ఓమ్ తత్ సత్

# ప్రశ్నోత్తరమాణిక్యమాల.

ఈ గ్రంథము

శ్రీ మలయాళస్వాములవారిచే రచింపబడినది.



రెండవ కూర్పు 2000 ప్రతులు.

చిత్తూరు శ్రీ వేదవ్యాస ముద్రాక్షరశాలయందు
ముద్రింపబడియె.

★





[వెల రూ. 2_0_0

వలయువారు యీ క్రింది విలాసమునకు వ్రాసి తెప్పించుకొనవలయును:_
శ్రీ వ్యాసాశ్రమము, యేర్పేడు పోస్టు, చిత్తూరుజిల్లా.

ఓం తత్ సత్

ఓం నమో భగవతే శ్రీమదసఙ్గానన్దాయ



జననము: 29—3—1885

నిర్యాణము: 12—7—1962

శ్రీ వ్యాసాశ్రమ సంస్థాపకులగు

మహర్షి సద్గురు శ్రీ మలయాళ స్వాములవారు

శుష్కవేదాన్తిదన్తీశ బృన్దసన్త్రాపి కేసరీ।

అసఙ్గానన్దయోగీన్ద్రో గురుర్విజయతేతరామ్॥

ఓమ్ తత్ సత్.

# పీఠిక.

ప్రశ్నోత్తరమాణిక్యమాల యను నీ దివ్యగ్రంథము, మాణిక్యమాలవంటి ప్రశ్నోత్తర వాక్యములచే గూర్చబడినదగుటచే 'ప్రశ్నోత్తరమాణిక్యమాల' యని దీనికి సార్థకనామము పెట్టబడ మైనది. ఇదివఱలో విరచితములగు గ్రంథములచే తీరని సందేహములుండిన దీనివలన నవి నివృత్తి కాగలుగును. అంతేగాక యిదివఱలోనుండు గ్రంథములయందు యెక్కువ శాస్త్రప్రమాణములగు ఉపనిషద్వాక్యములుండుటచే శాస్త్రపఠనములేనివారికి అర్థమగుట కొంతప్రయాసముగానుండును. ఇదియో అటువంటిదిగాదు. కేవలము సులభ భాషలో వచనరూపముగా నుండుటచే విద్యలేని ముముక్షువులకుగూడ వేదాంతసారము త్వరలోనే గోచరము గాగలుగును. మఱియు ప్రశ్నోత్తరరూపములగుటచే సామాన్య జిజ్ఞాసువులందఱికిని అతిసులభముగా అతిగహనమగు వేదాంతార్థము గోచరమగుటలో సందేహములేదు. ఇదివఱలో నేర్పడియుండు శుష్కవేదాంతతమోభాస్కర, ఓంకార, స్వబోధసుధాకర, ధర్మసేత్వాది యుత్కృష్ట గ్రంథములలోగూడ చర్చింపబడని యగాధములగు అప్రాకృతములైన విషయములు దీనియందు పెక్కులు గలవు.

శ్లో॥ కంఠంగతా వా శ్రవణంగతా వా
ప్రశ్నోత్తరాఖ్యా మణిరత్నమాలా।
తనోతు మోదం విదుషాం ప్రయత్నాత్
రమేశగౌరీశకథేవ సద్యః॥

తా॥ శ్రీ విష్ణు, పరమేశ్వరుల దివ్యకథలవలె ప్రశ్నోత్తరరూపముగానున్న యీ మణిరత్నమాలను చదివినమాత్రముననగాని, వినినమాత్రముననగాని, వెంటనే జ్ఞానులకు సంతోషము అధికముగా గలుగునుగాక!

అని శ్రీశంకర భగవత్పాదులు దెలిపినట్లు దీనిని కంఠములో ధరించినను, లేక. కర్ణములో ధరించినను జిజ్ఞాసువులకు నిరతిశయానంద సౌఖ్యమును గలుగజేయును. మాణిక్య మాలయగు దీనిని జదివి కంఠస్థముజేసినను, లేక చదువశక్తిలేనివారు శ్రవణము జేసినను నిత్యానందప్రదమగు మోక్షమును కలుగజేయును. కనుకనే "కంఠంగతా వా శ్రవణం గతా వా" అని చెప్పుటకు కారణమైనది. ప్రశ్నోత్తరములను మాణిక్యములచే చేయబడిన హారమగుటచే దీనికి ప్రశ్నోత్తరమాణిక్యమాల యని పేరుగలిగెను. ఆంధ్రదేశీయుడు గానందుచే భాషాలోపములు మెండుగానుండవచ్చును. కావున విజ్ఞులు క్షీరనీరన్యాయము ననుసరించి భావమును మాత్రము గ్రహించి యానందింతురు గాక!

లోకాస్సమస్తాస్సుఖినో భవంతు.
ఓమ్ తత్ సత్.

ఇట్లు తమ చరాచర సుఖాభిలాషియగు,

మలయాళస్వామి.

ఓంకారం బిందుసంయుక్తం నిత్యం ధ్యాయన్తి యోగినః ।
కామద[illegible]మోక్షదం చైవ ఓంకారాయ నమోనమః ॥

1. దైవమును శరణుబొందుము, దయ్యమును శరణుబొందకుము.
2. ధ్యేయమును శరణుబొందుము, ధ్యానములోనేకాలముగడుపకుము.
3. శాంతిని శరణుబొందుము, అశాంతిలో జీవింపకుము.
4. కారుణ్యమును శరణుబొందుము, కఠినత్వములో బ్రతుకకుము.

హ్రస్వో దహతి పాపాని

దీర్ఘో మోక్ష ప్రదాయకః ।



ఆప్యాయనః ప్లుతో వాపి

త్రివిధోచ్చారణేన తు ॥

5. జ్ఞేయమును బొందుము, జ్ఞానముతో తృప్తినొందకుము.
6. గమ్యమును చేరుము, గమనములోనే తృప్తిబడయకుము.
7. అఖండమును చేరుము, ఖండములోనే బడియుండకుము.
8. మంత్రార్థమును బొందుము, మంత్రములోనే కాలము గడుపకుము.

**ఓమ్ తత్ సత్.**

ఏవమేవ మహామంత్రం జీవానాం చ తనుత్యజామ్ ।
కాశ్యాం సంశ్రావ్య మరణే దత్తే ముక్తిం పరాం శివః ॥శివ॥

సర్వే వేదా యత్పదమామనన్తి, తపాంసి సర్వాణి చ యద్వదన్తి। యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి, తత్తే పదం సంగ్రహేణ బ్రవీమ్యోమిత్యేతత్ ॥కఠశ్రుతి॥

యదక్షరం వేదవిదో వదన్తి విశన్తి యద్యతయో వీతరాగాః। యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి తత్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే ॥గీత॥

ఓం తత్ సత్

# ప్రశ్నోత్తర మాణిక్య మాల.



ఓం నమః ప్రణవార్థాయ ప్రణవార్థవిధాయినే।
ప్రణవాక్షరబీజాయ ప్రణవాయ నమోనమః॥

## కర్మవిభాగము.

1. ప్రశ్న:—పాపకర్మలు చేయువారు ఆ పాపఫలముచే మఱల మఱల పాపకార్యములను చేయుచుందురనియు, జన్మజన్మాంతరములోను అధోగతికే వెళ్లుచుందురనియు చెప్పుచున్నారే. గీతలో శ్రీకృష్ణ భగవానులట్లే సెలవిచ్చియున్నారు. అ. 16

తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్।
క్షిపామ్యజస్రమశుభానాసురీష్వేవ యోనిషు॥

దీనియర్థము పైన వివరించినదే. దీనియొక్క రహస్యమిదేనా, లేక వేఱొకయర్థమేదైన యిందుగలదా? ఈ వాక్యమువలన మహా భయమున్ను దుఃఖమున్ను గలుగుచున్నది. ఏలన, అధికజనులు పాపకార్యములనే చేయువారై యున్నారు. అది వారికి తెలిసియో తెలియకయో, ఎట్లో చెప్పజాలను. పై అర్థమురీతియైన వీరందఱున్ను దుఃఖకరమగు పాపజన్మమునే పొందవలసియుండును. అయ్యో, ఇన్ని కోట్లజనులు దుఃఖములో పడిపోవుట యెంత సంకటమైన కార్యము! అట్టివారిని దుఃఖములోనికి పోనీయక చూచుటకన్న పుణ్యమింకొకటి గలదా!

ఉత్తరము:—ఈ విషయమై దుఃఖింపనక్కఱలేదు. దీనియొక్క అర్థమును చెప్పువారు గీతను ఆమూలాగ్రముగ యోచింపకయే చెప్పియుండవచ్చును. ఏలన, సముద్రమువంటి అపారమైన పాపము గలవాడైనను, ఆ పాపసాగరమంతయు జ్ఞానమనెడి నావచే దాటి ముక్తితీరమున చేరవచ్చునని శ్రీ భగవంతుడే యానతిచ్చియున్నాడు. అ. 4.

"సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి"

మఱియు, జ్వలించెడు అగ్ని యేలాగున కట్టెలను భస్మముగా కాల్చివేయునో, ఆలాగున జ్ఞానాగ్ని పాపకట్టెలన్నిటిని దహింపజేయును. సందేహములేదు.

"యథైధాంసి సమిద్ధోగ్నిర్భస్మసాత్కురుతేఽర్జున।
జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా॥"

ఇదిన్ని గీతయందే కలదు. పాపముచేయువారికి మఱల మఱల పాపబుద్ధియే గలుగునని చెప్పినది నిజమైనచో, పాపులైనవారుకూడ భక్తిచేతను, జ్ఞానముచేతను తరింతురను వాక్యము యెట్లు ఘటిల్లును? దీనిలోగల గూఢతత్వమేమన, పుణ్యవిశేషముచే దేవతాజన్మము, పాప విశేషముచే తిర్యగ్జంతువుల జన్మము, పుణ్యపాపముల మిశ్రితచే మానవజన్మమున్ను గలుగును. కావున మానవుడు ఏదో పాపకర్మ విశేషముచే యిప్పుడు పాపకార్యములను చేయుచుండవచ్చును. ఆ పాపము క్షయమునొందక మఱల మధ్యయే పుణ్యబుద్ధి గలిగెడు స్వభావము గలదు. అప్పుడు సుకృతకర్మస్వభావ ముదయమగును. అందువలన సత్కర్మలాచరించును. అపుడు భగవద్భక్తియున్ను కలుగును. దానివలన ఆత్మశుద్ధియు, జ్ఞానప్రాప్తియు గల్గి ముక్తుడగును.

2. ప్ర:—అదెట్లు ఘటించును? ఒక వృక్షమునుండి యేర్పడిన బీజములు మఱల ఆలాటి వృక్షములేయై పుట్టునుకాని వేఱొకవిధముగ నెట్లు మాఱును? ముష్టివిత్తనము మఱల ముష్టిచెట్టుగా యేర్పడునేగాని చీనీ (బత్తాయి) చెట్టుగా యెట్లు మారును? ఆలాగున పాపకర్మలచే యింకను పాపకార్యములనే యాచరించే స్వభావము కలుగునుగదా!

ఉ:—అట్లు కాదు. కర్మలన్నియు సంచితములై యుండును. ఇప్పుడు చేయునదే మఱుజన్మములో వచ్చునను నిర్ణయములేదు. వర్తమాన క్రియమాణకర్మ సంచితములోచేరును. రాబోవు జన్మమునకు యే కర్మ ఫలోన్ముఖమై యుండునో, అది పుణ్యముగాని, పాపముగాని వచ్చుచుండును. బహుశః పుణ్యముగానే రావచ్చును. అప్పుడు పుణ్య కర్మలచే సంచితములోనుండు పాపరాశికర్మలనన్నిటిని నివృత్తిచేసికొన

వచ్చును. పుణ్యకర్మలకన్న భగవద్భక్తి అధికమహిమ గలిగియుండును. దానికన్న జ్ఞానమునకు మఱింత మహిమయు, శక్తియు గలిగియుండును. కావున పర్వతాకారముగనుండు కర్మనుగూడ జ్ఞానాగ్ని దగ్ధమొనర్చునని చెప్పెడు రహస్యము. కర్మలన్నియు కోర్టులోవేసిన దావాలవంటివి. ఈ దినము దాఖలుచేసినదైనను దానికిముందుగా యెన్ని కేసులు విచారించవలసినవి యుండునో, ఆ నెంబరుప్రకారమే విచారణకు వచ్చునట్లు, కర్మచక్రముయొక్క అరములు (ఆకులు)న్ను తిరిగి రావలసియుండును.

3. ప్ర:—మహాత్మా ! గొప్ప సందేహమనెడు విషజ్వాలచే ఆవృతమైన మనస్సుగలవానిని తమ అమృతవచనములనెడు దివ్యౌషధముచే శమింపజేసి ధన్యునిగా జేసితిరి. అయితే, మానవులకుమాత్రము ఈలాగున కర్మ పరిణామము గల్గును. తిర్యగ్జంతువుల కీయవస్థ కలుగదుగదా !

ఉ:—పాపాధిక్యతచే జంతువులై జన్మించిన పశ్వాదులు పాప కర్మచే పుట్టినందుచేతను, స్వబుద్ధి లేనివగుటచేతను ఈ జన్మలోచేయు కర్మలకు పాత్రులుకావు. ఏ కర్మచే యిప్పుడు మృగజన్మ గలిగినదో, ఈ జన్మములో ఆ కర్మ నశించినవెంటనే యే కర్మశేషము సంచితములో ఫలోన్ముఖమైయుండునో దాని ననుసరించిన జన్మము వచ్చును. అపుడా జీవులుకూడ ఉత్తమజన్మకు రావచ్చును. అయితే ఈ కర్మ రహస్యము స్థూలదృష్టికి గోచరించునదికాదు. దివ్యదృష్టిగలవారికే గోచరించును. ఏలన, మీయొక్క పూర్వజన్మము, ఆ జన్మలోచేసిన కర్మము, సంచితములో యెంత నిలువగలదు, భావిజన్మమునకు ఫలోన్ముఖమైనదేదియని తెలిసికొనజాలరుగదా. కర్మసూక్ష్మతయు ఆలాగుననేయుండును.

4 ప్ర:—పుణ్యాధిక్యతచే గల్గిన దేవతాజన్మముగలవారు మఱల మఱల పుణ్యకర్మల జేసికొని దేవలోకమునే పొందుదురా ?

ఉ:—అట్లు నియమములేదు. పుణ్యఫలముచే గల్గెడు దేవత్వమున్ను, పాపజన్మముచే గల్గెడు నరకత్వమున్ను స్థిరములుకావు. అవి కర్మఫలములగుటచే దాని ఫలమునకుకూడ అవధి గలదు. కనుక నరకములోనుండువారుగాని, స్వర్గములోనుండువారుగాని వారివారి కర్మ

క్షయించినప్పుడు పుజీల మర్త్యలోకమున జన్మింతురు. అప్పుడు మజీల యేకర్మ చేయుదురో, ఆ ఫలితమును మజీల పొందవలసియుండును.

5. ప్రః—సమస్తజీవకోట్ల హృదయాంతరాళమునందుండి ఈశ్వరుడే ప్రేరణచేసి జీవులచే కర్మ చేయించుచున్నాడని కొందఱు చెప్పుచున్నారు. మఱికొందరు ఈశ్వరుడు సాక్షిమాత్రుడై యున్నాడనియు, ప్రాణికోట్ల జన్మాంతరసంస్కారముల ననుసరించి కర్మఫలము గలుగుచున్నదనియు చెప్పుదురు. శాస్త్రములందును ఆయావిధముగ గలదు. దీనియందేది నిజమైనది ?

ఉ:—ఈశ్వరుడే ప్రేరణచేసి కర్మలను చేయించుచున్నాడని చెప్పిన, పాపపుణ్యముల బాధ్యత ఈశ్వరునియందే కలుగును. జీవులం దుండగూడదు. అట్లైన జీవులకు కర్మఫలమగు సుఖదుఃఖము లుండ రాదు. అంతేగాక, ఈశ్వరుడు పక్షపాతము గలవాడేయగును. పక్ష పాతాదిగుణము లీశ్వరునియందుండరాదు. పక్షపాతము లేనివాడే సర్వేశ్వరుడు. కావున జీవకోట్ల జన్మాంతర సుకృతదుష్కృత కర్మ ఫలము ననుసరించి సుఖముగాని, దుఃఖముగాని కలుగుచున్నదని చెప్పు టయే న్యాయమగును. ఎట్లన, భూమియందనేక వృక్షములుగలవు. కొన్ని మధురఫలముల నిచ్చుచున్నవి; కొన్ని చేదుఫలములనుగూడ గలుగజేయుచున్నవి. మఱికొన్నిటియందు పులుపుఫలములు పుట్టు చున్నవి. అట్టిభేదములకు భూమి యేలాగున కారణముకాదో, బీజమే కారణముగా నుండునో, ఆలాగున జీవకోట్ల కర్మఫలములకు జన్మాం తరకర్మయే కారణమగును.

6. ప్రః—ఈశ్వరుడన్నిటిలోను సాక్షిగానుండి, సర్వశక్తియు న్ను, దయయున్ను గలవాడైయుండిన, అన్ని ప్రాణికోట్లను ఒకేవిధ ముగ యేల చేయరాదు? లేక జీవులన్నియు ఒకేవిధముగ నేల యుండ రాదు ?

ఉ:—భూమి గొప్పశక్తియు మహిమయు గలిగియుండినను, బీజములను మార్పుచేయుటలేదు. ఆలాగున ఈశ్వరుడున్ను అట్లు చేయుటలేదు. సాక్షిగానుండినను జీవుల సంస్కారము ననుసరించినట్లే గుణములు గలుగుచుండును. విద్యుద్దీపమున అమర్చిన గ్లాసులయొక్క

రంగు ననుసరించి దీపము యెఱుపుగానో, పచ్చగానో, నీలముగానో యేలాగున ప్రకాశించుచుండునో, ఆలాగున జీవులయొక్క సత్వరజస్తమోగుణములనుబట్టియు మఱియు మిశ్రగుణమునుబట్టియు జీవులనేక విధములుగా నుంటున్నవి. పై దృష్టాంతమున విద్యుద్దీపములు భిన్నభిన్నములుగా నుండుటచే విద్యుచ్ఛక్తికి మహిమ లేదనిగాని, సర్వములోను సమానముగా నుండుట లేదనిగాని యనుచు అందుభేదము నెట్లారోపించరాదో, జీవకోట్లస్థితియు ఆలాగుననే యుండును.

7. ప్ర:— భగవంతుడు కరుణాస్వరూపుడు. ఒకరిపై కరుణగలిగిన అప్పుడే వానిని గొప్ప బ్రహ్మజ్ఞానినిగా చేయగల్గును, లేక దరిద్రుని వెంటనే మహాచక్రవర్తిగా చేయవచ్చును. ఏలన, సర్వేశ్వరునియొక్క కరుణ అవ్యాజమైనది. నిర్హేతుకజాయమానకరుణాకటాక్షము గలవాడు భగవంతుడు. కరుణాసముద్రుడు. ఎట్లన ఒక చక్రవర్తి తన కిష్టమువచ్చిన ఒక బీదవానిని గొప్పరాజుగా చేయగల్గును. ఆలాగున ప్రభువునకు ప్రీతిగల్గిన, విద్య లేనివానినిగూడ గొప్ప ఉద్యోగిగా చేయగల్గునుగదా. అట్టిచో సర్వశక్తుడైన సర్వేశ్వరునకు తనకిష్టమువచ్చినట్లు చేయుటకు సమర్థత లేదాయేమి ? లేక అట్లు చేయుటలో యెవరికైన యాతడు భయపడవలసిన పని యేమిగలదు ? కావున మీరు భగవద్భక్తి గలిగియుండినను, లేకపోయినను ఆ మహాప్రభువుయొక్క దయగలిగిన, మీకు మోక్షము సులభముగా లభించును, అని కొందఱు చెప్పుచున్నారే ?

ఉ:—వారు చెప్పేలాగున భగవంతుడు కరుణాసముద్రుడే. సర్వశక్తి గలవాడే. వానికి సమానమైనవాడుకాని, అధికమైనవాడుకాని మఱియొకడు లేడని చెప్పునదికూడా సత్యమే. ఆతడు తాను తలంచిన యెట్టికార్యమునైన చేయవచ్చును. బీదవానిని ప్రభువుగా నొనర్చవచ్చును. విద్యావిహీనుని పండితునిగా చేయవచ్చును. మహామూర్ఖుని గొప్ప విద్యావంతునిగ మార్పుచేయవచ్చును. కాని, కారణములేక అట్లెప్పుడున్ను జరుగదు. ఈ తత్వరహస్యము మీ ప్రశ్నయందే గలదు. ఏలన, భగవంతునకు ప్రీతిగలిగిన తన యిష్టానుసారమెట్లయినను చేయగల్గును. అందువలన భగవదిష్టము గలిగేలాగున

ప్రవర్తింపవలెనను అర్థము దానియం దేర్పడుచున్నదిగదా. భగవత్ప్రీతి గలుగుటకు భక్తి గలిగియుండవలెనని వారు చెప్పుచున్నారుగదా. దీని వల్ల భక్తిగలవారికే భగవత్ప్రీతి గలుగునని స్పష్టమగుచున్నది. మఱి యు, చక్రవర్తియైనను తనకు ప్రీతిగలవానినిమాత్రము గొప్ప రాజు గానో, ఉద్యోగిగానో చేయునదిగూడ మీ వాక్యములో గలదు. చక్ర వర్తికి ప్రీతి గలుగుటకు ఏదైన ఒక గొప్పకార్యము చేసియుండవలెను. ఈ వాక్యమువల్లను భగవత్కృప గలుగుటకు భక్తియు, భగవత్ప్రీతి కరమగు కర్మయు చేయవలెనని యర్థమగుచున్నది. ఈలాటి వాక్యము లన్నియు జనులకు భక్తిగల్గుటకున్ను, పుణ్యకర్మలందు ప్రవేశము గల్గుటకున్ను చెప్పుదురేకాని మఱియొకటికాదు. సత్కర్మయు, దైవ భక్తియు గలుగునపుడు వారు చెప్పేలాగున తప్పక లభించును. ఇదే దీనిలోగల రహస్యము. దానివలన, అట్లు చెప్పేవారిలో యేలాటి దోష మును లేదు. భగవంతుడుగూడ వేదశాసనమునకు విరుద్ధముగ చేయ డు. ఏలన, వేదములను భగవంతుడే సృష్టించియున్నాడు. తానేర్పఱి చిన నియమమును తానే యేలాగున నుల్లంఘించును? సార్వభౌము డైనను రాజనీతిననుసరించియే ప్రవర్తించును. కాని, మనుజునితో సర్వేశ్వరుని దృష్టాంతముగ చెప్పరాదు. మనుష్యుల బుద్ధికిని, వేద శాస్త్రమునకును అతీతస్థితిలో ఆ దివ్యశక్తి నిలచియున్నది. అది ఊహా తీతము. ఎవరికైనను సంపూర్ణముగ తెలియుట దుస్తరము.

8. ప్ర:—కొందఱు మతస్థులు — 'భగవంతుడే లోకకార్య నిర్వాహణకొఱకు ఒక్కొక్కరిని ఒక్కొకవిధముగ సృష్టించినాడు; లేనిచో ప్రపంచకార్యము జరుగదు; ప్రపంచము భగవత్సృష్టికావున దానిని చక్కగ నడుపుట దేవునియొక్క కార్యమైయున్నది. ఆ విషయ ములో మనుష్యులేమియు ప్రశ్నించరాదు. అది ఈశ్వరుని యిష్టము. నీవు ఈశ్వరుని విమర్శించెదవా?' అని చెప్పుచున్నారే!

ఉ:—ఈ ప్రశ్నలన్నిటికిన్ని, యిదివఱలో చెప్పినదానిలోనే తాత్పర్యముగలదు. అయినను బాగుగ అందఱికి తెలియుటకొఱకు మఱల విశదముగా తెలిపెద. ఏకాగ్రమనస్సుగలిగి వినవలెను. ఈలాటి వాక్యములన్నియు ఒకవిధమగు భక్తితో చెప్పేవచనములేగాని, లోతుగ

దీర్ఘవిచారణచేసి చెప్పే వచనములుకావు. ఏలన, ఎప్పుడు సృష్టియని చెప్పెనో, అప్పుడు దానికి ప్రళయమున్ను గలిగియే తీరవలెను. అట్లైన, ఒక కాలమున సృష్టింపబడిన జీవులు మఱియొకకాలమున లయమొందే తీరుదురు. అపుడు జీవులకు శాశ్వతత్వముండదు. శాశ్వతముకాని వస్తువు లన్నియు ప్రాకృతములే. జీవులో ఈశ్వరాంశులు. కావున శాశ్వతులు. మఱియు ఈశ్వరుడే సృష్టించెనని చెప్పినచో, ఈశ్వరునియందు విషమ దృష్టి యేర్పడును. అది న్యాయవిరుద్ధముగ నుండును. దుఃఖముతో గూడినవాడు, నిర్దోషినైయున నన్నేల యిట్టి క్రూరకర్మలకు లోనుజేసినావని అడిగినచో ఈశ్వరుడేమి సమాధానమివ్వగల్గును? కాన, అట్లెన్నటికిని జరుగదు. న్యాయమే రూపముగాగల ఈశ్వరుడు అన్యాయముగ నెప్పుడును ప్రవర్తింపడు. ఈశ్వరుడు సృష్టించెనని చెప్పుదానిలోగల అర్థమేమన, అపంచీకృత పంచభూతములను పంచీకృతముగజేసి జీవకోట్లకు వారివారి పుణ్యపాప కర్మానుసారము దేవ, మనుష్య, తిర్యక్ ప్రాణులకు తగిన దేహములను సృష్టించెను. జీవులు నిత్యులు; ఎల్లప్పుడునుండు వారు. కర్మలచే జననమరణములున్ను, సుఖదుఃఖములున్ను గలుగుచుండును. అట్టి కర్మలు జ్ఞానముచేతను, భక్తిచేతను నశించినపుడు జీవులు ముక్తులగుదురు. ఈ విముక్తిమార్గములన్నియు ఈశ్వరుడు వేదశాస్త్రములచేతను, బ్రహ్మనిష్ఠులగు జ్ఞానులచేతను జీవకోట్లు తరించే నిమిత్తము యేర్పఱచియున్నాడు. కావున జీవులకు గలుగుచుండు సుఖదుఃఖములకు జన్మాంతరకర్మయే కారణమని చెప్పుటకు హేతువైనది.

9. ప్ర:— 'పునర్జన్మము లేదు. జన్మాంతరము గలిగియుండిన ఆ జన్మములో చేసిన కర్మలున్ను, ఎత్తిన జన్మములున్ను జ్ఞాపకము ఉండకపోవునా?' అని కొందఱు మతస్థులు చెప్పుచున్నారు. ఈ విషయమై తమ యభిప్రాయమేమి?

ఉ:— పునర్జన్మము లేనిచో జీవులనేకవిధములుగా నుండుట కేలాటి కారణమును లేదు. పూర్వజన్మస్మృతి లేనందుచే మాత్రము పునర్జన్మము లేదని చెప్పుట సరికాదు. ఏలన, గర్భములో నుండునప్పుడు కూడ ఈ జీవి యుండియుండెను గదా. గర్భవాస స్థితిగతుల నిప్పుడు జీవుడు చెప్పగలడా? అందువలన మాతృగర్భములో నుండునప్పుడు

జీవుడు లేడని చెప్పవచ్చునా? అట్లే బాల్యావస్థలోగల జీవితము మనకు తెలియునుకదా. కావున బాల్యములేదని చెప్పదగునా? సంవత్సరము క్రింద ఫలానినెలలో ఫలాని తేది ఏ దివసమని యొకరడిగిన, చెప్పుట దుస్తరముకదా. ఆ దినము మీరేమి భుజించితిరి? ఏమేమిపనులు చేసితిరి? ఎవరితో సంభాషించితిరి? చెప్పగలరా? లేదుకదా. సంవత్సర మేల, గతనెల 15 వ తేది ఏరోజుగానుండెను? ఆ దినము మీరేమి భుజించితిరి చెప్పదరా? సాధ్యముకాదు. అట్లుండగా, అనేక సంవత్సరముల క్రిందట జరిగినదిన్ని, ఈ శరీరమునగాక మఱియొక శరీరమున జరిగినదిన్ని యెట్లు చెప్పగల్గును? అయితే మంచి జ్ఞాపకశక్తిగలవారున్ను, దీర్ఘవిచారము చేయువారును యైనచో పంచాంగాదులను చూచి గాని, లేక మఱియొకవిధముగ చింతించిగాని గత సంవత్సర, మాస, తేదీ, దివసములను, జరిగిననెల 15 వ తేదీ దివసమును యెట్లు జ్ఞాపకమునకు తీసికొని రావచ్చునో, మఱియు ఆ దివస భోజనము యెట్లు స్మృతికి తెచ్చుకొనవచ్చునో, ఆ దినకార్యము, సంభాషణము యెట్లు ఊహలోనికి తీసుకొనిరావచ్చునో, అదేరీతిగ తపస్సుచేతను, యోగముచేతను, జన్మాంతరస్థితిని కనుగొనవచ్చును. కాని, అది అందరికిని సాధ్యము కాదు. జ్యోతిశ్శాస్త్ర మేలాగున జన్మాంతరమును, జన్మాంతరకర్మలను నిరూపించుచున్నదో, అట్లు దానివలనను, జీవుల సంస్కారముల బట్టిన్ని జన్మాంతరము గలదని నిశ్చయించుకొనవచ్చును. ఈ మధ్య ఉత్తరహిందూస్థానమున శాంతాదేవి యను ఒక బాలిక పునర్జన్మమును గుఱించి చెప్పిన విషయమును వార్తాపత్రికలద్వారా అందఱును తెలిసికొనియే యున్నారు. గొప్ప గొప్ప పరిశోధకులాబాలికను పరిశోధించి ఆమె చెప్పినది నిజమని ఋజువుజేసిరి. ఈలాగుననే బర్మాదేశములోని ఒక బౌద్ధబాలకుడు పూర్వజన్మములో తానొక బౌద్ధ సన్యాసియని చెప్పి, అపుడుండిన మఠము, ఊరు మొదలైనవానిని నిరూపించెను. ఇంతేగాక 7 సం॥ల ప్రాయముగల ఆ పిన్నవాడు బౌద్ధ మతతత్వములోగల అగాధ విషయములను బోధించుట చూచి గొప్ప గొప్ప పండితులుకూడ విస్మయమొందిరి. ఈ విషయమును అందఱకు తెలిసినదే. పైనజెప్పిన శాంతాదేవి పూర్వజన్మమునగల భర్తను

కూడ కనిపెట్టి అతని నందఱికిని జూపెట్టి, పూర్వము యింటియందు దాచి యుంచిన డబ్బునుకూడ, వారింటికి వెళ్ళి తీసియిచ్చెనట! దీనికన్న పరమ ప్రమాణ మింకేమి గలదు? హిందువులును, బౌద్ధులున్ను అనాదినుండి పునర్జన్మముగలదని నమ్మువారు. క్రైస్తవ మహమ్మదీయులలో కొందఱు నమ్ముటలేదుగాని, ఆ విషయమై సరియైన సమాధానము చెప్పజాలరు. వారిలో యిప్పుడు అనేకులు పునర్జన్మను నమ్ముచున్నారు. కాని శ్రీ క్రీస్తు ఈశ్వరుని పుత్రుడనియు, పరమేశ్వరుడు భూలోకవాసులకు ధర్మమును బోధించుటకొఱకు పంపినవారనియు చెప్పినప్పుడు యితర జీవులకేల పునర్జన్మము కలుగగూడదు? ఆలాగున శ్రీ మహమ్మదు వారుకూడ దేవుని యాజ్ఞచే భూమిపై జన్మించి ఈశ్వరధర్మమును లోకములో ఉపదేశించుటకు వచ్చినవారనియు చెప్పుచుండగా తది తరజీవులేల జన్మమెత్తరాదు? మఱియు వీరుభయుల మతప్రకారము మరణాంతమున జీవులుచేసిన పుణ్యాపాపకర్మల ననుసరించి స్వర్గము గాని నరకముగాని అనాదియుగముల కాలమువఱకు అనుభవింపవలసిన దనియు, ఆ జీవు లెల్లపుడాలాగే యుండుదురనియు, ఆదిగల వస్తువులన్ని టికిని అంత్యము గలుగుననియు విధియై యుండగా, న్యాయశాస్త్రసమ్మత ముగా యుండియుండగా పునర్జన్మము లేదని యెట్లు చెప్పవచ్చును? ఆదిలేని వస్తువులకుమాత్రమే అంత్యము గలుగదు.

10. ప్ర:—అయితే యిపుడు తాము చెప్పినదానిలో నొక గొప్ప ధర్మసందేహము గలుగుచున్నది. ఏమనగా పై జెప్పిన యభిప్రాయ ప్రకారము కొంచెము పుణ్యము చేసినవారికిని ఎక్కువ పుణ్యము చేసినవారికిని. అనంతకాలమువఱకు స్వర్గమున్ను, ఆలాగున స్వల్పపాపము చేసినవారికిని గొప్పపాపము చేసినవారికిని యిదేవిధమగు నరకమున్ను అనంతకాలమువఱకును గలుగజేయుట యేమి న్యాయముగా నుండును? ఇంత కరుణలేనివాడా ఈశ్వరుడు?

ఉ:— కించిత్పుణ్యమునకున్ను అధిక పుణ్యమునకున్ను ఒకే విధమగు స్వర్గము అనంతకాలమువఱకున్ను, ఆలాగున స్వల్పపాప మునకున్ను యెక్కువ పాపకర్మమునకున్ను ఒకేవిధమగు నరకము అనంతకల్పమువఱకున్ను యుండదు. అది న్యాయవిరుద్ధము. సామాన్య

జ్ఞానముగల మహాత్ములలోఁగూడ కొంచెము మంచికార్యము చేసిన వారికి దానికి సరియగు బహుమానముగాను ఉద్యోగముగాని లభించుచున్నది. అలాగున అల్పపాపము చేసినవానికి స్వల్పశిక్షయు, అధిక పాపము నాచరించినవానికి గొప్పదండనయు, గవర్నమెంటువారు విధించుచున్నారు. అట్లే కాలమునకుగూడ హెచ్చుతగ్గులు గలవు. ఇదే ధర్మయుక్తముగా నుండును. తక్కినవి నమ్మదగినవి కావు.

11. ప్ర:—పరలోకములో పుణ్యపాపము లనుభవించియుండిన మఱల నిచట అందఱు నొకేవిధముగ నుండవలెనుగదా. అట్లు కానుపించుటలేదే? కావున పునర్జన్మమున్ను, స్వర్గనరకములున్ను అంగీకరించువారు దీని కేమి సమాధానము చెప్పెదరు?

ఉ:—దానికి విరోధ మేమియును లేదు. కర్మశేషమను ఒకపద్ధతి కలదు. దీనికే కర్మవాసనయనిగూడ పేరుకలదు. సంస్కార మనియు దీనినే వచింతురు. ఆయా వాసన ననుసరించి జీవులాయా స్వభావముతో పుట్టుదురు. అట్లుకానిచో ఈ మానవులు పునర్జన్మము కలదనియు, పుణ్యపాపములకు తగిన సుఖదుఃఖము లుండుననియు తెలిసికొన జాలరు. దానికొఱకు పరమకారుణికుడగు సర్వేశ్వరుడు ఈ నియమ మేర్పఱచియుండును. ఇట్టి కారణమువలన పరలోకము లేదనిగాని, పునర్జన్మము లేదనిగాని చెప్పరాదు.

12. ప్ర:—పరలోకముండుననుటకు కారణమేమి?

ఉ:—శాస్త్రమే ప్రమాణము. అంతేగాక పరలోకస్థితిని చెప్పువారుండుటయే ప్రమాణము. పైజెప్పిన శాంతాదేవియు, బౌద్ధబాలకుడును పరలోకవృత్తాంతము చెప్పినవారే. ఈ విషయములో క్రైస్తవులున్ను, మహమ్మదీయులున్ను యేకాభిప్రాయము గలవారై యున్నారు.

13. ప్ర:—పరలోకమున్నదనుట కేదైన నిదర్శనము గలదా?

ఉ:—వేదముసకంటె పరమనిదర్శనమేమి కావలయును? అట్టి వేదమే పరలోకమును నిరూపించుచున్నది. మఱియు ఋషులకు పరలోకవిషయము తెలిసికొన శక్తి గల్గియున్నట్లు మనము వినుచున్నాము. మనదృష్టికి కనుపడని సూక్ష్మజీవులను ఏలాగున దుర్భిణీయంత్ర

సహాయముచే కనుగొనుచున్నారో, ఆలాగున దివ్యదృష్టిగలవారికిన్ని గోచరము కాగల్గును. మఱియు అంగారకుడు, చంద్రుడు మొదలగు గోళములలోగల వస్తువులను యేలాగున దూరదర్శినీయంత్రసహాయ ముచే కనుగొనుచున్నారో, ఆలాగున అప్రాకృతదృష్టి గల్గునపుడు మానవులకుగూడ పరలోక విషయములు తెలిసికొను సామర్థ్యము కలుగును. ఇది హిందువులయొక్క ఆశయముమాత్రము కాదు. శ్రీబుద్ధదేవుడు మొదలగు మహాత్ములందఱున్ను ప్రత్యక్షముగా పరలోకములో జరుగు సంగతులు వివరించి మానవుల కుపదేశించియున్నారు. వేదమును నమ్మని సాంఖ్యులు, జైనులుకూడ పరలోకమును, పునర్జన్మను అంగీకరించియున్నారు. పరలోకముండనీ, లేక ఉండకపోనీ, దానితో మనకు పనిలేదు. పుణ్యాపాపకర్మననుసరించి సుఖదుఃఖములు గలవా, లేవా యని గ్రహించుకొనిన చాలును. దానియందు నమ్మకము గలిగిన వాదములేదు. స్వప్నములో జనుల కేవిధముగ సుఖదుఃఖములు జాగ్రదవస్థలో గల్గుచున్నవిధముగ నుండునో, అంతేగాక లోకములు, లోకాంతరములు, భవనములు, భోగ్యములు మొదలగు వస్తువులన్నియు దృశ్యలోకమువలె ప్రత్యక్షముగా యుంటున్నప్పుడు పరలోకమున్ను స్వర్గనరకలోకములున్ను యేల యుండరాదు ?

14. ప్ర:—— స్వర్గనరకములు యిచ్చటగాక వేఱే యెచ్చటనైన యుంటున్నవా ?

ఉ:——అది మీ కెందుకు ? స్వప్నలోకములుంటున్నవా, లేవా ? ఉంటున్నవనియే చెప్పవలెను. మీరు స్వగృహములో నిద్రించుచుండినను, అనేక యోజనముల దూరమునకు మీరు తీసికొనిపోబడినట్లును, అనేక లోకములను మీరు దాటిపోయినట్లున్ను, అనేక సుఖముల ననుభవించినట్లున్ను, అనేక బాధలు పడినట్లున్ను, భయంకర రాక్షసులవంటి భూతములు మిమ్ములను తీసికొనివెళ్ళినట్లున్ను, లేక అనేక పుణ్యపురుషుల సహాయమున పోయినట్లున్ను స్వప్నములో గన్పట్టుచున్నవికదా? స్వర్గనరకలోకములున్ను ఆలాగున యుండునని యేల నమ్మగూడదు?

15. ప్ర:— ఆ స్వర్గనరకాది లోకములు తనయందేయుండునా? లేక లోకాంతరములు వాస్తవములా, యను సందేహముగలదు.

ఉ:—లోకములు తనయందుండునా? లేక వేఱుప్రదేశమందుండునా యను ప్రశ్న మీాకక్కఱలేదు. సుఖదుఃఖములు జాగ్రదవస్థయందువలె స్వప్నములో నుంటున్నవేకదా. మనకు కావలసినది అంతే. లోకములుండినను, లేకపోయినను వాదములేదు.

16. ప్ర:—లోకాంతరములు వాస్తవములా? లేక స్వప్నలోకములవలె కల్పితములా?

ఉ:— అది మనకక్కఱలేదు. సుఖదుఃఖములు గలవా, లేవా యని గ్రహించినమాత్రము చాలును. అయితే స్వప్నములో ననుభవించు లోకములుగూడ ఇదే మోస్తరు స్థూలలోకములుగావు. అవన్నియు సూక్ష్మలోకములే. దానియొక్క రహస్యము సామాన్యజనులకు తెలియ సాధ్యముగాదు. సామాన్యమానవులు సృష్టించెడు భూతద్దముల ద్వారా చూచునప్పుడే, ఒక ఆవగింజసమానముగలది గొప్ప పర్వతమువలె కన్పించుచున్నది. మానవులు సృష్టించిన సినిమా, బయస్కోప్ మొదలగువానియందలి యంత్రముల మహిమయే ఈలాగునయుండునపుడు, అట్టి మానవులను సృష్టించిన ఈశ్వరుని మహిమాతిశయము మేమని చెప్పవచ్చును! ఆవగింజంత పరిమాణముగల భూతదర్పణములో చూచినప్పుడే అనేక యోజనముల విస్తీర్ణమైన సముద్రము, హిమాలయ పర్వతములు మొదలగునవి కనుపించుచున్నవే! ఆలాగుననే గొప్పగొప్ప దేవాలయములు, పుణ్యాశ్రమములు, వనములు, సాగరములు మొదలైనవి అతిసూక్ష్మమగు రంధ్రములో గోచరించినపుడు, మానవుల హృదయములోగూడ వారివారి పుణ్యపాపకర్మల కనుగుణ్యమగు దృశ్యములను కలుగజేయుటలో యేమియు ప్రయాసమైన పనిగా ఈశ్వరున కుండదు. కావున హృదయముమాత్రము పుణ్యకర్మలచేతను, దైవచింతనచేతను శుద్ధపఱచుకొనుట జనులయొక్క ముఖ్యకర్తవ్యము. అట్టివారెచటనున్నను స్వర్గముగానేయుండును. ఆత్మశుద్ధి గలుగునప్పుడు వారి హృదయము స్వర్గమని చెప్పిన చాలదు. బ్రహ్మలోకమని చెప్పవచ్చును. అదిన్ని గొప్పదికాదు. బ్రహ్మానందమయమనియే దృఢముగ

చెప్పవలెను. కావున మానవులు అంతఃకరణములోగల దోషమును తొలగించి శుద్ధపఱచిన చాలును. అపుడట్టివారికి జాగ్రదవస్థలోను, సుషుప్తికాలమందును తురీయావస్థగలుగును. సూర్యుని సమీపమున చీకటి యేలాగున చేరజాలదో, ఆలాగున ఆ దివ్యపురుషుని ఆత్మలో ఏవిధములైన క్లేశములుగాని ఆవరణములుగాని కలుగవు.

17. ప్ర:—జీవులయొక్క సంస్కారముల ననుసరించి నానా రూపములు గలుగుచుండునని యానతిచ్చితిరి. జీవులన్నియు ఈశ్వరాంశములనియు సెలవిచ్చితిరి. అగ్నియందుండి యేర్పడిన మిణుగురులన్నియు అగ్నిస్వరూపములుగానే యుండునప్పుడు, మఱల వానికి సంస్కారరూపములగు మంచిచెడుగులు యెట్లు గలుగును?

ఉ:—ఈ విషయమై యిదివఱలో యెన్నియో ఉదాహరణములు చెప్పబడియున్నవి. పుష్పములపై వాసన యేర్పడునట్లు ఆ సంస్కారములు జీవుల నాశ్రయించియున్నవి. ఆలాగున జీవుడు జన్మాంతరవాసనలతోగూడి యిహలోక పరలోకములకు వచ్చుచు పోవుచు నుండును. ఆ వాసనలకు సంస్కారములనియు, గుణములనియు, సంకల్పములనియు పేర్లుగలవు. అవి అతిసూక్ష్మములు. మఱ్ఱివిత్తనమందు గొప్పవృక్షమిమిడియున్నట్లు సంస్కారములున్ను సూక్ష్మరూపమున యిమిడియుండును. భూమి, జలము, సూర్యకిరణములు, వీని సహాయము గలుగునప్పుడు ఆ సూక్ష్మవటబీజమేలాగున క్రమముగ మహత్తరమైన వృక్షముగ పరిణమించునో, సంస్కారములుకూడ ఆలాగున జన్మము వచ్చునపుడు వికాసస్థితిని పొందుచుండును.

18. ప్ర:— ఈ సంస్కారములలోకూడిన జీవుడు గర్భమందేలాగున ప్రవేశించును? కొందఱు 7 నెలలగర్భములో పిండము వృద్ధినొందినపుడు జీవుడు ప్రవేశించుచున్నాడని తెలుపునది నిజమా?

ఉ:—గర్భోపనిషత్తు మొదలగు కొన్నిటిలో ఆలాగున కాన్పించుచున్నది. దానియొక్క రహస్యమేలాగున నుండునో తెలియుట దుస్తరము. ఉపనిషత్తుల యర్థము సామాన్యదృష్టిగలవారికి గోచరము కాదు. 7 వ మాసములో ప్రాణశక్తి కలుగుననియు, అప్పటికి గర్భపిండమునకు అంగములన్నియు యేర్పడుననియు, అప్పటివఱకు అణగియుండు

జీవశక్తి అపుడు చలనమునకు వచ్చుననియు అర్థముకూడ గలదు. అందువలన సప్తమమాసములో జీవుడు ప్రవేశించుచున్నాడని చెప్ప వచ్చును. యథార్థముగా జీవుడు యెప్పుడు యేరీతిగ ప్రవేశించునో తెలియుట కెవరికిని తరముకాదు. పరిశోధకు లెవరున్నను నేటి వఱకు ఆ విషయమై ఇదమిత్థమని నిర్ధారణ చేసియుండలేదు. అయితే కపిలాది మహర్షులు భాగవతాది గ్రంథములలో జీవుడు వర్షధారా రూపముగ ఓషధుల (ధాన్యాదుల)లో ప్రవేశించి ఆహారరూపముగా పురుషునియందు చేరి శుక్లరూపముగా స్త్రీగర్భములోనికి ప్రవేశించునని తెలిపిరి. అనేకులీ యభిప్రాయమునే యంగీకరించియున్నారు. దీనికి యుక్తులు, ప్రమాణములు గలవు. నమ్ముటకును మార్గమున్నది.

19. ప్ర:— మనుష్యశరీరమును పొంది వికాసస్థితినొందిన జీవుడు పాపకార్యములు చేసినను మఱల మనుష్యశరీరములో మాత్రమే జన్మమెత్తుననియు, పశ్వాది జన్మము లాతనికి గలుగవనియు కొందఱు చెప్పుదురు. ఏలన, పనసవృక్షము మొదలగువానినుండి యేర్పడు బీజములు పనసాది వృక్షములగునేగాని, చింతచెట్టు యెట్లు కానోపును? ఆలాగున, అశ్వగజాది జంతువులనుండి యేర్పడెడి శిశువులుకూడ ఆలాటివిగ పుట్టునేగాని యితర మృగములుగా యెట్లు జన్మించును? అట్లే శుక, పిక, మయూరాది పక్షులున్ను ఆయాజాతులలో మాత్రమే జన్మించునుగాని, విపరీతముగా జన్మింపజాలవు. ఆలాగునే, మనుష్యులలోనుండి యేర్పడిన జీవులు మానవులుగానే జన్మమెత్తును. మఱియు మనుష్యావస్థకు వచ్చునప్పుడు జీవుడు చాల వికాసము, వివేకము పొందియుండును. అట్టివి అల్పజీవులుగా యెట్లు మారగలవు? ఏనుగును యెవరైన దోమలో ప్రవేశపెట్టగలరా? కావున మనుష్యజన్మములో పాపముచేసినను మనుష్యుడుగానే జన్మించును అని చెప్పుదానిలో తమ ఆశయమేమి?

ఉ:— ఈ యుక్తులన్నియు చక్కగ, చక్కని గురువుల దగ్గఱ చక్కని శాస్త్రములు శ్రవణముచేయని కారణముచే గలిగెడులోపమే. మనుష్యులు పాపములచే పశువులై పుట్టనీ, లేక మనుష్యులై జన్మించనీ, లేక దేవతలై జనించనీ, దానిలో మాకేలాటి వాదములును

లేవు. పుణ్యాపాపముల ననుసరించి సుఖదుఃఖములుగల జన్మలు వచ్చు నని అంగీకరించిన చాలును. ఒక్కొక్క విషయములో పశువులకన్నను మనుష్యులలో కొందఱు దుఃఖజీవితులై యుంటున్నారు. మంచి రాజు కుటుంబములో గల గజ, అశ్వ, గోవులు యెంతో సౌఖ్యము గలిగి యుంటున్నవి. గొప్ప ఉద్యోగస్థుల కుక్కలైన జన్మించినను యెంతో సుఖముగలదు. మనుజులలో కొందఱు రోగులుగాను, మఱికొందఱు దరిద్రులుగాను నుండి పడెడు కష్టములు చూచిన రాతివలెనుండు కఠిన హృదయములుకూడ నీరై కరుగును. అయితే మనము ఒక కార్యము నిశ్చయించినపుడు, ఇదివఱలో ఆ విషయమును నిర్ధారణచేసిన వారు మనకంటె గొప్పవారలా, లేక తక్కువవారలా యని చూడ వలెను. కర్మానుసారముగ మానవులు పశ్వాది జన్మలను పొందవచ్చు నని చెప్పినది అతీంద్రియజ్ఞానముగల ఋషులు. శ్రీ శంకరాచార్యుని వంటి అవతారపురుషులు, నిర్వాణపదమును పొందిన శ్రీబుద్ధ దేవులు మొదలగువారికన్న యెక్కువ ప్రజ్ఞ మనకు గలదా? చిన్నతరగతిలో చదువువారిని పై తరగతిలో చదువువారు పరీక్షచేయవచ్చును. పై తరగతిలో నుత్తీర్ణులైనవారిని క్రిందితరగతిలో చదువుచుండువారు యెట్లు పరీక్షచేయగలరు? అంతేగాక వేదశాస్త్రములున్ను జన్మలను గుఱించి కర్మానుసారముగ ఉచ్చ నీచజన్మలు గలుగుచుండునని తెలుపు చున్నవి. పూర్వపక్షమువారి ఆశయ మీలాగున యున్నది. ఏ వృక్షము నుండి యుద్భవించెడు బీజములు ఆలాటి వృక్షములుగానే యుండును. మృగములున్ను, పక్షులున్ను ఆలాగున యుంటున్నవని నిరూపించిరి. సరే అప్పుడు, మానవులనుండి పశువులుగాని, పక్షులుగాని, వృక్షములుగాని పుట్టవు. మనుష్యులే పుట్టుదురు. అంతేగదా వారియొక్క వాదము. ఇది శరీరములకు సంబంధించిన ధర్మము; సరిగానేయున్నది. అయితే శరీరియగు ఆత్మ (జీవుడు) దేహమున కన్యుడుగదా. ఆ జీవశక్తి ఏ శరీరములో ప్రవేశించుటకైన విరోధమేమి? జీవుడు ప్రకాశస్వరూపుడు. దీపమువంటి తేజోరూపుడని అర్థము. ఏ గ్లాసులో పెట్టినను ఆ గ్లాసు దీపము ననుసరించినట్లు, ప్రకాశించు యే శరీరము వచ్చినను దాని ననుసరించి జీవుడు జన్మించును. ఇక రెండవ కారణమేమన, గజమువంటి

వికాసస్థితిని బొందిన మానవజీవుడు మశకమువంటి క్షుద్రజీవులలో యెట్లు అణగియుండును అనునదే. దీనివల్ల వీరు దేహమును చూచియే జీవుని నిర్ధారణ చేయుచున్నారు. ఇదివఱలో జీవులు సూక్ష్మరూపులై వర్షరూపమున ధాన్యాదులందు ప్రవేశించి, శుక్లరూపమున గర్భములో ప్రవేశించునని చెప్పిన సంగతి ఆలోచించిన ఈ సందేహము గలుగదు గదా. పోనిమ్ము, జీవుడు యెంత పరిమాణముగా నుండునది వారు నిరూపింపగలరా? శాస్త్రములలో, కేశాగ్రమును శతభాగముచేసిన ఒక్కొక్కభాగమెంత సూక్ష్మమో అంతసూక్ష్మముగనుండునని జీవుని పరిమాణము చెప్పబడియున్నది. మఱియు గర్భములో ప్రవేశించు అతి సూక్ష్మరూపమగు శుక్లములద్వారా జీవుడు ప్రవేశించుననియు శాస్త్ర మందు గలదు. అందువల్ల జీవుడతిసూక్ష్మరూపుడగుటచే యెంత చిన్న శరీరములోనైనను, ఎంత పెద్ద శరీరములోనైనను ఉండుట కేలాటి విరోధ మున్ను గలుగదు.

20. ప్ర:—పూర్వీకులేర్పరచిన రీతిగా నడువవలెననియు, వారు అతీంద్రియజ్ఞానులనియు తాము సెలవిచ్చియున్నారు. కాలము ననుస రించియు, జీవుల పరిపక్వత ననుసరించియు మార్పులు చేసికొన వలెననియు, ఆయాకాలానుగుణ్యముగ అప్పుడుండు విజ్ఞులు మార్పుల చేయవలెననియు పెద్దలున్ను, శాస్త్రములున్ను చెప్పుచుండగా తామేల పూర్వాచారప్రకారము నడువవలెనని యుపదేశించుచున్నారు? ఇది ప్రకృతియొక్క మార్పునకెట్లు సరికాగలదు? ఇది ఎండాకాలమునను, శీతాకాలమునను ఒకే యాహారమున్ను, ఒకే విధమగు దుస్తులున్ను యుండవలెనను రీతిగా యుంటున్నది.

ఉ:— ప్రకృతియొక్క మార్పుల ననుసరించి ప్రాకృత విషయ ములను మార్పుచేయుట న్యాయమే. అది ఆలాగుననే యుండవలెను. అట్లుగానిచో దేశాభివృద్ధి గలుగదు. అది సరియే. ఆత్మ విషయమై, మఱియు దైవికజ్ఞానవిషయమై యీలాటి మార్పులు గూడవు. ఏలన, జీవులు సనాతనులు. ఆలాగున వేదమున్ను సనాతనమే. దానికి మార్పు గలుగదు. కాని ధర్మశాస్త్రము లన్నియు కాలానుగుణ్యముగ మార్పు నొందుచుండును. కృతయుగమునకు అప్పటిస్థితి ననుసరించి మనుస్మృతి

యు, తరువాత గౌతమస్మృతియు, శంఖలిఖితస్మృతియు, కలియుగమున పరాశరస్మృతియు యేర్పడినవి. వేదముమాత్రమెల్లపు డొకే రీతిగ యుంటున్నది. ఎందఱో సంస్కర్తలు వచ్చినను వేదవాక్యముల నెవరున్ను మార్పు చేయలేదు. వేదార్థములను వ్రాసినదానికిమాత్రము వారివారి బుద్ధి కనుగుణ్యాముగ అర్థము చేసికొనుండిరి. ఇదే దీనియందు గల రహస్యము.

21. ప్ర:—జీవులు స్వయముగా పరిణామ మొంది జ్ఞానదశకు వచ్చుచున్నారా? లేక ఈశ్వరుడే వారికి జ్ఞానము గలుగజేసి ముక్తులుగా చేయుచుండునా? లేక జీవులే తమ యత్నముచే భవబంధనమునుండి విముక్తులగుచున్నారా? ఈ విషయమై నాకు గొప్ప సందేహ మప్పుడప్పుడు గల్గుచుండును. దీనికి తమరు దయయుంచి సమాధాన మీయవలెను.

ఉ:— ఈవిషయమై మాత్రమడుగకుము. ఇదివఱలో చేసిన ప్రశ్నలకు శాస్త్రములున్ను, యుక్తులున్ను, సమాధానములున్ను గలవు దీనికిమాత్రము వేదముగూడ సరియైన సమాధానము చెప్పి యుండలేదు. ఆ విషయమై వేదశాస్త్రములన్నియు ఏదోయొక పూర్వ జన్మ పుణ్యకర్మవిశేషముచే ఈశ్వరభక్తియు, ముముక్షుత్వమున్ను గలుగుచున్నవనిమాత్రము చెప్పుచున్నవి. అయితే వేదము పరమప్రమాణమై, అపౌరుషేయమై, ఈశ్వరనియామకమైయుండగా యిట్టి ముఖ్యవిషయములకంటు సమాధానము లేకపోయిన, దానికి అపౌరుషేయశక్తి యేమి గలదని శంకించెదరేమో. అందులకు సరియైన సమాధానము గలదు. అయితే అది అప్రాకృత విషయమగుటచే సామాన్యముగా బాహ్యదృష్టిగలవారికి గోచరముకాదు. ఆ యతీత, గంభీర ప్రత్యుత్తర మేమన, ఈకర్మలన్నియు, జననములన్నియు మాయవల్లనే గలుగుచున్నవనియు, మాయ నశించినపుడు ఆత్మ సనాతనమైయుండు నిత్య దైవస్వరూపమని బోధ గలుగుననియే. అనగా జననములుగాని, కర్మలుగాని, బంధములుగాని యేకాలమందును గలిగి యుండలేదనియు, మాయయొక్క భ్రాంతివలన ఆలాగున తోచుచుండు ననియు, అగాధమైన ఆశయముతో వేద ముపదేశించుచున్నది. ఈ విష

యమై యెక్కువ చెప్పలేము. కావున మీరున్ను అప్రాకృతస్థితిలోనికి వచ్చినమాత్రమే దీనియొక్క యథార్థ తత్వమును గోచరముచేయ గల్గుదురు. నేత్రదోషముచే ప్రపంచమంతయు పచ్చగ కన్పించును. పైత్యాధిక్యతచే తల తిరుగునపుడు భూమియున్ను అతివేగముగా భ్రమణము సల్పుచున్నట్లు కన్పించును. దిగ్భ్రమచే సూర్యుడు పశ్చిమమున ఉదయమగునట్లు తోచును. నదిలో ప్రయాణము చేయునపుడు తీరము, అట గల వృక్షములు, అన్నియు వెనుకకు పరుగిడునట్లు తోచును. ఇవన్నియు వాస్తవముగా యేలాగున లేవో, విచారించిన మనోభ్రాంతిగా యెట్లుండునో, ఈ కర్మలయొక్కయు జన్మలయొక్కయు స్థితిన్ని ఆలాగుననే యుండును. మఱియు, మేఘముయొక్క గమన వేగముచే చంద్రుడు వెనుకకు పరుగెత్తుచున్నట్లు మనకు తోచుట లేదా? ఒక సరోవరపు కట్టపై నడుచువారిని ఈవలితీరమునుండి చూచినప్పుడు వారి శిరస్సు క్రిందుగాను పాదములు పైగాను నున్నట్లు మనకు కన్పించును. చలించుచుండు జలములోని చంద్రప్రతిబింబమును జూచిన, నిశ్చలముగానుండు చంద్రబింబమే కదలుచున్నట్లు గోచరమగుటలేదా? మాయయొక్క విపరీతశక్తి యీలాగున నుండును. ఇంకను వినుము. అనాదికాలమునుండి ప్రతిదినమున్ను మనము చూచుచున్న సూర్యభగవానుడు ఈ భూమిని ప్రదక్షిణము చేయునట్లు కన్పించుచున్నాడు. యథార్థము విచారించిన, భూమియే సూర్యుని చుట్టును భ్రమణముచేయుట తెలియుటలేదా? స్వప్నములో తనయొక్క నిజరూపమును మఱచుటయు, తనకు లేని యెన్నియో అవస్థలు పొందుటయు అందఱకు అనుభవమే గదా. గ్రహావిష్టుడైన మానవుడు నైజమగు వంశము, నామధేయము మఱచిపోయి గ్రహము యొక్క స్వభావముతో గూడి యెట్లు వర్తించుచుండునో, ప్రకృతి యొక్క శక్తియు అటువంటిదే కావున మాయ నశించువఱకును, ప్రకృతినుండి విముక్తిపొందువఱకును, ఆత్మసాక్షాత్కారజ్ఞాన ముదయమగునంతవఱకును జీవుని యథార్థసత్య మెవరికిని బోధ కాజాలదు. కనుకనే బంధవిముక్తిని త్వరలో చేసికొనవలెననియు, ఆ తరువాతనే సత్యమును తెలిసికొనుటకు సాధ్యమగుననియు శాస్త్రములు

చెప్పెడి రహస్యము. అందుచే 'యస్మిన్ విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి' అను ఉపనిషద్వాక్యము గలిగియుండుటకును కారణమైనది. మఱియు, 'యజ్జ్ఞాత్వా నేహ భూయోఽన్యజ్జ్ఞాతవ్య మవశిష్యతే' అని శ్రీ గీతాచార్యులును ఉపదేశించియున్నారు. అనగా 'దేనిని తెలిసికొనిన సమస్తము తెలిసికొనబడినదగునో, మఱల తెలిసికొనుట కేదియు మిగిలియుండదో' అని తాత్పర్యము. మీరడిగిన ప్రశ్నలో మూడు విషయములు గలవు. (1) జీవుడు స్వయముగా పరిణామము పొంది రావలెననిన, జీవులయొక్క నిర్మలావస్థకొఱకు చేయు యత్నము లున్ను, బోధనలున్ను వ్యర్థములై పోవును. (2) స్వయముగా బంధచ్ఛేదనము చేయు శక్తిగలిగి యుండుననిన చెప్పిన, ఎందఱో ప్రయత్నించి గూడ విముక్తి నొందకయున్నారు. (3) ఈశ్వరుడే వారిని అనుగ్రహించి తనలో ఐక్యముచేయుననిన, అప్పుడీశ్వరునియందు పక్షపాతము గలిగినట్లగునని యిదివఱలో చెప్పబడియుండెను. కావున, ఇది మిగుల దుర్ఘటమైన సమస్యగానున్నది. ఇప్పుడు మనముకూడ పూర్వజన్మకృత మగు ఏదోయొక పుణ్యవిశేషమునే అంగీకరించవలెను. అది జీవులు పరిణామదశ పొందివచ్చినదానికిన్ని, లేక ఈశ్వరకృప గలిగినదానికిన్ని సరిపోవుచున్నది. ఏలన, జన్మాంతరకర్మ మనబుద్ధికి గోచరించునది కాదు. అనుమాన ప్రమాణమును బట్టి మనబుద్ధికి గోచరింపజేసికొనవచ్చును. ఒక నవీనవృక్షము నొక ప్రదేశమున చూచిన, అది యెవరు పెట్టినది, యెప్పుడు పెట్టినది, ఎందులకు పెట్టినది తెలియక పోయినను, కారణము లేక కార్యముండదను న్యాయము ననుసరించి వృక్షమునకు బీజముండియే తీరవలెనని నిశ్చయింతుము. కావున యిప్పుడొక్కరికి శుభేచ్ఛగలిగిన, ఏదైనయొక గొప్పపుణ్యఫలముండియే తీరవలెనని నిశ్చయించుకొని ముముక్షువైనయాతడు, యెంతత్వరలో జననమరణ రూపమగు భవార్ణవమునుదాటి శాశ్వతపదవిని పొందగల్గునో అట్టి మార్గము ననుసరింపవలెను. ఇదే సంగ్రహముగా మనము గ్రహించుకొనవలసిన విషయము. ఆ తరణోపాయము మనయొక్క ప్రవృత్తి ననుసరించి శీఘ్రముగానో మందముగానో గమ్యస్థానము చేర్చుచుండును. తెప్పపై సముద్రము దాటదలంచిన కాల విలంబనము చాల అగును. పడవపై

ప్రయాణముచేసిన యింకను త్వరలో చేరవచ్చును. పొగయోడపై వెళ్ళిన అతివేగముగ చేరవచ్చును. కావున మందము, తీవ్రము, అతి తీవ్రములను మూడు ఉపాధులు గలవు. అవన్నియు మనయొక్క భక్తి, వైరాగ్య, శ్రద్ధలపై ఆధారపడియున్నవి.

22. ప్రః—ఇప్పుడు తాము సెలవిచ్చిన విషయము చాలగొప్పది. ఆ విషయమున సందేహము తీరిపోయినది. అయితే, మీరు చెప్పుదానిని బట్టి యాలోచించిన మఱియొక సందేహ మడ్డుపడుచున్నది. అదేమన జీవులు ముముక్షుస్థితిలోనికి వచ్చిన తర్వాతి అవస్థ తాము తెల్పితిరి. ముముక్షుత్వమునకు వచ్చునపుడే చాలవఱకు దుఃఖము నశించిన దనియే చెప్పవచ్చును. ఈ దశ ఆరోగ్యమునకు వచ్చిన రోగదశవలె నుండును. లోకమో, రామ రామ, శివ శివ, దారుణమగు భవరోగముచే తపించుచున్నది. దుఃఖములతో నిండియున్నది. అజ్ఞాన సర్పముచే కఱువబడి మైకము కమ్మివేయబడియున్నది. విషయదోషముచే కాలకూటవిషము త్రాగినవానివలె మూర్ఛనొందియున్నది. ఇట్టివారు తరించే ఉపాయమే యిప్పుడు కావలసియున్నది. కల్లోలముతో గూడిన ఉప్పు సముద్రమున మునిగి, ఉప్పునీళ్లు త్రాగి, ప్రాణము ముక్కుకొనకు వచ్చినవానిని యెట్లు తరింపచేయవలెనో, అట్టి ఉపాయము నుపదేశించి పుణ్యముకట్టుకొనుము మహాత్మా!

ఉః— మీరు చెప్పినదికూడ ఒకగొప్ప సంగతియే. దీనికి రహస్యమొకటి గలదు. అదేమన, జనులకు దైవభక్తియందు ప్రవేశము గలిగేలాగున ప్రోత్సాహముచేయుటయే. ఏలన భక్తిగలవారి కీశ్వరుడు ముక్తి నిచ్చియే తీరవలెను. కావుననే కలియుగమున భక్తి ముక్తికి ముఖ్యసాధనమని చెప్పుటకు కారణమైనది. ఆలాగున పుణ్యకర్మలున్ను కలియుగమున తరణోపాయమని, మోక్షకారణమని స్మృతికర్తలు తెలిపియున్నారు. సత్కర్మలు ఈశ్వరార్పణబుద్ధితో జేసిన అంతఃకరణ శుద్ధియున్ను, పాపశమనమున్ను గలుగును. అప్పుడు జీవులకు తత్వజ్ఞానమున్ను, విషయములందు విరక్తియు తప్పక గలుగును. కనుకనే ప్రతి మహనీయుడున్ను సత్కర్మలను, దైవభక్తిని జనులచే చేయించుటకు కారణమైనది. ఈ విషయము జనులకు పరిపక్వత గలుగజేయునా? అని సందే

హింపఁబనిలేదు. ఏలన, జనుల సంస్కారమెట్లుండునో సామాన్యముగ అందఱకును తెలియదు. ఎండ కాలమున తృణాదుల బీజములన్నియు భూమిలో మనకు కన్పించకనే యుండును. కాని, వర్షము కురియు నపుడేలాగున నవి యంకురించునో, ఆలాగున జీవుల యంతఃకరణసంస్కారము మనకు తెలియకపోయినను, వారివల్ల భక్తి చేయించుట చేతను, సత్కర్మలాచరింపజేయుటచేతను, మనముదోబోధించుటచేతను, తప్పక వారిలోగల పుణ్యసంస్కారములు మొలకెత్తును. ఇదే జీవులు తరించుటకు మంచి యుపాయము. ఒకవేళ మంచిసంస్కారము లేకపోయినను ఇప్పుడు వారి మనస్సును కొంచెము సత్కర్మలందుగాని, దైవభక్తియందుగాని ప్రవేశింపజేసిన, అవి క్రమముగ సంస్కారమై మాఱును. ఎట్లన వగరు, చేదు, పులుపు మామిడిచెట్లకు మంచి అంటుకట్టిన ఏలాగున మధురములైన శ్రేష్ఠఫలములు గలుగునో, మఱియు ఆలాగుననే పాలచెట్టుమొక్కకు సపోటా అంటుకట్టిన, పాలచెట్టు స్వభావముపోయి సపోటా కాయలు దానికి గలుగునట్లున్ను ఈ దుఃఖజీవుల సంస్కారములున్ను మార్పుచేసికొనవచ్చును. అప్పుడు భక్తి గలవారికి భగవంతుడు మోక్షమును గలుగజేయును. దీనియందు సందేహము లేదు. మోక్షదశలోనికి వచ్చునప్పటికి సర్వదుఃఖములు శమించును. అంతేగాక, అది చాల పవిత్రమైన స్థితియగుటచే అట్టి జీవులకు సమస్తసౌఖ్యములున్ను గలుగును. ఏలాటి కొఱతయున్ను గలుగదు. వారియొక్క సంకల్పములు శుద్ధములగునప్పుడు, అట్టివారి పవిత్ర సంకల్పములచే లోకమున్ను పావనమగును. ఇదే ఈ జీవకోట్ల నుద్ధరించుటకు పరమరహస్యమైన సులభోపాయము.

23. ప్ర:—నైజమగు స్వభావమునకు మార్పుగలుగదని యిది వఱలో తాముపదేశించి, యిప్పుడు సంస్కారములచే మార్పు గలుగునని యెట్లు చెప్పెదరు ? ఇది పూర్వోత్తర విరుద్ధముగదా ?

ఉ:—దీనియందు విరుద్ధమేమియును లేదు. ఆత్మవస్తువొక్కటి మాత్రమే సనాతనమైనది. మార్పులేనిది. పుణ్యాపాపకర్మలన్నియు సంస్కారములే అట్టి కర్మనైజముకాదు. ఆగంతుకము. కనుక సంస్కారముచే తప్పక మార్పు గల్గును. వాసిష్ఠమందును ఈలాగుననే తెలిపిరి.

శ్లో॥ తండులస్య యథా చర్మ యథా తామ్రస్య కాలిమా ।
నశ్యతి క్రియయా పుత్ర పురుషస్య తథా మలమ్ ।
నశ్యత్యేవ న సందేహ స్తస్మాదుద్యమవాన్భవ ॥

తా॥ బియ్యమునకు పుట్టుకలోనే పొట్టు,తవుడు గల్గియుండినను దంచుటచే ఆ పొట్టున్ను, తవుడున్ను యెట్లు తొలగిపోవునో, మఱియు తామ్రమునకు పుట్టుకలోనే చిలుము గలిగియుండినను అది స్ఫుటముచే యెట్లు నశించి సువర్ణమగునో, అలాగున జీవులకు గలిగియుండు కర్మలన్నియు భక్తి, వైరాగ్య, ధ్యానాదులచే నశించును. దీనియందు సందేహములేదు. కావున జీవుడు తనయొక్క కర్మరాహిత్యము చేసికొనుటలో యెల్లప్పుడు ఉద్యమముగలవాడై యుండవలెను. అపుడతడు తప్పక భవబంధనమునుండి విముక్తుడగును. మఱియు శివమహాపురాణమందొక రహస్య ముపదేశింపబడినది. అదేమన—

మహాదేవ ! మహాదేవ ! మహాదేవేతి యో వదేత్ ।
ఏకేనైవ భవేన్ముక్తిర్ద్వాభ్యాం శంభుఋణీ భవేత్॥

ఎవడు మహాదేవ! మహాదేవ! మహాదేవయని భక్తితో మూడుసార్లు జపించునో, అందొక్కదానివల్లనే వానికి ఈశ్వరుడు మోక్షము గలుగ చేయవలసియుండును. తక్కిన రెండువాక్యములకు పరమేశ్వరుడతనికి ఋణస్థుడగును. ఇది ఈశ్వరుడు చెప్పిన వాక్యమగుటచే తప్పక యాతడు దీనిని సంరక్షించియే తీరును. కావున ఈశ్వరుని స్వాధీనపఱచుకొనుటకిది మంచి సూత్రము. కనుకనే మహనీయులందఱును జనులచే భగవద్భజనము చేయించుటకు కారణమైనది.

24. ప్ర:—భగవద్భక్తిని గూర్చియు, పుణ్యకర్మల గూర్చియు బోధించి అందు విశ్వాసముగల్గి ఆచరించుటకై జనులకందఱికిని చెప్పిన విందురా ?

ఉ:— అది నిజము. రోగులైనవారిపై కరుణగల్గి ధర్మచికిత్స చేయ తలంపుగలవారేల ముందుగా వైద్యశాస్త్రము చక్కగ తెలిసికొనవలసియుండునో, మఱియు విద్యలేనివారలకు ధర్మార్థముగా చదువు చెప్ప నిశ్చయించువారు ముందుగా తామేలాగున బాగుగ చదువవలసియుందురో, అలాగున జీవుల తరింపచేయ దలంచువారు ప్రథమమున

తాము తరించవలెను. తాము భక్తిగల్గి భగవత్కృప నొందినవారుగా నుండవలెను. తాము తపస్సు, ధ్యానాదులచే బ్రహ్మవిద్యను అభ్యసించుకొనవలెను. ప్రకృతిదోషము లేనివారుగా నుండవలెను. అందఱిపై ప్రేమగల్గి యుండవలెను. ప్రతిఫలము కోరక శ్రద్ధతో ప్రవర్తింపవలెను. ముందుముందుగా వచ్చినరోగులు బాగుపడునప్పుడు అదిజూచి అనేక జనులు దేశదేశములనుండి వచ్చెదరు. కావున జనులు భవరోగమును రహితమొనర్పజేయ దలంచువారు తమయొక్క సంసారవ్యాధిని ప్రథమమున నిర్మూలించుకొనవలెను. అట్లుకానిచో, పుట్టంధుడు మఱియొక అంధునకు మార్గముచూప ప్రయత్నించేలాగున నుండును. కావున లోకసేవ చేయ తలంచువారందరును ముందుగాతమయొక్క ఆత్మసేవను శుద్ధముగా చేసికొనవలెను. తరువాత ఇతరుల ఆత్మలకు సేవచేయుటకై యత్నించవలెను. అన్నిటికిన్ని సత్యమే ముఖ్యాధారము. వాక్శుద్ధిలేనిచో తానెంత పాండిత్యముగల్గి యుపదేశించినను ఒక్కవచనమందైనను యెవనికిని విశ్వాసము గలుగదు. ఆలాగున, మనశ్శుద్ధి లేనిచో ఒకచిన్నసంకల్పమైనను అతనికి ఫలింపదు. అదేరీతిగ కాయశుద్ధి లేనిచో తానొక చిన్న పనియైనను ప్రారంభించిన సరిగా నెరవేరజాలదు. ఈ తత్వమును ధర్మబోధకులున్ను, జ్ఞానబోధకులున్ను ముఖ్యముగా జ్ఞాపకములో నుంచుకొనవలసినది. అనుష్ఠానపరులకున్ను యిది మఱువజాలనిది. ఆత్మశుద్ధి గల్గునప్పుడు తమ సంకల్పములన్నియు తప్పక ఫలములను గలుగజేయవలెను. అట్లు గలుగజేయు కాలపరిపక్వత ననుసరించి హెచ్చుతగ్గులుగ మారుచుండును.

25. ప్ర:— పరలోకము గలదనియు, అచ్చట సుఖదుఃఖములిదేరీతిగా నుండుననియు యిదివరలో సెలవిచ్చితిరి. భూలోకము, చంద్రలోకము, అంగారకాది లోకములన్నియు యిదేమాదిరి ధాతువులచే హెచ్చుతగ్గులతో గూడియుంటున్నవని పరిశోధకులు తెలుపుచున్నారు. పరలోకము యెట్టిధాతువులతో సృష్టింపబడినది తెలియుటలేదు.

ఉ:— స్వర్గాదిలోకములన్నియు ఇదేమాదిరి పంచభూతములచే చేయబడినవి కావు. అవి పృథ్వ్యాది ధాతువులచే చేయబడియుండలేదు. అవి సూక్ష్మలోకములు. పంచభూతసంబంధములు కావు. అవి

స్వప్నలోకమువలెనే యుండును. ఈ విషయము ప్రపంచములోగల సర్వమతస్థులును అంగీకరించియే యున్నారు. అవి (1) స్థూల (2) సూక్ష్మ (3) సూక్ష్మతర (4) సూక్ష్మతమ (5) అతిసూక్ష్మ (6) అతిసూక్ష్మతర (7) అతిసూక్ష్మతమ మనెడు అవస్థలతో గూడియున్నవి. నిర్మలతయు, జ్ఞానమున్ను, సుఖమున్ను ఒక్కొక్కదానికంటె ఒక్కొక్కదానియందు శతగుణాధికముగనే యుండును. (1) భూలోకము (2) భువర్లోకము (3) సువర్లోకము (4) మహర్లోకము (5) జనలోకము (6) తపోలోకము (7) సత్యలోకము, ఈ ఒక్కొక్క లోకములోనుండు జీవులు కూడ ఒక్కొక్క లోకములోనివారికంటె అధికపరిశుద్ధత గల్గియుందురు. సత్యలోకమందు చతుర్ముఖబ్రహ్మ నివాసముగా నుండును. బ్రహ్మవలె అత్యంతశుద్ధులున్ను, జ్ఞానులున్ను మాత్రమే ఆ స్థానమును పొందెదరు. లోహవర్గములో యేలాగున (1) ఇనుము (2) సీసము (3) ఇత్తడి (4) తామ్రము (5) కంచు (6) రజతము (7) సువర్ణము మొదలగు భేదములు గలవో, ఈ సప్తలోకములున్ను ఆలాటి భేదములు గలిగి యుండును. అయితే అవి యీలాటి లోహములచే నిర్మితములు కావు.

26. ప్ర. — కర్మలెన్ని విధములు? వాటి తరగతు లెన్ని ?

ఉ:— కర్మ లసంఖ్యాకములు. వాటి ఫలములున్ను అసంఖ్యములే. అయితే అవి 1. పుణ్యకర్మ, 2. పాపకర్మ, 3. మిశ్రకర్మ, 5. కామ్యకర్మ, 5. నిష్కామకర్మ అని అయిదు విధములుగ నుండును. ఈ అయిదింటెని మూడుగ సంక్షిప్తముగ ఋషులు చెప్పిరి. అవి పుణ్య, పాప, మిశ్రమమనుపేర్లు గలిగియున్నవి. ఈ మూడున్ను ఒక్క అవిద్యయందుండియే పుట్టినవి. ఈ యవిద్యకు అజ్ఞానమనియు పేరు. అజ్ఞానమొకటి నశించిన, కర్మలన్నియు, మూలము నశించిన వృక్షముయొక్క శాఖోపశాఖలన్నియు, ఫలపత్రాదులన్నియు నశించులాగున నశించును. పుణ్యకర్మచే దేవత్వమున్ను, స్వర్గలోకమున్ను, పాపకర్మచే అధోలోకమున్ను తిర్యగ్లోకమున్ను గలుగును. మిశ్రకర్మ భూలోకమును, మర్త్యజన్మమును సిద్ధింపజేయును. కామ్యకర్మఫలము ఈ మూడులోకములలో దేనినైనను ప్రాప్తింపజేయును. నిష్కామకర్మచే అంతఃకరణశుద్ధియు, వైరాగ్యమున్ను ఆవిర్భవించును. దానివల్ల భక్తియు, జ్ఞానమున్ను

ఉద్భవించును. వీటి అన్నిటిలో పరిపక్వతాభేదముననుసరించి మహా ర్లోకము మొదలు సత్యలోకమువఱకు గల నాలుగు లోకములను జీవులు పొందుదురు. సమష్టియందుగలది వ్యష్టియందును యుండును. అండములోగలది పిండములోగూడ యేర్పడును. కావున ఈ యేడు లోకములున్ను అందఱి శరీరములలోను గలవు. అట్టి ఫలములు (సుఖములు) గూడ యిచ్చటనే గలుగును. అవన్నియు జీవులయొక్క శుద్ధత ననుసరించియుండును.

27. ప్ర:—దేహవియోగకాలమున ఆయాలోకములను యెవరు పొందింపజేయుదురు ?

ఉ:— ఆయాలోకములకు సంబంధించిన యాతివాహికదేవతలు జీవులను పొందింపజేయుదురు. దీనికే అర్చిరాదిమార్గమనిపేరు. గీతలో అష్టమాధ్యాయమున పక్ష, అయన, అగ్న్యాది దేవతలను గుఱించి చెప్పబడినట్లుండును. ఎట్లన, ఎవరైన విదేశాదులకు ఓడపై వెళ్లునపుడు అచ్చటకు చేరెడు సమయమున దానికిని తనకును సంబంధించిన జనులు, ఏలాగునవచ్చి గౌరవముగ తీసికొనిపోవుదురో, ఈ లోకాంతరయాత్రయు ఆలాగుననే యుండును. సామాన్యుల నందఱిని యమధర్మరాజుదగ్గఱకు దూతలు తీసికొనివెళ్లెదరు. అచ్చట విచారణ గావింపబడి స్వర్గలోకమునకుగాని, నరకలోకమునకుగాని పంపబడుదురు. ఇది యొక పద్ధతి. ఇక వారివారి భక్తి, జ్ఞాన, వైరాగ్యాదుల ననుసరించి విష్ణుదూతలుగాని, శివదూతలుగాని అంత్యకాలమున వచ్చి తీసికొనిపోయెదరు. యమదూతలలో మంచివారున్ను, చెడ్డవారున్ను కూడ గలరు. ఆ మంచి చెడ్డలు జీవుల పుణ్యాపాపకర్మల ననుసరించి యుండును. ఎట్లన, దేశాంతరములకు ఖైదీలను తీసికొనివెళ్లునపుడు దానికి సంబంధించిన జైలుఅధికారులున్ను, భటులున్ను వచ్చి యెట్లు తీసికొనివెళ్లుదురో, జీవుల పరలోకప్రయాణమున్ను అటువంటిదే. కావున, మనుజుడు జీవించియున్నపుడే పాపకార్యములఁ జేయక పుణ్యకర్మలనే చేయవలెను. పాపకార్యములచే సంపాదించిన ధనముగాని, తదితరములుగాని యేమియు వెంట రాజాలవు. పాపముమాత్రమే వెంట వచ్చును. చోరులను పోలీసులు పట్టుకొని తీసికొనిపోవునపుడు బంధు

త్రులుగాని, పుత్రికలుగాని, సంపాదించిన వస్తువులుగాని కూడ పోజాలవు గదా. కనుకనే శాస్త్రము లీలాగున చెప్పుటకు కారణమైనది:

శ్లో॥ ధనం చ భూమౌ పశవశ్చ గోష్ఠే
కాన్తా గృహద్వారి జనశ్శ్మశానే ।
దేహశ్చితాయాం పరలోకమార్గే
కర్మానుగో గచ్ఛతి జీవ ఏకః ॥

తా॥ సంపాదించిన ధనమంతయు ఆయాచోట్లనే నిలచిపోవును. పశువులన్నియు కొట్టములోనే ఆగిపోవును. తాను ప్రాణసమానముగ ప్రేమించిన భార్య గృహమందే నిలచిపోవును. దేహసంబంధులు శ్మశానమువఱకే వచ్చెదరు. పాపకర్మచే పోషింపబడిన ఈ దేహము చితిలో నుంచబడును. అచ్చటనుండి పరలోకమార్గమునకు జీవుడు ఒంటరిగానే వెళ్ళవలసియుండును. తక్కిన సహాయులెవరున్ను వెంట రాజాలరు. మఱియు, ఇక కొంతకాలముండి మంచికార్యము చేయవచ్చుననియు నిరీక్షించరాదు. ఈనిమిషమో, ఉత్తరనిమిషమో శరీరమునుండి జీవుడు లేచిపోవచ్చును. పంజరమునుండి పక్షి యెగిరిపోవునది యేసమయ మునవో యెవరికిని తెలియదు. దేహమునుండి జీవుడున్ను ఆలాగుననే లేచిపోవును. జీవితము నీటిపై బుడగవంటిది. సముద్రపు అలలెంత చంచలములైనవో, మెఱుపు యెంత క్షణికమో, దేహముయొక్క స్థితియు ఆలాగుననే యుండును.

యావత్స్వస్థమిదం శరీరమరుజం యావజ్జరా దూరతో
యావచ్చేన్ద్రియశక్తిరప్రతిహతా యావత్క్షయో నాయుషః ।
ఆత్మశ్రేయసి తావదేవ విదుషా కార్యః ప్రయత్నో మహాన్
సందీప్తే భవనే తు కూపఖననం ప్రత్యుద్యమః కీదృశః ॥

తా॥ ఎప్పుడు శరీరము ఆరోగ్యము గలిగియుండునో, ధనమున్ను అధికారమున్ను చేతిలోనుండునో, శరీరము రోగరహితముగా నుండునో, ఎపుడు వార్ధక్యాదులచే దేహము బాధింపబడకుండునో, ఇంద్రియములయొక్క శక్తి నశింపకయుండునో, ఆయుస్సు క్షయము పొందకుండునో అపుడే బుద్ధిమంతులు ఆత్మయొక్క శ్రేయస్సుకొఱకు గొప్పయత్నము చేయవలెను. అట్లుగాక ఇంద్రియములకు పటుత్వము

తప్పి, ధనము క్షీణించి, చేతినుండి అధికారము జారిపోయినతరువాత మంచికార్యము చేయవచ్చునని తలంచుట, గృహము అగ్నిచే దహింప ప్రారంభించినపుడు నూతినిత్రవ్వి అందలి జలమును తెచ్చి ఆనిప్పును చల్లార్చవచ్చునని తలంచినట్లయిన అదెట్లు సాధ్యము కాకుండునో పై జెప్పిన కార్యములన్నియు ఆలాగుననేయుండును. సకామ, నిష్కామ కర్మలచే క్రమముగ ప్రవృత్తిమార్గముగాని, నివృత్తిమార్గముగాని కలుగును.

28. ప్ర:—కర్మ, సంచితాగామి ప్రారబ్ధములనెడు మూడుతెగలుగా నుండుననియు, ఈ కర్మలు నశింపక జీవులకు మోక్షము గలుగదనియు చెప్పుచున్నారే, దీని రహస్య మేలాగుననుండును?

ఉ:—ఈ విషయము చాలపెద్దది. వేదశాస్త్రార్థము లన్నియు ఈవిషయమై యెక్కువగ చెప్పుచుండును. జన్మజన్మాంతరములలో పరంపరగా వచ్చుచుండు సంస్కారములన్నిటికిని కర్మయను పేరుగలిగి యుండును. అట్లు అనేకజన్మములందు చేసిన కర్మలన్నియుచేరి సంచితమనంబడును. దీనిని పూర్వజన్మకర్మయని అందురు. ఇది నిలువయుండు కర్మకు పేరు. ఇది యెంతమాత్ర ముండునదిగాని, లేక యిక లేదనిగాని మనకు తెలియుట ప్రయాసము. దీనినే సంచితమందురు. ఆ సంచితకర్మ రాశినుండి ఈజన్మలో అనుభవమునకు వచ్చుదానికి ప్రారబ్ధమను పేరు గలిగియున్నది. ఇప్పుడు చేయు కర్మలు ఆగామి యని చెప్పబడును. అనగా రాబోవు జన్మలయందు అనుభవింపబడునదని యర్థము. ఈ మూడు కర్మలునుజేరి సంచిత, ఆగామి, ప్రారబ్ధమను నామములు గల్గియున్నవి. ఒక జన్మలో చేసినకర్మ మఱియొకజన్మలో అనుభవించిన పూర్తియగునని తలంపరాదు. ఒక వేళ అనుభవించిన తీరిపోవచ్చును. ఇపు డనుభవించు ప్రారబ్ధకర్మకూడ దీనికిముందు వచ్చిన ఒకేజన్మయొక్క కర్మయని నమ్ముటకు వీలులేదు. ఒకపుడు అట్లైనను కావచ్చును. సంచితములో యెక్కువ కర్మ లేకుండినమాత్రమే అట్లు జరుగును. అట్లుకానిచో, వర్తమానమున ననుభవించెడు యీ ప్రారబ్ధకర్మఫలముకూడ ఎన్నియో జన్మలకుముందుగా చేసినదైనను రావచ్చును. మొత్తముమీద యేజన్మమందైనను చేసినదిమాత్రమే వచ్చునుగాని లేనిది రాజాలదు. ఇట్లు

ఈశ్వరవిధి కలదు. కనుకనే యెవ్వరైనను కష్టము లనుభవించునప్పుడు, ఏజన్మలో చేసినకర్మరూపా ఈలాగున సంకటరూపముగ వచ్చినదని దాని భావము. కర్మ ధాన్యపురాశివంటిది. దానిలో ఒక్కొక్క ఋతువులో పండుచుండెడు గోధుమ, వరి మొదలగు అనేకరకముల ధాన్యములు పోయబడుచుండెనని తలంచుడు. అడుగుభాగమునగల రంధ్రమునుండి నిత్యము ఖర్చుకొఱకు ధాన్యము తీయుచుండిన, ముందుముందు పోయబడిన ధాన్యమే వచ్చుచుండునుగాని, వెనుకవెనుక పోసియుండు ధాన్యము పిమ్మటనే వచ్చును. ఒకవేళ ధాన్యపుపాత్రయందు ప్రాంత ధాన్యము లేనిచో, నిన్నటిదినము వేసిన ధాన్యముకూడ ఈదినము రావచ్చును. కర్మానుభవముయొక్క రీతి ఈలాగుననుండును. అది చక్రమువలె తిరుగుచుండును. చక్రభ్రమణము ప్రారంభించిన, దానికి యెన్ని ఆకులుగలవో అవన్నియు ఒక్కొక్క దానివెనుక మఱియొకటి యెట్లు వచ్చుచుండునో, కాలచక్రమున్ను, కర్మచక్రమున్ను ఈలాగుననే యుండును. కనుకనే యొకడు వర్తమానమున క్రూరుడైనను సుఖవంతుడుగాను, మఱియొకడు శాంతుడైనను దుఃఖమును పొందుటకును కారణమగుచున్నది. జ్ఞానాగ్ని ఉదయమైనవెంటనే అనేక జన్మములలో చేసిన కర్మలన్నియు భస్మమైపోవును. ఆలాగున చాల సంవత్సరముల ధాన్యములుండినను గృహములో అగ్ని తగులుకొనిన యెట్లు అన్నియు దహించిపోవునో, కర్మయొక్క రీతియు ఈలాగుననేయుండును. సంచితకర్మయొక్క రీతి ఈలాగుననుండును. ప్రారబ్ధముమాత్ర మనుభవించియే తీరవలెను. ఆత్మజ్ఞానోదయముచే క్రియమాణమగు ఆరబ్ధము క్షయించిపోవును. ఎట్లన యిపుడు చేయుచుండు కృషి వర్షములులేక, గొప్పయెండ గల్గియున్న ఎట్లు ఫలమునకు రాక నశించునో, ఆలాగున జ్ఞానాగ్నియొక్క వేడిమిచేతను, వాసనారాహిత్యరూపమగు వర్షాభావముచేతను ఆగామి నశించును. మఱియొకపక్షమున, జ్ఞానియొక్క ఆగామికర్మలన్నియు వాని శత్రువులచేతను మిత్రులచేతను తీసికొనబడునని కలదు. దూషించువారికి పాపకర్మయు, భూషించువారికి పుణ్యకర్మలును పోవుచుండును. కనుకనే జ్ఞానులను నిందింపరాదని శాస్త్రములు చెప్పెడు రహస్యము. ప్రారబ్ధము ఈ సంవత్సరము భోజనాదు

లకు పెట్టియుంచిన ధాన్యమువంటిది. భుజించుటచేత యది రహిత మగును. ఆత్మజ్ఞానముగలిగి పరమత్యాగ ముదయించిన, వాని యాగామి కర్మను లోకమున పంచుకొనెదరు. ద్రవిడదేశమున పట్టిణత్తార్ అను గొప్ప ధనికుడుండెను. ఆతడు కోట్లకొలది ధనము సంపాదించి కొంతకాల మునకు పరమవైరాగ్య మవలంబించి దిగంబరుడై గృహమును వదలు నపుడు, కావలసినవారి ధనమును తీసికొనవచ్చునని తండోరావేయించెను. అపుడనేక గ్రామస్థులు వచ్చి దానిని తీసికొనివెళ్ళిరి. ఆలాగున పుణ్యము భక్తులున్ను, పాపము విరోధులున్ను వందనముచేతను, నిందచేతను అపహరించుకొనెదరు. కావున జ్ఞానియైనవాడు పుణ్యాపాప కర్మనుండియు, సంచితాగామి కర్మనుండియు విముక్తుడై జీవన్ముక్తి యను నిత్యశాంతిని పొందునని తెలియఁదగినది.

29. ప్ర:— ఈ కర్మత్రయవిధులలో ఒక గొప్ప సందేహము నాకు గలిగియున్నది. ఇది నాబోటివార్లకే గాదు; సత్యాన్వేషకు లందఱికిని గలుగునదే. దీనివల్ల భక్తులపై, జ్ఞానులపై మేధాసంపత్తి గలవారందఱికిని గొప్ప అవిశ్వాసముగూడ గలిగినది. గొప్ప బ్రహ్మ నిష్ఠులపై గూడ అవిశ్వాస మేర్పడినది. కావున దీనిని తొలగించిన, బ్రహ్మనిష్ఠులందఱిని, పరమభక్తుల యావన్మందిని ఉద్ధరించినట్లేయగును. ఆ సందేహము తమరిప్పుడు సెలవిచ్చినదానిలోనే గలదు. జ్ఞానము చేత సంచితమున్ను, ఫలాపేక్షలేక చేయుటచేతగాని లేక శత్రుమిత్రులు జ్ఞానియొక్క కర్మ నపహరించుటచేతగాని ఆగామియున్ను నశించును. ప్రారబ్ధ మనుభవించియే తీరవలెనని తెలిపితిరిగదా. ఇందువల్ల వేదాంత రహస్యము బాగుగ తెలియని మాబోటివారు, వేదాంతులని పేరు పెట్టుకొనినవారిలో కొన్ని లోపములు అప్పుడప్పుడు కనుపించుచుండు టచే ఆ విషయమేమని వారినడిగిన, 'మా ప్రారబ్ధకర్మ ఆలాగున యుం టున్నది.' అనిచెప్పి "ప్రారబ్ధం భోగతో నశ్యేత్" అను శాస్త్రవాక్యము నడ్డుపెట్టుదురు. కావున ఈ విషయమై మాబోటి జిజ్ఞాసువులు చాల శ్రమను పొందుచున్నారము. కాన పరమదయతో ఈ బాధను తొల గించి మమ్ములను, లోకమును ఉద్ధరించవలెనని మిక్కిలి భక్తితో ప్రార్థించుచున్నాను.

ఉ:— నాయనా! నీవు చెప్పినది నిజముగానే యుంటున్నది. ఇట్టి దుష్టకృత్యములచే సజ్జనులపై గూడ లోకులకు అవిశ్వాసము యేర్పడుటకు కొంత అవకాశము గలిగెను. కాని యిది నిజమైన బ్రహ్మనిష్ఠులను తెలియనివారికిమాత్రమే యుండును. అట్టివారిపై మొదట అవిశ్వాసము గలిగినను, వారియొక్క సత్యనిష్ఠ, ధర్మబుద్ధి, పవిత్ర వర్తన మొదలగు పావనగుణములు తెలియునప్పుడు సందేహము గలవారెవరెవరుందురో వారే తిరిగి పశ్చాత్తాపము నొందుదురు. సూర్యుడు ప్రకాశించునపుడు గుడ్లగూబ మొదలగు జంతువులకుమాత్రమే చీకటియుండునుగాని తక్కిన మానవాదులకుండునా? మఱియు సజ్జనులు కర్మయందు విశ్వాసముగలవారు. కర్మఫలమును సర్వేశ్వరుడు తప్పక కలుగజేయునని వారికి తెలియును. సర్వేశ్వరునకు తెలియని విషయము బ్రహ్మాండమందుండజాలదు. మఱియు మధురవృక్షబీజములు పెట్టెడువారికి చేదుఫలములు గలుగునను సందేహము గలుగునా? అలాగుననే, చెడుస్వభావముగలవారు కొందఱుండినను శ్రేష్ఠగుణము గలవారికేమియు కొఱతయుండదు. వారు సర్వదా సర్వేశ్వరునిపై భారమునుంచియున్నారు. సర్వేశ్వరుడు జాగ్రత్స్వప్న సుషుప్తి భేదములేక సమస్తచరాచర ప్రాణికోట్ల హృదయాంతరాళమునుండి సర్వమున్ను యెఱుంగువాడు; చెవిలేకనే చీమయొక్క సంకల్పమును కూడ స్పష్టముగా వినువాడు. నేత్రములేకయే బ్రహ్మాండములోని పరమాణువులనుకూడ బాగుగ చూచువాడు. పాదములేకనే అనంతకోటి బ్రహ్మాండములంతటను ఒక నిమిషమైన ఆలస్యములేక పరుగిడువాడు. కరములు లేనివాడైనను అనంతకోటిప్రాణికోట్లకేకకాలముననే వాటి వాటి ఫలముల నొసంగెడువాడు. సర్వప్రాణికోట్ల సంకల్పముల నెఱింగెడు ప్రభువునకు, అట్టి మహనీయునకు, తెలియనియట్టి యే కార్యమును యే ప్రాణియైనను చేయజాలదు.

"అపాణిపాదో జవనో గృహీతా పశ్యత్యచక్షుః స శృణోత్యకర్ణః।
స వేత్తి వేద్యం న చ తస్యాస్తి వేత్తా తమాహురగ్ర్యం పురుషం మహాన్తం"

ఈ శ్రుతివాక్యమున కర్థము పైన చెప్పినదే. అయితే బ్రహ్మజ్ఞానులు ప్రారబ్ధము మొదటనే అనుభవించితీరవలెనని చెప్పెడు శ్రుతి

వాక్యముయొక్క అర్థము బాగుగ విచారణచేయకయే అట్టివారు ప్రమాదమునొందెదరు. ఏదోయొక గురుమంత్రము ఉపదేశింపబడి నంతమాత్రముచే మేము బ్రహ్మజ్ఞానులమైతిమని తలంచుటచేతనే యిట్టి పొరబాట్లు కలుగుచుండును. బ్రహ్మజ్ఞాని బ్రహ్మమయముగా నుండు ననియే శాస్త్రము విధించుచున్నది. బ్రహ్మమందేలాటి ప్రకృతిగుణము లైనను యెట్లు కలుగునని విచారణచేయని దోషముచే వారిని ప్రకృతి వికృతిలోనికి తీసికొనివచ్చుచుండును. శ్రవణమున్ను, మననమున్ను దాటి నిదిధ్యాసనములో నుండువారుకూడ సాక్షాత్కారము కలుగు వఱకు జాగ్రతగల్గి అవిద్యాదిక్లేశములు గలుగనీయక చూడవలెననియు శ్రుతి విధించుచున్నది. యమాది అష్టాంగయోగమునందలి సమాధిని పొందు యోగికూడ వాసనాక్షయ, మనోనాశ, జ్ఞానోదయములు తనకు కలిగినవా యని పరిశోధన సల్పవలెనని వేదాంతము బోధించుచున్నది. శ్రవణమునకు ముందుగా సాధనచతుష్టయసంపన్నుడు కావలెనని శాస్త్రము లుద్ఘోషించుచున్నవి. తామ్రమును శుద్ధముగా స్ఫుటముచేసిన సువర్ణమగును. సువర్ణమైన, దానియందిక చిలుముండరాదు. చిలుముం డిన, సరిగా యింకను స్ఫుటము కాలేదని యర్థము. అపుడు నిమ్మపండు రసముచేతను, చింతపండుచేతను ఆ తామ్రభస్మమును శోధించవలెను. ఈ పదార్థములచే యేది చిలుముగలుగనిచో స్ఫుటము శుద్ధమైనదని గ్రహింపవచ్చును. లేనిచో శుద్ధముకాలేదని నిశ్చయించుకొనవలెను. ఆలాగున జ్ఞానాగ్నియందు స్ఫుటమైన ఆత్మయైనచో మాయాది దోష ము లేవియు గల్గియుండరాదు. అవిద్యాదోషముండిన, జీవుడింకను శుద్ధుడు కాలేదని యర్థము. కావున, బ్రహ్మజ్ఞానియైనవాడు తనలో అవిద్యాలోపముండినను అది ప్రారబ్ధమని చెప్పెడు వాక్యమును బుద్ధి మంతుడైనవాడు నమ్మనక్కరలేదు. అమృతములో విషముండినను దోషములేదను వాక్యమునైన నమ్మవచ్చును; జ్వలించుచుండు అగ్నిలో శీతలజలముగలదను వచనము తప్పుగాదని యైన నమ్మవచ్చును గాని, పై జెప్పె వాక్యమునుమాత్రము నమ్మకుము. సుషుప్తిలో నుండువాడు నిర్వికల్ప సమాధియందుంటున్నాడని చెప్పినను నమ్మవచ్చునుగాని పై జెప్పిన మాటలు వినకుము. గ్రీష్మఋతుమధ్యాహ్నకాలమున ప్రపంచమం

తము అంధకారమయమైయున్నదని చెప్పినను నమ్మవచ్చునుగాని, జ్ఞానులందు అజ్ఞానగుణముండినను అది ప్రారబ్ధమని చెప్పెడు వాక్యమునుమాత్రము వినకుము. గరుడపక్షి గూటిలో సర్పము కాపురము చేయుచున్నదని చెప్పినను, వ్యాఘ్రములమధ్య గోవులు సంతోషముగా మేయుచున్నవని యెవరైన వచించినను నమ్మవచ్చునుగాని పై వాక్యమునుమాత్రము నమ్మకుము. సింహ నివాసబిలములో యేనుగులు నివసించుచున్నవని చెప్పినను, సర్పములు వాసముచేసెడు స్థలములో మండూకములు కాపురము చేయుచున్నవనినను, గండుపిల్లుల మధ్య మూషికములు నాట్యముచేయుచున్నవని చెప్పినను నమ్మవచ్చునుగాని బ్రహ్మజ్ఞానికి ప్రకృతిగుణములున్నను దోషములేదు, అది ప్రారబ్ధమని చెప్పువాక్యమునుమాత్రము నమ్మకుము. ఇట్టి వాక్యమును వినిన, నీవుకూడ పతితుడగుదువుసుమీ! నిప్పులో బాగుగ వేయించబడిన విత్తనములు భూమియందు పెట్టిన మంచి పైరుకాగలదని చెప్పిన నమ్మువారెవరైన యుండినచో వారితో యీలాటి పాపవాక్యములను చెప్పవలసినదేకాని, వివేకవంతు లెవరైన యట్టివానిని విందురా? ఈలాటివారిని చూచుటచేతనే వివేకవంతులకున్ను, విద్యావంతులకున్ను, గౌరవనీయులకున్ను పరమసాధువులపై, భక్తులపై విశ్వాసము లేకపోవుటకు కారణమైనది. కావున యిట్టి దోషములెంత త్వరలో లేకుండ చేసిన లోకమంత త్వరలో బాగుపడును. దానివలన జనులందరికిని భక్తిమార్గమందును, జ్ఞానమార్గమందును విశ్వాసముగలిగి, వారున్ను దుఃఖసాగరమునుండి తరింపగలరు. అట్టివారు ముముక్షువులకున్ను, బ్రహ్మచారులకున్ను యేదైన సహాయము కావలసియుండిన, శ్రద్ధతో చేయగలరు. దీనివలన గృహస్థులున్ను, జిజ్ఞాసువులున్ను తరింపగలరు. భగవద్భక్తుల హృదయములో, బ్రహ్మనిష్ఠుల యుదరములో, సాధువుల కడుపులో మనది యేవస్తువైన కొంచెము పడినచో మనము తరింపగలము, మన వంశము పావనమగును, పుణ్యప్రాప్తి గలుగునను తలంపు జనులకు కలిగేలాగున భక్తులు, సంన్యాసులు, సాధువులు, వేదాంతులు, యోగులు, ధర్మబోధకులు వర్తించవలయును. అపుడే బ్రహ్మవిద్య వృద్ధి కాగల్గును. అట్టి పవిత్రత, ఆచరణ, వైరాగ్యము, సంయ

మముగల్గి సాధువులు వర్తించవలెను. ఇక ఈ విషయమై విచారణా భాగము కొంతగలదు. అది జ్ఞానవిభాగమున తెలియఁదగును. కావున వృక్షమునకు మూలము యెటువంటిదో, బ్రహ్మనిష్ఠకు అనుష్ఠానమున్ను అటువంటిదని మఱువకుడు.

క్వ కిల స్వాత్మవిశ్రాంతిః క్వైతద్విషయవేదనమ్।
సుషుప్తిజాగ్రతోరైక్యం భ్రాంతా భ్రాంతాత్మనో భవేత్ ॥

తా॥ ఆత్మవిశ్రాన్తి యెచట! విషయప్రవృత్తి యెచట! సుషుప్తికిని జాగ్రత్తునకును యేకత్వమెచట! అనగా భిన్నత్వముండును. ఆలాగున, జ్ఞానియైనవానియందు అజ్ఞానమెట్లుండును? అనగా యుండజాలదని అర్థము. ఇట్లు వాసిష్ఠము.

యస్య న స్వదతే దృశ్యమదృశ్యం స్వదతే హృది।
స బాహ్యాభ్యంతరశ్శాన్తిః స వితీర్ణో భవార్ణవాత్ ॥

తా॥ ఎవనికి దృశ్యవిషయమందు రుచిగలిగియుండదో, దృక్కైన ఆత్మయందు ప్రీతిగల్గియుండునో, అట్టివానికి బాహ్యమందును, అంతరముందును పరమశాంతి నెలకొనియుండును. అట్టివాడు సంసారసాగరమును లెస్సగ తరించినవాడే యగును.

30. ప్ర:—ఈ ప్రారబ్ధవిషయమై కొందఱీలాగున చెప్పుదురు:—ఎంత జ్ఞానము కలిగినను, ఘటమునకు (కులమునకు) సంబంధించిన కొన్ని లోపములు పోవుట దుస్తరమని తెలుపుదురు. ఈ విషయమై తమ యభిప్రాయమేమి?

ఉ:—ఈలాటి సందేహము చాలమందికిని గలదు. కారణము ఆత్మానుభవము బాగుగ కలుగకపోవుటయే. కొందఱికి ధ్యానములో మనస్సు నిలువకపోవుటచేతను, కొందఱికి విషయనివృత్తి గలుగకపోవుటచేతను, కొందఱికి క్రోధాది దుర్గుణములు నశింపకపోవుటచేతను, కొందఱికి కొన్ని భుజించెడు వస్తువులం దభిరుచిగలుగుటచేతను, కొందఱికి జాత్యభిమానము రహితము గాకపోవుటచేతను, కొందఱికి కొంత లోభగుణము గలిగియుండుటచేతను, కొందఱికి కొంత కఠినస్వభావము గల్గియుండుటచేతను, ఇవన్నియు ఘట ప్రారబ్ధమనియు, ఫలాని జాతిలో పుట్టినందుచేత ఈలాగున గలుగుచున్నవనియు చెప్పెడువారలనేకులు

గలరు. దానికి కారణము ముఖ్యముగా ద్వంద్వాతీతబోధకుల దగ్గఱ చేరకపోవుటయే. తనయొక్క స్వరూపము శుద్ధబ్రహ్మమని బోధ గలిగిన, మనోరాహిత్యము సిద్ధించిన, వాసనారాహిత్యము లభించిన, ఈలాటి దోషములు ఉదయముకావు. కాని అది గలుగుట చాల దుస్తరము. సాక్షాత్ ఈశ్వరస్వభావము ఆత్మయను భావమునకు రాక పోయినను, ఈశ్వరాంశులే జీవులను బోధగలిగిన, పై నిరూపించిన వాసనాదోషములుండవు. కావున బ్రాహ్మణులైనచో సంపూర్ణజాత్యభిమానము పోవుట కష్టతరమని తోచిన, బ్రాహ్మణులలోనుండెడు సనకాదిఋషులను, శుక దత్తాత్రేయాది మహాత్ములను హృదయమున తలంచిన, పూర్వసంస్కారములు నశించి ఆ మహాత్ముల స్వభావమే యేర్పడగలదు. ఆలాగున క్షత్రియజాతులైన, అందుండు బ్రహ్మనిష్ఠులకు రజోగుణక్షయము గలుగనిచో, విశ్వామిత్ర, జనకాదులను స్మరించవలెను. అపుడు వారి స్వభావమునకు మార్పు గలుగును. ఆలాగుననే వైశ్యులైన, జ్ఞానానుష్ఠానము చేయునపుడు మంచి త్యాగము గలుగక లోభగుణముండిన, తులాధారాది మహాత్ములను హృదయములో భావించవలెను. దానివలన లోభగుణ మణగిపోవును. అదేరీతిగ శూద్రులైనచో కోపముగాని, శుచిత్వము లేకపోవుటగాని, ధైర్యము బాగుగ నుండకపోవుటగాని కలిగిన, సూత, ఉద్ధవాదులను జ్ఞాపకము చేసికొనిన, ఆ కోపాదిదోషములు లీనమైపోవును. అదేరీతిగ కిరాతవంశీయులైనచో వాల్మీకి, కన్నప్పనాయన మొదలగువారిని భావనచేయవలెను. అప్పుడు వారియొక్క హృదయమున్ను గంభీరమగు తపోభావములోనికి ప్రవేశించును. పంచమజాతియందుండు పరమభక్తులకుగాని, ధ్యాన, జ్ఞాన, విచారాదులు చేయువారికిగాని హీనమైన ఆహారములపై యాశ గలుగుటగాని, ధైర్యము చాలకపోవుటగాని సంభవించినచో తిరుప్పాణి యాళ్వారులనుగాని, నందనారు మున్నగువారి జీవితములనుగాని భావన జేసినచో దోషములనుండి విముక్తులు కాగలరు. అతీతమగు భక్తియు, గొప్పదగు తపోనిష్ఠయు అప్పుడు వారికి లభించును. ఆలాగున బ్రహ్మనిష్ఠచేయు స్త్రీలకు విషయరాహిత్యము గలుగనిచో, దేహాభిమానముండినచో, మనోధైర్యము చాలకపోయినచో, దృఢమైన ధ్యానము

కుదురకపోయినచో, మైత్రేయి, గార్గి మొదలగువారిని మనస్సులో లెస్సగ భావనచేయవలెను. మఱియు బ్రహ్మవిద్యా ప్రవర్తకులలో ముఖ్యులగు పాతివ్రాత్యమును గొప్ప ఋషిత్వమును పొందియుండిన లోకమాతను స్మరించవలెను. అప్పుడు పై జెప్పిన లోపములు తొలగి పోవును. అఖండమగు ధ్యానమున్ను, బ్రహ్మబోధయున్ను గలుగును. వీరిలో భర్తలుండియు, విరక్తిగల్గి బ్రహ్మనిష్ఠ చేసినట్టి చూడాల, మదాలస మొదలగు మహాతల్లులను జ్ఞాపకము చేసికొనవలెను. భర్తలుండియు, విరక్తి నవలంబించి బ్రహ్మవిచారముచేయు నారీమణులు, మైత్రేయిని, బ్రహ్మచారిణులై తపోధ్యానాదుల ననుష్ఠించువారు గార్గిని హృదయములో లెస్సగ భావన చేయువలెను. ఏలన గార్గి బ్రహ్మచారిణి. మైత్రేయి యాజ్ఞవల్క్యఋషిని భర్తగ గల్గియుండియు విరక్తి నవలంబించి వర్తించిన పుణ్యవతి. చూడాల, మదాలసాదులు భర్తలతో గూడి యుండియే యోగసిద్ధిని, జ్ఞానసిద్ధిని పొందియున్నారు. పాతివ్రాత్య బ్రహ్మవిద్యాసాంప్రదాయ ప్రవర్తకురాలై యుండిన గొప్ప తపస్విని. ఈలాగుననే బ్రహ్మధ్యానపరులగు పురుషులుగూడ గృహస్థాశ్రమమున నుండి బ్రహ్మనిష్ఠ నభ్యసించువారు వసిష్ఠ జనకాదులను కొంతకాలము గృహస్థాశ్రమమున నుండి తపస్సులో ప్రవేశించువారు విశ్వామిత్ర యాజ్ఞవల్క్యాదులను, నైష్ఠికబ్రహ్మచారులగువారు సనక శుకాదులను హృదయమున బాగుగ ధ్యానింపవలెను. మనస్సు ఫోటోతీయు కెమెరా లోని అద్దమువంటిది. దేనిని భావించిన ఆలాటి స్వరూపమునే అది పొందును. ఇదేరీతిగ క్రైస్తవ భక్తులు శ్రీ క్రీస్తువును, మహమ్మదీయ భక్తులు శ్రీ మహమ్మదునబిగారిని, బౌద్ధభక్తులు శ్రీ బుద్ధదేవుని చిత్తములో చింతించుచుండవలెను. అప్పుడట్టి దివ్యపురుషుల స్వభావమే వీరికిన్ని గలుగును. క్రైస్తవులు శ్రీ యేసుక్రీస్తుయొక్క సహనమును, శాంతమును, దయను, భగవద్భక్తినిన్ని భావనచేయవలెను. ఆలాగున మహమ్మదీయులు శ్రీ మహమ్మదునబిగారి సత్యనిష్ఠను, దైవవిశ్వాసమును, ధైర్యమును, కార్యశూరత్వమును జ్ఞప్తిసీమలోనికి తీసికొని రావలెను. ఆలాగున బౌద్ధులు శ్రీ బుద్ధదేవునియొక్క అపారకరుణను, తీవ్రమగు తపస్సును, పరమత్యాగమును, నిర్వాణప్రాప్తిని తమ మనో

వీథిలోనికి తీసికొనిపోవలెను. హిందువులందఱును ఋషులయొక్క బ్రహ్మచర్యమును, తపస్సును, ధర్మనిష్ఠను, [illegible] తమ హృదయములో భావనచేయవలెను. అప్పుడు [illegible] యొదైన దేహమునకు సంబంధించియుండు భావనలుగాని, మనోవాసనలుగాని యుండిన యవి నశించిపోవును. దుర్వాసన జలముగల గుంటలోనికి మంచినీరు వచ్చుటకు కాలువ యేర్పఱచి, చెడునీరు తొలగిపోవుటకు మార్గమున్ను నిర్మించిన, ఏలాగున కొద్దిరోజులలోనే యందలి మలినజలముపోయి శుద్ధజల మేర్పడునో, మనస్సుయొక్క స్థితియు యీలాగున నుండును. ఫలానిజాతిలో జన్మించిన కారణమువలన యీలాటి పూర్వస్వభావము గలుగుననెడి సందేహమనేకులకు గలుగును. భ్రమరకీటకన్యాయము మీరందఱును యెఱింగియున్నారు. క్రిమి యేలాగున తుమ్మెదను ధ్యానించి తుమ్మెదగ మాఱిపోవునో, మనస్సుయొక్క స్వభావమున్ను ఆలాగుననే యుండును. పంచలోహములతో నిర్మింపబడిన లక్ష్మీవిగ్రహము నేలాగున కఱిగించి నారాయణవిగ్రహముగ చేయవచ్చునో, మఱియు, నందికేశ్వర విగ్రహమును అగ్నిలో ద్రవమొనర్చి శివవిగ్రహముగ మార్చవచ్చునో, అదేరీతిగ ఒక విగ్రహమును కఱిగించి మఱియొక విగ్రహము నేలాగున నిర్మింపవచ్చునో, మనస్సుయొక్క స్వభావమున్ను అటువంటిదే. శిల్పి చేసిన అచ్చునుమాత్రము మార్చిన చాలును. లోహమును మార్చవలసిన పనిలేదు. అట్లే ఆత్మను మార్చ నవసరములేదు. భావమును మార్చిన చాలును. ఇదే బ్రహ్మనిష్ఠలోగల రహస్యము. ఈ తత్త్వమును గ్రహించినచో మీరు గొప్ప బ్రహ్మనిష్ఠులు కాగలరు. ఇట్లు జనులకు ప్రబోధ ముచేయక, 'మీ కులస్వభావ మిట్లుండును. మీ దేహస్వభావ మిట్లుండును' అని చెప్పువారు దివ్యమగు ఆత్మతత్త్వమును జనులలో మఱుపు గలుగచేయువారగుదురు. అనాత్మరూపములగు దేహాదులను జ్ఞాపకమునకు దృఢముగా నొక్కి యెక్కించువారి యుపదేశము విపరీతాభిప్రాయమైనది. ఏలన, వేదాంతశాస్త్రములన్నియు అనాత్మభావమును మఱుపుచేసికొనవలెననియు, ఆత్మభావమును సదా మఱుపుగలుగనీయక చూడవలెననియు చెప్పుచుండగా, విషమును త్యజించి, అమృతపానముచేసి,

నిత్యశాంతి, నిర్మలసుఖము, జననమరణరహితమగు అమృతత్వము జీవులేల పొందజాలడు? ఆత్మయొక్క స్వభావము తెలుపునది అమృతోపదేశము. కులమును దేశమును ఆధారపడి ఉపదేశించునది విషప్రాయము. కర్మశాస్త్రము కులమునుగురించి, జ్ఞానశాస్త్రము ఆత్మనుగురించి ఉపదేశించుచుండును. అమృతప్రాయమగు పదార్థమును భుజించి తృప్తినొందక విషప్రాయమగు అనాత్మోపదేశము విని యేల కృశించి పోవలయును? ఇట్టి తగినంతమంది ధర్మబోధకులు లేనందుచేతనే భారతదేశ మధోగతికి పోవలసివచ్చినది. కావున జనులలో నిద్రించి యుండు ఆత్మదేవుని మేల్కొలిపెడు బోధకులుమాత్రమే యీపని చేయగలరు. మహావిద్వాంసులుగాని, ధనవంతులుగాని యుండినను, వారు గాఢసుషుప్తిలోనుండునపుడు స్వయముగ లేవజాలరు. మఱియు నిద్రనుండి యితరులనుగూడ లేపజాలరు. నిద్రలోనుండు పండితులను గాని, శ్రీమంతులనుగాని జాగ్రద్దశకు వచ్చినవాడేలాగున సుషుప్తి నుండి లేపగల్గునో, ఆలాగున మహామాయామోహమను నిద్రలో నుండువారేకార్యమును చేయజాలరు. ఆత్మప్రబోధమగు జ్ఞాన జాగ్రతకు వచ్చినవారున్ను, బంధనములేమియు లేనివారున్ను మాత్రమే యిట్టి గొప్పకార్యమును నిర్వహింపగలరు. కనుకనే శ్రీ బుద్ధదేవుడు, శ్రీశంకరులు త్యాగమునకు, సంన్యాసమునకు అంత యాధిక్యత నిచ్చిరి. ప్రస్తుతము సాధువులు దానిని మఱచిపోవుచున్నారు. కావుననే జనులకు వీరిపై విశ్వాసము శమించుటకు కారణమైనది. బంధనమునకు లోబడియుండువాడు మఱియొక బద్ధుని బంధచ్ఛేదనము చేయుట కేలాగున శక్తిగలవాడై యుండడో, ఆలాగున ప్రపంచసంబంధమగు ఏదో బంధమైన నుండువాడు బద్ధులైన జనులకు బంధచ్ఛేదనమొనర్చి, వారలను భవబంధవిముక్తులుగ చేయజాలడు. అట్టివారందఱును పాశముతో గట్టబడిన పశువులవలె నుండవలసినవారలే. పాశపు హద్దులోపలనున్నామను జ్ఞానముమాత్ర మాపశువునకుండి, విస్తారమైన లోకజ్ఞాన మెట్లుండదో, ఆలాగున ఏదైన దృశ్యసంబంధపు హద్దునకు లోబడినవాడు పంజరములోని పక్షివలె నుండవలసినదేగాని పంజరము నుండి బయల్పడి ఆకాశములో సంచరించెడి విహంగమువలె దివ్య

శాంతిని, విశ్వజ్ఞానమును పొందుటకుగదా! ఈ దీర్ఘాలోచనచేసియే శ్రీబుద్ధ శంకరాదులు త్యాగము భవరోగమునకు పరమౌషధమని బోధించిరి. అట్టి విశాలమైన బోధలనెడి దివ్యబీజములన్నియు, ఊషరక్షేత్రమందు చల్లిన బీజములవలె వ్యర్థములై పోవుచున్నవి. ఓహో! లోకము యొక్క దుర్దశ యేమని చెప్పవచ్చును!

31. ప్ర:—దృశ్యవృత్తులకు ఆత్మ దృక్కగుటచే యెట్లు బంధనము నొందును? గృహాంతరాళములోగల వస్తువులన్నిటిని గృహామధ్యమందున్న దీపము ప్రకాశింపచేయుచున్నను, ఆ గృహామందుండు వస్తువులచేత ఆదీపమున కెట్లావరణము గల్గును? కావున శరీరాంతర్వర్తియగు ఆత్మను వృత్తులేమియు చేయజాలవు. ఆ యింటియందు తెలుపు, యెఱుపు, నలుపు, పసుపు వర్ణములుగల వస్తువులుగాని, చలనము లేకయుండు వస్తువులుగాని లేక చలించుచుండెడు వస్తువులుగాని యుండిన దీపమున కేమి హానిగల్గును? అలాగున, దేహమనెడు గృహాంతరాళ మధ్యముననుండు సాక్షియగు ఆత్మయను దీపమును సత్వరజస్తమో గుణాదులుగాని, ఇంద్రియముల నిశ్చలత్వ చలనములుగాని, సాక్షిని యేమియు బాధింపజాలవు.

ఉ:—ఇటువంటి కుయుక్తులవల్లగదా పరిశుద్ధమైన వేదాంత శాస్త్రమందు జనులకు విశ్వాసము లేకపోయినది. ఈ వాక్యములు యుక్తికిని, అనుభవమునకును, శాస్త్రమునకును విరుద్ధములైనవి. ఇట్టి మోసకృత్యమువలన అమాయకులు వీరియొక్క కృత్రిమమగు వలలో పడిపోవుచున్నారు.

(1) గాలి వీచుచున్న యింటిలో దీపము నిలువనట్లు, రజోగుణమగు చిత్తవిక్షేపముగల హృదయములో జ్ఞానజ్యోతి నిలువజాలదు. గాఢాంధకారమయమగు రాత్రియందు గృహాంతరాళములోగల వస్తువులేవియు గోచరము కాజాలవు. అట్టి చీకటి (తమోగుణము)లో దృగ్దృశ్య వివేకమే గలుగదు. మల, విక్షేప, ఆవరణములను మూడు దోషములు గలిగియుండువఱకును యెవరికిని ఆత్మజ్ఞానోదయము కాదు. మఱియు దృశ్యములగు వృత్తులకును, సాక్షియగు ఆత్మకున్ను యేమి సంబంధమను వాక్యము అజ్ఞానముతో కూడినదేగాని, జ్ఞానయుతము

కాదు. ఏలన, జ్ఞానము గల్గిన దృక్కు, దృశ్యము, దర్శనమను త్రిపుటియుం డదు. ఏకైకమగు అద్వయబ్రహ్మమే మిగిలియుండును. భేదము అజ్ఞానజని తమేగాని జ్ఞానజనితము కాదు. మఱియు, మలినదర్పణములో స్వీయము ఖము, స్వదేహము కానుపించనట్లున్ను, మేఘాచ్ఛాదిత యాకాశమున సూర్యదర్శనము గలుగనట్లున్ను, తామసవృత్తియగు మలము గలిగియుండువఱకు ఆత్మజ్ఞానప్రభాకరుని దర్శనము గలుగదు. మఱియు సత్వగుణమునుకూడ దాటి విశుద్ధసత్వగుణము గల్గునపుడే జ్ఞానోదయమగునని శాస్త్రము చెప్పుచున్నది. అంతఃకరణశుద్ధి గల్గి, శమదమాది సాధనచతుష్టయసంపత్తి గలిగినపిమ్మటయే వేదాంత విచారణ చేయతగినదని శాస్త్రముద్ఘోషించుచుండగా మీరు చెప్పే లాగున యెవరైన నమ్మగలరా? మఱియు తమోగుణము గల్గియుండు నపుడు నిద్రాలస్యప్రమాదములున్ను, మోహము, కోపము, విషయ బుద్ధియు గల్గియుండును. రజోగుణదశలోనికి వచ్చునపుడు చలనము, రాగము, ద్వేషము, అభిమానము మొదలగు గుణములే యుండును. సత్వగుణమావిర్భవించునపుడు సత్యము, శాంతము, దయ, ప్రసన్నత మొదలగు దైవగుణములు గల్గును. అప్పుడు భక్తి, వైరాగ్యము, జ్ఞానాదు లుదయించును. ఆలాగుననే యెవనికైనను, ఏకాలమందైనను, ఏ దేశమందైనను యింద్రియనిగ్రహము సిద్ధించును. ఇది ప్రకృతియొక్క నియమము. దీనికెప్పుడును మార్పు గలుగదు.

32. ప్ర:— ఇంద్రియనిగ్రహము తాము ముఖ్యమని పైన చెప్పియున్నారు. హింసయున్ను కూడదని నిషేధించిరి. దేవేంద్రుడు గొప్ప బ్రహ్మజ్ఞానియైయుండియు, యుద్ధములో ననేకదైత్యుల వధించెను. కోటి సంన్యాసులను హననము చేసెను. అయినను బ్రహ్మ జ్ఞానముయొక్క ప్రభావముచే వానియొక్క రోమమునకైన హాని గలుగ నట్లున్ను, శచీదేవి మొదలగు దేవతాస్త్రీలతోగూడి సుఖముగ నుండి నట్లున్ను కౌషీతకీయుపనిషదాది శాస్త్రములచే తెలియవచ్చుచున్నది. కావున బ్రహ్మజ్ఞానులకు హింసాదోషముగాని, విషయానువర్తనముగాని దోషముకాదు. జ్ఞానాగ్నియందు కోట్లకొలది పాపములను కట్టెలన్నియు క్షణకాలములో భస్మమైపోవును. అట్టి బ్రహ్మజ్ఞానము లేని సంసారులకే

ఈ నియమములన్నియు, జపతపములన్నియు, వ్రతపూజాదులన్నియు యేర్పడినవని కొందఱు చెప్పుచున్నారే! కావున కర్మముగాని, ధర్మము గాని మమ్ములనేమియు చేయజాలదని వారు చెప్పునదికూడ నిజమా?

ఉ:—కౌషీతకీయుపనిషదర్థమును నాత్మపురాణమందు శ్రీశంకరానందమునివరులు ప్రస్తావించియున్నారు. దానిని నిదానముగా జూచిన, దేవేంద్రుడేమియు ధర్మవిరుద్ధమైన కార్యము చేసినట్లు కనుపించదు. అసురులయొక్కయు, యతులయొక్కయు వధలుమాత్రము కానుపించుచున్నవి. కాని వానికి సరియైన కారణము దానియందే కలదు. నెనప్పు దిగ దేవతలు తమలోకములో నుండునప్పుడు అసురులు నిష్కారణముగా అప్పుడప్పుడు వచ్చి బాధలు కలుగజేయుటచేత ధర్మబద్ధమైన యుద్ధములో ఇంద్రుడు వారిని బరిమార్చినది నిజమే. ఇంద్రుడు స్వర్గమునకు రాజు. కావున శత్రువులబారినుండి రాజ్యమును సంరక్షించుట వాని ధర్మము. అతిపవిత్రమగు గీతాశాస్త్రమున్ను దీనినే యుపదేశించుచున్నది. శ్రీమద్రామాయణమున్ను ఈ తత్వమునే తెలుపుచున్నది. ప్రజాపరిపాలనాకార్యము గలవారుమాత్రము రాజ్యసంరక్షణవిషయమై అట్లు చేయుట విధిగానుండును. అలాగుననే కోటిసంఖ్యగల సన్న్యాసులను దునిమినదిన్ని సత్యమే. అవిషయమై యింద్రుడు యెంతయో ఆలోచన చేసినట్లున్ను, అనేక ధర్మసందేహముల తనలోతాను పలుమారు గావించుకొనినట్లున్ను ఆ యుపనిషత్తునందే గలదు. ఆ సన్న్యాసులు వేషముమాత్రమే గల్గియున్నట్లున్ను, క్రోధయుక్తులున్ను, శమదమాదిసాధనసంపత్తి లేనివారున్ను, అధ్యాత్మపరిశీలన మెఱుంగనివారున్ను, ఆత్మజ్ఞానోపదేశము గురుముఖతః శ్రవణము చేయనివారున్ను, బ్రహ్మవిచారమెఱుంగనివారున్ను, మంచి యౌవనమందుండు వారున్నునై యుండిరి. ఈ వధ జరుగుటకు మొదటి కారణమేమన, ఆ సన్న్యాసుల గుంపును జూచి, వీరాత్మజ్ఞానము నిజముగ గలవారా యని పరీక్షచేయనెంచి యింద్రుడు మెల్లగ వారివద్దకు వెళ్లి మీరెవరని ప్రశ్నించెను. వారు దానికి సరియైన సమాధానమును చెప్పక క్రోధయుక్తులై తిరస్కారభావమే జూపిరి. దానిపై యింద్రుడు పైఁజెప్పిన ఆలోచనలను తనలో తాను జరుపుకొనెను. ధర్మముతో రాజ్యపాలనము

చేయు రాజులు పరిపక్వస్థితి లేనివారై ఆలాగున వేషధారులై తిరుగు వారిని మంచిమార్గములో నడుపుట ధర్మమేగాని అధర్మముకాదు. ఇట్టి విచారణ లేని కారణముచేతనే మన దేశమున మంచి యౌవన దశలోనుండువారుకూడా యనేకులు బిచ్చకారులై పోవుచున్నారు. దీనివల్ల వారి జీవితము చాల దుర్భరమగుచున్నది. వారి సంతానము కేవలము పశుప్రాయులగుచున్నారు. విద్యావిహీనులై, ఆత్మ సంస్కార మేమియు లేనివారై, దుఃఖభారమును మోయజాలకయున్నారు. అట్టి వారికి తగిన జీవనవృత్తుల నేర్పఱచి, విద్యాసంస్కారాదులు చేసిన, వారున్ను మంచివారు కాగలరు. ఆలాగున వారికి తగినపనులు యేర్పాటు చేయక వారిని దూషించిన ఫలములేదు. దానికి సరియైన రాజశాసన ముండవలెను. జనులు వ్యర్థముగ ద్రిమ్మరులు కాగూడదని నిశ్చయించి యున్న ఆయాదేశములం దట్టివారికి వృత్తులను కల్పించియున్నారు. ఈ ద్రిమ్మరుల జూచియే సత్పాత్రులకు దానముచేయ దలంచువారు కూడ ధర్మములను, దానములను, ధర్మకార్యములను నిలుపుదల చేయు చున్నారు. కావున దీనియందు యింద్రుడుచేసిన అపరాధమేమియు లేదు. విషయవాసనారహితుడు కాదని చెప్పినను, తన కేర్పడియుండు శచీదేవి మొదలగు భార్యలలో విధిననుసరించి ప్రవర్తించెనే గాని, విధినిషేధకార్యములు చేయలేదు. విధినతిక్రమించిన, యెట్టి జ్ఞానులైనను దానియొక్క పాపకర్మము తప్పక అనుభవించియే తీరవలెను. దేవేంద్రుని చరిత్రయే దీనికి సాక్ష్యముగ నున్నది. గౌతమ మహాముని భార్యయగు అహల్యాదేవియెడ దుర్బుద్ధిగల్గి యింద్రుడు ప్రవర్తించి నందుచేతనే శాపగ్రస్తుడై శరీరమంతట సహస్రయోనులుగల్గి వికారవంతు డగుటకు కారణమైనది. మఱల పశ్చాత్తాపమొంది అపరాధము క్షమింపుడని ప్రార్థించినందుచే అమ్మహర్షి దయగల్గి యింద్రునకు మాత్రము మామూలుగా దేహమంతయు సహస్రభగములు కనుపించులాగునను, యితరులకు సహస్రనేత్రములు గలవాడుగా కానుపించు లాగునను శాపమునకు కొంత పరిహారము గావించెను. దీనివలన కర్మఫల మెవరికిని తప్పినది కాదని యెఱుంగవచ్చును.

యో యాదృక్ క్లేశమాధాతుం సమర్థస్తాదృగేవ సః।
అవశ్యం ఫలమాప్నోతి ప్రబుద్ధోఽ ప్యజ్ఞ ఏవ వా॥

తా॥ జ్ఞానియైనను, అజ్ఞానియైనను క్లేశకరములగు వారివారి కర్మల కనురూపమగు ఫలమును తప్పక పొందుదురు (యోగవాసిష్ఠము). ఇంద్రుడేమి, చతుర్ముఖ బ్రహ్మ అయిదు శిరస్సులు గలవాడైనను, అసత్యము చెప్పుటచే ఆ యసత్యము పలికిన శిరస్సును ఈశ్వరుడు తీసివైచెను. సృష్టికర్తయగు బ్రహ్మదేవు నుద్దేశించి ఒక్కపూజగాని, వ్రతముగాని, దేవళముగాని లేకుండ జేసెను. బ్రహ్మహత్యాదోషముచే శివుడు కరకమలములలో కపాలమెత్తుకొని భిక్షమెత్తవలసివచ్చెను. వృంద మొదలగువారి శాపమువలన విష్ణువు దశావతారములు మొదలగునవి యెత్తవలసివచ్చెను. శ్రీరాముడు వనములో సీతావియోగముచే చతుర్దశవత్సరములు సంకట పడవలసివచ్చెను. వీరికంటె గొప్ప బ్రహ్మ జ్ఞానులా, మాకు కర్మముగాని, ధర్మముగాని అక్కఱలేదని తిరుగు ఈ వాచావేదాంతులు! ఎవరు ఏవిత్తనము పెట్టిన దానికితగిన చెట్టు గలుగు చుండిన, కర్మఫలమున్ను వారికి తప్పదు. విత్తొకటి, చెట్టు మరియొకటి చేయగలశక్తి గలవారుండిన వారికి కర్మఫలము గలుగదు. ఆలాగున తాను నడుచునప్పుడు తననీడ తనతోగూడ రానివ్వని సిద్ధులుండిన, వారిని కర్మఫలము వెంబడించదు. అట్లు కానివారిని కర్మఫలము విడ నాడదు. మహాపతివ్రతయు, తపస్వినియునగు అహల్యగూడ దేవేంద్రుని సంసర్గముచే అరణ్యమున శిలారూపమై పడియుండి గాలి, వాన, మంచు, యెండ సహించవలసినవిధి యేర్పడిన సంగతి మన వేదాంతులు నేర్చుకొనినను, వేదాంతము చెప్పెడు తల్లులుకూడ జ్ఞాపక ముంచుకొనినను, వారికి శ్రేయోదాయకముగనుండును. 'గృహస్థులగు వారికే ధర్మముగాని కర్మముగాని గలుగును. జ్ఞానులగు మాకు లేద'ని చెప్పునదికూడ సరియైనది కాదు. ఏలన కర్మకాండసంబంధములగు విధులుమాత్రము సంసారములో నుండువారికి యేర్పడినవను అర్థమే శాస్త్రములో చెప్పియుండునుగాని దోషరహితులున్ను, సుగుణసంపన్ను లునునగు జ్ఞానులకు దుర్గుణములుండవచ్చునని ఏ శాస్త్రమందును చెప్ప బడియుండలేదు. అంతేగాక జనులకు ధర్మము నుపదేశించుట కేర్పడిన

బ్రహ్మజ్ఞానులు ధర్మవిరుద్ధముగ నెట్లుండగలరు? ఇది అంధులకు పుట్టంధుడు మార్గముచూపుట కేర్పడినట్లుండును. ఇట్టి వేదాంతు లేర్పడి నందుచేతనే లోకము ఉభయమార్గమునుండి పతితమగుటకు కారణ మైనది. కావున ధర్మవిరుద్ధములగు కార్యము లెవరును చేయరాదు. ముఖ్యముగా జ్ఞానము నుపదేశించుట కేర్పడిన సాధువులు, సంన్యాసులు, వేదాంతులు, ధర్మప్రచారకులు మొదలగువారందఱున్ను సత్యమార్గ మును, ధర్మమార్గమును, దయామార్గమును యనుసరించవలెను. అపుడే జనులు న్యాయమార్గప్రవర్తకులై సంచరింపగలరు. లేనిచో చుక్కానిలేని పడవచందమున లోకము ఋజుమార్గమున నడువజాలదు. మార్గము తప్పుచో పడవ మెరకపై చేరును, లేక సుడిలో పడిపోవును, లేక గాలివేగమున అపాయమును పొందును. ఇపుడు లోకముయొక్క గతియు యీలాగుననే పరిణమించినది. కావున పరమకారుణికుడగు సర్వేశ్వరుడు తగిన పుణ్యపురుషులను జ్ఞానమూర్తులను ప్రపంచమునకు పంపి, కరుణతోను, న్యాయముతోను, గుణకర్మలయోగ్యత ననుసరించి జనులను సంరక్షించేలాగున జనులందఱును, ముఖ్యముగా భక్తులంద ఱును సర్వేశ్వరుని ప్రార్థన చేయవలెను.

33. ప్ర:—భూతములు, పిశాచములు గలవని కొందఱున్ను, ఇవన్నియు మనఃకల్పితములేగాని మఱియొకటి గాదని ఇంక కొందఱున్ను తెలుపుచున్నారు. దీనియందు తమ యభిప్రాయమేమి?

ఉ:—మనకు శాస్త్రమే ప్రమాణము. అట్టిశాస్త్రము ప్రత్య క్షమైనదే. స్థూలమగు ఈ సృష్టి యుండునపుడు సూక్ష్మమగు సృష్టి ఏల యుండగూడదు? కొందఱు, కొన్ని వాయువుల చలనభేదముచే కొన్ని ప్రదేశములలో రాత్రికాలమున నిప్పును జూచి భూతములని నమ్ము దురేగాని వాస్తవముగా యవి లేవనియే చెప్పుదురు. వాయుభేద ముచే అట్లు గల్గినను గలుగవచ్చునేగాని, భూతములు, పిశాచములు, ప్రేతములుమాత్రము అట్లు గాలిచే కలుగవు. అట్లుగానిచో ఇంటిలో నుండు వస్తువులను యితరప్రదేశములలోనికి తీసికొనివెళ్ళుట, యింటి లోగల వస్త్రాదులను కాల్చివేయుట, పెట్టెలోగల ధనమును లేకుండ జేయుట, ఆ ధనము ఫలాని స్థలమున నున్నదని యశరీరవాక్యము

పల్కుట, స్వప్నములోగాని గ్రహావేశమునగాని ఫలానిదినము ఫలాని కార్యము జరుగునని చెప్పిన అదేరీతిగ జరుగుట, ప్రత్యక్షముగ పట్టపగలు యింటిలోని వస్తువులు మటుమాయమైపోవుట మొదలగునవి యెట్లు సంభవించును ? ఈలాటి యెన్నియో కార్యములు జరుగుచున్న సంగతి యందఱికిన్ని కనుపించుచుండగా, ఇవి కేవలము మనఃకల్పితములనిగాని, గాలియొక్క చలనభేదముచే గలుగుననియనిగాని యెట్లు నమ్మగలము ? అయితే సత్యస్వభావముగలవారిని, కారుణ్యగుణముగలవారిని, ఈశ్వరభక్తిగలవారిని, బ్రహ్మచింతన చేయువారిని, ఈ భూతప్రేతపిశాచాదులేమియు చేయజాలవు. అట్టివారి దృష్టిలోకూడ అవి కాన్పించవు. దుష్టులదగ్గఱ దుష్టులే చేరునట్లు పాపకర్మలచే యేర్పడియుండు భూతపిశాచాదులు పాపకర్ములవద్దమాత్రమే చేరును. శ్రేష్ఠుల సమీపమున శ్రేష్ఠులే చేరునట్లు పుణ్యపురుషులవద్ద ఋషులు, దేవతలు, సిద్ధపురుషులు మొదలగువారే చేరుదురు. ఈ జగత్తంతయు మనఃకల్పితమను జ్ఞానము గలవారికిమాత్రము ఈ భూతపిశాచాదులున్ను మనఃకల్పితములేయగును. తక్కినవారికి ఈ జీవులు, ఈ లోకము యుండియుండగా, భూతములు, పిశాచములు యెట్లుండకపోవును ? ఈశ్వరస్వభావమునకన్యమై ఒక్కతృణమైనను లేదను ఆరూఢజ్ఞానముగల మహనీయులందఱికిని అంతయు పరమేశ్వరమయమై తప్ప, అన్యమేమియున్ను కనుపించదు. దృశ్యమందు మిథ్యాభావమున్ను, ఆత్మయందు సత్యబుద్ధియు గలవారి దృష్టియందివన్నియు మనఃకల్పితములే. ద్వంద్వములతోగూడి, దృశ్యవాసనలలో జిక్కుకొనినవాని కివన్నియు సత్యములే.

34. ప్ర:—కొందఱు స్త్రీలకు గ్రహావేశము గలుగుటయు, అందుచే దుష్టచేష్టలు చేయుటయు నిజముగా పిశాచములచేతనా, లేక రోగముచేతనా, లేక మనోబలము లేక పోవుటచేతనా, లేక అదిరొుక సంతోషమని వారు తలంచుటచేతనా, జరుగుచున్నవి ?

ఉ:—శాస్త్రములలో భూతప్రేతపిశాచముల సృష్టి కలదు కదా? మఱియు భూతవైద్యముకూడ శాస్త్రనిర్మితముగదా? అప్పుడవి అసత్యమని యెట్లు చెప్పగలరు ? అయితే చాలమందికి రోగముచేతను, కొందఱికి మనోదుర్బలత్వముచేతను ఆలాగుననగ్గును. ఇది స్త్రీలలోనే

యెక్కువగ కాన్పించుచున్నది. అయితే గ్రహములు పట్టుకొనిన పురుషులుకూడ యెందఱో గలరు. కావున, సంపూర్ణముగ మనోదుర్బలత్వమే కారణమని చెప్పుటకు వీలులేదు. ఎందఱో గౌరవకుటుంబముల లోనుండు స్త్రీలకుగూడ గ్రహావేశముగలదు. వారు మనోదుర్బలులు కారు, సంతోషమని తలంచియు అట్టిచేష్టలు చేయరు. కొందఱు స్త్రీలుమాత్రము, యింటిలో నెవరిపైనైన కోపంచేతనో, లేక యేదైన కార్యము సాధించుటకొఱకో, లేక అదియొక సంతోషమైన స్వభావముగ యేర్పడియుండుటచేతనో గ్రహావేశము గలవారివలె నటించవచ్చును. కాని అట్టివారఱుదు. వారినిజూచి యందఱున్ను ఆలాగున నున్నారని తలంచరాదు. ఏలన, భూతవైద్యము శాస్త్రరీతిగా యేర్పడియుంటున్నది. కావున అది సత్యము. కాని యెక్కువమందికిన్ని మనోబలము లేకపోవుటచేతను, ఆత్మశుద్ధి లేనందుచేతను గలుగుచున్నది. ఈ భూతపిశాచాదులను శ్రీ యేసుక్రీస్తువున్ను, శ్రీ మహమ్మదు గారున్ను, శ్రీ బుద్ధదేవుడున్ను నమ్మియుండిరి. వారు హిందూమతస్థులు కారు. ఇతరమతస్థులు. భూతవైద్యముచే యెందఱో బాగుపడియున్నారు. అప్పుడీ శాస్త్రము వ్యర్థమని యెట్లు చెప్పవచ్చును? క్రీస్తు, మహమ్మదు మొదలగు ప్రవక్తలు, పిశాచములు మొదలగునవి పట్టిన యెందఱినో బాగుపరచినట్లు వారి చరిత్రలలో కానుపించుచున్నది. ఇది ఆయా మతస్థులందఱికిన్ని నమ్మకమైన విషయమే.

35. ప్ర :—చెట్టుముందా? లేక విత్తుముందా? అని కొందఱడుగుచుందురు. ఈ విషయమై తమరేమి సెలవిచ్చెదరు?

ఉ :—ఈలాటి ప్రశ్నలన్నియు అశాస్త్రీయములు. ఇవి శాస్త్ర పరిచయము లేనివారున్ను, సామాన్యులగు పామరజనులున్ను చేయు ప్రశ్నలుగానున్నవి. ఇది సమయముయొక్క విలువ తెలియక వ్యర్థముగ కాలము గడుపువారియొక్క స్వభావము. ఈ ప్రశ్నయొక్క రహస్యమేమన, చెట్టు లేనిచో విత్తు యెట్లేర్పడును? విత్తులేనిచో చెట్టు యేలాగునను ండును? అని కుతర్కము చేయుటకున్ను, అదేప్రకారము కర్మ లేనిచో జన్మ మెట్లుగల్గును? జన్మ లేనిచో కర్మ యేలాగున తటస్థించును? కావున కర్మముందా, జన్మముందా? అను యూహతో సాధువులెవరైన

వచ్చినచో, వారిని చీకాకుపఱచుటకున్ను కొందఱు విద్యావిహీనులు ఈలాటి ప్రశ్నలు వేయుచుందురు. అట్లు ప్రశ్నలువేయువారు తమ యొక్క విద్యావిహీనతను, అయోగ్యతను గమనించుటలేదు. వీటికి పామరప్రశ్నలనిపేరు. వీరు తమయొక్క సంకుచితబుద్ధితో చూచియే లోకమంతయు ఆలాగుననే యుండునని తలంచుచున్నారు. ఇట్టివారికే కూపస్థమండూకములని పేరుగలిగియున్నది. అయితే వారి కిది గొప్ప సంతోషముగా తోచవచ్చును. వారియొక్క స్థితియు ఆలాగుననే యుండును. సర్వశక్తుడగు సర్వేశ్వరునియొక్క అచింత్యమగు శక్తిని వారు తెలిసికొనజాలరు. ఇంద్రజాలికుడు ఏ విత్తనపు సహాయముచే చెట్టును నిర్మించియున్నాడు? ఏ ఋతువుల సహాయముచే సృష్టించిన ఆవృక్షమును పుష్పింపజేయుచున్నాడు? దేనివలన ఆ ద్రాక్షలు కాయలుకాచుచున్నవి? యని తెలిసికొనిన ఈ సందేహములు గలుగవు. ఒక సామాన్యమనుజుడే అట్టి అద్భుతకార్యములను ప్రదర్శింప జేయునప్పుడు సర్వశక్తుడగు సర్వేశ్వరుని మాయయందెంత శక్తిగల్గి యుండును! గొప్ప యోగసిద్ధిని పొందినవారు తమ యోగబలముచే యెన్నియో సృష్టులు చేయుచున్నారు. విశ్వామిత్రాది ఋషులే దీనికి తార్కాణము. స్వప్నములో గలుగుచుండు సమస్త దృశ్యవిషయ ములకు, వనములకు, నదులకు, గ్రామములకు, వెయ్యేల, అన్నిటికి యేమికారణముగలదు? మాయ. కావున ఈశ్వరుని మాయాశక్తి మనుజు నకు గలిగిన శక్తివంటిది కాదు. మానవులకు విత్తనముండిన మాత్రమే చెట్టుచేయగల శక్తిగలుగును. పైజెప్పిన ఇంద్రజాలికున కును, స్వప్నములోనుండువానికిని అవసరములేదు. అయినను, సర్వేశ్వ రుడు సృష్టిచేయవలెనని తలంచినపుడు తన అమోఘదివ్యసంకల్పము లచే బీజములను వర్షముచే భూలోకములో యేర్పఱచియున్నాడు. ఈ విషయము మనుస్మృతియందు గనందగును. ఇక కర్మముందా, జన్మ ముందా యను ప్రశ్న మిగిలియున్నది. ఇదిన్ని అశాస్త్రీయమే. దేనికి ఆదియుండునో, దానికి అంత్యమున్ను తప్పక యుండియేతీరవలెను. బీజమునకు ఆది గలదు. కనుక అంత్యమున్ను యుండును (వృక్ష మె నశించును). కాని జీవుడటువంటివాడు కాడు. జీవున కాదియుండిన,

అ త్యమున్ను యుండవలసియుండును. అప్పుడు, జీవులు నిత్యులని చెప్పు శ్రుతివాక్యమునకు విరోధము గలుగును. అంతేగాక బీజము యొక్క మాధుర్యము, వగరు, చేదు మొదలగువాని ననుసరించియే ఫలము లేర్పడుచున్నవి. ఈశ్వరునినుండియే సకల ప్రాణికోట్లు యేర్పడినవని చెప్పినచో, జీవులయొక్క సత్వరజస్తమోగుణములకున్ను, జ్ఞానాజ్ఞానములకున్ను, పుణ్యాపాపములకున్ను ఈశ్వరుడే కర్త కావలసి వచ్చును. అట్లైన, అనేక దోషములు తటస్థించును. ఈశ్వరుడుగాక ప్రాణుల కర్మలకు కర్త యెవరని సామాన్యులు తలంచవచ్చును. ఈ విచారము సరికాదు. ఈశ్వరుడు కర్మఫలమును గలుగజేయుటలోను, కర్మానుగుణమగు ఉద్భిజ, జరాయుజ, అండజ, స్వేదజములు మొదలగు చతుర్విధప్రాణులను గలుగజేయుటయందు మాత్రమే కర్తగా నుండును. ఇక వారివారి ప్రార్థనలననుసరించి భక్తి, జ్ఞాన, వైరాగ్యాదులను, మోక్షమును గలుగజేయును. ఈశ్వరుడెట్లు అనాదిగా నుండువాడో, జీవులున్ను అట్లు అనాదులని శాస్త్రము చెప్పుచున్నది. వేఱు యెన్ని యుక్తులు చెప్పినను సమాధానము గలుగదు. ఇక మఱియొక అప్రాకృతమగు దివ్యదృష్టితో చూచిన, సృష్టిస్థితిలయములన్నియు మాయలోనే జరుగుచున్నవనియు, ఆత్మ నిత్యమై, శివమై, సనాతనమై, జ్ఞానస్వరూపమై యున్నట్లు గోచరము కాగల్గును. అది యొకటియే సత్యమైనది.

36. ప్ర:— గురువు ఆచరించెడు కార్యములలో తోడ్పడి, వాటిని వృద్ధిపఱచుట శిష్యునియొక్కయు, భర్తచేయు ప్రవర్తన ననుసరించుట భార్యయొక్కయు, స్వామికార్యములలో అనుకూలముగ ప్రవర్తించుట సేవకునియొక్కయు ధర్మముగా నుంటున్నప్పుడు, ఈశ్వర సృష్టియగు జీవులను వృద్ధిపఱచుటలో యత్నించుటగదా నిజమైన ఈశ్వరభక్తి యగును? కావున బ్రహ్మచర్యాది వ్రతములచే జగద్వృద్ధికి ఆటంకము కలుగజేయుట భక్తిగాని, జ్ఞానముగాని యెట్లు కానోపును?

ఉ:— మంచి ప్రశ్న. ఓహో! లోకముయొక్క గతి దుర్గతిగా మారినదే! జనులు దుఃఖములనుగూడ సుఖములనుగా తలంచుచున్నారే! ఆహా! కలిమహిమ యేమని చెప్పవచ్చును! కలికాల ప్రభావమిపుడు

బాగుగ ప్రబలమైనదనియే చెప్పవలెను. శాస్త్రములలో బ్రహ్మచర్య వ్రతమున కెంతయో మహిమయు, ఉత్కృష్టతయు చెప్పియుండుటయేగాక మోక్షముయొక్క ద్వారమునకది తాళపుచెవిగా వర్ణింపబడియున్నది. లోకమెట్లు విపరీతార్థమును గ్రహించుచున్నదో, దానిచే కలియొక్క ప్రబలత తెలియుచున్నది. అయితే లోకవృద్ధి, జీవవృద్ధి నశింపచేయ వలెనను తలంపుతో బ్రహ్మచర్యవ్రతమును బూనమని శాస్త్రము చెప్పి యుండలేదు. శాస్త్రములలో ప్రవృత్తిమార్గమనియు, నివృత్తిమార్గమని యు రెండుమార్గములు గలవు. ప్రవృత్తిమార్గము అంతఃకరణశుద్ధియు, విషయ విరక్తియు గలుగనివారికేర్పడినది. అట్టివారుకూడ 25 సంవత్సర ములు బ్రహ్మచర్యవ్రతముతో అధ్యయనము, దివ్యమంత్రజపము, తప స్సు, అగ్నిహోత్రము మొదలగు ఆత్మశుద్ధిని గలుగజేయునవియు, ఈశ్వర ప్రీతిని జనింపజేయునవియునగు అనుష్ఠానములను చేయవలెనని శాస్త్ర విధిగలదు. తరువాత విషయవిరక్తి గలుగనిచో గృహస్థాశ్రమ మవలం బించవచ్చును. అదిన్ని 25 సంవత్సరములు మాత్రమేయని విధిగలదు. 50 సంవత్సరములు వచ్చినవెంటనే గృహకృత్యములన్నింటిని తగినవారికి యొప్పజెప్పి వానప్రస్థాశ్రమమును స్వీకరించి వనమునకేగవలెను. అచట యోగసాధన, తపస్సు మొదలగు కృచ్ఛ్రవ్రతములచే విషయవాసనా నివృత్తి పర్యంతము 25 సం॥లుండవలెను. 75 సం॥లైన పిమ్మట సంన్య సింపవచ్చును. ఇది సామాన్యవిధిగా నుంటున్నది. విశేషవిధియందు, ఏ యాశ్రమములో నుండునపుడు సంపూర్ణవిషయ విరక్తిగల్గునో, అచ్చో టనుండియే యత్యాశ్రమమును పొందవచ్చును. భార్యకు మంచి భక్తి, విరక్తి గల్గియుండిన, వనములోనికి తాను ప్రవేశించునపుడామెనుగూడ తీసికొనిపోవచ్చును. లేనిచో యామె గృహమందైన నుండవచ్చును. గృహస్థాశ్రమములో నుండునపుడుగూడ పుణ్యదినములలోను, వ్రతదిన ములలోను బ్రహ్మచర్యవ్రతము గల్గియుండవలయును. అట్టి విషయము లిదివఱలో వ్రాసియుండుటచే యిచ్చట నిరూపించుటలేదు. బ్రహ్మచర్య మును సరిగ నాచరించనిచో ఊషరక్షేత్రమున జల్లినవిత్తనమును పెట్టిన యెంత నిరుపయోగమో, అంత నిరుపయోగమగును. ఆలాగున స్త్రీల కున్ను, పురుషులకున్ను గృహస్థబ్రహ్మచర్య వ్రతనియమము లేనిచో,

బుద్ధిహీనులై, రోగగ్రస్థులై, ప్రజ్ఞారహితులై, అల్పాయుష్కులైనట్టి సంతానమే గలుగును. దంపతులకు గృహస్థబ్రహ్మచర్యముండిన, సారవంతమైన సుక్షేత్రములో పెట్టిన కృషిచే శ్రేష్ఠమైన ఫలము గలుగురీతిగ, వీర్యవంతులును, ధీమంతులును, ప్రజ్ఞాఘనులును, పూర్ణాయుస్సు గలవారును, ధర్మబుద్ధిగలవారును, మాతాపితరులయందును దైవమందును విశ్వాసము గలవారునునగు సంతతియే గలుగును. పెట్రోల్, క్రూడాయిల్ మొదలగు తైలములు యంత్రాంతర్భాగమందుండి యింజనుల నెట్లు నడుపుచుండునో, అలాగున సప్తధాతువుల లోపలనుండి శరీరమను యంత్రమును, బ్రహ్మచర్యతేజస్సు నడుపుచుండును. తైలమునశించిన, యింజనులేలాగున పనిచేయజాలవో, బ్రహ్మచర్యవీర్యరహితుడు సర్వదా నిర్వీర్యుడేయగును. లోకోద్ధారకములగు గొప్పకార్యముల నాతడేమియు చేయజాలడు. పూర్వకాలమున యిట్టి బ్రహ్మచర్యవ్రతముండినందుచేతనే బ్రాహ్మణులందును, క్షత్రియులందును మహాప్రజ్ఞావంతులు జన్మించుటకు కారణమైనది. జనులకు యిహపరసౌఖ్యవిషయమై, బ్రహ్మచర్యసంరక్షణవిషయమై, జాగ్రత శాస్త్రములో చెప్పినట్లు మఱియేయితర విషయమునుగూర్చియు అంత శ్రద్ధగా చెప్పియుండలేదు. ప్రభువుపెట్టిన విత్తనములను చక్కగ పోషించువారే నిజమైన ప్రభుభక్తిగలవారుకాని, ఆ చెట్లను సంరక్షింపనివారు భక్తిగలవారెట్లగుదురు? అలాగున, ఈశ్వరసృష్టిలోని జీవులను మంచిమార్గములో నడిపి, వారిని మంచిగుణవంతులుగ, మంచి సుఖవంతులుగ, జ్ఞానవంతులుగ చేయువారే యథార్థముగ ప్రభుభక్తిగలవారగుదురు. కావుననే మహాసీయులందరును జీవకోట్ల క్షేమము నుద్దేశించి పనిచేయుటకున్ను, బ్రహ్మచర్యవ్రతముగల్గి లోకసంరక్షణచేయుటకున్ను ఆసక్తులైయున్నారు. బ్రహ్మచర్యము, వీర్యము నశించిన, తైలము నశించిన దీపమేలాగున ఆరిపోవునో, అలాగున జీవుని విజ్ఞానశక్తియంతయు నష్టమైపోవును. సంతానమును వృద్ధిపఱచుటయే ఈశ్వరసంకల్పము కాదు. సంతతి సుఖముగ నుండుటయే ఈశ్వరసంకల్పమగును. కావుననే మానవజీవితమును నాల్గుభాగములుచేసి, బ్రహ్మచర్య, వానప్రస్థ, సంన్యాసములనెడు మూడాశ్రమములలో బ్రహ్మచర్యవ్రత, తపోమార్గ

సులను పఠించుటకు కారణమైనది. మఱియు గృహకృత్యము వహించు వన్నూడుగూడ విధిననుసరించి అనేక పుణ్యదినములలో బ్రహ్మచర్యవ్రతము సలుపవలసి యుండును. సంతానవృద్ధియే ఈశ్వరలక్ష్యమైనచో, స్త్రీలకు పతివియోగానంతరము పునర్వివాహము విధించియుండవలసి యుండును. కావున ఈశ్వరసంతానమగు జీవకోట్లకు దుఃఖమునొందని సౌఖ్యము గలుగజేయుటయే ఈశ్వరకృపకు ముఖ్య హేతువగును. సౌఖ్యము గలుగవలసియుండిన, విషయదోషరాహిత్యము గలుగవలెను. విషముగల దేహములో సుఖముండునా? అలాగున విషయవాసనగల దేహికిని సుఖము గలుగదు. మఱియు, జ్ఞానము గలుగజేయక దేహ బలముమాత్రము గలిగియుండిన, యేమి ప్రయోజనము? అలాగున జ్ఞానవిజ్ఞానములతో నిత్యసుఖమగు ఆత్మసాక్షాత్కారము గలుగజేయు టయే జీవులయొక్క ముఖ్యసేవయగును. అదే లోకసేవయనికూడ తలంచవలెను.

37. ప్ర:—తాము ఇన్ని ధర్మములు చెప్పి, ఆఖరున బ్రహ్మ జ్ఞానము జనులకు గలుగజేయుటయే ముఖ్యమగు లోకసేవయని సెల విచ్చితిరి. ఇది సోమరితనమునకు త్రోవ చూపునదిగదా. ముక్తికి ముందు భుక్తిగదా కావలసినది? దేహములేనిచో దేహి యేపనులు చేయ గల్గును? ఆకటిబాధచే జనులు మలమల మాడుచుండి, కడుపులో జఠరాగ్ని రగులుచుండగా, చెవియందు వైశ్వానరాగ్ని 'జూ' యని ప్రణవనాదము చేయుచుండగా, ఓంకారనాదానుసంధానము చేయవలె నను ఉపదేశము, అగ్నిమధ్యనుండి దహింపబడువానితో మనోనిశ్చలత గల్గి ప్రసన్నమనస్సుతో ధ్యానము చేయవలెనని ఉపదేశించులాగున యుండును.

ఉ:—భుక్తికి సంబంధించిన పనులు చేయవలదని యెవరును చెప్పరుగాని, భక్తిలేక భుక్తిమాత్రమే చేసికొనిన, బలిష్ఠమగు మృగ మునకన్న విశేషమేమియు కలుగదనిమాత్రము శాస్త్రము చెప్పుచు న్నది. మఱియు సర్వప్రాణులున్ను వాటియొక్క జీవనమును చేసికొను చునే యున్నవి. ఆ విషయములో యెవరున్ను ఘనమైన యుపదేశము చేయనక్కరలేదు. అది ప్రకృతిసిద్ధమైయున్నది. పశువులు, పక్షులు

క్రిములు, కీటకములన్నియు వాటి జీవనసంరక్షణ చేసికొనుచునే యున్నవి. వాటి కెవరును ఉపదేశించుటలేదు. అదేరీతిగ వాటి సంతానోత్పత్తికి యెవరును యేసహాయమున్ను చేయవలసినపనిలేదు. ఆ ప్రవృత్తులన్నియు ప్రకృతిమాతయే చేయుచుండును. ఆలాగున మానవులును అయినచో యిక మృగములకును, మనుజులకును యేమి భేదము ? మృగమువలె మనుజుడున్ను జ్ఞానహీనుడై జీవించిన చాలుననియా ఉపదేశించవలసినది ? అట్లయిన శ్రేష్ఠులైన మనుజులకును, జంతువులకును దేనియందు భేదము కలుగును ? దేహేంద్రియాది సౌఖ్యములకు భిన్నముగానుండు నిత్యసౌఖ్యమగు జ్ఞానము మృగములకు లేదు. అది మానవులకే సాధ్యము. ఇంద్రియసౌఖ్యము లనిత్యములు. అవి విషముకలసిన క్షీరాన్నమువంటివి. మొదట రుచిగానుండినను, మఱల దుఃఖమై పరిణమించును. కావున దేహసుఖముతోసహా ఆత్మసుఖమును పొందవలెనని యుపదేశించవలయును. మఱియు, మంచి గృహము, మంచి భోజనము, మంచి ఆరోగ్యముమాత్రమే సుఖకరమని తలంచరాదు. సుఖమునకు కారణము మనస్సు. అట్టి మనస్సు శుద్ధమైనమాత్రమే సుఖము కలుగును. అపుడు బాహ్యవస్తువుల ఆవశ్యకత యెక్కువయుండదు. అందులకు ఆత్మజ్ఞానసంపన్నులై, బ్రహ్మానందామృతమును పానముచేసి తృప్తులైన మనఋషులే దృష్టాంతము. నిత్యమగు ఆత్మశాంతికొఱకు రాజ్యములను, రాజ్యసౌఖ్యములను తృణీకరించి వనములకు ప్రయాణముచేసిన భూపాలురే యిందులకు సాక్షులు. ఇంద్రియసౌఖ్యములే పరమావధియను నమ్మకముండిన, రాజాధిరాజులు ఆత్మతృప్తినిమిత్తము, దైవజ్ఞానముకొఱకు యేకాంత ప్రదేశములగు వనములకు నేగి, యేల రాజర్షులని పేరుబడయవలెను ? వారుప్రపంచమును హీనముగా చూడలేదు. ప్రపంచములోమాత్రము కాలముగడపిన చాలదని తెలిసికొనియుండిరి. కావుననే బ్రహ్మచర్య, గృహస్థములను 2 పూర్వాశ్రమములను నిర్వహించి వానప్రస్థాశ్రమమను మూడవదగు ఉత్తరాశ్రమమును అనుసరించి జీవితయాత్రను గడిపిరి. ఇదే సరియైన మార్గము. ఆత్మార్థజ్ఞానమహిమను బోధించి జనులను నిత్యశాంతిమార్గములోనికి తీసికొనివెళ్లువారు కొఱతగలిగినకారణముచేతనే ఈ ప్రశ్నలన్నియు వచ్చుచున్నవి.

38. ప్ర:—అయితే జీవితములో సగముభాగము తాము చెప్పే లాగున లోకనిర్వాహణములోనుండినతరువాతగదా ప్రపంచమును వదలిపోవలెను? అనగా విరక్తిమార్గమగు నివృత్తిలోనికిగాని, సంన్యాస మార్గమగు త్యాగములోనికిగాని, భక్తిమార్గములోనికిగాని, ముక్తి మార్గములోనికిగాని ప్రవేశించవలెను. అట్లుచేయక చిన్న కాలమునుండి సాధువులై దేహకష్టము చేయనొల్లక గృహస్థుని బాధించి, యాచించి జీవించువారందరు భక్తిప్రియులా లేక భుక్తిప్రియులా ? యోగులా లేక భోగులా ? సంన్యాసులా లేక అన్యాయులా ? సోహంపరులా లేక సోమ రులా ? శాస్త్రానుసారము వర్తించువారా లేక అశాస్త్రీయప్రవర్తకులా? ఆహా ! ప్రపంచమునకు భారముగానుండు యిట్టివారిని పోషించుట పుణ్యమనియా మాకు బోధచేయుట? చాలును, చాలును ! సరి, సరి !

ఉ:—త్యాగమే పరమాదర్శముగ గలిగిన పవిత్రాత్ములగు ఋషులవంశములో, పుణ్యభూమియగు భారతదేశమున జన్మించిన యో సోదరోత్తమా ! మీరు చెప్పినది సత్యము. కోపింపకుడు. మీకు ధర్మబుద్ధి గలిగియున్నది తెలుసును. వివేకమున్ను గలదు. అయితే తొందరపడకుడు. గొప్పవారి స్వభావము గంభీరముగానుండును. వారు సావధానముగ ప్రవర్తింతురు. విశాలభావము గలిగియుండుడు. మీరు చెప్పేలాగున వర్తమానకాలము పరిణమించినది. భారతీయులకు నాయ కులు లేరు. ప్రజలను సన్మార్గములో నడుపవలెనని విచారించెడు ప్రభువులున్ను లేరు. రాజ్యభారవిషయముమాత్రమే యిప్పుడుగల ప్రభువులు చూచుచుందురు. మతముతో వారికి సంబంధములేదు. మతము భారతీయులది. రాజ్యము క్రైస్తవులది. కావున మతనియమ మెట్లు నిలుచును? మానవుల నడతలమాత్రము చూచిన చాలదు. శాస్త్రనియమములనుకూడ చూడవలెను. సాధనచతుష్టయసంపత్తి గల వారే నివృత్తిమార్గములోనికి ప్రవేశింప నర్హులు. తక్కినవారిని ధర్మ మార్గములో నడుపవలసిన కార్యము ప్రభుత్వముపై యాధారపడి యుండును. యాచకులైనవారిని ద్వేషించిన లాభములేదు. వారికి తగిన జీవనోపాయవృత్తి కల్పించి యాచకవృత్తి మాన్పించవలెను

అట్లుగానిచో మాకు వృత్తి చూపవలెనని యాచకులడిగిన దాని కేమి ప్రత్యుత్తరమివ్వగలము? సామాన్య జీవనమునకైన మార్గమేర్పడిన, యిందఱు యాచకులుండరు. యాచకులు లేకుండకూడ చేయవచ్చును. ఈ కార్యములో జోక్యము కలుగజేసికొనవలసియుండిన, అధికారముండ వలెను. రక్షించెడువారికే శిక్షించుట కర్తృత గలుగును. ఆత్మశుద్ధి గలుగువఱకున్ను తురీయాశ్రమములో ప్రవేశింపగూడదను నియమము పూర్వకాలముండెను. అట్టి పరిశోధనకొఱకు సంఘముకూడ పూర్వము యేర్పఱుపబడియుండెను. అలాగున నాచరింపనివారు రాజశిక్షకు పాత్రులుగా చేయబడుచుండిరి. ఇప్పుడుకూడ యెందఱో మహనీయులుగలరు. వారందఱును తిండిపోతులై తిరుగువారని అందఱిని మొత్తముపై చెప్ప రాదు. అందఱిని ఒకేవిధముగ దూఱుట యోగ్యముకాదు. అది అంధుని గమనము వంటిది. అది సరికాదు ఎందఱో యెన్నియో స్థాపనలు చేసి లోకసేవయు, ఆత్మసేవయు చేయుచున్నారు. వారు విద్యయందును, ధనమందును, ఆరోగ్యమందును, ప్రజ్ఞయందును, పుణ్యమందును, జాతి యందును హెచ్చైన స్థితిలోనుండువారే. అట్టివారి పావనోద్యమము, పవిత్ర హృదయము, పుణ్యశీలత్వము, జ్ఞానసంపన్నత లేనిచో లోక మీలాగుననైన యుండియుండజాలదు. మఱియు అందఱున్ను పూర్వోక్త రాశ్రమములను పరంపరగా గ్రహించవలెనను. విధిలేదు. ఆత్మనిష్ఠగల వారున్ను, ఆత్మశుద్ధిచే విషయమందు దోషబుద్ధి యుదయించినవారున్ను ఏ యాశ్రమములోనుండియైన తురీయాశ్రమములో ప్రవేశించవచ్చును. మాయామోహామహిమచేతనే విషయము సౌఖ్యమని తోచుచుండును. అట్టిదోషము నశించినవారికి విషయము విషప్రాయముగా తోచును. అప్పుడే వారికి వైరాగ్యము కలుగును. ఇట్టిస్థితి బాల్యమందుగాని, యౌవనమందుగాని, వార్ధక్యమందుగాని కలిగిన, అప్పుడు సంన్యసించ వచ్చును. బిచ్చపువారిని జూచి బిక్షువులని తలంచకుము. భిక్షువులను బిచ్చగాండ్రనుగా భావింపకుము.

యదా మనసి వైరాగ్యం జాతం సర్వేషు వస్తుషు।
తదైవ సన్న్యసేద్విద్వానన్యథా పతితో భవేత్॥

తా॥ ఎప్పుడు విషయములలో విరక్తికలుగునో అప్పుడే బ్రహ్మచర్యాది నాల్గాశ్రమములలో దేనియందున్నను త్యాగమవలంబించ వచ్చును. అట్లుగానిచో పతనముగల్గును.

౪౭. ప్రః— తాముచెప్పిన వాక్యములలో, సంతానాభివృద్ధియే ఈశ్వరాజ్ఞయైనచో వితంతుస్త్రీలకు శాస్త్రము పునర్వివాహము విధించి యుండుననియు, అట్లు లేనందుచే ఈశ్వర అభిమతము ప్రజాభివృద్ధికాద నియు, వైరాగ్యమే ఈశ్వరునకు ప్రీతియనియు తెలిపియున్నారు. అది సరియైనచో భార్యావియోగముగల పురుషులకు మఱల వివాహమేల విధించియుండవలెను? కాన తాము చెప్పినట్లు కానుపించుట లేదు. ఇదియేదో పక్షపాతకారణముచే కల్పితమైన శాస్త్రమనియేగదా విజ్ఞులు నమ్మెదరు? ఒక తప్పుకార్యము స్త్రీపురుషు లిరువురునుచేసిన ఉభ యుల నొకేవిధముగ దండించవలసియుండును. అట్లుగాక ఒకరిని శిక్షించుట, రెండవవారిని నిర్దోషియని విడచిపెట్టుట అన్యాయమేగాని న్యాయమెపుడునుగాదు. అట్టి సత్యదూరమైనదానిని, న్యాయవిరుద్ధ మైనదానిని వేదశాస్త్రమని చెప్పి మాచే అంగీకరింపఁజేయ చూచు చున్నారా? చాలు! లోక మంతయంధప్రాయముగాదు. అట్టి యుగము కాలగర్భమున కలిసిపోయినది. దానినింకను గురువులు తెలిసికొనక పోవుట కడుంగడు ఆశ్చర్యముగా నుంటున్నది.

ఉః—పావనాత్ముడవగు సోదరా! మీరు చెప్పినవాక్యములకు సరియైన సమాధానము కానుపించుటలేదు. మీ వాక్యములన్నియు సత్యములైనవే. వివేకవంతులెవరైనను వానినంగీకరింపవలసినదే. శాస్త్ర ములలో యీ విషయమై యేలాటి కారణమును కనుపించుటలేదు. కొన్ని శాస్త్రములలో పునర్వివాహమున కేలాటివిరోధము కానుపించదు. కొన్నిటిలో అది కూడదనియు గలదు. అయితే, జరిగిపోయినదానిని గుఱించి యిప్పుడు చెప్పి యేల కలహము గైకొనవలయును? ఇప్పుడు మీకు పునర్వివాహమున కేలాటి యాటంకము లేదుగదా! అంతేగాక ఈ విషయమై గవర్నమెంటుకూడ యేలాటి నిర్బంధమున్ను చేయుట లేదుగదా. కావున యిష్టమున్నవారు చేసికొనవచ్చును. దీనికి సంబం ధించిన శాస్త్రములన్నియు యింతకు పూర్వము వ్రాసియుండిన 'వివాహ

పద్ధతిలో గలవు. కనుక యిచ్చట వ్రాయబూనలేదు. అయితే పునర్వివాహముచే స్త్రీలకు సౌఖ్యము గలుగుననిమాత్రము తలంచరాదు. సౌఖ్యమునకు బదులు దుఃఖమే కలుగును. ఏలన సుఖమునకు కారణము మనస్సు. అట్టి మనస్సు శుద్ధమైన సుఖమున్ను, అశుద్ధమైన దుఃఖమున్ను తప్పక గలుగును. శాస్త్రకర్తలందఱున్ను ఋషులగుటచే వారు నిర్విషయ శాశ్వత బ్రహ్మసుఖము నొందినవారు. కావున వారి హృదయమంతయు జ్ఞానపరమై యుండును. వారు బ్రహ్మచర్యమును తపస్సును యెక్కువగ ప్రేమించువారు. నైష్ఠికబ్రహ్మచారులుగ నుండవలెననియే వారి యాశయము. అది ప్రయాసమైనచో విషయముల నొక్కసారి యనుభవించిన, దానిలోగల దుఃఖమును తెలిసికొనగలరని తలంచి ఒకేసారి వివాహకార్యమును విధించియుండిరి. మాయయొక్క మహిమవలన మొదట విషయములన్నియు సుఖములుగ కాన్పించును. తరువాత, పరమదుఃఖరూపములై మారుచుండును. అవి విషము కలిసిన క్షీరాన్నమువంటివి. మొదట తీపిగానున్నను మఱల దానివలన దుఃఖమే కలుగును. కనుకనే అంతఃకరణము శుద్ధమగునపుడు, వివేకముదయమగునపుడట్టి విషయములో తుచ్ఛబుద్ధి కలుగుటకు కారణమైనది. నిజముగా విషయములలో సుఖముండిన ఆత్మశుద్ధి గలుగునపుడున్ను, విజ్ఞాన మావిర్భవించునపుడున్ను వాటియందు పూర్వాధికసౌఖ్యము కనుపించవలసియుండును. అట్లు కన్పించుట లేదు. విషయబద్ధులు కానివారు స్త్రీలుగాని పురుషులుగాని యెంతో సౌఖ్యమున్ను ఆత్మస్వాతంత్ర్యమున్ను పొందుచున్నారు. విషయబద్ధుల కట్టి శాంతి గలుగునా? సత్యముతో సంసారము గడుప సాధ్యమగునా? కరుణగల్గియుండుట కనుకూలముండునా? దైవవిచారమునకు సమయము లభించునా? పరోపకారమొనర్చుటకు కాలముండునా? అట్టి దుఃఖములోనుండి తరించుట కెందఱో యెన్నియో విధముల సంకటపడుచున్నారు. అయితే మనస్సును నిర్మలముగా నుంచుటకు సాధ్యముకానివారును, ఇంద్రియములను స్వాధీనములో నిలుపుటకు శక్తిలేనివారున్ను, భ్రాంతిచే మనస్సున విషయవాంఛాప్రేరణ గలిగియుండువారును, పునర్వివాహము చేసికొనుటయే మంచిది.

అనేక పాపకార్యములుచేసి మానసంరక్షణనిమిత్త మనేక క్రూరకృత్యములు సల్పి, విషయభ్రాంతులై యుండువారు చేయు పాపమునకన్నను పునర్వివాహము పుణ్యమేగాని అందేలాటి పాపమున్ను లేదు.

40. ప్ర: — పునర్వివాహమునుగూర్చి బాగుగ జెప్పితిరి. సంతోషము. అయితే బాల్యవివాహమునుగూర్చి తామేమి సెలవిచ్చెదరు?

ఉ:— ఈ విషయమున్ను యిదివరలో వ్రాయబడియున్నది. ఇపుడు గవర్నమెంటుశాసనమే బాల్యవివాహము కూడదని నిషేధించి యుండగా, మరల మనమేల యీ విషయమై ప్రస్తావించవలయును? బాల్యవివాహపిశాచము స్త్రీలనుమాత్రము కాదు; పురుషులను కూడ సిరీవముగా నొనర్చుచున్నది. బాల్యవివాహముచే యెందరో విద్యార్థులు విద్యయందు పతితులగుచున్నారు. ఇక స్త్రీలసంగతి చెప్పనక్కఱ లేదు. విద్యాలయమునకు వెళ్ళుటకు వారికి సమయమేలేదు. 11, 12, 13 సం॥ల వయస్సులో రజస్వల యగుదురు. దానికి ముందుగా వివాహము జరుగవలయును. రజస్వలయైన వెంటనే గృహస్థాశ్రమమున ప్రవేశము గలుగుచున్నది. ఇక పాపము! వారెప్పుడు విద్యాభ్యాసము చేయుదురు? అది తలంచిన చాల కష్టముగా నుంటున్నది. అతిబాల్యములో ప్రసవించుటచే యెన్నియో కష్టములకు పాలగుచున్నారు. శిశువులు దుర్బలురగుట మొదటి కష్టము. పురుషులు శక్తిహీనులగుట రెండవ కష్టము. స్త్రీలు బలహీనులగుట మూడవ కష్టము. సంసారము నిర్వహించుటకు తగిన విద్యాభ్యాసముగాని, ధనార్జనమునకు సమయముగాని లేనందుచే స్త్రీలున్ను, పురుషులున్ను, పిల్లలున్ను దుఃఖములో మునుంగుచున్నారు. ఇది అన్నిటిలోను గొప్ప సంకటమైన విషయము. లేతవిత్తనము సారరహితమగు భూమిలో పెట్టిన, యేలాగున చక్కగ పెరుగజాలదో, దానివలన ఫలములు బాగుగ యెట్లు గలుగవో, ఆలాగున కొంతకాలము బ్రహ్మచర్యవ్రతముచే శుక్లము శుద్ధమగుటకు ముందుగా గలిగెడు సంతానమున్ను దేహమనోబలములలో హీనులగుదురు. ఆలాగున, స్త్రీల కేర్పడవలసిన శరీరావయవములు పుష్టిగాకయు, రక్తము శుద్ధముగాను, బలముగాను నుండుటకు ముందుగాను ప్రసవించిన, సరిగ జలములేని కృషి అల్పఫలమిచ్చునట్లు, ధాన్యములు పూర్తిగ

పెరుగునట్లు జన్మించెడు శిశువులుకూడ బలవంతులు, ధీమంతులు, ఆరోగ్యవంతులు కాకుందురు. ఎందఱో ఈ విషయమై ప్రవర్తించినను వారి యత్నములన్నియు అరణ్యరోదనమైనవి. ఏమిచేయగలము? మన దేశముయొక్క భాగ్యమీవిధముగ నున్నదని యెంచి మనస్సును శాంతిచేసికొనుటయే మంచిది.

41. ప్ర:— మీరందరకును వైరాగ్య ముపదేశించుటచే మన దేశముయొక్క జనాభివృద్ధి తగ్గిపోవుచున్నది. కావున మనదేశాభివృద్ధి కది హాని కలుగజేయుచున్నది. జర్మనీ నియంతయగు హిట్లరున్ను, ఇటలీ డిక్టేటరగు ముస్సోలినీయున్ను ప్రజాభివృద్ధికొఱకెన్నియో యేర్పాటులు చేయుచున్నారు. వారు వారి గవర్నమెంటునుండియే సహాయమొనర్చి వివాహాదులను సల్పుచున్నారు. లోకక్షేమమును కోరువారీలాగున గదా చేయవలెను? జనవృద్ధియే దేశవృద్ధి.

ఉ:— ఇట్టి అంధవిశ్వాసముతోఁగూడిన పామరుల వాక్యములు మంచి బుద్ధిగల మీబోటివా రేల విశ్వసించుచున్నారు? పైఁజెప్పినవా రిరువురున్ను జనాభివృద్ధి చేయతలంచినది నిజమేకాని, అది మంచి బుద్ధితో చేసిన కార్యముకాదు. అన్యాయముగా యితరదేశజనులను అగ్నిలో కాల్చివేయుటకు చేయు పన్నాగము. విషవాయువులతోను, బాంబువర్షములచేతను పరదేశమును భస్మమొనర్చుటకు చేసిన పాప కృత్యమే యది. వారిరువురును చిన్నదేశములపైబడి జనులను, రాజులను ధ్వంసమొనర్చిరేగాని యేలాటిమేలున్ను లోకమునకు చేసియుండ లేదు. బలముగల జంతువు బలహీనజంతువును వధించి తినుట మృగీయ స్వభావమేకాని ఉత్కృష్టమైన మానవస్వభావము కాదు. తనకంటె గొప్ప బలవంతులను జయించిన, అదికదా శూరత్వము. రక్షించుటయే యోగ్యతగాని, శిక్షించుట యోగ్యత కానేరదు. మఱియు ఆ దేశములో జనసంఖ్య చాల తక్కువగ యుంటున్నది. పెద్దవారందఱున్ను యుద్ధములో నశించిపోవుదురని తలంచి పిల్లలను వృద్ధిచేయుతలంపుతో వారాలాటి కార్యములో ప్రవేశించిరి. శ్రేష్ఠ జంతువులగు గజము, అశ్వము, గోవు పరులకు పీడలేకనే సంతోష ముగ జీవించుచున్నవి. క్రూరజంతువులగు వ్యాఘ్రాదులు ప్రాణుల

వధించి బ్రతుకుచున్నవి. కావున ఆలాటి పాపకార్యములను చెప్పకుము. మఱియు మనదేశమున జనాభా లెక్క ప్రకారము ప్రతిసంవత్సరమున్ను ఒక కోటి జనులు వృద్ధియగుచున్నారు. ఇపుడు రమారమి 40 కోట్లజనులు యుంటున్నారు. ఇంగ్లీషుజాతులన్నియు జేరి 4 కోట్లు మాత్రమే గలరు. ఇంత స్వల్పజనసాఖ్య ఈ అసంఖ్యాకులగు హిందువుల నెట్లు పాలించుచున్నది? దానిని పరిశీలించిన, హిందువులయొక్క బలహీనతయే కారణమని తెలియగలదు. మఱియు నిప్పుడుండు జనులు జీవనోపాయములేక సంకటపడుచున్న సంగతి అందఱకును తెలిసియే యున్నది. ఏదైన కొంచముగాని గొప్పగాని చదివి యుత్తీర్ణులైన వారిలో కొందఱు పని లభింపక, అనేకులు గౌరవము నిలుపజాలక, జీవించుటకు మార్గము లేకపోవుటచేత, ఆకటిబాధను సహింపజాలక ఆత్మహత్య చేసికొనినవారనేకులుగలరు. జనసంఖ్య తగ్గిపోవునని మీరు భయపడ నక్కఱలేదు. మీకు యెన్నికోట్లు కూలీలుకావలెనో, ఎన్ని కోట్లు గుమాస్తాలు కావలెనో, ఎన్నికోట్లు ఉద్యోగస్థులు కావలెనో, అన్ని కోట్లకంటె అధికముగ ఎన్నియోకోట్లుజనులు నిరుద్యోగులై మిగిలియేయున్నారు. అయితే వీరు అధికజీతము అడుగుదురేమో, దానినిగూర్చియు భయపడ నక్కఱలేదు. రెండుపూటలు కడుపునిండ అన్నమున్ను, పురుషులకు నాలుగు మూరలు వస్త్రమున్ను, స్త్రీలకు ఆఱు గజముల గుడ్డయున్ను, ఉండుటకొక పూరిల్లున్ను యిచ్చిన చాలును. మిక్కిలి శ్రేష్ఠమైన భోజనమక్కఱలేదు. విలువగల వస్త్రములున్ను అక్కఱలేదు. ఇంతమాత్రము పుణ్యము భారతదేశమునకు గలిగిన చాలును. మఱియు పిల్లలకో, పెద్దపెద్ద పరీక్షలలో నుత్తీర్ణులై గొప్పగొప్ప యున్నతోద్యోగములున్ను అక్కఱలేదు. చదువుటకున్ను వ్రాయుటకున్ను మాత్రము విద్య యేర్పడిన చాలును. ఉన్నతవిద్యయు, ఉన్నతోద్యోగమున్ను ధనముండినవారు సంపాదించుకొనెదరు. జనాభా లెక్కలో భారతదేశ విద్యావిధాన ప్రభావముచే నూటికి యెన మండ్రుగురకు చదువులయు, వ్రాయుటయు వచ్చునట! ఓహో! దేశమందెంత సౌభాగ్యము గలిగియుంటున్నది! వేలకొలది గొఱ్ఱెలను మేపుటకొక గొల్లవాడు చాలునట్లు, విద్యయున్ను, బుద్ధియున్ను, బల

మున్ను, ధైర్యమున్ను గల జనులెక్కువమంది యక్కఱలేదు. అట్లు కానివారెన్నికోట్లమంది యుండినను యేమి ప్రయోజనము ? ఇంకను జనాభా వృద్ధియైనచో ఇపుడుగల జీవనమున్ను చాలకపోవును. ఏలన, భూమి యేమాత్రమున్ను పెరుగుటలేదు.

ప్రస్తుతము జీవనోపాయములేక సంకటపడు స్థితిలోనున్న జనులకు వైరాగ్యమును బోధించి, బ్రహ్మచర్యవ్రతము సలిపేలాగున నుపదేశించి, వారిని దైవమార్గములో నడిపినమాత్రమే లోకములో దుఃఖము లేక యుండును. లేనిచో, చిన్నచేపలను పెద్దచేపలు తినుచు, ఆ పెద్దచేపలను వానికన్న గొప్పచేపలు భక్షించుచు, వానిని వాటికన్న గొప్పచేపలు భక్షించుచువచ్చునట్లు జనులు ఒకరిని యింకొకరు జయించుచు బాధను గలుగజేయుదురేగాని శాంతిగలుగదు. కావున వైరాగ్యమును బోధించుటచే యీ మహాసంకటము తొలగునదేగాక, వీరి ఆత్మ శుద్ధమై నిరతిశయ సౌఖ్యమును పొందగల్గునదేగాక నిత్యసుఖమగు మోక్షము లభించును గదా ! బంధములేని జీవులు తాము తరించుటకున్ను, యితరుల తరింపజేయుటకున్ను యెంతో అనుకూలముగలిగియుండును. కనుక యిట్టి ఉపదేశము లోకమునకు క్షేమకరమే. ఒకరు భుజించెడి ఆహారము నలుగురు భుజించిన యేలాగున జనులు దుర్బలురగుదురో, ఒక్క వృక్షము పెరుగుటకవకాశమున్నస్థలములో నాలుగువృక్షములున్న ఏలాగున నవి పుష్టికరముగ పెరుగజాలక మంచి ఫలముల నివ్వజాలక యుండునో, మరియు పశువులు, పక్షులు మొదలగునవన్నియుకూడ తృప్తికరమగు ఆహారములేనిచో యెట్లు వృద్ధినొందకుండునో ఆలాగున తృప్తియగు భోజనమున్ను, విద్యయున్ను లేనిచో యేజాతియు వృద్ధినొందజాలదు.

42. ప్ర:—వేదములలో సమస్తమున్ను గలదనియు, పూర్వము విమానములుండియుండిన వనియు, విద్యుద్దీపములు గలవనియు, బ్రహ్మాస్త్రము, ఆగ్నేయాస్త్రము మొదలగు దివ్యాస్త్రములుండినవనియు, యజ్ఞములచే వర్షము కురిపింపజేయవచ్చుననియు, అట్టి శాస్త్రములను పాశ్చాత్యులు, జర్మనీయులు తీసికొనిపోయినందుచే వారు విమానము, రైలు, పొగయోడ, విద్యుచ్ఛక్తియంత్రములు, విద్యుద్దీపములు మొదలైనవి నిర్మించుచున్నారనియు చెప్పుచున్నారే, ఇది నిజమా ?

ఉ:—వేదమునందు ధర్మసముదాయములన్నియు గలవు. అది సత్యము. అయితే దానిలో చెప్పియుండు క్రియలిప్పుడెవరున్ను చేయజాలరు. దానియొక్క విధానమిప్పుడెవరికిన్ని తెలియదు. పేర్లుమాత్రము గలిగియుండునే కాని, ఏలాగున నిర్మించవచ్చునో, అది మాత్ర మిప్పుడు తెలిసినవారు లేరు. జర్మనీయులుగాని, యితర పాశ్చాత్యులు గాని మనయొక్క వేదగ్రంథములను తీసికొనిపోయి, విమానములు గాని, విద్యుద్దీపములుగాని నిర్మించినవారుకారు. విమానములు పెట్రోలుచే నడుపబడుచుండునని వేదములలో నెచటను చెప్పబడియుండ లేదు. అయితే పూర్వము విమానములుమాత్రము విరివిగ యున్నట్లు తెలియుచున్నది. ఆలాగున విద్యుద్దీపములును, దివ్యాస్త్రములును కూడ యున్నట్లు కన్పించుచున్నది. అవన్నియు యంత్రములచే నడుపబడినట్లు కాక మంత్రములచే నడుపబడినట్లు గన్పట్టుచున్నది. సంస్కృతభాష తెలియనివారు మన వేదములను తీసికొనిపోయి యీ విద్యలన్నియు నేర్చుకొనిరని చెప్పుటకన్న మూఢవిశ్వాసము మఱియొకటి లేదు. లేక సంస్కృతము తెలిసిన భారతీయపండితులను వారు తెప్పించి వేదములను తర్జుమాచేసి యీ విద్యలన్నియు సంపాదించెదరని చెప్పుటకన్నను అంధవిశ్వాసమింకొకటి లేదు. సంస్కృతభాష భారతీయుల స్వంతభాషయైయుండగా వారేల విమానములను, ఫిరంగులను, బాంబులను చేసి శత్రువులను జయించి రాజ్యమును రక్షించుకొనగూడదు ? అయితే హిందూరాజులు లేనందుచే యింతపతనము గలిగినదని చెప్పుటలో నేలాటి అర్థమున్ను లేదు. ఏలన, హిందూరాజులు పాలించెడు కాలముననే మహమ్మదీయాక్రమణము భారతదేశమున జరిగియుండెను. తరువాత యనేకులు ఒకరివెంట మఱియొకరుగ భారతదేశమున ప్రవేశించి, అంతయు కొల్లకొట్టుకొని పోవుచుండ, క్రమముగ ఇంగ్లీషువారు వ్యాపారరీత్యావచ్చి నెమ్మదిగ రాజ్యమునాక్రమించుకొనిరి. ఇదే సత్యమగు విషయము. అయితే భారతభూమి ధనముచేతను, సస్యముచేతను, జ్ఞానముచేతను, విజ్ఞానముచేతను అట్టికాలములో భూలోకములో గల దేశములన్నిటిలోగూడ అగ్రస్థానమలంకరించియుండెను. ఆకాలపు చరిత్రను పరిశోధించిన, యిప్పుడున్నత

స్థితిలోనుండు దేశములన్నియు అపుడు చాల హీనస్థితిలోనే యుండినవను విషయము చరిత్రకారులందఱకును తెలిసినదే. అయితే యిప్పుడు కూడ ప్రపంచములోగల దేశములన్నిటిలోను దైవజ్ఞానమునందును, ఈశ్వరభక్తి విశ్వాసములందును, జీవకారుణ్యమందును, దానధర్మపరోపకారములందును, భారతదేశము అన్నిదేశములకన్న ఉన్నతస్థితిలోనే యుంటున్నది. అనేక ఋషులు, సిద్ధులు, యోగులు, అవతారపురుషులుకూడ యీ దేశములో జన్మించినట్లు మఱే దేశమందును జన్మించియుండ లేదు. మూడు మతములకు మూలపురుషులగు ప్రవక్తలైన శ్రీ క్రీస్తు, శ్రీ మహామ్మదు, శ్రీ బుద్ధుడుకూడ ఈ ఆసియా ఖండముననే జన్మించిరి. ఈ సంగతి భూలోకమంతయు విదితమే. సమశీతోష్ణాది సుఖములున్ను, సర్వవిధములగు ఫలములున్ను, పంటలున్ను, పాడియున్ను, ధాన్యములున్ను, కందమూలములున్ను, ఫలవర్గములున్ను ఈ పుణ్యభూమియగు భారతదేశమున నుండునట్లు మఱి యెచ్చోటను లేదు. అయితే ఈ దేశమడుగంటి పోవుటకున్ను, తక్కిన దేశము లున్నతస్థితిలోనికి వచ్చుటకున్ను కారణము లనేకములుండినను, ముఖ్యకారణము ఈ దేశములోగల జాతిద్వేషమే. అదియే మనదేశము నింత అధోగతిలోనికి తెచ్చినది. గుణమునను సరించి మానవుల కున్నతమార్గము పొందే పద్ధతి లేకపోయెను. కులమునకే యాధిక్యత యిచ్చివచ్చినది. గుణముల కాధిక్యత నివ్వకపోయినది. అందువలన దేశము హీనస్థితికి జారిపోవడమైనది. అయితే యీ అభిప్రాయమునకు వ్యతిరేకాభిప్రాయము గలవారుండవచ్చును. వారి యాభిమతము జాతి భేదముండిన యీ భారతదేశమునకు అభివృద్ధి గలుగుననియు, అట్లుండుటయే మేలనియు చెప్పుదురు. వారు చదువుకొనినందుచే వచింప శక్తిగల చమత్కారవచనమే దానికి యాధారముగాని, మఱియేలాటి ఆధారమున్ను లేదు. వారు చదివేలాగున యితరులుకూడ విద్యాభ్యాసము గలిగి యుండిన దానియొక్క తారతమ్యమును వారే గ్రహించుకొనగలరు. 'వేదములలో సమస్తమున్ను గలదు. బ్రహ్మాస్త్రాది దివ్యాస్త్రములున్ను, విమానాది నడుపబడు సర్వవిధ యంత్రనిర్మాణములున్ను గలవు. మన వేదములలో లేనిది పాశ్చాత్యుల కెచ్చటనుండి లభించెను?' అని

యొకడు చెప్పినచో యీ వాక్యములను విని యెందఱో హార్షధ్వనులు చేయగలరు. అలాగున 'అగ్రజాతిలో పుట్టిన చాలును. వారికి బ్రహ్మ సంబంధమగు గుణములేవియు అక్కఱలేదు. అట్లే, సంన్యాసియైన చాలును. అట్టివారికి యతులయొక్క సంయమాది దివ్యగుణము లేవియు పనిలేదు; వారు పరమపూజ్యులు. వారిని పాపములంటవు.' అని యొకరుచెప్పినచో అట్టివానినందఱున్ను సనాతనధర్మమునే నమ్మువాడనియు, మహాబ్రాహ్మణవిశ్వాసము గలవాడనియు, పరమ ఆస్తికుడనియు గొప్పగ స్తోత్రము చేయుదురు. అట్లుగాక, బ్రాహ్మణ జన్మము శ్రేష్ఠమైనదేగాని, దానికి సంబంధించిన అధ్యయనము, తపస్సు, అనుష్ఠానముకూడ యుండవలయుననియు, వేషముచేమాత్రము సంన్యాసి కాజాలడనియు, సాధుధర్మములన్నియు గల్గియుండవలెననియు, జ్ఞాన విజ్ఞానములందు యంతము గలవానికే సంన్యాసి శబ్దముయొక్క అర్థము సరియగుననియు చెప్పినచో, పోయినది !! 'వీడు నాస్తికుడు, వేదశాస్త్రములలో విశ్వాసము లేనివాడ'ని కేకలువేయనారంభింతురు. ఇట్లు చెప్పుటచే ఈ యుపాధికి వేదమందు విశ్వాసము లేకపోవుటగాని, బ్రాహ్మణులందు భక్తి లేకపోవుటగాని, సంన్యాసులందును సాధువులయందును ప్రీతి లేకపోవుటగాని మనఃపూర్వకముగా తలంచవలదని ప్రమాణపూర్వకముగ చెప్పగలను. అయితే ఆత్మస్తుతియందుమాత్రము ఈ యుపాధి కిష్టములేదు. స్తుతిప్రియులు కార్యశూరులు కాజాలరు. పాశ్చాత్యులున్ను, ప్రాచ్యులున్ను వారియొక్క సంఘబలముచేతను, పరిశ్రమ పరాయణతచేతను కులమున కాధిక్యత నివ్వక, గుణముల కాధిక్యత నిచ్చినందుచేతనే యింత యున్నతస్థితికి రాగల్గెననిమాత్రము చెప్పుట సత్యదూరము కాదని విశ్వాసముగలదు. ఇక జనులెట్లు తలంచినను తలంచవచ్చును. సత్యము నీశ్వరుడెఱుంగగలడు. ఇట్లు చెప్పుటచే జాతిసంకరము చేయవలయునని తలంపుకాదు. విద్యయందును, జ్ఞానమందును, ప్రపంచకార్య నిర్వాహణమందును గుణమునునుసరించి మనుజుల కాధిక్యత నివ్వవలెనను యొక ధర్మమునుమాత్రము చెప్పుచుందును. ఇది సంన్యాసమునకుగూడ సంబంధపడియుండవలెను. గుణముల ననుసరించి జపానులున్ను, పశ్చిమ దేశీయులున్ను ఒక్కొక్కరిని ఆయాపనులలో పెట్టు

టచే దానియందు వారికి బుద్ధి యెక్కువ ప్రవేశించుటకు అవకాశము గలదని కనిపెట్టి చేసిన కార్యము చాల మంచిదైనది. ఈ తత్త్వ రహస్యము మనదేశమందుకూడ యుండియుండెను. దృష్టాంతముగా, రాజులలోను క్షత్రియులలోను యితర కొన్ని ముఖ్య కుటుంబములలోను శిశువులకు అన్నప్రాశనముచేయు సమయమున పుస్తకము, ఖడ్గము, జపమాల, పూజాద్రవ్యములు, పండ్లు, యితరములైన భోజనవస్తువులు అన్నియు పెట్టివైచి, ఆబాలకుని ఆ వస్తువులపైకి విడచి, యిష్టముగలదానిని తీసికొనేలాగున ప్రేరణచేయునపుడు, బాలకునకేది యిష్టము గల్గియుండునో, దానిని నెత్తుకొను స్వభావముగలదు. అందువలన, శిశువు స్వీకరించినదానియందు వానిని ప్రవేశపెట్టి, వృద్ధిలోనికి తీసుకొనివచ్చెడు నియమము గలిగియుండెను. అట్టికార్యము లిప్పుడుకూడ కొందఱు చేయుచున్నారు. దానియందు లక్ష్యము లేకపోయెను. అదిన్ని నామమాత్రమాయెను.

43. ప్ర:— బ్రాహ్మణులు వేదవిద్యను తప్ప, జీవనోపాయమునకుగాని, ధనార్జనమునకుగాని, మఱిదేనికిగాని యితరవిద్యల నభ్యసింపగూడదనియు, అట్లు జీవనోపాయాదులకుగాని, యితరములగు యుద్యోగములకుగాని ప్రాకృతభాష నభ్యసించిన, వంశముతోగూడ పతితులగుదురని శాస్త్రములలో చెప్పియుండునది నిజమా?

ఉ:—ఇదంతయు పైజెప్పిన ఆత్మస్తుతియున్ను, పరనిందయున్నుగాక, దీనియందు మఱేలాటి రహస్యమున్ను లేదు. "అంత్యాదపి పరం ధర్మం" అని గల శాస్త్రవాక్యమున కేమి యర్థము ? అనగా శ్రేష్ఠమైన ధర్మము అంత్యజాతిలోనున్నవానివలననైనను గ్రహించవలెననిగదా ఉపదేశము? అయితే శాస్త్రముల జెప్పఁబూనిన అంతము లేదు. శ్వాసోచ్ఛ్వాసములను నిలుపకయే వెయ్యిప్రమాణశ్లోకములను చెప్పువారుకూడ గలరు. కాని అర్ధశ్లోకములోగల యనుష్ఠానము గలవారైనను యఱుదు. ఇదే ఈ దేశమునకు గలిగిన రోగము. ఇక మనకు కావలసినది అనుష్ఠానముగలవారే. మంచి ఆచరణగలవారే. అప్పుడుమాత్రమే దేశమున్నతస్థితికి రాగల్గును. తక్కిన వాక్యములన్నియు ఫోనోగ్రాఫుపాటవంటివని హృదయములో బాగుగ నాటే

లాగున చేయవలెను. అట్లు లేనందుచేతనే, అధికారముగల జనులు తమకు తగిన యోగ్యత సంపాదింప యత్నింపనందుచేతనే యనధికారుల స్థితిలోనికి దిగిపోవుటకు కారణమైనది. అనధికారులని తలంచువారికి అధికారస్థితిలోనికి వెళ్లుటకు మార్గము లేకపోయెను. కావున యుభయులును జడప్రాయులైరి. ఉత్తమబుద్ధిగల సోదరా! నిజముగా చెప్పినచో రాజభాషయే నిజమైన వేదభాషయగును. కావున యిప్పుడుగల రాజభాష తప్పక గలిగియుండవలెను. అట్టి భాషాజ్ఞానము గలిగియుండినందుచేతను, దానికి తగిన యుద్యోగ ముండినందుచేతను, బ్రాహ్మణు లింతమాత్రమైన ఉన్నతస్థితిలో నుంటున్నారు. కాన లోకజ్ఞానము లేనివారి అర్థములేని వ్యర్థమాటలను విని బ్రాహ్మణులు రాజభాష విడుచుటగాని, ఉద్యోగములను మానుటగాని చేసినచో, యిప్పుడుగల రాజ్యపాలనా స్థితినిబట్టి తప్పక వారికి పతనము గలుగును. దుఃఖమనుభవింపవలసివచ్చును. అయితే దీనివల్ల తమ రాజ్యమందు భక్తిలేక యుండవలెననిగాని, రాజ్యముకొఱకు పాటుపడవలదనిగాని భావముకాదు. దేశాభిమాన మవశ్యముగా నుండియుండవలెను. దానికై యెంతత్యాగమైనను చేయవలెను. కొంత దైవభక్తియు, ఆచరణయు, సత్యబుద్ధియు గలవారికి విదేశభాషయందు విశ్వాసము లేకపోవుటకు కారణము అట్టిభాష చదివినవారున్ను, ఉద్యోగము గలవారున్ననగు కొందఱిలో ఆచరణ లేకయుండుటయు, సనాతనమగు స్వమతములో విశ్వాసము లేకపోవుటయే. దానిని చూచియే వారట్లు తలంచుచున్నారు. అట్టి ఆచరణదోషము సంస్కృతము చదివినవారిలో యెందఱికో గలిగియుంటున్నది. వారివారి పుణ్యగుణము ననుసరించి యింగ్లీషు చదివినవారిలోను, ఉద్యోగములోనుండువారిలోను మంచి ఆచరణగలవా రెందఱో గలరు. ఉద్యోగులలో యెందఱో దైవభక్తి, సత్యబుద్ధి గల్గి, ఆత్మజ్ఞానానుభవముగల్గి యుండువారున్నారు. అయితే మూఢాచారమే పరమాచారమని తలంచినవారు, సమానగుణములుగల యితర మానవులను తాకుట, చూచుట దురాచారమని తలంతురు. నిజముగా యిదే సదాచారము. అట్లుచేయక, సోదరభావములేక, యితరుల ఆత్మోన్నతికై యత్నింపక, నిజమైన కరుణలేక,

అందఱి హృదయములలో వెలుగుచుండు దైవమునుచూడక, అభిమానము వదలక యుండుటచే. దురాచారము. అయితే యోగ్యమైన గుణములు మాత్ర మందఱికిని యుండవలెను. హెచ్చు జాతిలో నుండువాడు తక్కువ జాతివానితో కలిసి తన హెచ్చు గుణమును పోగొట్టుకొని తక్కువగుణముగల్గి యుండరాదు. తక్కువ గుణము గల వారిని, ఎక్కువగుణము గలవారినిగ చేయవలెను. దైవగుణముల చిహ్నము జీవులయందు కరుణయు, విషయములయందు విరక్తియు, ఈశ్వరునియందు విశ్వాసమున్ను గల్గియుండుటయేగాని, శుభ్రవస్త్రము ధరించుటగాని, సంస్కృతము చదువుటగాని, తోడిమానవులను చూడక పోవుటగాని, తాకకపోవుటగాని కాదు. అయితే ఈ విషయమై శ్లోకములు వల్లింపఁబూనిన అసంఖ్యాకములు గలవు. అన్నిటికిని శాస్త్రములుంటున్నవి. అది గొప్పసంగతికాదు. అది న్యాయవాదుల (వకీళ్ళ) వివాదమువంటిదే. దీనికన్న దానియందేలాటి విశేషమున్ను లేదు. గొప్పతనమంతయు సత్యమందును, ఆచరణయందును ఉండును. ఇట్లు చెప్పుటచే మిశ్రభోజనము, సంకరవివాహమున్ను యుండవలెనను యాశయముకాదు. జ్ఞానోన్నతికి, ఆత్మోన్నతికి, దేశోన్నతికి తగిన యోగ్యత గలవారిని ఆయాస్థానములలో ప్రవేశపెట్టవలెను. అంతే చాలును. నాయనా! బ్రాహ్మణులు వేదభాషయగు సంస్కృతము తప్ప యితరభాషలు నేర్చిన, కుటుంబముతోగూడ పతనము గలుగునని మీరు చెప్పినదానికి ప్రమాణము మనుస్మృతియందు గలదు. ఎట్లన,

యోఽనధీత్య ద్విజో వేద మన్యత్ర కురుతే శ్రమమ్।
స జీవన్నేవ శూద్రత్వమాశు గచ్ఛతి సాన్వయః॥

44. ప్ర:— సంన్యాసులు లోకమున కేమి మేలును చేయుచున్నారు? వారియొక్క సుఖముగదా వారు చూచుచున్నారు. అట్టివారిచే లోకమున కేమి మేలుగలుగును? అంతేగాక కొందఱు సంన్యాసులు గృహస్థులబాధించి, భిక్షాన్నము తిని, ద్రిమ్మరులై తిరుగుచున్నారేగాని యేలాటి పరిశ్రమయు చేయకయున్నారే! ఇదియా సంన్యాసము యొక్క లక్షణము? ఈ విషయమై ఏమని యడిగిన, శ్లోకములను వల్లింప ప్రారంభించెదరు. దానికి తగిన ప్రమాణములు కావలసినవి

వారు నేర్చుకొనియుండరు. వారికి వేఱేపని యేమియు లేదు. అంతేగాక శాస్త్రములన్నియు వారివంటివారే వ్రాసియున్నారు.

జ:—నాయనా! కాలానుగుణ్యమగు మంచిప్రశ్న చేసితివి. ఇది కలియుగప్రశ్నలలో చేరినదే. సామాన్యముగా యాచకులై తిరుగుచుండువారినిచూచి, ఇదే సంన్యాసముయొక్క పరమలక్ష్యమని తలంచినందుచే యీలాగున తోచుట కవకాశము కలిగినది. ఇప్పుడుకూడ ఉత్తర హిందూస్థానమున సరియైన సంస్కారము గలవారినిమాత్రమే సంన్యాసపద్ధతిలో జేర్చుకొందురు. దానికి సంబంధించిన సంస్కారములను విధిప్రకారము వారు చేయవలసియుండును. భిక్షుకారులు వృద్ధియైపోయినది సంన్యాసులదోషముకాదు, రాజ్యపాలనాదోషమే. కాయక్లేశముచే జీవించుటకు శక్తిగలవారిని అట్టి యాచకవృత్తిలోనికి పోనీయక చూచుటయు, వారికి తగిన వృత్తులను కల్పించుటయు గవర్నమెంటువారి పనిగా నుంటున్నది. రోగులుండుస్థలమునకు వెళ్ళి ధర్మచికిత్స చేయదలంచువారికిగూడ కొంతకాలము వైద్యవిధానము నేర్చుకొనుట కవకాశము గలుగవలెను. ఆలాగుననే విద్యావిహీనప్రదేశములో ధర్మార్థముగ విద్యను చెప్పదలంచువారికిగూడ ఉన్నత విద్యాభ్యాసమునకు కొంత అనుకూలముండవలెను. చదువురానివాడును, వైద్యశాస్త్రము మెఱుంగనివాడును లోకములో రోగుల కౌషధసేవచేయ నెట్లు సమర్థుడగును? ఆలాగున, ప్రపంచములోని జనులకు ధర్మబోధ, జ్ఞానబోధ గావించుటకున్ను, వారిని ధర్మమార్గములో నడుపుటకున్ను కొంతకాలము బ్రహ్మనిష్ఠ నభ్యసించవలసియుండును. మఱియు బాహ్యమైన రోగమునకన్న అంతరముననుండు భవరోగమును మాన్పుటకు అవిద్య, హీనగుణము మొదలైనవి చక్కబఱచుటకు చాల సమర్థతగలవాడై యుండవలెను. ఇట్టి ఆంతరికరోగము గలవాడు విద్యావంతుడైనను, ధనవంతుడైనను, దుఃఖసాగరములోనుండి తరింపజాలడు. మఱియు జీవునియొక్క దుఃఖోపాధి నశించునపుడు స్వార్థబుద్ధియు నశించును. అపుడు సర్వజీవులకును మేలుచేయవలెనను స్వభావముదయమగును. ఈశ్వరుడు సకల జీవకోట్లకు మేలు కలుగజేయుటకొఱకు పంచభూతములు, ఓషధులు, అన్నములు

మొదలగు అసంఖ్యాకవస్తువులను ఎందుకొఱకు ఉత్పత్తి చేయుచున్నాడో, ఆలాగున ఈశ్వరావస్థను పొందునపుడు, అవిద్యోపాధి నశించునపుడు జీవుడుకూడ ప్రపంచమందలి జీవకోట్లయందు కరుణగల్గి, వారి మేలునే సర్వదా చేయుచుండును. ఇది భారతదేశమందు మాత్రమేకాదు; జీవన్ముక్తులగు శ్రీయేసుక్రీస్తు, శ్రీమహమ్మదు, శ్రీబుద్ధుడు, శ్రీగురునానక్, శ్రీ శంకరులు, శ్రీ కృష్ణచైతన్యులు మొదలగు మహానీయులందఱును ఆలాగున లోకక్షేమ మొనర్చియున్నారు. ఆలాగుననే శ్రీ రామకృష్ణపరమహంస, శ్రీ వివేకానంద, శ్రీ రామతీర్థ, శ్రీదయానంద, శ్రీ రామమోహన, శ్రీ నారాయణగురు మొదలగు మహాత్ములందఱున్ను ఈశ్వరునివలె లోకమున కుపకారమొనర్చియున్నారు. హిమాలయప్రాంతమున హరిద్వారము, ఋషీకేశము మొదలగు అనేకప్రదేశములలో యెన్నియో సత్రములు, ఎన్నియో పాఠశాలలు, ఎన్నియో ఆసుపత్రులు కాలీకంబలీ అను ఒక సాధువుగారెట్లు యేర్పచిరో ఆలాగున ఒక్కొక్క పుణ్యజీవులును వారివారిశక్తికొలది జీవకోట్ల కుపకారమొనర్చియున్నారు; ఒనర్చుచున్నారు. వీరు చేసియుండు ఉపకారములన్నియు సాధువులకుమాత్రమేకాదు; బీదలకు, విద్యావిహీనులకు, రోగులకు, వెయ్యేల, అందఱకును వారు ఉపకార మొనర్చియున్నారు. మఱియు ఎంతో విద్యగాని, ధనముగాని లేకున్నను, ఒక్కసాధువైనను అన్నకావిడి వేసియైన కొంతమంది సాధువులకును, బీదలకును ఉపకారము చేయుచున్నారే! అంతమందికి మేలు సామాన్యముగ యొకధనవంతుడు చేయగల్గునా? మఱియు, వారివారి శక్తికొలది జనులను సన్మార్గములో, భక్తిమార్గములో, ధర్మమార్గములో నడుపుచున్నారే! అయితే యిట్టివారిలోకూడ కొందఱు దుర్మార్గులుండవచ్చును. అధర్మప్రవర్తకులుండవచ్చును. అట్లుచూచినను, అది ప్రతిసంఘములోను యుంటున్నది. కావున యిట్టి దుష్టకృత్యము గలవారిని జూచి పరమపావనులగు బ్రహ్మనిష్ఠులనుగూడ ఆలాగున తలంపరాదు. ఒక్కొక్క విపత్కాలమున ఒక్కొక్క మహానీయుడు జన్మించి లోకమును యెంతో ఉన్నతస్థితికి తెచ్చియున్నారు. ఆత్మశుద్ధి గలుగనిచో బాహ్యములైన ధనముగాని, విద్య

గాని యున్నను జీవుడు సౌఖ్యము నొందజాలడు. ఆ పరమశాంతిని, ఆ దివ్యప్రకాశమును, ఆ కారుణ్యానిలయమును పొందకపోవుటచే దానియొక్క మహిమ తెలియకపోవుచున్నది. మఱియు గొప్ప గొప్ప బ్రహ్మవేత్తలు విద్యచేతను, ఆరోగ్యముచేతను, కొందఱు ధనముచేతను మంచి స్థితిలోనుండియు, వాటిని పాటింపక సర్వసంగపరిత్యాగులై లోకసేవచేయుటలోను, ఆత్మజ్ఞానమును సంపాదించుటలోను తమ జీవితమును నియుక్తపఱచుచున్నారుగదా ! పైఁజెప్పిన భోగములనుండి త్యాగులై యుండునపుడు వారి ఆత్మ యెంత శుద్ధముగా నుండవలసి యుండును ? సామాన్యముగా ప్రపంచజనులలో కొందఱు పరమనిర్ధనులై భయంకరరోగగ్రస్తులై, కురూపులై యుండువారుకూడ విషయమోహములోనుండగా, మఱియు యింద్రియములను నిగ్రహింపజాలక దుఃఖములోపడి తపించుచుండియు, అదే సౌఖ్యమని తలంచి అట్టి విషయములలోనే జీవితమును గడుపుచుండగా, పైఁజెప్పిన పుణ్యజీవులు యెంతో సుకృతులనియే తలంచవలెను. ఏలన, మాయామోహముగు భ్రమయుండునపుడే జీవులకు విషయవాంఛ గల్గియుండును. పుణ్యముచేతను, జ్ఞానముచేతను అట్టి మోహము నశించునపుడు ఆ విషయములలో స్వయముగానే వారికి విరక్తి యుదయించును. ఈ లోకమును స్వయముగ యుద్ధరించువారికన్నను ఆత్మలోకమును శుద్ధపఱచి జ్ఞానసుఖమును గలుగజేయువారు యెంతయో ఉన్నతస్థితిగలిగియుండవలెను. పూర్వీకరాజర్షులగు జనకాదులందఱున్ను ప్రపంచములో సర్వసౌఖ్యములున్ను గలవారై యుండియు, ఆత్మసౌఖ్యముకొఱకు పరమఋషుల నాశ్రయించినట్టు శాస్త్రములలో కన్పడుచున్నది. పూర్వీకరాజులలో గాక, యిప్పుడుగల రాజులలోఁగూడ యెందఱో బ్రహ్మవిద్యను మహనీయుల అనుగ్రహముచే నేర్చుకొనుచున్నారు. ఎంత విద్య నభ్యసించినను, ఎంత ధనము సంపాదించినను, ఎంత ఆరోగ్యము కలిగియున్నను, మనశ్శాంతి గలుగనిచో, హృదయము శుద్ధముగానిచో నిర్మలసౌఖ్యము జీవులకు గలుగదు. ఈ వాక్యములు ఉపనిషత్తులలోను, వేదాంత వాక్యములలోను స్పష్టముగా తెలిపియేయున్నారు. అవి వర్తమానకాలపు సాధువులుగాని, సంన్యాసులుగాని వ్రాసినవి కావు; వేదవాక్య

ములు. అయితే అట్టి బ్రహ్మనిష్ఠులు, తాపసోత్తములు, యోగనిష్ఠులు, పరమభక్తులు, పరోపకారపారీణులు ప్రస్తుతము తగ్గిపోయిన కారణము చేతను, ఆ స్థానములలో సోమరులు, పరిశ్రమరహితులు, దుర్గుణాభూయిష్ఠులు చేరికొనుచేతను, జనులకు సాధువులపై, పుణ్యపురుషులపై, సంన్యాసులపై విశ్వాసము లేకపోయినది. సాధువులనియు, సంన్యాసులనియు చెప్పుటచే, సాధువులవేషము వేసికొనినవారని యర్థముకాదు. సాధనచతుష్టయము గలవారందఱును సాధువులే; త్యాగశీలురందఱును సంన్యాసులే; పరోపకార పరాయణులందఱును పరమభక్తులే. ఇది ఒక జాతికిగాని, ఆశ్రమమునకుగాని, అవస్థకుగాని సంబంధించినదికాదు. వేషధారులై తిరుగువారిని జూచియే జనులకు అట్టి ధర్మసందేహము గలిగినది. ఏమి చేయగలము? కాలమట్టిస్థితిలోనికి వచ్చి చేరెను. పూర్వకాలము సాధువులందుగాని, బ్రాహ్మణులందుగాని సరియైన అనుష్ఠానము గల్గియుండుచున్నదా యని చూచుటకు తగినవారిని రాజులు నియోగించియుండిరి. రాజ్యభరణములో నిదిన్ని యొక అంగముగా పరిగణింపబడెను. కావుననే అట్టి సంన్యాసుల, బ్రాహ్మణుల సంస్థలకు అగ్రహారాదులు నొసంగుచుండిరి. ఈ కాలపు రాజులు అట్టి గొప్ప ఘనకార్యము చేసినవారు కారు. ఆ కాలస్థితి సంన్యాసులకు, బ్రాహ్మణులకు జ్ఞానపరమైయుండెను. అప్పుడు సాధువులకున్ను, బ్రాహ్మణులకున్ను గలిగియుండిన యోగ్యత యిప్పుడుండువారికి లేనందుచేతనే జనులకీ యుభయులందును విశ్వాసము తగ్గిపోవుటకు కారణమైనది. దీనివల్ల జనులను దూషించిన ప్రయోజనములేదు. వీరుభయులయొక్క క్షీణించిపోయిన యోగ్యతను వీరు మఱల సంపాదించుకొనిన, పూర్వముండిన గౌరవమిప్పుడున్ను వీరికి గలుగును. లేనిచో యిప్పుడు వారియెడ జనులకు గలిగియుండు కొంచెము విశ్వాసముకూడ కొలదికాలములో లేకపోవును. సంన్యాసమిచ్చునపుడు 'ఆత్మయొక్క శ్రేయస్సుకొఱకున్ను, జగత్తుయొక్క సంరక్షణకొఱకున్ను ఈ పవిత్రాశ్రమమియ్యబడుచున్న'దని ఆచార్యుఁడుపదేశించును. 'ఆత్మనో మోక్షార్థం జగద్ధితాయ' — అనగా ఆత్మయొక్క హితముకొఱకున్ను, లోకముయొక్క హితముకొఱకున్ను ప్రయత్నించుటకని తాత్ప

ర్థము. సంన్యాసియను శబ్దమునకు — జగత్తుకొఱకున్ను, తన ఆత్మ కొఱకున్ను యత్నించువాఁడని అర్థము. బంధనము గలిగియుండిన, నిరాటంకముగా యెల్లప్పుడున్ను లోకోపకారము చేయుటయందున్ను, ఆత్మశుద్ధికరములగు ధ్యానమననాదులు చేయుటయున్ను సమయము దొఱకదను కారణముచేతనే సంన్యాసము యేర్పడినది. ఇట్టి విరక్త్యాశ్రమము క్రైస్తవ, బౌద్ధ, మహమ్మదీయ మతములన్నిటిలోను గలదు.

45. ప్ర:— శ్రీ భగవద్గీతలో నిష్కామ కర్మయోగమును కదా ప్రతిపాదించినది. భగవంతుడగు శ్రీ కృష్ణపరమాత్మ యాశయమున్ను యిదియేకదా. అట్లుండగా మఱల భక్తియేల చేయవలెను? యోగమేల కష్టపడి యనుష్ఠింపవలయును? తపస్సుచే యేల కృశింపవలయు? ధ్యానముచే యేల శుష్కించవలెను? బ్రహ్మవిచారముచే శిరస్సునేల పాడుచేసికొనవలెను?

ఉ:— ఈలాటి వాక్యముల నెక్కడనుండి నేర్చుకొనినావు? ఇది యెటువంటిదనగా, 'సముద్రములో మత్స్యములుమాత్రము గలవు. వేఱు జంతువులుగాని, రత్నములుగాని, ముత్యములుగాని, పగడములుగాని యేమియు లేవు. ఆలాగు భూమిపై చింతచెట్లేగలవు. ఇతర వృక్షములేవియు నుండలేదు. ఆలాగుననే జంతుసముదాయమున్ను లేదు. అశ్వమొకటిమాత్రమే గలదు. అట్లే ఆకాశవీథులలో కోయల యను పక్షియొకటిమాత్రమే యుంటున్నది. మఱియొక విహంగమేదియు లేద'ని చెప్పినట్లుండును. గీతలో కర్మయోగ మొక్కటి మాత్రమేయుండిన మూడవ అధ్యాయములో నుపదేశించిన కర్మయోగ ధర్మమొకటియే అన్ని అధ్యాయములలోను యుండవలెను. అట్లుగాక, రెండవ అధ్యాయమున సాంఖ్యయోగము (ఆత్మవిచార యోగము), ఆరవ అధ్యాయమున ధ్యానయోగము, పండ్రెండవ అధ్యాయమున భక్తియోగము, పదునాల్గవ అధ్యాయమున గుణత్రయ విభాగయోగము, పదునెనిమిదవ అధ్యాయమున మోక్ష సంన్యాస యోగము యేల నుపదేశించవలెను? ఇవన్నియు వ్యర్థములా? వీటిలో గల ఆత్మశక్తి సామాన్యమా! ఒక్కొక్కదానిలో నిమిడియుండు దైవశక్తి అనంతము. మహత్తైన వటవృక్షము సూక్ష్మమగు బీజ

ములో నిమిడియున్నట్లు, దివ్యశక్తి జానిలో యిమిడియున్నది. మఱియు వేదముయొక్క సారము ఉపనిషత్తు. అట్టి ఉపనిషత్తుల సారము గీత. అట్లుండగా భక్తి, జ్ఞాన, వైరాగ్య, ధ్యాన, యోగ, తపాదుల నెట్లుపే క్షింపగలవు? మఱియు సామాన్యజనులు నిష్కామకర్మయోగమే (అనగా లోకోపకారకార్యము ఫలాపేక్షలేక చేయుటయే) గీత యొక్క భావమని గ్రహించియున్నారు. ఇది నిష్కామకర్మయోగ మొక్కదానికి మాత్రము చెందినదే. కాని నిష్కామకర్మము నకు ఈయొక్క అర్థముతో భావము పూర్తికాదు; కరణములచే చేయు క్రియలన్నిటికిని కర్మయనియే పేరు. ఇదియే దానియొక్క శబ్దార్థము. అప్పుడు కరచరణాదులచే చేయు కార్యములకున్ను, వాక్కుతో చేయు కీర్తన, భజన, నామస్మరణాదులకున్ను కర్మ యనియే పేరుగలుగును. అలాగున మనస్సుతో చేయు జప, విచార ణాదులకున్ను అదేయర్థము సిద్ధించును. అట్లే బుద్ధితో చేయు ధ్యాన యోగాదులకున్ను, మనన నిదిధ్యాసనములకున్ను కర్మయనియే అర్థము సిద్ధించును. అప్పుడు వాగాది కరణములన్నిటికి కరణములనియే పేరు గలుగును. అట్టి స్థితిలో ఆ యింద్రియములచే చేయు సమస్తక్రియల కున్ను కర్మయను పేరు వచ్చిచేరును. కావున, కరచరణములతో చేయు లోకసేవయు, భగవత్కార్యములున్ను, వాక్కుతో చేయు లోక సేవయు, భగవత్కార్యములున్ను, వాక్కుతో చేయు స్మరణ, కీర్తన, అధ్యయనములున్ను, ఇష్టముతో చేయు దైవచింతనయు, మనస్సుతో చేయు మననధ్యానాదులున్ను, బుద్ధితో చేయు ఆత్మభావాదులున్ను, ఇవన్నియు ఫలాపేక్షలేక ఈశ్వరార్పణబుద్ధితోగాని, లోకక్షేమము కొఱకుగాని తనయొక్క కర్తవ్యమని తలంచిగాని చేయునప్పుడే నిష్కామకర్మయోగార్థము పూర్ణముకాగలుగును. ఎవరైనను యిప్పుడు గొప్పజ్ఞానులుండిన, వారికి దైవప్రార్థనలేదా? బ్రహ్మచర్య, తప స్సులు లేవా? ధ్యానము, ఇంద్రియనిగ్రహము లేవా? జనుల క్షేమ ముకొఱకు వారు పనులు చేయుటలేదా? ప్రత్యుపకారము కోరక యెందఱో జీవులకు ధర్మము బోధించుట, శక్తికొలది అన్నమునిచ్చుట, విద్యను నేర్పుట, ఔషధము నొసంగుట, ధ్యానమును బోధించుట

చేయుటలేదా? ఇవన్నియు గలిగియే యుంటున్నారు. అయితే ఒక్కొక్క కాలమున ఒక్కొక్క ధర్మము క్షీణదశనొందునపుడు దానినుద్ధరించుట కొరకు దివ్యపురుషుడు లోకమునకు వచ్చును. అప్పుడాతడు దానికి కొంత ఆధిక్యతనిచ్చును. లేనిచో ఆకార్యము సిద్ధింపదు. అదే దీనిలో గల రహస్యము. ఇట్టి రహస్య మేదేశమందైనను నుండును. అది ఈశ్వరుని నియతిగానున్నది. దీని నెవరు మార్పుచేయజాలరు. అందఱును ఆ యీశ్వరాజ్ఞ ననుసరించియే నడువవలసి యుండును. ఒక్క పరమాణువైనను, సూర్యాది మహాగోళములైనను, జ్యోతిశ్చక్ర గమనము ననుసరించియే పోవలసియుండును. ఆ నియమము నెవరున్ను యుల్లంఘించి నడువజాలరు. ఈశ్వరునికన్న పెద్దవాడు ఒక్కడు యేర్పడినమాత్రమే ఆ నియతిని మార్ప శక్తిగలిగియుండును. మఱియు జీవకోట్ల సంస్కార మేకవిధముకాదు, అనేకవిధములు. జీవుల యొక్క పరిపక్వతాభేదములున్ను అనేక రకములు. కావున నిష్కామ కర్మయోగము, భక్తియోగము, ధ్యానయోగము, జ్ఞానయోగము మొదలగు పద్ధతులు యేర్పడుటకు కారణము. ఈ పద్ధతులన్నియు ఒకే సత్యమునకే తీసికొనిపోవుచున్నవి. అన్నిటియొక్క అంత్యమున యోగశబ్దముండుటచే దీనిలో దేనినాశ్రయించినను ఆ పరమసత్యమునే చేరగలరు. నదులన్నియు సముద్రములో లయమొందునట్లు వీరంద ఱును దైవములో నైక్యము నొందుదురు. అనగా జ్ఞానప్రాప్తినొంద గలరు. ఒకడు చేయుకార్యము ప్రపంచములోనుండు అందఱికిని హితము గలుగజేయు కాలమొకటి యుండునపుడుమాత్రమే కర్మ యోగముగాని, భక్తియోగముగాని, ధ్యానయోగముగాని, జ్ఞానయో గముగాని లోకమున అందఱికిని రుచించును. అట్టికాలమొకటి యుం డదు. తక్కినమార్గము లనేకములుగనుండినను ముఖ్యముగ యీనాల్గు మార్గములలో నంతర్భూతములైయ్యే యుండును. 'ఆయుర్వేదములో అనేక ఔషధములయొక్క యోగము ఆవశ్యకతలేదు. ఒక్క మందు చాలును. సమస్తవ్యాధులును నశించు'నని యొకడు చెప్పఁబూనిన అది యెంత సాహసకృత్యమో, సాధ్యముకాని పనియో, ఆలాగున పై జెప్పిన నాల్గుయోగములున్ను అవసరములేదు; ఏదైన యొక్కటి

మాత్రము చాలునని చెప్పుటయు అట్లనేయుండును. ప్రపంచములో సంఘజీకెని ఒకే వ్యాధిమాత్రము గలుగు కాలమొకటి యెప్పుడు వచ్చునో, అప్పుడుమాత్రమే కర్మయోగమో, భక్తియోగమో, ధ్యానయోగమో, లేక జ్ఞానయోగమో ఒక్కటిమాత్రము చాలునని చెప్పవచ్చును. అయితే ఒక్కొక్క వైద్యుడున్ను ఒక్కొక్క వ్యాధికి తగిన ఔషధమును లోకములో వ్యాపింపజేయునట్లు, ఒక్కొక్క మహాత్ముడున్ను ఒక్కొక్కయోగమును లోకమున వ్యాపింపచేయుటలో యాశ్చర్యమేమియును లేదు. ప్రపంచములో యెన్నియో నిష్కామ కర్మయోగ విధులుండినను, ఎన్నియో యుపాసనారూపములగు భక్తియోగములుండినను, ఎన్నియోవిధములగు యోగసాధనలుండినను, ఎన్నియో జ్ఞానమార్గములుండినను, అవన్నియు పైనుదహరించిన నాల్గుయోగములలో నంతర్భూతములే యగును. ఏలన, ప్రపంచములో యెన్నియో నదులు, కాలువలు యుండినను, అవన్నియు నాలుగు సముద్రములలో నైక్యము నొందవలసియుండును. తూర్పుసముద్రమందైనను, దక్షిణసముద్రమందైనను, పడమటి సముద్రమందైనను, ఉత్తర సముద్రమందైనను వాటికి నైక్యము గలుగును. ఏ మతమువారికైనను, ఏ దేశమువారికైనను నాల్గుసముద్రములు తప్ప ఐదవ సముద్రములేదు. సర్వమతములకును, సమస్తదేశములకును ఈ నాల్గుమార్గములే గలవు. అయితే నాల్గుదిక్కులలో నాల్గు సాగరములుండునట్లు చెప్పుచున్నను, నిజముగా నాలోచించిచూచిన, సముద్రములన్నియు చేరి ఒకటే యగుచున్నవి. అన్నియు ఒకే జలమయమే. ఆలాగున, పైనుదహరించిన నాల్గుయోగములున్ను ఒకే దైవస్థానమునే గలుగజేయును. ఇదే దీనిలోగల సత్యము. అట్లు కాదనువారి వాదములన్నియు —— మామోక్షము ఉత్తరసముద్రమువంటిది; కాదు, మాది తూర్పు సముద్రము వంటిది; అట్లుకాదు, మాది దక్షిణ సముద్రము వంటిది; కాదు కాదు, మా మోక్ష మిదికాదు, అది పశ్చిమ సముద్రము వంటిదని వాదించినట్లుండును. హిందూదేశముయొక్క పూర్వ సముద్రము తూర్పుదేశీయులకు పశ్చిమసముద్ర మగుచుండును. భారతదేశపు పశ్చిమసముద్రము పడమటి దేశీయులకు తూర్పుసముద్రమని

పేరుగల్గి యుండును. అలాగున భరతఖండముయొక్క ఉత్తరసముద్రము ఆవలయుండు దేశీయులకు దక్షిణసముద్రమనిపించును. హిందూదేశపు దక్షిణసముద్రము ఆవలియుండు నివాసులకు ఉత్తరసముద్రమను పేరు గలిగియుండును. ఈ వాదము లీలాగున వ్యవహారములో నుండినను, వాస్తవము లెట్లుకావో, మతవాదములయొక్క సారమున్ను యింతే. ఎవరి హృదయము మంచిదో, వారి మతము మంచిమతము. మంచి మతములో నుండువాడైనను, యెవని మనస్సు మంచిదికాదో వాని మతము దుర్మతము. ఇంతే మతములోగల సారము.

46. ప్ర:— శూద్రులచే పాలింపబడెడు రాజ్యమున బ్రాహ్మణు లుండరాదని మనుస్మృతిలో చెప్పబడినదిగదా ?

ఉ:— ఇప్పుడు ప్రపంచములోగల రాజ్యములన్నియు యితర మతస్థులచే పాలింపబడుచున్నవే. భారతదేశములో కొన్ని చిన్నరాజ్యములు స్వదేశప్రభువుల పాలనలో నుండినను అవన్నియు స్వతంత్రములుకావు. ఇంగ్లీషు గవర్నమెంటు పాలనక్రింద యుండునవే. కొన్ని మహమ్మదీయుల పాలనక్రింద నున్నవి. కావున యివన్నియు యితర మతస్థుల పాలనక్రింద యున్నవనియే చెప్పవచ్చును. పశ్చిమ దేశములన్నియు క్రైస్తవ మతస్థుల పాలనక్రిందనే యుండును. తూర్పుదేశములన్నియు బౌద్ధమతస్థుల పాలన కధీనములై యున్నవి. ఇక హిందువుల దేశముగాని, క్షత్రియుల పాలనగాని యెచటగలదు? భరతఖండములోను, ఈ దేశములనిటిలోను బ్రాహ్మణులుగలరు. వారేమి చేయవలెను? ఈలాటి సాధ్యముకాని వాక్యములన్నిటికిని కారణము దేశ కాలస్థితి ననుసరించి మనుజులకు మతముయొక్క పరిపాకరము తగినట్లు చేయకపోవుటయే యగును. ఒకకాలమున, భారతదేశమంతయు మహమ్మదీయుల పాలనయందే యుండెను. అపుడు బ్రాహ్మణాదు లేదేశమునకు పోగల్గిరి? ఇవన్నియు మతముయొక్క బాహ్యచిహ్నములేగాని మఱి యొకటికాదు. ఇది ముఖ్యమని తలంపరాదు. మన మతమునకు మూలము మనసే. మనస్సు శుద్ధముగానుంచిన, ఏ దేశముననుండినను దోషమేమియులేదు. మఱియు వారివారి మతానుసార మనుష్ఠించుటకు ప్రతిబంధముగలిగిన, ఆదేశమును విడువవలెనని చెప్పినచో, అది అంత ఇరో

ధము లేదు. అదిన్ని సామాన్యజనులకు సాధ్యముకాదు. అయితే మతమందు విశ్వాసముంచుట ప్రతివారియొక్క కర్తవ్యము. మతము ప్రాణమువంటిది. కాని బాహ్యచిహ్నములతో మతముయొక్క యోగ్యత యేమాత్రమున్ను లేదు. పూర్వకాలపువారు భారతదేశమునకు యితరదేశీయులు రాజులరని తలంచియుండవచ్చును. ఆకాలములో భారతదేశమున దండయాత్రసలుప శక్తిగలవారెవరున్ను యుండలేదు. కావుననే కలియుగమున కేర్పడిన పరాశరస్మృతియందు, యేకాలమున జనసముదాయమున నుండువారిలో నెవరు శ్రేష్ఠులై యుందురో వారు ఆ కాలమునకు తగినట్లు నిశ్చయించెడు ధర్మమే ఆచరించవలెనని విధించుటకు కారణమైనది. దీనిపై యాధారపడిన, యే చిక్కులున్ను జనులకు కలుగవు. ఇదే నిజమైన దీర్ఘ బుద్ధితో చేయబడిన నియమము. జనులందఱును ఆలాగున నాచరించుచున్నారు. వేఱువిధముగ యెవరున్ను నడువజాలరు. తక్కినవాక్యముల కేలాటి అర్థమున్ను లేదు. సముద్రయానము బ్రాహ్మణులకు నిషేధింపబడినది. కాని యీ కాలములో బ్రాహ్మణులు ఉన్నతవిద్యకై పశ్చిమదేశమునకు వెళ్ళకపోయినచో వారిగతి యేమగును ? అధోగతియే. మఱియు రాజకీయవిషయములకొఱకు రాజులుండు దేశములకు వెళ్ళకయు, రాజభాష నేర్చుకొనకయు యుండిన, రాజులతో సంభాషింపక పోయిన, అట్టిజాతియొక్క దురవస్థ యేమని చెప్పవచ్చును ! అట్లయిన, ప్రస్తుతకాలస్థితికి బ్రాహ్మణజాతి యెంత దీనావస్థను పొంది యుండును ! కాని, వారియొక్క అంతరంగానుష్ఠానమునకు భంగము కలుగకయుండిన చాలును. శ్రీ వివేకానందస్వామి రామతీర్థయతివరుడు మొదలగువారు పాశ్చాత్యదేశములకు వెళ్ళి భారతీయ మతబీజములను వెదజల్లకపోయిన యిపుడు భరతఖండముయొక్క స్థితి యేమైయుండును ? లోకముయొక్క పరివర్తనము తెలిసికొనని మతాధిపతులుగాని, వేదమునో లేక సంస్కృతమునోమాత్రమో చదువుకొని ప్రపంచముయొక్క పరిణామస్థితి యెఱుంగని కొందఱు శాస్త్రులుగాని చెప్పెడి వాక్యములను విని బ్రాహ్మణులెవరున్ను యింగ్లీషువిద్యను విడువం బనిలేదు. దేశముకొఱకు విడువవలసివచ్చినప్పుడు అన్ని జాతుల

వారును ఐక్యముగలిగి, తప్పక ఉపేక్షింపవలెను. లేనిచో దేశద్రోహులు కాగలరు. అంతమాత్రము చాలును. పైఁజెప్పిన యతులుగాని, వైదికశాస్త్రులుగాని, విదేశవస్తువులను వాడనివారున్ను, స్వదేశసామానులుమాత్ర ముపయోగపఱచువారున్ను, ప్రజలందరియొక్క క్షేమముకొఱకు ప్రయత్నపరులై యుండువారున్ను, జనులకు కావలసిన విద్యయు, జీవనోపాయమున్ను యేర్పఱచువారున్ను, ఇతరదేశీయులనుండి బాధ కలుగక సంరక్షించెడు ఉపాయము మనుష్యులందఱి యోగ్యతననుసరించి యుపదేశించువారున్ను యెవరైనయుండినచో, అట్టివారి పుణ్యవాక్యమును వినిన చాలును తక్కినవాక్యములు గాలి వంటివి. వానియందేలాటి అర్థమున్ను లేదు. తానాచరింపని కార్యమును యితరులతో ఆచరింపఁజెప్పుట యోగ్యులైనవారి స్వభావము కాదు. తానాచరించి, ఆ తరువాత యితరులచే నాచరింపఁజెప్పువాడే ఆచార్యశబ్దమున కర్థము నెఱింగినవాడగును.

ఆచినోతి చ శాస్త్రార్థమాచారే స్థాపయత్యపి ।
స్వయమాచరతే యస్మాదాచార్యస్తేన కథ్యతే ॥

దీనియొక్క అర్థము పైన చెప్పినదే. జీవనమునకు గలవారు ఉద్యోగముకొఱకు విదేశవిద్య నభ్యసింపక, లోకమునకు ధర్మమును బోధించుటకున్ను, ఆ భాషలోగల జ్ఞానము గ్రహించుటకొఱకున్ను, తనయొక్క ఆశయమునుయితరులకు తెలుపుటకొఱకున్ను యితర విద్యల నభ్యసింపవలెను. కాని ఆధ్యాత్మజ్ఞానమును, ఆత్మశుద్ధికరమగు అనుష్ఠానమును, దైవికగుణమును, దైవభక్తిని గ్రహించవలసియుండిన, ఏదేశీయులైనను భారతదేశఋషులయొక్క మతమగు ఉపనిషత్తులను పఠించియే తీరవలెను. అట్టి దైవధనముమాత్రము ప్రపంచములో యే మతమందుగాని, దేశమందుగాని, భాషయందుగాని యుండలేదు. ఏలన, అనేక ఋషులు, సిద్ధులు, యోగులు, పరమభక్తులు ఈ భారతదేశమందే యవతరించియుండిరి. కాని యీ పరమపురుషుల యాచరణమాత్రమిప్పుడు చాలవఱకు తగ్గిపోయినది. ఇదే దీనిలోగల రహస్యము. మఱియు, సంన్యాసులలో సరియైన అనుష్ఠానము గలవారున్ను చాలవఱకు తగ్గిపోయిరి. వాచావేదాంతము ప్రబలి అనుష్ఠాన వేదాం

తము అరుదైనది. ఇదియు దేశపతనమునకు కారణమైనది. ప్రస్తుత పరిస్థితికి ఆధ్యాత్మిక విషయమై విదేశములనుండి మనము గ్రహించవలసినదేమియు లేకున్నను, జీవనోపాయమునకున్ను, దేశసంరక్షణకున్ను కావలసిన విశేషములనేకములు వారినుండి మనము గ్రహించవలసియుండును. జీవనోపాయములేనిచో వేదాంతము నేమిచేయగలము? దేశములేనిచో మతమున్ను నిలువదు. మతము దుర్బలపడునపుడు దానియందున్న జ్ఞానమున్ను కృశించిపోవును. దేహారోగ్యము దేహికెటువంటిదో, మతమునకు దేశమున్ను అటువంటిది. దేశ మొక గోడవంటిది. మతము దానియందు చిత్రించిన పవిత్రాక్షరములు, లేక చిత్రములవంటివి. భిత్తిధ్వంసమైన, పవిత్రమైన వేదమంత్రముల లేఖనములున్ను, దైవభావమయమగు చిత్రములున్ను నశించుటలో సందేహ మేమి గలదు? దివ్యాక్షరములను, శ్రేష్ఠచిత్రములను సంరక్షించుటకు భిత్తిరక్షణ యెంత సహాయకరమో, ఆలాగున మతమును, వేదమును రక్షించుటకు దేశసంరక్షణయు అటువంటిదేయగును. ఇట్టి విశాల భావమును యోచింపక చెప్పెడు వాక్యములన్నియు, కూపస్థమండూకముల ఘోషమువంటివే యగును. బ్రహ్మచారులను తయారుచేసి, బ్రహ్మనిష్ఠను బోధించి వారిలో యోగ్యతగలవారికి సంన్యాసాశ్రమమిచ్చి, ధర్మమును లోకములో బోధించుటకు తగిన సంఘము యేర్పడకపోవుటయు దేశపతనమునకొక ముఖ్యకారణమైనది. విశ్వవిద్యాలయములోనుండి ప్రతిసంవత్సరమున్ను యెందఱో యువకులు, యువతులు ఎట్లు ఉత్తీర్ణులై వచ్చుచున్నారో, ఆలాగున బ్రహ్మవిద్యను బోధించుటకున్ను విశ్వవిద్యాలయము లేర్పడి ప్రతిసంవత్సరమున్ను త్యాగులు, బోధకులగు సంన్యాసులు, లోకోపకారులు, కరుణ నుపదేశించువారు, సమత్వమును తెలుపువారు, ధార్మిక జీవితమును జనుల కుపదేశించువారు, సోమరితనమునకు తిలోదకమిడినవారు, భేదబుద్ధియను రాక్షసత్వమును హోమము చేసినవారు, బ్రహ్మవిద్యలో పట్టభద్రులు, యోగనిష్ఠగలవారు, శాస్త్రసారము నెఱింగినవారు యేర్పడవలయును. శ్రీ బౌద్ధవిశ్వవిద్యాలయములోనుండి యీలాగున శ్రీబుద్ధదేవుని దివ్యోపదేశము పఠించి, అనుష్ఠించి, ప్రపంచములోనికి వచ్చిన

వారే ఆ బౌద్ధయుగమున లోకమంతయు శ్రీ బుద్ధదేవుని పుణ్యమతమును బోధించియుండిరి. అట్లుకానిచో ప్రపంచమందంతటను బౌద్ధమతమునెట్లు బోధింపగల్గిరి? శ్రీ శంకరుల కాలమందును యిదేరీతిగ కొందఱుండిరి. అందుచేతనే వేదాంతమతమునింత ప్రచారములోనికి తీసికొనిరాగల్గిరి. ఇట్టి అతిపావనమగు బ్రహ్మవిద్యను, యోగవిద్యను ముముక్షువులకు, జిజ్ఞాసువులకు, బ్రహ్మచారులకు బోధించుటకొఱకే, మఠములు ఆశ్రమములు, విహారములు, చర్చిలు ప్రతిమతకర్తయు యేర్పఱచియుండిరి. అయితే, శంకరుల కాలమునుండియు వేదాంతమతములో యొక సంకుచితభావము గల్గియుండెను. దానిచేతనే అది క్రమముగ సన్నగిల్లుటకు కారణమైనది. అదేమన, జీవుల పుణ్యమునుజూడక పుణ్యమయమగు వేదాంతబోధయందొక్క జాతికిమాత్రమే యధికారము గలదని నిశ్చయించినందున అట్టి సంఘములో విజ్ఞానవంతు లెక్కువమంది పుట్టకపోవుటచే దానికిన్ని పతనముగల్గెను. అట్లు హ్రస్వభావమునకు మార్గమీయక, దీర్ఘమగు విశాలభావము నవలంబించి, యెవరికైన యోగ్యతగల్గియుండిన, వారి నాసంఘములోచేర్చి, బ్రహ్మవిద్యకు సంబంధించిన శాస్త్రము, అనుష్ఠానములు ఉపదేశించుచుండినచో లోకమెంత పుణ్యవంతముగ నుండును! ఇంగ్లీషువిద్య నొకజాతివారు మాత్రమే చదువవచ్చునను నిషేధముండిన లోకములో నది యింత ప్రచారమునకు వచ్చునా? ఇట్టి దీర్ఘాలోచనయందొక్కొక్కఱు కొఱత గల్గియున్నారు. అయితే ఆకాలముయొక్క స్థితిగతులాలాగుననుండెను. కాని ఆ పద్ధతినే యిప్పుడును అవలంబించవలెనని చెప్పుట పశుస్వభావమేగాని పాశవిమోచనమునకై యేర్పడిన మనుష్యస్వభావము కాదు. ఏలన, సృష్ట్యారంభమునుండియు పశువులు అదే స్థితిలోనే యుంటున్నవి. మానవులు సంపూర్ణమగు దైవత్వమును పొందవలసినవారగుటచే అలాగు పశువులరీతిగా నుండదలంచుట యెంత నీచము! ప్రకృతికి మార్పు లేకుండుట యేకాలమందైన జరుగునా? ప్రకృతికి పరిణామస్వభావము లేదని నిరూపింపగలవాడొక్కడు భూలోకమునకు జన్మమెత్తివచ్చె. కాలమొకటి యుండిన అప్పుడు మాత్రమే ఆ పద్ధతి నిలువగల్గును. అట్లుగాక ప్రకృతికి ప్రతిక్షణమున్ను

పరిణామమునొందు స్వభావముగలదని అంగీకరించదగిన మేధాశక్తి గల్గియుండినచో, జీవకోట్ల సుగుణములననుసరించి సర్వాధికారమున్ను అతిప్రేమతో వారికివ్వవలెనని చెప్పువాక్యమే సత్యమగును. తక్కినది సత్యదూరము. పైజెప్పిన ఆశ్రమాదు లెటువంటివో, దేనినిమిత్త మేర్పడెనో, దేవాలయములున్ను ముఖ్యముగా దానినిమిత్తముగానే యేర్పడియుండెను. అట్టి పవిత్రాశయములన్నియు కాలగర్భములో లీనమైపోయినవి. దేవాలయములు వేదపారాయణకు బదులు వేశ్యల నాట్యములకు స్థానమ్ములైనవి. అదిన్ని నిలుచుటకు కారణమేమని యోచించిన, వారికేర్పడియుండు మాన్యములు పోగొట్టకుండ నిలుపబడియుండుటయే, కాని వేదపాఠకులకొఱకు, బ్రహ్మచారులకొఱకు, ధ్యాననిష్ఠలు చేయువారల కొఱకు, మతబోధకుల కొఱకు యేర్పడిన మాన్యములన్నియు భూగర్భములో విలీనములై పోయెను. మలిన విషయవాసనగల యట్టి వేశ్యల ప్రవేశము దేవాలయములలోనుండుట ధర్మశాస్త్రమనియు, అది లేనిచో షోడశోపచార పూజా విధానము అంగహీన మగుననియు స్థాపించుటకు ప్రయత్నించువారి పాండిత్య మహిమ యేమని చెప్పవచ్చును! ఓహో! ఇట్టి అంధకారావృత మగు మనదేశమెప్పుడు కండ్లు తెఱచి విజ్ఞానప్రకాశమును, నిర్మల తేజస్సును చూడగల్గును ?

47. ప్ర:— ఇప్పుడు తాము సెలవిచ్చిన వాక్యములలో, విశ్వ విద్యాలయములలోనుండి యువకులున్ను, యువతీమణులున్ను ప్రతి సంవత్సరము అనేకులు ఉత్తీర్ణులై వచ్చుచున్నట్లు, బ్రహ్మవిద్యావిశ్వ విద్యాలయమునుండి కొందఱు యేర్పడవలెనని తెలిపియున్నారు. స్త్రీ లకుకూడ బ్రహ్మవిద్యయందధికారము గలదని పూర్వము నిరూపించి యున్నారు. స్త్రీ బ్రహ్మవిద్యాపరంపరకూడ గలదని తెలిపితిరి. ఆ ఋషి పరంపర యేది ? ఋషులగు ఆ నారీమణులెవరు ? ఈ విషయమై శాస్త్రయుక్తముగ తమవలన వినగోరుచున్నాను.

ఉ:—పౌతిమాషి మొదలగు స్త్రీల ఋషిపరంపర ఋషుల కాలములోనుండెను. యజుర్వేదమునందలి మధుకాండము చివరను, యాజ్ఞవల్క్యకాండము చివరను తెలుపబడిన ఋషుల పరంపరలను

పురుషవంశపుమలనియు, ఖిలకాండము చివర తెలుపబడిన ఋషుల పరంపరను స్త్రీవంశమనియు అందురు. ఈ మూడువంశములందును అభేదమే పలుపుర శాస్త్రజ్ఞుల మతమైయున్నది. స్త్రీవంశము నందలి ఋషుల పరంపర పౌతిమాషీనుండి ప్రారంభమైనది. పౌతిమాషీ యను స్త్రీ బ్రహ్మవిద్యాధికారు లందఱకును మాత. ఏలన ఆ పౌతి మాషీయొక్క పుత్రుడగు పౌతిమాష్యుడే సర్వ బ్రహ్మవిద్యాధి కారులకును దుర్విజ్ఞేయమగు బ్రహ్మవిద్య నుపదేశించెను. పౌతి మాషీ, కాత్యాయనీ, భారద్వాజీ, పారాశరీ, ఔపవస్తీ, పారా శరీ (వీరు పూర్వము తెలిపిన 'పారాశరీ'కంటె వేఱు), కౌశికీ, ఆలంబీ, వైయాఘ్రీ, కాపీ, కాణ్వీ, ఆత్రేయీ, గౌతమీ, భారద్వాజీ, పారాశరీ, వాత్స, పారాశరీ, వార్కారుణీ, (ద్వితీయ) వార్కారుణీ, శౌంగీ, సాంకృతీ, ఆలంబాయినీ, ఆలంబీ, జాయంతీ, మాండూకాయనీ, మాండూకీ, శాండలీ, రాథీతరీ, భాల్లుకీ, క్రౌంచకీ, వైదభృతి, కార్ష కేయీ, ప్రాచీనయోగీ, సాంజీవీ, ప్రాశ్నీ మొదలగు నారీమణులపేర్లు స్త్రీఋషిపరంపరయందు గాన్పించుచున్నవి.

ఋషిత్వమును పొందకయు, వేదాంతమును చదువకయు గార్గి మొదలగు స్త్రీలు యాజ్ఞవల్క్యమునివరునితో జనకరాజ సభయందు పండితమండలియందెట్లు శాస్త్రార్థము చేయగల్గిరి ?

48. ప్ర:— బ్రహ్మవిద్యాస్థానములలో స్త్రీలున్ను, పురుషు లున్ను ఒకేస్థలముననుండి బ్రహ్మచర్యవ్రతమును సల్పి బ్రహ్మవిద్య నభ్యసించిరా ? లేక వేఱువేఱుస్థలములలోనుండి యభ్యసించిరా ? ఈ సందేహము నన్ను తీవ్రముగ బాధించుచున్నది.

ఉ:—ఇది మంచిసంగతి. మీకుమాత్రమేగాదు; అనేక బుద్ధి మంతులకున్ను, వివేకశాలురకున్ను యీ సంశయము గలిగియున్నది. పూర్వకాలమున యెట్లుండెనో యది బాగుగ తెలియ సాధ్యముకాదు. కాని ఋష్యాశ్రమములలో ఋషికన్యకలుండినట్లు పెక్కుశాస్త్రముల వలన తెలియబడుచున్నది.

వారు ఒక్కెబ్రహ్మవిద్యాపాఠశాలలో చదివిరో, లేక వేఱువేఱుగా నుండిరో తెలియ సాధ్యముగాదు. బౌద్ధయుగములో స్త్రీలుకూడ బ్రహ్మవిద్య నభ్యసించినట్లును, వారికిగూడ సంన్యాసాధికారముండినట్లున్ను, ఆ నారీమణులకు ప్రత్యేకముగ ఆశ్రమములుండినట్లున్ను, ఆ స్త్రీసంఘమునకు నాయకురాలుగా మహాగౌతమీదేవి యుండినట్లున్ను, ఉత్పల, క్షేమ మొదలగు విదుషీమణులు జీవించియున్నప్పుడే ఉత్తమమగు నిర్వాణపదమును పొందినట్లున్ను బౌద్ధమత ముఖ్యగ్రంథమగు 'మధ్యమ నికాయము' నందు కానుపించుచున్నది. కాని, పూర్వము స్త్రీపురుషు లొక్కే-స్థలముననుండిన సరి, లేక వేఱువేఱుగానుండిన సరి, అది మన కవశ్యమైన విషయము కాదు. ప్రస్తుతకాలమునకా పద్ధతి సరిపోవునా, లేదా యని విచారించిన చాలును. ఏలన, కాలానుగుణ్యముగ యన్నిటిలోను మార్పుగలుగుటయు, అట్లు మార్పు చేయుటయు బుద్ధియొక్క వికాసమునకు తగును. ఆర్యమతస్థులు స్థాపించియుండు గురుకులము పురుషులకు ప్రత్యేకముగను, స్త్రీలకు కన్యాగురుకులము ప్రత్యేకముగను యుంటున్నవి. ప్రస్తుతకాలమున కీపద్ధతియే మంచిది. కాని యట్లు చేయుట సోదరసోదరీభావమునకు సరికాదనియు, ఇట్టి భేదములు మొదట యేర్పడిన, ఎల్లప్పుడవి గలిగియే యుండుననియు, కావున స్త్రీ పురుషు లుభయులకు ఒక్కే స్థలముండుట మంచిదనియు చెప్పువారు కొందఱుగలరు. అది మంచిదికాదు. సృష్టియొక్క రహస్యము తెలియకయే వారట్లు చెప్పుచున్నారనియు, అది గొప్ప అపాయమును గలుగజేయుననియు, అగ్నియున్ను జలమున్ను యేకస్థలములో నుండ సాధ్యముకాదనియు, అగ్నిగుండముపై నేతికుండను పెట్టిన యెట్లుకఱుగకయుండును ? అని యీ విధముగ దత్తాత్రేయులు అవధూతగీతలో వ్రాసియున్నారనియు, కావున ప్రత్యేక స్థలముండుటయే మంచిదనియు కొందఱు వాదించుచున్నారు. కావున ఈ యుభయవాదములున్ను త్రోసివైచి నాయొక్క ఆశయమును మాత్రము తెలిపెద. అయితే స్త్రీ పురుషులు ఒక్కే-స్థలములో నుండి సోదరసోదరీభావము గల్గియుండుట చాలగొప్పది. కాని యీ లాగున యుండుట మంచిదని యిప్పుడు చెప్పువారు ఆలాగున స్త్రీ

పురుషులలోనుండి యాచరించినవారా యని చెప్పుటకు ప్రయాసముగా నున్నది. ఎవరైన కొందఱు బ్రహ్మనిష్ఠులగు యింద్రియనిగ్రహము గలవారు స్త్రీలలోను, పురుషులలోను నుండవచ్చును. కాని, మొత్తముపై అట్లు కలుగుట దుస్తరము. అంత నిగ్రహము, విజ్ఞానము అందఱకును యుండదు. ఇది యెప్పటికైన అపాయకరమే. సంశయము లేదు. కాని, స్త్రీలకు ప్రత్యేకముగ ఉన్నతవిద్యాలయములు యేర్పడు వఱకు, ఉభయులున్ను ప్రత్యేకప్రత్యేకముగా చదువుటకనుకూల పరిస్థితి గలుగువఱకు, యోగ్యతగల స్త్రీలున్ను యోగ్యతగల పురుషులున్ను ఒక్కస్థలములో యుండేలాగున చూడవలెను. లేనివో స్త్రీలగతి యడుగంటిపోవును. అచ్చటైనను స్త్రీల నివాసము, భోజనము ప్రత్యేకముగానే యుండవలెను మఱల అనుకూలము త్వరలో యేర్పాటుచేసికొని ప్రత్యేకప్రత్యేక స్థలములు యేర్పాటుచేసి కొనవలెను. ఇది యెటువంటిదనగా, స్త్రీలలో గొప్ప డాక్టరుపరీక్ష పొందని కాలమున పురుషడాక్టర్లే స్త్రీలకు కావలసిన చికిత్సలు చేసి వచ్చిరి. కాని స్త్రీలలో గొప్పడాక్టరు పరీక్షపొందినవా రేర్పడినపిదప స్త్రీలకు స్త్రీలున్ను, పురుషులకు పురుషులున్ను యెట్లు యేర్పాటు చేయబడెనో, ఈ భవరోగనివృత్తి విషయమందును ఆలాగుననే యుండ వలెను. ఇదే సరియైనది.

49. ప్ర:— స్త్రీ పురుషులు యొక్కస్థలముననుండిన చెడుటకు కారణము స్త్రీలా, లేక పురుషులా? ఈ సందేహమున్ను చాల కాలము నుండి నాకు గలిగియున్నది. అదిన్ని తమవలననే నివృత్తికావలెను.

ఉ:—సమయానుగుణ్యముగ మీరు చేయు ప్రశ్నలు చాల విచిత్రముగా నున్నవి. మీయొక్క బుద్ధిశాలిత్వమేమని చెప్పనచ్చును! ఇట్లు సమయానుకూలముగ చెప్పుశక్తి లేనివారిని శ్రీ శంకరులు మూకులనియు, బధిరులనియు మణిరత్నమాలలో చెప్పిరి. కావున మీరు మంచి సమర్థులు. ఈ విషయమై స్త్రీల నిందించెడు ప్రమాణము లనేకములు గలవు. అవి మనకావశ్యకములుగావు. పురుషుల దోషము చేతనే అట్టి చెరుపు గలుగుచున్నదని చెప్పువారుకూడ యుంటున్నారు. అదిన్ని మనకక్కఱలేదు. ఒక రైలుయింజను నడుచుటకు నిప్పున్ను,

నీళ్లున్ను యేలాగున సమానశక్తి గల్గియుండునో, ఆలాగున విషయ ప్రవేశనావేగములో స్త్రీపురుషులుభయులున్ను సమానకారకులే. అగ్ని యుత్పత్తిచేయుటలో పొటాసియం, మనశ్శిల యేలాగున సమమైనశక్తి గల్గియుండునో ఆలాగున విషయాగ్ని జ్వలించుటకు స్త్రీపురుషు లిరువురున్ను హేతుభూతులే. అదేరీతిగ విద్యుచ్ఛక్తిచలనమునకు రెండువిధములగు ప్రాణశక్తులెట్లు కావలసియుండునో, ఆలాగున విషయచంచలత్వము గలుగుటకు పురుషులున్ను, స్త్రీలున్ను సమానశక్తిగలవారే. గ్యాసులైటు వెలుగుటయందు గాలియున్ను, కిరసనాయిలున్ను సమానమైనశక్తి యెట్లుగలిగియుండునో, ఆలాగున విషయజ్వాల జ్వలించుటకు నరులున్ను, నారీమణులున్ను సమమైనశక్తిగలవారే యగుదురు. సూర్యుడెట్లు భూమినాకర్షించునో భూమి యెట్లు సూర్యునాకర్షించునో, ఆలాగున సృష్టికర్త స్త్రీపురుషుల యుభయులలోను పరస్పరాకర్షణశక్తి గలుగజేసియున్నాడు. అయస్కాంత మేలాగున యినుముయొక్క సమీపమునకు వచ్చునపుడు స్వాయముగనే దానినాకర్షించునో, ఆలాగున విషయాకర్షణ స్త్రీపురుషుల యుభయులలోను యుండును. కావున నొకేస్థలమున యుండుట యుభయులకును శ్రేయస్కరముకాదు. అట్టి భ్రమశక్తిలేనిచో యీ జగత్తు నిలువజాలదు. కనుకనే యెందఱో మేధాశక్తిగలవారున్ను యిట్టి పాపమునకు లోబడిపోవుచున్నారు. స్త్రీలయందు బ్రహ్మవిద్య తక్కువైనందుచేతను, గ్రంథములు వ్రాయువారు స్త్రీలలో కొఱత గలిగినందుచేతను, తాపసులు, యోగులు, సంన్యాసులు, భక్తులు, పండితులు పురుషులలో యెక్కువగుటచేతను, శాస్త్రములలో స్త్రీలను గుఱించిన నింద గల్గియుండవచ్చును. కాని, ధర్మశాస్త్రములన్నిటిలో పురుషులకన్న స్త్రీలకే యెక్కువ ఆధిక్యత కల్పింపబడియున్నది. కావుననే 'మాతృదేవో భవ' అనిన తరువాతనే 'పితృదేవో భవ' అని వేదముకూడ చెప్పుటకు కారణమైనది. మఱియు, కుమారుడు మాతాపితరులకు నమస్కరించవలసివచ్చినపుడు ముందుగా తల్లికి నమస్కరించి, తరువాతనే తండ్రికి నమస్కారము చేయవలెను. మఱియును కుమారుడు సంన్యసించినచో తండ్రికిగాని, తాతకుగాని నమస్కారము

చేయవలసిన విధిలేదు. వీరుభయులే తిరిగి పుత్రుండగు నా పరివ్రాజకునకు నమస్కృతు లొసర్చవలెను. కాని, తల్లికిమాత్రము యతీశ్వరుడు సాష్టాంగప్రణామము చేయవలసియుండును. కుమారుడైన యతి వరుఁ డతీతజ్ఞానియైనను తల్లిమాత్రము వానికి నమస్కారము చేయరాదు. పుత్రుండు మునివరుడైనను యతివరుడైనను తల్లిమాత్రమే వాని నాశీర్వదించవలయు. దీనిచే తల్లియొక్క ఆశీర్వాద మెంత గొప్పదో, జనులు తెలిసికొనవచ్చును. కాని బ్రహ్మచర్య, వానప్రస్థ, గృహస్థాశ్రమములలో నుండువా రెంతజ్ఞానులైనను మాతాపితరులకు, పితామహులకు, పెద్దలకు సమస్కృతు లొసర్చవలెనేగాని వారివల్ల తాము నమస్కృతి నొందగూడదు. సృష్టిశక్తియందు స్త్రీపురుషు లుభయులయందును గొప్పదగు యాకర్షణశక్తి యుంటున్నది. ఎంత దూర మాలోచించినను దీనియొక్క అంతము కన్పించుటలేదు. అట్టి మహాశక్తిలేనిచో, మాయాభ్రాంతి లేనిచో ప్రపంచము నిలువజాలదు. కావున సృష్టికర్త తనయొక్క సంకల్పము జరుగుటకొఱకు యిట్టి అమోఘమగు, అచిన్త్యమగు, దురతిక్రమమగు శక్తిని నిలబెట్టియున్నాడు. లేనిచో యెందఱో యోగులు, ఋషులు, జ్ఞానసంపన్నులు, పరమ భక్తులుగూడ యీ దుఃఖసముద్రమగు, అవమానకరమగు, రోగ కారణమగు, విజ్ఞానరహితమగు, పాపహేతువగు, అతినీచమగు విషయములో పడిపోవుదురా ? ఎవరో ప్రకృతి నశించినవారు, జీవన్ముక్త స్థితి పొందినవారుమాత్ర మిట్టి మాయామోహమునకు లోబడకయుండ వచ్చును. అట్లైనకూడ వారు యేకాలములో యేమి తటస్థించునో యని భయపడి ప్రత్యేకప్రత్యేక స్థలములలోనే యుండియున్నారు. ఒకవేళ వారు నిగ్రహశక్తి గలిగియున్నను, తమయొక్క అనుయాయులు బాగుపడుట కొఱకైనను, వారు ప్రత్యేకముగానే యుండవలసివచ్చెను. ఏలన 'యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరో జనః' అని గీతాచార్యుల పరమోపదేశము ననుసరించియే వారు వర్తించుచున్నారు. అనగా శ్రేష్ఠుల యాచరణ చూచియే తక్కినవారుకూడ నడుచుచుందురు. కావున తమ కవసరము లేకపోయినను లోకహితార్థమై జ్ఞానులుకూడ యోచించి ప్రవర్తింతురు. కావున ఆత్మశ్రేయోభిలాషులును, లోక

శ్రేయోభిలాషులును నగు ధర్మబోధకులందఱును్ను, జ్ఞాననిష్ఠులంద ఱున్ను ప్రత్యేకప్రత్యేకముగా నుండుటయే మంచిది.

శ్లో॥ శ్రుతం సత్యం తపశ్శీలం విజ్ఞానం విత్తమున్నతిమ్।
ఇంధనీకురుతే మూఢః ప్రవిశ్య వనితానలమ్॥

తా॥ మూఢుడు గురుముఖమునుండి వినిన ధర్మము, శాస్త్రము, సత్యము, తపస్సు, పుణ్యశీలము, విజ్ఞానము, ధనము ఉన్నతపదవి— ఇట్టి యమోఘములగు దివ్యగుణములను వనితయను అగ్నియందు కట్టెలవలె కాల్చి భస్మమొనర్చుచున్నాడు.

శ్లో॥ సా ధన్యా జననీ లోకే స ధన్యో జనకః పితా।
ధన్యస్స చ పతిర్యస్య గృహే దేవీ పతివ్రతా॥
పితృవంశ్యా మాతృవంశ్యాః పతివంశ్యాస్త్రయస్త్రయః।
పతివ్రతాయాః పుణ్యేన స్వర్గే సౌఖ్యాని భుంజతే॥

తా॥ ఏ గృహమందు పతివ్రతయగు పుణ్యవతియైన స్త్రీయుం డునో, ఆమె పాతివ్రత్యమహిమచే వారి తల్లియు, తండ్రియు ధన్యులగు దురు. అంతేగాక, భర్తకూడ పతివ్రతయగు భార్యయొక్క మహిమచే ధన్యుడగును. పతివ్రతయగు నారీమణియొక్క పాతివ్రత్యమహిమ వలన పితృవంశీయులున్ను, మాతృవంశీయులున్ను, పతివంశీయు లున్ను, మూడుమూడు తరగతివార్లు స్వర్గమందు సౌఖ్యమును పొంద గలరు.

శ్లో॥ పతివ్రతాం స్త్రియం దృష్ట్వా పాపనాశో భవేన్మమ।
శుద్ధా జాతా విశేషేణ గౌరీతుల్యా పతివ్రతా॥

అనగా 'పతివ్రతయగు స్త్రీని దర్శించుటవలన నా పాపములు నశించుచున్న'వని ఈశ్వరుడు పలికెను. విశేషమైన పుణ్యముచేతనే శుద్ధ గుణముగల నారీమణులు జన్మింతురు. వారు పార్వతీదేవితుల్యులు, లక్ష్మీదేవికి సమానులు, సరస్వతీభగవతికి సములు—అని యీశ్వరుం డుపదేశించెను (శివపురాణము).

50. ప్ర:—స్త్రీపురుషుల శరీరసృష్టియందేదైన భేదముగలదా? పురుషుల శరీరమువలె స్త్రీల శరీరమున్ను పంచభూతాత్మకముగదా?

ఉ:— పురుషశరీరసృష్టియందును, స్త్రీశరీరసృష్టియందును భేదము

కలదు. శరీరనిర్మాణమున ఆఱు కోశములుగలవు. అవి క్రమముగ త్వచము, రక్తము, మాంసము, మేదస్సు, మజ్జ, అస్థి అనునవి.

శ్లో॥ ఏతే మహాత్మయః ప్రోక్తా షట్కోశ స్తదనన్తరం ।
త్వక్చ రక్తం మాంసమేదో మజ్జాస్థీని నిబోధత ॥

వీనిలో త్వచము, రక్తము, మాంసము స్త్రీలశరీరమందు అధికముగను, మేదస్సు, మజ్జ, అస్థి అను నీమూడుకోశములు పురుషశరీరమందు అధికముగను యుండును. శరీరనిర్మాణసమయమున అనగా పిండోత్పత్తికాలములో శుక్లమధికమైన పురుషశిశువున్ను, రక్తమధికమైన స్త్రీశిశువున్ను, రెంటియొక్క సమానావస్థయందు నపుంసకశిశువున్ను జన్మించునట్లు శాస్త్రము చెప్పుచున్నది. కేవలము శాస్త్రముమాత్రమేకాదు, ప్రత్యక్షానుభవమున్ను ఆలాగుననే యున్నది. సాంఖ్యశాస్త్రకర్తయగు కపిలమహర్షియే ఈ పంచీకరణశాస్త్రమును నిర్మించినవారు. ఇయ్యది ప్రస్తుతము పరిశోధనలోనుండు ప్రత్యక్షప్రమాణరూపమగు విజ్ఞానశాస్త్రము (సైన్సు) ననుసరించియున్నది. మజ్జచేత బుద్ధియున్ను, మేదస్సుచేత నరములున్ను, అస్థిచేత ధరించుటకు బలముగల యెముకలున్ను యేర్పడుచుండును. ఈ మూడుపదార్థములు స్త్రీశరీరమందు తక్కువగా నుండును. కనుకనే పురుషులకుగల దేహదార్ఢ్యము స్త్రీలకు లేకపోవుటకు కారణము. ఈ సృష్టినియమము సమస్తప్రాణులందును గలదు. ఎద్దుచేయు పనులగు భారముతో గూడిన బండిని లాగుటగాని, లేక బరువు మోయుటగాని ఆవులు చేయగలవా ? ఏ కాలమందును చేయలేవు. ఆలాగున మొగయేనుగు భరించెడు భారమును ఆడయేనుగు వహించగలుగునా ? ప్రత్యక్షముగా పురుషగజముయొక్క దంతములు యెంత పొడుగుగాను, బలము గలవిగాను, లావుగాను నున్నవి ! ఆడయేనుగునకట్లు గలవా ? ఆలాగున దున్నపోతులు లాగెడు బండ్లను గేదెలు లాగగలవా ? అట్లే మొగనెమలిని చూడుము, ఆడనెమలిని చూడుము. మొగనెమలి యెంతపెద్దది ! దానిపింఛ మెంతవిశాలమైనది ! దానికూత యెంత దూరము వినవచ్చును! అట్టిశక్తి నెమలిపెట్టయందు గలదా ? ఆలాగుననే కోడిపుంజుయొక్క బలము, పందెములో దానికిగల సామర్థ్యము, యుద్ధ

శూరత్వము, సుందరమైన శిఖ, శ్రేష్ఠములైన రోమములు, కాలిపై పోరాడుటకు తగినగోళ్ళు, కోడిపెట్టకుండునా ? అదేరీతిగ, పొట్టేలు యొక్క పోట్లాడుశక్తి, శౌర్యము, ధీరత్వము, గొఱ్ఱె కేకాలమందైనను కలుగునా? అట్లే యుద్ధములో ఫిరంగులతో, మరతుపాకులతో పురుషులుచేసెడు యుద్ధమును స్త్రీలేకాలమందును చేయజాలరు. ఇదిసృష్టి యొక్క నియమము. దీనిని మనుష్యులెవ్వరును పక్షపాతముతో చేసినదికాదు. మానవులేకాదు; దేవతలుకూడ దీనిని మార్చుశక్తిగలవారు కారు. రోమములున్ను, మీసములున్ను చూడుడు. పురుషులకుండునట్లు స్త్రీలకుండవు. జంతువులకు కొమ్ములున్ను, పక్షులకు శిఖ, పింఛములు, పాదములోముల్లు, పురుషజాతిలో నెట్లేర్పడియుండునో స్త్రీజాతిలో అట్లులేవు. ఇవన్నియు సృష్టియొక్క వైచిత్ర్యములు. కావుననే పురుషులకుండునంత కఠినస్వభావము స్త్రీలకు లేకపోవుటకు కారణము. అట్లే మనోనిగ్రహము, ధారణాశక్తి, బలము పురుషులకున్నంత స్త్రీలకు కలుగదు. స్త్రీలకు శరీరచర్మము పురుషులంత బిరుసుగానుండదు. చాల మృదువుగానుండును. త్వచమున్ను, రక్తమున్ను, మాంసమున్ను మెత్తనివస్తువులు. వానియందు కఠినపదార్థములేదు. కావుననే స్త్రీలకు జాలియు, ప్రేమయు, శాంతస్వభావమున్ను, మృదువైన గుణమున్ను పురుషులకంటె యధికముగనుండుటకు కారణము. కాని, పురుషుల యొక్క నిశ్చలత్వము, ధీరత్వము స్త్రీలకు గల్గియుండదు. ఒక గృహమును భరించుటలో లోపలగల దూలములు, దాలయంత్రములు, గోడలు యెటువంటివో, ఆలాగున శరీరగృహమున అస్థి, మేదస్సు, మజ్జ అటువంటివి. ఇంటిపై గల కప్పు, దానికి సంబంధించిన చిన్నచిన్న కఱ్ఱలు, సున్నము యెట్టిమృదువస్తువులో శరీరగృహమున త్వచము, రక్తము, మాంసము అటువంటివి. ఇయ్యవి స్త్రీశరీరమునకు సాధనములని గ్రహింపదగినది. సృష్టి యివ్విధముగ లేనిచో, సంతానము వృద్ధియగుటకు కావలసిన రక్తాదులు యేర్పడవు. రక్తముచేతనే గర్భములో శిశువు వృద్ధినొందవలసియుండును. కావుననే సర్వేశ్వరుని చేనాలాగున చేయబడినది. భూమియందు జలము సమృద్ధిగ లేనిచో వృక్షము లేలాగున పెరుగజాలవో, పైస్థితియు ఆలాగుననుండును. కిందువు

బీజమువంటిదనియు, స్త్రీ భూమివంటిదనియు విజ్ఞులమతము. కనుకనే భూదేవియను పేరుగలుగుటకు కారణమైనది. మఱియు, వృక్షశబ్దము పుంలింగముగాను, భూమిశబ్దము స్త్రీ లింగముగాను యుంటున్నవి.

51. ప్ర:—అయ్యయ్యో, దైవమా! స్త్రీలకు దేనియందును అర్హతలేదనియు, అసలే బ్రహ్మనిష్ఠకు యోగ్యులు కారనియు చెప్పుచుండగా స్త్రీ లోకమునకు కల్పవృక్షమువలె శ్రీగాంధీమహాత్ముడున్ను మీరున్ను జనించియున్నారని హృదయములో తలంచి నారీమణులు ఆనందవారాశిలో మునుంగుచుండు యీ సమయమున యిదివఱలో యెవరును తెలుపని యీ సృష్టిభేదమును నిరూపించెడు పిడుగువంటి వాక్యమును విని స్త్రీలహృదయము తల్లడిల్లుచున్నది. ఇదివఱలో మీయొక్క యనుగ్రహమనెడు సూర్యప్రకాశముండుటచేతనే అబలలగు సోదరీమణుల హృదయపంకజము వికసించియుండెను. అట్లుండ, సూర్యుడస్తమించిన, పద్మములు ముకుళించునట్లు యిట్టి భేదమను ఘోరమగు కారుచీకటి దట్టముగ నావరించుటచే వారి హృదయము చాల క్లేశయుతమైనది. మృదువైన కమలములు వజ్రప్రహారణముచే యేలాగున విచ్ఛిన్నములై పోవునో, ఆలాగున యిపుడు మీరు చెప్పిన కర్ణకఠోరమగు వాక్యముచే ప్రసన్న, ప్రశాంతస్థితిలోనుండు తల్లుల హృదయకమలములు చీకాకునొందెను.

ఉ:— నిజము చెప్పవలసినప్పుడు దాచగూడదు. అది ధర్మబోధకుల స్వభావముకాదు. సత్యమీలాగున యుంటున్నది. కాని దానివలన స్త్రీల కేలాటి యాపదయున్ను గలుగదు. ఏలన భగవద్భక్తికిన్ని, బ్రహ్మజ్ఞానమునకున్ను కఠినస్వభావము కూడదు. దానికి మృదుస్వభావమున్ను, మిక్కిలి శాంతస్వభావమున్ను కావలసియుండును. అట్టి గుణములు పురుషులకంటెను స్త్రీలయందధికముగా యుంటున్నవి. నిర్మలమైన స్ఫటికశిలయందు సూర్యప్రతిబింబము స్పష్టముగా కనుపించునట్లు తదితర కఠినశిలలందు ప్రతిబింబించజాలదు. ఆలాగున ప్రసన్న, ప్రశాంత హృదయాంతరాళములోనే భగవంతుని దివ్యప్రకాశమెక్కువగ గోచరించును. కఠిన, కర్కశహృదయములో దానియొక్క ప్రబోధము గలుగుట కష్టతరము. కావు

ననే స్త్రీలయందు భక్తియు, భూతదయయు, దానబుద్ధియు నెక్కువగ నుండుటకు కారణమైనది. గోపికాస్త్రీలే యిందులకు దృష్టాంతము. స్త్రీలకు కావలసినది దైవకృపగదా; దాని కేలాటి కొఱతయు వారికి లేదు. కొన్ని కార్యనిర్వహణములకున్ను, ఉద్యోగములకున్ను, దీర్ఘాలోచన చేయుటకున్ను, రణరంగములలో దుముకుటకున్ను, కఠినశాస్త్రములు చదువుటకున్ను మాత్రము పురుషవ్యక్తియందాధిక్యత యేర్పడియున్నది. దానివలన భక్తికిన్ని, జ్ఞానమునకున్ను యేలాటి యాటంకమును కలుగలేదు. కావుననే వ్యాసాది మహర్షులందఱును స్త్రీలకు భక్తిముఖ్యముగా నుండవలెనని చెప్పుటకు కారణము. మఱియు శ్రీ కృష్ణుడుకూడ భక్తియను తైలమే జ్ఞానమను జ్యోతిగ మారునని చెప్పుటకును కారణము. ఈ భక్తి స్త్రీలకు మాత్రము కాదు; కలియుగములో స్త్రీపురుషులందఱకును భక్తియే ముక్తికి కారణమని యుపదేశించియున్నారు. కావున, భక్తిమార్గములో ప్రవేశించిన, అదే జ్ఞానమై మారును. కాన భక్తికిగాని, జ్ఞానమునకు గాని దయాళుత్వముగల హృదయము, పావనమైన మృదుస్వభావము కావలసినది. సర్వేశ్వరుఁడు పరమదయగలిగి, నారీమణులందు వీటిని యెక్కువగ యేర్పఱచియున్నాడు.

52. ప్ర:—సాంఖ్యశాస్త్రములో పంచకోశములని చెప్పబడియుండగా తాము షట్కోశములని చెప్పుటకు కారణమేమి?

ఉ:—ఆత్మకు సంబంధించిన కోశమొకటి. శరీరమునకు సంబంధించిన కోశమొకటి. షట్కోశములు శరీరనిర్మాణమునకు సంబంధించినవి. పంచకోశములు ఆత్మకు సంబంధించినవి. ఈ యైదు కోశములు స్త్రీలకున్ను, పురుషులకున్ను సమానములే. అందేలాటి మార్పున్ను లేదు. అవి క్రమముగ (1) అన్నమయ (2) ప్రాణమయ (3) మనోమయ (4) విజ్ఞానమయ (5) ఆనందమయములనఁబడును. కోశమనగా, ఖడ్గమునకు ఒఱవంటిది; ధనము సంరక్షించుటయందు యినుపపెట్టె వంటిది; మఱియు, కోశకారక్రిమియొక్క గూడువంటిది. ఆ గూడు యేలాగున క్రిమిని కనుపఱచకుండ యావరణ మొనర్చుచున్నదో, ఒఱ ఖడ్గమును మరుగుపఱచుచున్నదో, పెట్టె ధనమునేలాగున దాచి

యనీయక చేయుచున్నదో, అలాగున ఈ యైదుకోశములు ఆత్మను తెలియనీయక ఆచ్ఛాదించుచున్నవి. కనుకనే కోశమను పేరుగల్గినది. ఒక్కకోశముచే నావరింపబడినందుచేతనే ఖడ్గమున్ను, ధనమున్ను, క్రిమియున్ను మూయబడియుండ, ఐదుకోశములచే నాచ్ఛాదింపబడిన ఆత్మ నెట్లు చూడగలము ? ఈ పంచకోశముల స్వభావములఁగూర్చి అనేక సామాన్యగ్రంథములలో వ్రాయబడియుండినందున మఱల యిచట చెప్పఁబూనలేదు.

53. ప్ర:— మానవులగు స్త్రీ పురుషుల శరీరములన్నియు పంచభూతమయమైయుండగా స్త్రీ శరీరమునకు మీరు చెప్పినట్లు భేదమెట్లేర్పడును ? అందఱిదేహములును పృథివి, అప్, తేజస్సు, వాయువు, ఆకాశములచే చేయఁబడినవి. కావున వీనిలో యొకటి బలవంతమైనది, మఱియొక్కటి బలహీనమైనది యని చెప్పుట కెట్లు సాధ్యమగును ?

ఉ:— ఇఁకను యీవిషయమై చెప్పునపుడు నిజము తెలుపవలసియుండును. సత్యబోధకులు దానికి భిన్నముగ పలుకరు. కావున, స్త్రీలను నిరుపయోగులుగ చేసినారని తలంచి క్లేశము నొందగూడదు. ఈ దేహసంబంధమైన భేదముచే భక్తికిన్ని జ్ఞానమునకున్ను యేలాటి మార్పున్ను గలుగుటలేదు. కాని, లోకకార్యనిర్వాహణమునమాత్రము తారతమ్యము గలదు. దీనివలన స్త్రీల గౌరవమునకుగాని, దైవభక్తికిగాని, ఈశ్వరజ్ఞానమునకుగాని యేలాటి మార్పున్ను గలుగదు. ఇనుముతో నిర్మించిన యంత్రమునకున్ను, ఉక్కుతో నిర్మించిన యంత్రమునకున్ను యెంతతారతమ్యము గలదో, రెండును లోహతత్వములే, పృథ్వ్యంశములే యైనను, బలాబలములలో యెంత మార్పుగలదో, అలాగున సృష్టియందుగూడ శరీరమానసేంద్రియములందును మార్పు గలదు. మంచి చేవగల చందనము, వేప మొదలగు వృక్షస్తంభములకున్ను, మామిడి, బూరుగ మొదలగు వృక్షములచే చేసిన స్తంభములకున్ను గృహాది భారమును వహించుటలో యెంతమార్పుగలదో, స్త్రీ పురుష శరీరనిర్మాణమందును అట్టి మార్పుగలదు. అవన్నియు పంచభూతములే. అట్లే శిలావర్గములోను భేదముగలదు. తెల్లరాతి స్తంభములకున్ను, నల్లరాతి స్తంభములకున్ను దృఢాదృఢత్వముల మార్పు

యెట్లుగలదో, ఆలాగున స్త్రీపురుషుల దేహనిర్మాణమందును మార్పు గలదు. శిలయు పంచభూతమయమే. అందఱి శరీరములున్ను పంచభూతమయములే. ఐనను, వానియందు కొంతమార్పు యేర్పడియున్నది. కొన్నిటిలో నవి సమానముగానే యుంటున్నవి. ఎట్లన, (1) పిండి (2) అరటిపండు (3) చక్కెర (4) పాలు (5) నెయ్యి, ఈ యైదు వస్తువులున్ను సమానముగాచేర్చి చేయు పిండివంటయున్ను, ఒకదానిలో పాలు జాస్తిగాను, ఇంకొకదానిలో నెయ్యి యెక్కువగాను, మఱియొక దానిలో పంచదార అధికముగాను, వేఱొకదానిలో అరటిపండ్లు హెచ్చుగాను, ఒకదానిలో పిండి యెక్కువగాను చేర్చి చేసెడు పిండి వంటల కేలాగున రుచులమార్పున్ను, శక్తిభేదమున్ను గలుగుచున్నవో, ఆలాగుననే యీ పంచభూతనిర్మితవస్తువులందును భేదముగలదు. ఏల అవన్నియు పంచభూతమయములు కావా ? ఆలాగుననే సత్వరజస్తమోగుణములయొక్కయు, విశుద్ధసత్వముయొక్కయు, జ్ఞానముయొక్కయు గుణమిశ్రితవలన మనోవాక్కాయములకున్ను మార్పు గలుగుచుండును ఏలన స్థూల, సూక్ష్మ, కారణములను మూడుభాగములు చేసినను ఒకవస్తువుయొక్క గురుత్వము, లఘుత్వము, అతిసూక్ష్మత్వాది స్వభావము నొకేవిధముగా నుండును. కనుకనే కొందఱు శాంతులుగాను, కొందఱు దయాస్వరూపులుగాను, మఱికొందఱు కఠినులుగాను, ఇంకకొందఱు జ్ఞానులుగాను, ఇంకకొందఱు అజ్ఞానులుగాను యేర్పడుటకు కారణము. ఈ త్రికరణము యేకరీతిననుసరించియే గలుగుచుండును. ఎక్కువతీపి, తక్కువతీపి యనిగల భేదమేగాని వస్తువొకటిగానేయుండును. కావుననే సాత్వికాహారముయొక్క స్థూలభాగమే శరీరముగాను, సూక్ష్మభాగ మింద్రియములుగాను, కారణభాగము మనస్సుగాను మారుచుండునని శాస్త్రములు నిరూపించుటకు కారణమైనది. కావున సాత్వికాహారముచేతనే సత్వగుణము గల్గును. సత్వగుణము గల్గునపుడే ఇంద్రియశుద్ధత, మనోనిర్మలత్వము గల్గును. కనుక అధ్యాత్మక్షేత్రములో ప్రవేశింపఁ దలంచువారు మొదట సాత్వికాహార మలవఱచుకొనవలెను. వస్తువులుమాత్రము సాత్వికముగా నుండినచాలదు. అవి వచ్చెడుమార్గము యుక్తముగను,

సత్యముగను నుండవలెను. అసత్య, అధర్మమార్గముద్వారా వచ్చు ధనముతో శుద్ధసాత్వికాహారము భుజించినను అది తామసాహారమువలె మనస్సును, ఇంద్రియములను, దేహమును మలినపఱచును. దానిచే ఆత్మయు మాలిన్యమొందును. కావున ఈ విషయములో బుద్ధిమంతులు చాలజాగ్రత వహించవలసియుండును.

54. ప్ర:— స్త్రీల శరీరనిర్మాణమునుగూర్చి చెప్పినపుడు ధారణాశక్తియు, చింతనాశక్తియు, సమాధిబలమును్న, బ్రహ్మవిచారణాశక్తియు పురుషులకు గలుగునట్లు స్త్రీలకు గలుగవని సెలవిచ్చితిరి. అంతకుముందు మైత్రేయి, గార్గి, సులభ, మదాలస మొదలగు నారీమణులు యాజ్ఞవల్క్య, జనకాదులనుగూడ బ్రహ్మవిచారణయందును, యోగాద్యష్టాంగవిషయములలోను విస్మయ మొందించినట్లును్న యానతిచ్చిరి. కావున యిదెట్లు పొసగును? ఇది పూర్వోత్తర విరుద్ధ వాక్యముగదా!

ఉ:—బ్రహ్మధ్యాన, యోగనిష్ఠ, దైవభక్తులలో అందఱికి అధికారముగలదని యిదివఱలో తెలుపబడియుండెను. శాస్త్రవిచారణలోను, యోగధారణలోను పురుషులనువలె స్త్రీలకు దృఢత్వము గలుగుట ప్రయాసమని చెప్పబడినది. కాని, సాధ్యముకాదని చెప్పియుండలేదు. కావున పూర్వోత్తరవిరుద్ధవచనమేమియు యిందు గలుగలేదు. మఱియు, పురుషులవలె బ్రహ్మనిష్ఠులందు, యోగనిష్ఠులందు, శాస్త్రకర్తలందు స్త్రీల సంఖ్య చాల తక్కువగ నుంటున్నది. ఏదో జన్మాంతరమున మహత్తరమగు దివ్యశక్తియుండుటచే గార్గి, సులభ, మైత్రేయి, మదాలస మొదలగు నారీమణులకట్టి దివ్యజ్ఞానము గల్గియుండును.

54. ప్ర:— పురుషులకుమాత్రము జన్మాంతరసుకృత విశేషము లేకయు, సంస్కారశక్తి గలుగకయు బ్రహ్మజ్ఞానమందును, యోగనిష్ఠయందును ప్రవేశము గలుగునా?

ఉ:—పురుషులకైనను, స్త్రీలకైనను పూర్వజన్మవిశేషము వలననే నివృత్తిమార్గమున మనస్సు ప్రవేశించును. కాని, పురుషులలో యనేకులుండుటవలనను, స్త్రీలలో కొలదిమందిమాత్రమే యుండుటచేతను ఆలాగున తెలుపుటయైనది కాని మఱియొకటికాదు.

56. ప్ర:—పురుషులవలె యనుష్ఠించుటకు స్త్రీలకు అవకాశము గలుగజేయకపోవుటచేతనే నారీమణులలో పురుషులంత యెక్కువగ బ్రహ్మనిష్ఠురాండ్రు లేకపోయిరేగాని, మఱియొక కారణ మిందు యెంత వెదకినను కనుపించుటలేదు.

ఉ:— ఇది కొంతవఱకు నమ్మదగినదిగాని పూర్తిగ విశ్వసింపఁ దగినది కాదు. ఏలన బ్రహ్మచర్యపదార్థమువలననే అమానుషశక్తి గలుగును. అది స్త్రీలయందు లేదు. కావున యట్టిశక్తి స్త్రీలకు గలుగుట కవకాశము లేదు. మఱియు, ఒకవేళ స్త్రీలు బ్రహ్మచర్యము నవలంబించినను, రజస్వలాదోషము నెలనెలకు జరుగుచుండుటచే కాయికశక్తియు, మానసిక బలమున్ను, బుద్ధియొక్క నిశ్చయాత్మక శక్తియు వారికి గలుగుట దుస్తరము. పురుషులు బ్రహ్మచర్యము చక్కగ యాచరించిన, స్త్రీలకు గలిగెడు ఋతుకాలదోషమువలె బ్రహ్మచర్య నష్టము పురుషులకు కలుగదు. కాని మానసిక పవిత్రత, ప్రసన్నత, ప్రశాంతత, ప్రబోధత మొదలగు గుణములు బ్రహ్మచారులగు పురుషులవలె స్త్రీలకున్ను గలుగును. మఱియు సంతానము గలుగుటవలన స్త్రీల శరీరమందుగల శక్తికి హేతువగు రక్తము విశేషముగ నష్టమై పోవుటచే మానసికబలమున్ను, కాయబలిష్ఠత్వమున్ను తగ్గిపోవును. అట్టి దుర్బలత యెక్కువగ బ్రహ్మచారిణులగు స్త్రీలకు గలుగదు. కాని, సంతానము గలుగని స్త్రీలకు మానసిక శుద్ధిలేనిచో, దైవవిచారములో యున్నతస్థితి బొంద సమర్థత కలుగదు. బ్రహ్మనిష్ఠగల స్త్రీల యోగ్యత వీరికి గలుగదు. పురుషులైనను బ్రహ్మచర్యవ్రతము మాత్రముగల్గి మానసికశుద్ధి, దైవవిచారము లేనిచో, అట్టివారికికూడ యది కలుగదు.

57. ప్ర:—వైరాగ్యవిషయము వచ్చునపుడు వ్యర్థముగ అమాయకులగు నారీమణులను గొప్ప బ్రహ్మజ్ఞానులుకూడ నిందించుచున్నారే. ఆలాగున స్త్రీలలో యిదివఱకేర్పడిన యోగినులు, తపస్వినులు, బ్రహ్మజ్ఞానసంపన్నులు, పరమభక్తురాండ్రు యేల పురుషుల నింద చేయలేదు ?

ఉ:—అదేను స్త్రీలలోగల మహిమ, పవిత్రత, సహనము,

ఆకాలపు నారీమణులు శాస్త్రమందు మహావిశ్వాసముగలవారు. శాస్త్రములలో భర్తల నిందించుట మహాపాతకమని వారు వినియుందురు. మఱియు పురుషుల సహాయములేక యేకాలమునను స్త్రీలు స్వాయముగ గొప్పకార్యమును నిర్వహింపజాలరని వారికి తెలియును. మఱియును, స్త్రీలు తమయొక్క పవిత్రధర్మమునుండి పడిపోవుటకు కారణములనేకములు గలవు. పురుషుల కాలాగున స్వాత్మధర్మమునుండి పతనము గలుగుట కెక్కువ మార్గము లేదు. కావున, స్త్రీలు తమ పాతివ్రత్యమునే గొప్పదిగ తలంచియుండిరి. దానికి మించిన ధర్మము వారికి మఱియొకటిలేదు. ఈ విషయములో భారతీయనారీమణులకు సమానులైనవారు ప్రపంచములో యెచటగూడ లేరనియే చెప్పవచ్చును. ఇది ఆత్మస్తుతికాదు. లోకచరిత్రము సాక్ష్యమిచ్చుచున్నది. మఱియు ద్వాదశాబ్దములోపలనే కొందఱు స్త్రీలు ఋతుధర్మమునకు లోబడివచ్చుటవలన పురుషులవలె యెక్కువకాలము విద్యాభ్యాసాది తపస్సులు బ్రహ్మచర్యవ్రతనిష్ఠతో చేయజాలకున్నారు. ఇదిన్ని వారి యున్నతికి ఆటంకమును గల్గజేయుచున్నది.

58. ప్ర:— ఓ స్వాములవారూ! స్త్రీలను స్తోత్రముచేసి, వారిని పైకిరానీయక చూచే తంత్రముగదా మీబోటివారిది. కావున గదా స్త్రీలోకమింత యధోగతిని యుంటున్నది? కావున మీరు సత్యాన్వేషులైనచో, న్యాయదృష్టి గలవారైనచో, సమత్వబుద్ధి గలవారైనచో ఈ మాతృస్వరూపిణులగు నారీమణు లుద్ధరింపబడే మార్గముపదేశించవలెను. నారీమణులు దీనిని నిరోధించుటకు తగిన సూత్రము బాల్యవివాహనిషేధమే యని నిశ్చయించుకొనినారు.

ఉ:— బాల్యవివాహనిరోధ మిప్పుడు గవర్నమెంటులోనే యేర్పడియున్నది. బాల్యవివాహములేని రాజులందును, కమ్మవారియందును, రెడ్లయందును, యితరులయందును నారీమణులేల యున్నతస్థితిలోనికి రాజాలకున్నారు? బాల్యవివాహము ఆత్మోన్నతి నరికట్టుచున్న విషయము విజ్ఞానవంతులంద అంగీకరించియేయున్నారు. కాని దీనియొక్క నిరోధముమాత్రము చాలదు. స్త్రీలలో కొందఱు మంచి సంస్కృతాది విద్యల నభ్యసించుటలోను, దైవభక్తి సల్పుట

లోను, తపస్సు చేయుటలోను, యోగనిష్ఠ శీలించుటలోను, బాలికలకు గురుకులములు స్థాపించుటలోను ప్రయత్నింపవలెను. అధ్యాత్మశక్తిని సంపాదించుకొనవలెను. జ్ఞానబలము, దైవబలము, తపోబలము పొందవలెను. తరువాత నారీమణుల కుపదేశించవలెను. అపుడే వాక్యములకు విలువయుండును. తక్కిన యుపన్యాసములుగాని, సభలుగాని, పత్రికాప్రచురణములుగాని, గ్రంథరచనలుగాని గొప్ప ఫలమును గలుగజేయజాలవు. వాక్కు చైతన్యము గలిగియుండవలెను. మంచి ఆచరణ శీలించవలెను. ఉత్తమమనోనిగ్రహము, ఇంద్రియ నిగ్రహము, సత్యప్రవర్తనము అలవడవలెను. అప్పుడు శుద్ధసంకల్పము గలుగును. అందువల్ల సంకల్పసిద్ధి లభించును. అది గొప్ప మహిమను లోకులకు గలుగజేయును. పవిత్రకాయికక్రియ లాచరించుట మొదలగు దైవగుణములను సంపాదించుకొనవలెను. అప్పుడే మన ప్రసంగములకు ప్రభావము కలుగును. అట్లుకాని గంభీరవాక్యములన్నియు మందువేసి గుండు లేక కాల్చిన ఫిరంగి శబ్దమువలె నుండును. అట్టి ఆత్మశక్తి లేని వాక్యములన్నియు, లోపలగింజలేని పొట్టును భూమియందు పెట్టి చేసిన కృషివలె వ్యర్థమేయగును. కావున తగిన యనుకూలముగల నారీమణులు శక్తికొలది ఆత్మసేవ ప్రారంభించవలెను. ఆచరణ అన్నిటికిని యాధారభూతమైనది. ఇది స్త్రీలకు మాత్రము చెప్పినది కాదు. పురుషులకైనను, ఋషులకైనను, దేవతలకైనను, సిద్ధులకైనను ఆచరణ అన్నిటికిన్ని ఆధారమైనదగును. 'ఆచారహీనం న పునంతి వేదాః' అనియేగదా శాస్త్రవాక్యము.

59. ప్ర:— నిష్కామకర్మయోగము పూర్తియైనదని దేనివలన తెలిసికొనవచ్చును?

ఉ:— సకామకర్మ పూర్తియైనమాత్రమే నిష్కామకర్మయందు ప్రవేశముగల్గును. దుష్కర్మలు పూర్తిగ ముగిసిన తరువాతమాత్రమే సకామ పుణ్యకర్మలో మనస్సునకు ప్రవేశము గల్గును. పాపకర్మ చేయుట మంచిదికాదని హృదయములలో తలంపు గలుగునప్పుడు జీవుడు దురితమునుండి విడుదల పొందినవాడగును. తరువాత సకామ పుణ్యకర్మలయందు ప్రవేశించవలెనను యిచ్ఛ యుదయమగును. దాని

యందు విషయసుఖములపై ముఖ్యముగా దృష్టిగలిగియుండును. ఇహ సంబంధమైన ఫలము నుద్దేశించియే యేకార్యమైనను చేయు స్వభావ మట్టికాలమున గలుగును. అట్టికర్మలు కొంతకాలము చేయునప్పుడు దానియందు పరిపక్వత గలుగుదశలో, 'ఫలాపేక్షతో చేయు కర్మల వలన ఆత్మశుద్ధిగలుగదు; ఆత్మశుద్ధి గలుగనిచో మనశ్శాంతి సిద్ధింపదు; మనశ్శాంతిలేనిచో యెన్ని సుఖములుండినను ఆత్మసౌఖ్యము గలుగ' దను సంకల్పము క్రమముగా దృఢమగును. అప్పటికి జీవుడు గొప్ప యదృష్టవంతుడు కాగలడు. తరువాత నిష్కామబుద్ధితోనే అన్నికర్మలను చేయుచుండును. అందువలన హృదయము చాల శుద్ధమగుటచే ఉపరతిస్థితిలోనికి ప్రవేశముగలుగును. అది నిత్యశాంతియు, పరమానంద ప్రాప్తియు, శోకరాహిత్యమును యగుటచే బ్రహ్మాత్మైక్యసిద్ధిని త్వరలో గలుగచేయును. అప్పుడు మనస్సు మొదలైన కరణములన్నియు శరత్కాలమేఘమువలె నిర్మలములున్ను, ప్రశాంతములున్ను కాగలవు. అట్టిస్థితి గలుగునప్పుడు ముక్తులగు కొందఱి యింద్రియవ్యాపారమునుండి ఆత్మ విరమించవచ్చును. కాని, కొందఱు శరీరపతనము వఱకు జీవకోట్లు తరింపవలసిన కార్యములలో ప్రవర్తింపవచ్చును. అయినను వారు చేయు కార్యములన్నియు అతిశుద్ధములుగాను, బంధవిముక్తములుగాను నుండును. 'మూఢోత్తారణమేవేహ స్వభావో మహాత్మామితి' — అజ్ఞానుల నుద్ధరింపజేయుటయే స్వభావముగ గల్గి జ్ఞానవంతులుందురు. ఇది వారియొక్క స్వభావము. ఆస్థితికి వచ్చినప్పుడు మహనీయులందఱున్ను బద్ధులైన జీవుల విముక్తికొఱకున్ను, దుఃఖులైన జీవుల సుఖముకొఱకున్ను, అజ్ఞులైన జీవుల జ్ఞానముకొఱకున్ను, అస్వతంత్రులగు జీవుల స్వాతంత్ర్యము కొఱకున్ను, నిమ్నస్థితిలోనుండు జీవుల యున్నతస్థితికొఱకున్ను, విద్యావిహీనులైన జీవుల విద్యకొఱకున్ను ప్రవర్తించెడు స్వభావము గల్గియుందురు. అగ్నికి ఉష్ణత్వమున్ను, జలమునకు శైత్యమున్ను, వాయువునకు చలనమున్ను, సూర్యునకు ప్రకాశమున్ను, చంద్రునకు శీతలత్వమున్ను యెట్లు స్వభావముగ నుండునో, మహాత్ముల స్వభావమున్ను జీవకోట్ల మేలుకొఱకు ప్రవర్తించుటయే యగును. కనుకనే 'పరోపకారాయ సతాం విభూతయః' —

ఏలాగున నదులు జనులకొఱకు జలమును వహించుచున్నవో, మేఘములేలాగున జీవులకొఱకు వర్షము కురియుచున్నవో, వృక్షములేలాగున జీవకోట్లకొఱకు ఫలముల వహించుచున్నవో, ఆలాగున సత్పురుషులందఱున్ను జ్ఞానవిజ్ఞానధనవిద్యాది విభూతులన్నిటిని లోకముకొఱకే వినియోగపఱచెదరు.

60. ప్ర:— జీవన్ముక్తియందు అందఱును యొకేవిధముగ నుండవలసినదిగదా. మఱల కొందఱు కర్మయందుండి యుపరతిని పొందకుండుటయు, మఱికొందఱు కర్మలను చేయుటయు యెట్లు పొసగును? స్ఫుటము చేయబడి శుద్ధమైనట్టి బంగారము యేరూపము గలిగియుండినను, అన్నియు నొకేవిధముగా నుండవలసినదిగదా. అప్పుడుకూడ భేదము గలిగియుండిన, ఒకేవిధముగ శుద్ధమైనదని యెట్లు తెలిసికొనవచ్చును? ముక్తిదశయందుకూడ భేదము కలుగునా? ఈ సందేహమును నివృత్తిచేయ ప్రార్థించుచున్నాను.

ఉ:— ముక్తిదశయందు, ఆత్మవిషయమందు, పరమశాంతివిషయమందు భేదము లేకపోయినను జీవుల సంస్కారము శరీరముండువఱకును కొందఱికి స్వల్పముగా నుండవచ్చును. దానివలన ఆత్మసుఖమునకుగాని, యేకత్వమునకుగాని, సమత్వమునకుగాని విరోధము గలుగదు. ఏలన, శరీరము వచ్చినది ప్రారబ్ధమనుభవించుటకొఱకైనను, లేక అట్టి జీవి లోకములో యేదైన మహాకార్యముచేయుటకొఱకైనను యుండవలయు. కావున తైలముండువఱకు దీపము వెలుగునట్లు, శరీరముండునంతవఱకు అట్టి సంస్కారము కూడియే యుండును. మలినబంగారము శుద్ధముచేయబడినపిదపయు వేఱువేఱు ఆకారములు గలిగియుండిన దోషములేనట్లు, జీవన్ముక్తుడు చేయు కార్యములలో భేదము కన్పించినను అది దోషముకాదు. స్ఫటికమణిసన్నిధిలో రక్త, పీత పుష్పములుండిన, వాటి వర్ణము లామణియందు కనబడినను వాస్తవముగా నంటెట్లు లేవో, ఆలాగున ఆత్మజ్ఞాని స్వరూపములో శుద్ధత గలిగియుండుటచేతను, ఆత్మలాభము గలిగియుండుటచేతను, తనయందేవిధమైన ప్రకృతిదోషములుగాని, ప్రకృతిసంబంధములగు యితరవిషయములుగాని లేవను యనుభవము

గలిగియుండును. ఇతరులకుమాత్రము మణియందు పుష్పరంగులు కాన్పించునట్లు కర్తృత్వముగాని, భోక్తృత్వముగాని, ఆత్మజ్ఞానియందు తోచవచ్చును. అయితే ప్రకృతిసంబంధదోషములేమాత్రము నుండ దగదు. కనుకనే అది స్ఫుటముచేసిన సువర్ణమని చెప్పుటకు కారణ మైనది. మఱల దానియందు చిలుముండిన, ఒకవేళ స్ఫుటముచేసి యుండినను, యింకను శుద్ధము కాలేదని నిశ్చయించుకొనవచ్చును. అగ్నియందు దహింపబడిన త్రాడు చక్కగ కానుపించవచ్చును; వంక రగానుండవచ్చును. దానివల్ల దోషములేనట్లే జ్ఞానులయొక్క స్థితియు అని గ్రహించుకొనవలెను. ఆ త్రాడు అగ్నిచే దగ్ధమైయుండుటచే కట్టుట కుపయోగపడదు. జ్ఞానియొక్క ప్రారబ్ధకర్మకూడ ఆలాగున దగ్ధపటన్యాయముగనుండును.

61. ప్ర:—జీవన్ముక్తస్థితిగలిగినతరువాత కర్మలనుండి విరమించిన వారు శ్రేష్ఠులా, లేక జీవన్ముక్తస్థితి అనుభవించుచునుండియు, జీవ కోట్ల హితార్థముగ జ్ఞానసంబంధకార్యములు చేయువారు గొప్పవారా?

ఉ:—వీరుభయులున్ను గొప్పవారే. వీరిలో యొకరు శ్రేష్ఠు లనిగాని, యింకొకరు కనిష్ఠులనిగాని చెప్పుటకు వీలులేదు. వారుచేయు కార్యములనుబట్టి ఆత్మజ్ఞానములేనివారు (బహిర్దృష్టిగలవారు) 'వీరు లోకమునకు యెంతో మేలుచేయుచున్నారు; వారు లోకహితార్థమేమి చేయుచున్నారు? అనగా యేమియు చేయుటలేదు. సుఖముగ తమ కార్యముమాత్రము చూచుకొనుచున్నా'రని తలంతురు. అది సరికాదు. వారి సంస్కార మాలాగున యుంటున్నది, వీరి సంస్కార మీలాగున యుంటున్నదనియే విజ్ఞులు తలంతురు. ఇదే నిజముగా నుండును.

62. ప్ర:— కొందఱు స్త్రీలకు ఉన్నతవిద్య అక్కరలేదనియు, మఱికొందఱు స్త్రీలకు ఉన్నతవిద్య అత్యావశ్యకమనియు చెప్పు చున్నారే. ఈవిషయమై తమ యాశయమెట్టిదో తెలిసికొన కుతూ హలత గలుగుచున్నది.

ఉ: —ఉన్నతవిద్య గలిగిన స్త్రీలు స్వతంత్రులై విహరించుదు రేమో యని తలంచుటయే వారికి విద్య అవసరములేదని చెప్పుటకు

కారణము. ఉన్నతవిద్య స్త్రీలకున్ను యుండవలసినదే. విద్యాభ్యాసము యొక్క పద్ధతి సరిగ లేనందుచేతనే విద్య అవిద్యయై పరిణమించుటకు కారణమైనది. ఉన్నతాశయముతో బోధించెడి విద్య మిక్కిలి ఉపయోగకరముగనే యుండును. అది భారతీయ ఋషుల దృష్టితో గూడి నదిగా నుండవలెను. అట్లుగాక పాశ్చాత్యదృష్టితో గూడినదగుటచే భారతీయుల పావనదృష్టికి సరిపడకపోవుచున్నది. భారతీయఋషుల విద్యయొక్క లక్ష్యము అవిద్య నంతమొందించుటయే యగును. కావున నట్టి విద్య యెక్కువ సుగుణములతోను, ఆచరణతోను, జ్ఞానముతోను గూడియుండును. అట్టి విద్య నెవరున్ను ఉపేక్షణీయమని యనఁజాలరు. భారతీయుల దృష్టి యోగదృష్టిగా నుండును. పాశ్చాత్యుల దృష్టి భోగములతో గూడినదగుటచే కేవలము నివృత్తి నుద్దేశించెడు భరతఖండవాసులకు రుచింపకపోవుటకు కారణమగుచున్నది. కాని కొందఱు విద్యవలన స్త్రీలు చెడిపోదురని చెప్పువాక్యము నిజమైనదికాదు. విద్యావిహీనులుకూడ సుగుణము లేకపోవుటచే చెడిపోవుచున్నారు. పాశ్చాత్యవిద్యచే పురుషులుగూడ కొందఱు పశ్చిమదేశ స్త్రీలతోగూడి అట్టి స్వభావముగలవారై యుంటున్నారు. కావున స్త్రీలుగాని, పురుషులుగాని చెడుటకు విద్య కారణముకాదు. గుణమే కారణమగుచున్నది. అది బోధించువారిలోగల స్వభావము ననుసరించియుండును. సంస్కృతవిద్య స్త్రీలకును ముఖ్యముగనుండవలయు. ఏలన, ఆధ్యాత్మతత్త్వములు దానియందు ఘనీభవించియున్నవి. మరియు ధర్మమార్గములన్నియు సంస్కృతవిద్యవల్లనే గలుగవలసియుండును. పాశ్చాత్యవిద్యనభ్యసించి, స్త్రీలు ఉద్యోగము చేయవలసిన యవసరము యెక్కువగ కానుపించుటలేదు. ఏలన, ఉన్నతపరీక్షలో ఉత్తీర్ణులైన పురుషులనేకులు ఉద్యోగములభింపక సంకటపడుచున్నారు. కాని, స్త్రీసముదాయమునకు మిక్కిలి ఉపయోగకరమైనట్టి డాక్టరు విద్య (వైద్యము) వారికి ముఖ్యముగా నుండవలయును. ఆలాగున స్త్రీల పాఠశాలలో విద్యను బోధించుటకు తగిన పరీక్ష స్త్రీలున్ను తప్పక స్థాపితులై యుండవలెను. ఈ రెండు కార్యములును స్త్రీల కత్యావసరములైనవి. ఇవి యేమాత్రమును ఉపేక్షింపతగినవి కావు. మఱల

సంగీతము, కుట్టుపనులు మొదలైన స్త్రీలకు సంబంధించిన పనులన్నియు యవసరములే. ఆలాగున స్త్రీలకు మాత్రముకాదు; పురుషులకుకూడ ధర్మమును బోధించుటకు తగిన దైవికజ్ఞానసంపన్నమైన విద్య అవసరమైయున్నది. అది సంస్కృతములోనో లేక హిందీలోనో లేక ఆయా దేశసంబంధమైన భాషలలోనైనను చాలును. లోకమంతటను ధర్మబోధచేయుటకు తగిన యున్నతవిద్య గలిగియుండవలయును. శ్రీ అనిబిసెంటమ్మ మొదలగువారియొక్క యోగ్యత లోకమంతయు నెఱింగియున్నది. కాని అట్టి దివ్యవిద్య స్కూలులో చదివెడి గ్రంథములచే పూర్తిగా లభించునది కాదు. ఉత్తమమైన అనుష్ఠానమువలనను, తపస్సువలనను, దైవభక్తివలనను, శుద్ధమైన ఆచరణవలనను మాత్రమే యది లభించును. ఇదే భారతీయవిద్యయొక్క లక్ష్యము. స్త్రీలకు ఇంగ్లీషువిద్య యోగ్యముకాదని చెప్పువారు తమ భార్యలకుగాని, సోదరులకుగాని, కొమార్తెలకుగాని, తల్లులకుగాని రోగము కలుగునప్పుడు ఇంగ్లీషు ఆసుపత్రులలోనికి పంపకయుండవలెను. జనులు స్త్రీలకు గలుగు గర్భబాధలను, వుదరరోగములను నివృత్తిచేయుటకు పురుష ఇంగ్లీషుడాక్టర్ల దగ్గఱకును, డాక్టర్లగు విదేశ స్త్రీలదగ్గఱకును తీసికొనివెళ్ళి బాగుచేయించుచుండగా, మఱియు ఆలాగుననే తమ సోదరీలను, కొమార్తెలను విదేశపాఠశాలలకు బంపి, విదేశ పురుషులచేతను, స్త్రీలచేతను విద్యాభ్యాసము చేయించుచుండగా, వున్నతవిద్యను, విదేశశాస్త్రమును దూషించుటకన్న వెఱ్ఱితనము మఱియొకటి గలదా? ఇట్టి అర్థశూన్యమైన వ్యర్థవాక్యము నుచ్చరించుటయందు సిగ్గులేదా? కావున వైద్యము, విద్య ఈ రెండు విషయములలో స్త్రీలు వుత్తమ పరీక్ష పొందవలసినదే. ఆలాగుననే ఆధ్యాత్మసంబంధమగు సంస్కృతవిద్యయు బాగుగ నేర్చుకొనవలసియుండును. ఇది లోకక్షేమమునకెంతో తోడ్పడును. దీనివలన స్త్రీలయొక్క చారిత్రశుద్ధికేలాటి కళంకమున్ను గలుగదు. ఇతరములగు ఉద్యోగాది కార్యములలో ప్రవేశించిన యెట్లు జరుగునో చెప్పజాలను. అది యీశ్వరునికే తెలియును. చారిత్రశుద్ధికన్న యెక్కువైన గౌరవపద్ధతి స్త్రీలకు మూడులోకములందును మఱియొకటి లేదు.

ఇది స్త్రీలకుమాత్రమేకాదు; పురుషులకును ఏకపత్నీవ్రతమునకన్న గొప్పపదవి, గొప్పగౌరవము, గొప్పపుణ్యము మఱియొకటి యేలోకమందును గలుగదు. పైఁజెప్పిన యుభయులున్ను బ్రహ్మచారిణులుగాను, బ్రహ్మచారులుగాను నుండిన వారి మహిమకున్ను, మాహాత్మ్యమునకున్ను, ఆత్మసౌఖ్యమునకున్ను అంతమేలేదు.

'మరణం బిందుపాతేన జీవనం బిందుధారణాత్'

అని యోగశాస్త్ర ముపదేశించుచున్నది. అనగా బిందువుయొక్క పతనముచేతనే మరణము గలుగుచున్నదనియు, బిందుధారణచేతనే మృత్యువుతోగూడిన మనుజుడు అమర్త్యుడగుచున్నాడనియు అర్థము.

యథా పయసి సర్పిస్తు గుడశ్చేక్షౌ రసో యథా ।
శరీరేషు తథా శుక్రం నృణాం విద్యాద్భిషగ్వరః ॥

క్షీరమందు ఘృతమెటువంటిదో, చెఱకునందు రసరూపముగు బెల్లమెటువంటిదో, ఆలాగున మనుజులయొక్క శరీరమందు శుక్లమున్ను అటువంటిదని బుద్ధిమంతులు గ్రహించుకొనవలెను. వెన్నతీసిన పాలు యేలాగున నీరసమైపోవునో, రసముతీసిన చెఱకుగడ యేలాగున నిరుపయోగమైపోవునో, ఆలాగున వీర్యనష్టముగల మనుజులు కూడ నిర్వీర్యులై పోవుదురు.

నైర్మల్యం భావశుద్ధిశ్చ వినా స్నానం న జాయతే ।
తస్మాన్మనోవిశుద్ధ్యర్థం స్నానమాదౌ విధీయతే ॥

అట్టి బ్రహ్మచర్యము శుద్ధముగా నిలువవలసియున్న, ఆత్మశుద్ధియు, ఆహారశుద్ధియు కావలెను. స్నాన, శౌచములున్ను అత్యావశ్యకములు. కావున అన్ని కార్యములకును ముందుగ మనశ్శుద్ధికొఱకున్ను, భావశుద్ధికొఱకున్ను, దేహేంద్రియాదుల నిర్మలత్వముకొఱకున్ను స్నానము విధింపఁబడినది.

పూజితం హ్యశనం నిత్యం బలమూర్జం చ యచ్ఛతి।
అపూజితం తు యద్భుక్తముభయం నాశయేదిదమ్॥

ఆత్మపూజతో అనగా దైవధ్యానముతో భుజించెడు అన్నము బలమును, పవిత్రతను యిచ్చును. అట్లు దైవధ్యానముతో భుజింపని అన్నము శరీరబలమును, ఆత్మశుద్ధిని నశింపజేయును.

63. ప్ర:— నవగ్రహములు మంచిరాశిలో నుండుసమయమున జన్మించువారు పుణ్యాత్ములనియు, గ్రహములు నీచస్థానములలోనుండు నపుడు జన్మించువారు పాపాత్ములనియు జ్యోతిశ్శాస్త్రరీతిగ తెలియ వచ్చుచున్నది. కావున జీవుల పుణ్యపాపములకు కారణము జన్మాంతర కర్మయని యెట్లుచెప్పవచ్చును? జీవులయం దేదోషము గలదు? ఆదోష ములన్నియు నవగ్రహములవే.

ఉ:—ఈవిషయము జ్యోతిశ్శాస్త్రమందేగలదు. జన్మాంతరపుణ్యపాప కర్మననుసరించి ఏయేగ్రహములు ఏయే రాశిలోనుండిన, జీవులయొక్క కర్మానుగుణ్యమగు ఫలముగలుగునో, ఆయా గ్రహములు ఆయా రాశిలోనికి వచ్చినపుడు వారు జన్మింతురు. కావున ఆదోషములుగాని, పుణ్యములుగాని జీవుల జన్మాంతరసంస్కారమునకు సంబంధించినవేకాని గ్రహములవి కావు. ఏలన ఎవరెవరేయేకర్మ యొనర్చెదరో, వారే దాని ఫలమనుభవింపవలెనను ఈశ్వర నియతి గలదు. అట్లుకాక గ్రహములు చేయు అపరాధముండిన, ఆదోషము గ్రహములచే యనుభవింపబడవలసి నదికాని, నిర్దోషులైన జన్మమెత్తెడు జీవులపై యుండరాదు. ఇది సత్యము. తక్కినది సత్యదూరము. ఈశ్వరనియమమునకు విరుద్ధము. కావున, గ్రహములు నిమిత్తమాత్రములు. గ్రహములందు దోషమేమియు లేదు.

64. ప్ర:— ఆయుర్వేదములో శిశువులకు గలుగు కొన్ని వ్యాధులు తల్లితండ్రుల శరీరములనుండి వ్యాపించివచ్చినవనియు, శిశువులకేగాక, పెద్దవారైనతరువాతకూడ మాతృగర్భమునుండివచ్చిన రోగములు గలుగుననియు చెప్పుచున్నారే; అపుడేపాపమునెఱుంగని చిన్నపాపలు తమరోగములకు తగిన పాపమేమి చేసిరి?

ఉ:—దీనియొక్క రహస్యముకూడ పైవ్రాసినవలెనే యుంటున్నది. ఏలన, బాలురు ఈ జన్మలో పాపము చేయకపోయినను, జన్మాంతర కర్మానుసారముగ యేగర్భవాసమున బుట్టిన పుణ్యముగాని, పాపము గాని యనుభవింపవలసియుండునో, అట్టి మాతాపితరులకు పుట్టుదురు. కావున జన్మాంతరపాపకర్మగలవారే అట్టి రోగులగు తల్లిదండ్రులకు జనింతురు. కావున ఆదోషము జీవియొక్క పూర్వజన్మకర్మదోషమే గాని, దానియందు మాతాపితరులు నిమిత్తమాత్రులే యగుదురు.

65. ప్ర:— ప్రయోజనములేని పని చీమకూడ చేయదని శాస్త్రములు చెప్పుచుండగా, బ్రహ్మవేత్తయైన మహనీయుడు కర్మచేసినను, చేయకపోయినను దానియందుకూడ యేదైన యొక ఉపదేశము లోకమునకుండవలెను. కావున బ్రహ్మవేత్తలై కర్మలచేయువారు, చేయనివారు యనునీ యుభయులున్న లోకమున కేమి యుపదేశించుచున్నారు?

ఉ:— సృష్టిలో యేర్పడిన ఒక్క తృణముకూడ వ్యర్థము కాదు. దానివలన గల్గు ఉపయోగము మనకిపుడు తెలియకపోయినను, తెలిసికొనెడు కాలమొకటి లోకమునకు వచ్చును. ఏలన సామాన్యముగ శ్రేష్ఠుడును, జ్ఞానియునగు మనుజుడే వ్యర్థకార్యముచేయనప్పుడు సర్వేశ్వరుడున్ను, సర్వజ్ఞుడున్ను, సర్వవిధముగ శుద్ధుడునగు పరమేశ్వరుని సృష్టిలో ఒక్కపరమాణువైనను నిరుపయోగమై యుండదు. అట్లుండగా బ్రహ్మవేత్తయు, జీవితముయొక్క అంత్యదశకు వచ్చినవాడునగు ముక్తునియొక్క తూష్ణీయవస్థయు ఒక గొప్పరహస్యమును లోకమునకుపదేశించుచునేయుండును. కాని మనుష్యులయొక్క పక్వాపక్వస్థితుల ననుసరించి అది ఉపయోగముగాగాని, నిరుపయోగముగాగాని గోచరించుచుండును. మఱియు జీవకోట్ల పక్వాపక్వతల ననుసరించియే ఆవశ్యకతయు, అనావశ్యకతయు గలుగుచుండును. ఎట్లన ఒకడు బాల్యావస్థలోనుండునపుడు గృహస్థసంబంధమైన దాంపత్యవిషయమతని కేమాత్రమున్ను రుచింపదు. యౌవనము వచ్చునప్పుడు అట్టి గృహస్థాశ్రమసంబంధ దంపతీధర్మమున్ను, క్రియయున్ను ముఖ్యమని తోచుచుండును. ఆలాగున గృహస్థాశ్రమములోనుండునపుడు సంన్యాసులకు సంబంధించిన ఉపనిషత్తులుగాని, కాషాయ కమండులువులుగాని నిరుపయోగములని తోచును. కాని విరక్తిగల్గి ఆత్మచింతనలో మనస్సు ప్రవేశించునపుడు పైన జెప్పినవన్నియు యెంతో ఉపయుక్తములని తోచును. ఆలాగున అనేకవిషయములలో బహుకాలము తిరుగుచుండెడి మనస్సు కొంచమైనను ఉపరతిస్థితి పొందకయు, ఆత్మశాంతిగలుగకయు నుండువారికి కర్మములోనుండి ఉపరతిని పొందియుండు మహాత్ములు గొప్పయుపదేశము చేయుచుందురు. కాని మనస్సు

పరిపక్వత చెందనివారు అట్లు చేయకూడదని నిస్సంగస్థితిలోనుండి నిష్కామకర్మయోగమునసుష్ఠించు బ్రహ్మనిష్ఠుండుపదేశించును. మఱియు లోకములోగల ముముక్షువులకు కావలసిన యుపకారము జరుగవలసి యుండుటచే, ఆత్మోపరతిని పొందియుండు జీవన్ముక్తులు నిస్సంగులై లోకహితకార్యము చేయుచుందురు. వీరున్ను గొప్ప యుపదేశమునే ప్రపంచమునకు చేయుచున్నారు. ఇవన్నియు ఈశ్వరసంకల్పము లోనే యుంటున్నవి. అవి ఆలాగుననే జరుగును. వానిని యెవరున్ను మార్చుకొన శక్తులుకారు. ప్రత్యక్షముగ చూచుము. ఒకొక్క కాలమున ఒకొక్కదేశములో ఒకొక్క మతములోనే కొందఱు బ్రహ్మనిష్ఠులుండిన, ఒకరివలె మఱియొకరుండుటలేదు. వారిలోగూడ యేదైన యనుష్ఠానములోగాని, కర్మములోగాని, యుపదేశములో గాని కొంచెముకొంచెము భేదము కనుపించుచునే యుండును. కాని వారికందఱికిని ఆత్మసుఖ మొకేవిధముగనే యుంటున్నది. జనుల యాదరించుటయు సమానముగానే యుండును. కొందఱు ఒకరిని ప్రేమింతురు. తక్కినవారిలో కొంతలోపము చూపెదరు. అప్పుడు వీరు భక్తులు, వీరియందు భక్తిలేదు _ ఈలాగున జనులు చెప్పుదురు. 'వీరి మార్గము సత్యము, వీరిది సత్యముకా'దనియు చెప్పుదురు. ఒకరిపై విశ్వాసము అధికముగా కలుగును. మఱియొకరిపై సామాన్యముగానుండును. ఇది ప్రకృతియొక్క స్వభావము. ఏలన, నామరూపక్రియలనే జనులు చూడ గలరు. అవి ప్రకృతితో గూడినవి. వీటియందెల్లపుడును మార్పు గలుచునేయుండును. ఈ ప్రకృతికావలయుండు ఆత్మలో యేభేదమున్ను లేదు. జీవన్ముక్తులు దానియందుందురు. అది భేదరహితము. నిరతిశయానందము. నిత్యము. శివము. అమృతము. జీవన్ముక్తుల క్రియలన్నియు సత్వగుణముతో గూడినవైనను, అవిన్ని ప్రకృతియొక్క శుద్ధభాగమగుటచే భిన్నభిన్నముగానేయుండును. గుణాతీతమగు తురీయ పదములో కర్మలన్నియు క్షయించుటచే, అది నిష్క్రియము పరమ బోధైకనిలయము.

కర్మ విభాగము సంపూర్ణము.

ఓం తత్ సత్.



ఓమ్.

# 2. వర్ణవిభాగము.

1. ప్రశ్న:—గురువరా ! ముముక్షువైనవాడు ఏయుపాయముచే త్వరలో మోక్షమును పొందగల్గును ?

ఉత్తరము:—నిర్మలాత్ముడవగు ఓ ఆత్మసోదరా ! ముముక్షుత్వము గలుగుటకు కారణమేదియో దానిని ముందుగ తెలిసికొనవలెను. ఏలన ముముక్షుత్వముగలిగిన ఏప్రకారమైనను అతడు ముక్తిని పొందగల్గును.

2. ప్ర:—అట్టైన ముముక్షుత్వము ఏరీతిగ సిద్ధించును ?

ఉ:—నాయనా ! ప్రస్తుతము ఈ ప్రశ్నయే కావలసియుండును. ఏలన, జనులకు ముక్తిని పొందవలెనను విచారము కలుగుటయే ముముక్షుత్వమునకు సరియైన అర్థము. మోక్షము పొందవలెననిన, దృశ్యవిషయములో దోషబుద్ధి గలుగవలెను. దృశ్యవిషయములో దోషబుద్ధి గలుగవలసియుండిన అంతఃకరణశుద్ధి జనించవలెను. అంతఃకరణశుద్ధి అనినను, మనశ్శుద్ధి అనినను, హృదయశుద్ధి అనినను ఒకటే అర్థము. ఇది ఈశ్వరార్పణబుద్ధితోచేయు నిష్కామ పుణ్యకర్మ వలననే కలుగును.

3. ప్ర:—నిష్కామ పుణ్యకర్మ యేల జనులు చేయలేరు ?

ఉ:—ఇదిన్ని ముఖ్యముగా తెలిసికొనఁదగిన విషయమే. కలిదోషముచే కల్మషమైన మనస్సుగలవారికి నిష్కామబుద్ధికూడ కలుగదు. దీనికిని కొంతభాగ్యము కలుగవలసియుండును. కావున సంసారవిషయవాసనలచే బద్ధులైనవారికి సకామపుణ్యకర్మలను ఉపదేశింపవలెను. అప్పుడు యేలాగున వాణిజ్యవృత్తిగలవారు లాభమధికముగ గలుగు పనిని చేయుదురో, దానియందు యేలాగున వారు ప్రీతిగల్గియుందురో, అలాగున సత్కర్మలచే పుత్రపౌత్రధనధాన్యగృహారామాదు

లున్ను, పశువులున్ను, ఆరోగ్యమున్ను, దీర్ఘాయుస్సున్ను, పురుషుడైన మంచి భార్యయున్ను, స్త్రీయైన యోగ్యుడును సుందరుడును ధనవంతుడునునగు భర్తయు లభించుననియే యుపదేశింపవలసియుండును. మఱల స్వర్గలోకములో గొప్పసౌఖ్యముకూడ గల్గును. అదిన్నిగాక యిహములో గొప్పయశస్సున్ను సిద్ధించును, అనియే చెప్పవలెను.

4. ప్ర:— మహాత్మా! నిష్కామకర్మయోగముచే ముక్తియున్ను, సకామకర్మచే బంధమున్ను గలుగునని గీతాదిశాస్త్రములుద్ఘోషించుచుండగా, తామేలాగున యిట్లు సకామకర్మనుపదేశింపవలెనని చెప్పుచున్నారు?

ఉ:— శ్రీభగవద్గీత ముముక్షుత్వస్థితిలోనికి వచ్చిన జీవులను గుఱించియే ముఖ్యముగా చెప్పుచున్నది. ఏలన అర్జునుడు పాపికాడు. ఎంతో పుణ్యముచేసినవారికే వానియంతటి జన్మముకలుగును. ఏలననాతడు క్షత్రియవంశములో జన్మించినాడు. అంతేగాక వానికి గొప్పరాజ్యముగలిగియున్నది. మహాసౌందర్యపురుషుడు. ధనుర్విద్యయందు అపారమహిమకలవాడు. బహుకాలము సకామబుద్ధితో తపస్సుచేసి ఈశ్వరునివలన వరముపొందినవాడు. మఱియు శ్రీ కృష్ణపరమాత్మకు మిక్కిలిప్రియుడు. ఇవి అన్నియు సామాన్యజనులకు కలుగునా? కావున ఇవి సకామపుణ్యకర్మల విశేషముచేతనే సిద్ధించినవి.

5. ప్ర:— అయితే సకామపుణ్యకర్మను ఉపదేశించిన దానియొక్కఫలము ననుభవించుటకు స్వర్గలోకప్రాప్తియున్ను, ఆకర్మయొక్క వాసనాబలముచే మఱల జన్మమున్ను పరంపరగావచ్చుచుండిన, ఈ జీవునకిక యెప్పుడు జన్మరహితమైన సౌఖ్యము కలుగును? మఱియు ఘటీయంత్రమువలె యిహలోకమునుండి పరలోకమునకును, మఱల కర్మఫలము నశించినప్పుడు స్వర్గలోకమునుండి భూలోకమునకున్ను యెల్లప్పుడు సంసారచక్రములో తిరుగనలసియుండునుగదా! అంతేగాక స్వర్గములో పుణ్యము నశించినప్పుడు అచ్చోటునుండి పతనము గల్గుననుభీతియును, మనుష్యజన్మవచ్చినపిమ్మట మరణభయమున్ను గలుగుచుండునుగదా! అదియునుగాక గర్భావాస మహాకుంభీపాకనరకమున్ను, జన్మించినపిమ్మట షడ్భావవికారములచేతను, షడూ

ర్మ్మలవలనను, (ఉండుట, పుట్టుట, వర్ధిల్లుట, పరిణమించుట, క్షయిం చుట, నశించుట యనునీయాఱును షడ్వికారములనంబడును. ఆకలి దప్పికలు, శోకమోహములు, జరామరణములు షడూర్మ్మలనంబడును) రోగములవలనను, మానావమానములవలనను, లాభనష్టములవల నను ఈజీవికి యెల్లప్పుడున్ను దుఃఖమే గల్గునుగాని సుఖమేమియు కాను పించుటలేదు. ఇట్టి దుఃఖకారణమును జనులకేల యుపదేశించవలెను?

ఉః—ఓ బుద్ధిమంతుడా! మంచిప్రశ్న చేసినావు. దీనియందు చాల రహస్యముగలదు. నీవు ముముక్షుత్వస్థితిలోనికిమాత్రమే వచ్చి నందున దీనియొక్కరహస్యమును తెలియకయున్నావు. ముక్తస్థితిలో నికి వచ్చినప్పుడు దీనియందుగల సూక్ష్మములన్నియు గోచరము కాగ లవు. ఏలన నాల్గుప్రక్కల నాల్గుద్వారములుగల యొకగృహములో నుండువానికి ఒక్కద్వారముమాత్రము తెఱచిన, ఆయొక్క వీధి మాత్రమే కనుపించును. ముముక్షుత్వమందు మోక్షము పొందవలె ననెడు యొక్క మార్గముమాత్రమే హృదయములో సదా ప్రవర్తించు చుండును. అట్టితఱి అతని కెచ్చటచూచినను అదే గోచరించును. దానికిగలమార్గమే నిరంతరము వెదకుచుండును. అది కొంత తీవ్రావస్థ జెందిన మదపుటేనుగునకు కన్ను తెలియనట్లు, వీనిదృష్టియందు అది తప్ప తక్కినదేదియును గోచరముకాదు. మోక్షదశలో నాల్గు మార్గ ములున్ను తెఱువబడును. అప్పుడు ఆ గృహమధ్యమందుండువానికి నాల్గువీథులున్ను గోచరించును. ఇదియే దీనిలోగల రహస్యము. కనుకనే శాస్త్రములలో ముముక్షువునకు స్వాతంత్ర్యము పూర్తిగా యివ్వకపోవుటకును, ముక్తునకు సర్వస్వాతంత్ర్యమిచ్చుటకును కారణ మైనది. కనుకనే ముముక్షువైనవాడు స్వయముగా వేదాంతశాస్త్ర మును విచారణ చేయకూడదనియు, జీవన్ముక్తుడును, శాస్త్రసారమెఱిం గినవాడును, మంచి అనుష్ఠానము గలవాడును, దయావంతుడునునగు గురువువద్దనుండి ఉపనిషత్సారమగు వేదాంతశాస్త్రమును విచారించ వలెననియు విధించుటకు కారణమైనది.

6. ప్రః— అయ్యా! అట్లైన యీ జీవునిగతి యింతేనా? ఎల్లప్పుడున్ను పుట్టుట, గిట్టుట యను కాలచక్రమున యంత్రమువలె

క్రిందకును, పైకిని వచ్చుచు, పోవుచు, విశ్రాన్తి పొందకయుండ వలసినదే కదా !

ఉ:—తీవ్రముముక్షుత్వముగల ఆత్మమిత్రుడా ! దీనిలో దాగి యుండు రహస్యము తెలిపెద. సావధానచిత్తుడవై వినుము. సకామ కర్మమైనను, అది పుణ్యకర్మయగునేని, దానివల్లగూడ కొంత దైవ కృపయు, కొంత మనోనిర్మలతయు గలుగుచుండును. ఇది ప్రకృతి యొక్క స్వభావము. అతడు సత్కర్మను శ్రద్ధతో చేయునదేగాక మనస్సులో భగవంతునియొక్క ధ్యానమైనను, స్మరణమైనను తప్పక చేయుచుండును. దృష్టాంతము చూడుము. ఉత్తానపాదుడను రాజు యొక్క కుమారుడైన ధ్రువుడు రాజ్యప్రాప్తినిమిత్తము భగవంతుని గూర్చి తపస్సుచేసినను, ఆ తపోమహిమవలన అంతఃకరణములోగల ప్రకృతియొక్క దోషము తొలగినందుచే మోక్షప్రాప్తి కలుగుటకు కారణమయ్యెను. దీనికి శాస్త్రములో 'గుడాంగుళీ' న్యాయమను విధి యొకటిగలదు. అనగా, చిన్నపిల్లవానికేదైన వ్యాధిగలిగియున్నచో, 'ఔషధసేవచేయుము, రోగము శమించు'నని చెప్పిన, ఆ బాలుడు మందు తినడు. కావున బెల్లములోపల మందునుంచి తినుమని చెప్పిన సంతోషముగా తినును. దానివలన యావ్యాధి నివారించును. ఆలాగున సత్కర్మ సకామమైనను దానివలన కొంత దైవకరుణయు, కొంత మనశ్శుద్ధియుకూడ గలుగును. కనుకనే చతుర్విధమగు భక్తి గీతలో యుపదేశించుటకు కారణమైనది. దానియందు 1. ఆర్తుడు 2. జిజ్ఞాసువు 3. అర్థార్థి 4. జ్ఞాని, యను నీ నలుగురున్ను ఉదారచరితులనియు, వారిలో జ్ఞానియొక్కడుమాత్రము శ్రేష్ఠుడనియు, తక్కినవారు సామాన్యులైనను పుణ్యాత్ములనియు భగవంతుడే తెలిపియున్నాడు. ఈ విషయమై మఱియొక చరిత్రకూడ చెప్పెద. మాఘపురాణమున అంకిలుడను పేరుగల యొక బోయవాడు మహాశివరాత్రిదినమున అరణ్యమునకు వేటకొఱకు వెళ్ళి, ఆదినము ఒక జంతువైనను దొఱకనందున, రాత్రి యొకజలాశయమువద్దకు మృగములు రావచ్చును గాన, అప్పుడు దొఱకునని తలంచి, యొక బిల్వవృక్షముపై నెక్కి కూర్చుండి, రాత్రి విల్లు యెక్కుపెట్టి మృగములఁ జూచుచుండగా,

ఆ వృక్షపు యాకులు నేత్రమునకడ్డుగానున్నందున ఒక్కొక్కపత్రము తీసి క్రిందకు వేయుచుండ, అపుడు దానిక్రింద యొక శివలింగముండి నందుచే, ఆ మారేడాకులన్నియు ఆ యీశ్వరలింగముపై బడుచుండెను. అది మంచుకాలమగుటవలన ఆ పత్రములపై మంచునీరుకూడ యుండి యుండెను. ఆదినము పగలంతయు ఉపవాసముండుటచేతను, రాత్రి జాగరణ చేసినందుచేతను, మంచుతోకూడిన బిల్వపత్రములు పరమేశ్వరుని లింగముపై పడుటచేతను, ఆదినము మహాశివరాత్రి యగుట చేతను ఆ కిరాతునకు శివలోకప్రాప్తి కలిగినట్లు శాస్త్రములో చెప్పబడినది. కావున ధనవంతుడై యుండునప్పుడు ఏదైన దైవకార్యము గాని, సాధుసజ్జనులకు దానధర్మములు చేయుటగాని యొనర్చిన, పుణ్యము వృద్ధికాగలదు. దానిపై హృదయశుద్ధి బాగుగ కలుగుటకు నిష్కామకర్మయోగము నుపదేశించవచ్చును. వేదముయొక్క నిజతత్వము జనులను బ్రహ్మజ్ఞాన సంపన్నులనుగా చేయుటయైనను, మొదటినుండి అయ్యది సకామకర్మనే యుపదేశించెను. సంతాన ప్రాప్తికై యిచ్ఛగలవారు పుత్రకామేష్టియాగమున్ను, స్వర్గప్రాప్తి కోరువారు అగ్నిష్టోమాది యాగములున్ను చేయవలెననిబోధించుటకు కారణమిదియే. గీతాశాస్త్రములో చెప్పబడిన ఆర్తుడు మున్నగువారి నల్గురిలో మొదట ముగ్గురును సకామకర్ములే. నాల్గవదగు భక్తి యొక్కటిమాత్రమే నిష్కామముతో గూడినది. కావున త్రివిధకామ్య భక్తి యాచరించుచువచ్చుటచే శ్రేష్ఠమగు ముముక్షుత్వము కలుగును. కావుననే నాల్గవభక్తి జ్ఞానిది యని బోధించుటకు కారణమైనది. మూడువిధములగు భక్తిమార్గములవలంబించి వచ్చునపుడు శుభేచ్ఛ యుదయమగును.

7. ప్ర:—సాధుమూర్తీ! ఇదివఱలో తాము చెప్పినప్పుడు జ్ఞానికిమాత్రమే పూర్ణప్రబోధము కలుగుననియు, ముముక్షువునకు ఒక్క మోక్షాపేక్షమాత్రమే యుండుననియు తెలిపితిరే?

ఉ:—శుద్ధబుద్ధిగల సోదరా! అది ఆలాగుననే యుండును. ఏలన సామాన్యమనుజులకు, జంతువులన్నిటికిని నవద్వారములే గలవు. ఇవి శరీరసంరక్షణార్థమకుమాత్రమే యుపయోగపడును. అంతేగాక

యివి పంచభూతాత్మకమైనవి. కావున పంచభూతతత్త్వములను మాత్రమే ప్రకాశింపఁజేయును. అందువలన యివి ప్రకృతితోఁ గూడి నవి. ఇవి అప్రాకృతమగు ఆత్మను, లేక యీశ్వరుని, లేక పరబ్రహ్మ మును కనుగొనుశక్తి కలిగియుండవు. కనుకనే ఉపనిషత్తులలో మను జులకు పదునొకండుద్వారములు చెప్పుటకు కారణమైనది.

8. ప్ర:— పదునొకండుద్వారములు దేహములో యెచ్చట నున్నవి? కాన్పించుటలేదే ?

ఉ:— నేత్రేంద్రియాదులకు కనుపడునవిమాత్రమే సత్యమనియు, నేత్రాదీంద్రియములకు గోచరముకానివి అసత్యమనియు చెప్పరాదు. ఇదే దైవవిషయమై ప్రమాదముగల్గుటకు కారణము. కఠవల్ల్యాది శ్రుతులందు బ్రహ్మరంధ్రమనియు, కుండలీయుద్బోధమనియు రెండు ద్వారములు గలవనియు, అవి మాయచే మాయబడియుండుననియు, అజ్ఞానము నశించినవారికి ఆద్వారములు తెలియబడుననియు, అప్పుడు మాత్రమే అప్రాకృతమగు దైవదృష్టి వికసించుననియు చెప్పబడి యున్నది. ఇది ప్రకృతికి పరమగుటచే బుద్ధిపర్యంతముగల ప్రకృతిని దాటినవారికిమాత్రమే బోధమగును. కనుకనే యీశ్వరనిలయము 'తమసః పరస్తాత్' అని యుపదేశించుటకు కారణము. ఈ స్థితిలో ప్రవే శించువారికి దివ్యదృష్టి కలుగును. అప్పుడే అమానుషప్రజ్ఞయు, అప్రా కృతబోధమున్ను, నిరావరణ దివ్యజ్ఞానమున్ను జీవునకు కలుగును. అపుడతని హృదయమునుండి అనర్గళమగు గొప్పప్రవాహమువలె దైవ జ్ఞానము లోకమున ప్రవహించుచుండును. ఇది 'ప్రజ్ఞానం బ్రహ్మ' యని బోధించెడు మహావాక్య దివ్యమంత్రముయొక్క ధ్యానము చేతను, విచారణచేతను, యేకాంతమున సంయమియై చిరకాలము చింతనచేయుటచేతమాత్రము కలుగును. తక్కిన నివృత్తిమార్గము లన్నియు ఆస్థానములోనికే ఆత్మను (జీవులను) తీసికొనివెళ్లుచుండును. సముద్రపురేవులో నెలకొల్పబడియుండు 'లైట్‌హౌస్'ను లక్ష్యముంచి రాత్రులలో సముద్రమున నానాదేశములనుండి ప్రయాణముచేయుచు వచ్చినయోడలన్నియు, అద్దాని ప్రకాశమున దృష్టినుంచి రేవులోనికి చేరునట్లు, ఏమతస్థుడైనను, ఏమార్గము నవలంబించినవాడైనను ఈ

దివ్యజ్ఞానమున లక్ష్యముంచియే ప్రయాణముచేయుచుండును. శ్రీ బుద్ధదేవుడు మొదలగువారు చెప్పిన నిర్వాణమునకును యిదే అర్థము. గీతలో శ్రీ కృష్ణభగవానులుకూడ విశ్వరూపదర్శనకాలమున దీనినే అర్జునున కుపదేశించిరి. అపుడే వానికి జ్ఞానదృష్టి వికసించినది. దానివలననే శ్రీకృష్ణునియొక్క దివ్యదర్శనముగలిగెను. ఇది సద్దృష్టి. దేహామువెడగలది అసద్దృష్టి అని గ్రహించవలయును. సత్తును దర్శింపచేయునదగుటచే సద్దృష్టియనియు, అసత్తగు జడమును తెలియజేయునదగుటచే అసద్దృష్టియనియు పేరు కలిగినది.

9. ప్ర:—సద్దృష్టియనియు, అసద్దృష్టియనియు యేల పేరుగల్గినది ?

ఉ:— అది యిదివరలో చెప్పినదానినిబట్టియే యెఱుంగదగును. సత్యమై, సనాతనమై, అనాదియై, శాశ్వతమైయుండు నిత్యసుఖమును, సత్యస్వరూపమగు దైవమును చూపుటవలన సద్దృష్టియనియు, అసత్యమై, జడమై, అశాశ్వతమై దుఃఖవిమోచనమును కలుగజేయునట్టి జడమగు ప్రపంచాదులను దర్శింపజేయునదగుటవలన అసద్దృష్టి యనియు పేరువచ్చినది. మఱియు సత్యమగు తనయొక్క బ్రహ్మత్వమును తెలుపునదగుటచే సద్దృష్టియనియు, అట్టి సత్యమును మఱుగుపఱచి, అవిద్యాదిక్లేశములతోకూడిన జీవుడని తెలియజేయునదగుటచే అసద్దృష్టియనియు చెప్పడమైనది. అసద్దృష్టితో కానుపించునదంతయు దృశ్యమే; సద్దృష్టిచే గన్పించునది ద్రష్టయే. దృశ్యము నశించునది; ద్రష్ట నాశములేనిది. ఈ రహస్యము తెలియకపోవుటచేతనే 'ఈశ్వరుడుండినచో ఏల కనుపించుటలేదు? ఉండినది నిజమైనచో కనుపడకపోవునా' యని కొందఱడుగుటకు కారణము. ఈశ్వరుడు శాశ్వతస్వరూపుడగుటచే యీదృశ్యమువలె కనుపించినచో నాశము పొందవలసియుండును.కావుననే యీ బాహ్యదృష్టికి ఆ దివ్యపురుషుడు కనుపడకపోవుటకు కారణము.

10. ప్ర:—ఆచార్యా ! మీరు చెప్పినదానిలో నొక గొప్ప సందేహాము కలిగెను. అది తామే నివృత్తిచేయవలెను. ఏమన ఈశ్వరుని దివ్యపురుషుడని మీరు భక్తితో చెప్పితిరి. ఈశ్వరునకుకూడ మనుష్యులకు గలిగియున్నట్లు నామ, రూప, లింగభేదములు గలవా ?

ఉ:—సూక్ష్మగ్రాహివగునో బుద్ధిమంతుడా ! చాలశ్రేష్ఠమైన

ప్రశ్న నడిగితివి. ప్రకృతిని ప్రేరేపించువాడగుటచే పురుషుడను పేరు వచ్చినదేకాని, యథార్థముగ ఈశ్వరునకు నామ, రూప, స్త్రీలింగ, పుంలింగ, నపుంసకలింగ భేదములులేవు. అతడు సత్యము, జ్ఞానము, ఆనందము. ఎట్లన, కొందఱు వేదమునకు మూలమగు గాయత్రీ మంత్రముయొక్క అధిదేవతయగు పరబ్రహ్మమును వేదమాతయనియు, కొందఱు వేదాధిష్ఠానదైవమును వేదపురుషుడనియు యెట్లు చెప్పుచున్నారో, ఈ వాక్యములున్ను అటువంటివే. ఉపాధి గలదానికి మాత్రమే నామరూపలింగాది భేదములుండును. చైతన్యమున కవి లేవు. పాత్రమునననుసరించి శంఖతీర్థమనియు, కమండలుతీర్థమనియు యెట్లు వ్యవహారముగలదో, ఆలాగున ఆత్మచైతన్యము స్త్రీలలోను, పురుషుల లోను, దేవతలలోను, తిర్యక్కులలోను ఒక్కటియే; మార్పులేదు. అష్టపురీకములో నుండువాడగుట చేతనే పురుషుడని పేరు వచ్చినది. అష్ట పురీకములు స్త్రీలందుకూడ గలవు.

11. ప్ర:—అష్టపురీక మననేమి ?

ఉ:—దీనిని వివేక చూడామణిలో శ్రీశంకరులుపదేశించియున్నారు.

> వాగాది పఞ్చ శ్రవణాది పఞ్చ
> ప్రాణాది పఞ్చాభ్రముఖాని పఞ్చ ।
> బుద్ధ్యాద్యవిద్యాఽపి చ కామకర్మణీ
> పుర్యష్టకం సూక్ష్మశరీరమాహుః ॥

తా॥ (1) వాక్పాణిపాదపాయూపస్థలను కర్మేంద్రియపంచకము, (2) త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణములను జ్ఞానేంద్రియపంచకము, (3) ప్రాణాపానవ్యానోదానసమానములను వాయుపంచకము, (4) పృథివ్యప్తేజోవాయ్వాకాశములను భూతపంచకము, (5) మనోబుద్ధిచిత్తాహంకారములను అంతఃకరణచతుష్టయము, (6) అజ్ఞానము, (7) కామము, (8) కర్మము, అను నీ పుర్యష్టకమును సూక్ష్మశరీరమని చెప్పుదురు.

12. ప్ర:—ఇప్పుడు తామానతిచ్చినదానిలో గొప్ప సందేహ మొకటి కలిగినది. అదేమన పురుషులలోను, స్త్రీలలోను, దేవతల లోను, దయ్యములలోను ఒక్కే ఈశ్వరుడు గలడని తెలిపిరి. అట్లైన,

అందఱికిని ఒకే గుణము గలిగియుండవలసియుండునుగదా ? మీరు చెప్పిన దృష్టాంతమున శంఖకమండలువులును, పాత్రలును వేఱ్ఱేఱుగా నున్నను, జలమన్నిటిలోను యొకటియే గదా?

ఉ:—ఇదే మొట్ట మొదట చెప్పిన రహస్యము. మీకు ముముక్షుత్వము కలిగినదేగాని బ్రహ్మవేత్తలనాశ్రయించి వేదాంత విచారణ చేయకపోతిరి. అందువలననే యీలాటి చిన్న చిన్న విషయములలోకూడ సందేహము కలుగుటకు కారణమైనది. శ్రద్ధతో వినుము. ఆకాశమునుండి వర్షరూపముగా పడుచుండు మేఘజలము అంతట నానావిధముగ నున్నను, భూమియొక్క ధాతువుల భేదము ననుసరించి శ్వేతపీతాది అనేకవర్ణములుగాను, మాధుర్యాది అనేక రుచులుగాను మారుచుండును. ఇది జలభేదమా, లేక ఉపాధిభేదమా? ఆలాగున ఈశ్వరుడు అనేక యుపాధులలో నేకరూపుడుగానున్నను, ఉపాధి ననుసరించి అనేకగుణములతోగూడినట్లు కానుపించును.

13. ప్ర:—ఉపాధియనగానేమి?

ఉ:—మీకు పూర్వపుణ్యమహిమచే జిజ్ఞాస కలిగెనేగాని చక్కని గురుబోధయు, వేదాంతశ్రవణమున్ను లేనందుచే 'ఉపాధి' మొదలగు వేదాంతమందలి చిన్న చిన్న పదముల అర్థముగూడ తెలియక పోయినది. ఆలాటి వాక్యములన్నియు గ్రామ్యభాషలో చెప్పుటకు సాధ్యముకాదు. కొన్నిటికి గ్రామ్యభాషయే లేదు. కాని మీయొక్క పుణ్యవిశేషమహిమచేతను, దైవకరుణచేతను ఇప్పుడు వేదాంతవిచారణచేసి, నిస్సందేహస్థితి గలుగచేసికొనవలెనను యిచ్ఛ మీకు జనించినందుచే, మీరు ధన్యులే. ఉపాధి యనగా జన్మాంతరసంస్కారముచే నేర్పడిన యీ కానుపించు దేహమున్ను, అంతఃకరణమున్ను, వాటి సత్వరజస్తమోగుణములున్ను యగును. కావున భేదములన్నియు అంతఃకరణ సంస్కారమువలన యేర్పడినవేగాని, సాక్షిగనుండు ఆత్మదేవునియందవి లేవు. పాత్రలన్నియు నానావిధముగనుండిన, వానిలోగల జలమున్ను యేకరీతిగనుండును. ఆలాగుల తపోధ్యానాదులచే అంతఃకరణము శుద్ధమగునపుడు నిర్మలజ్ఞానము అందఱిలోను ఒకే విధముగనుండును.

14. ప్ర:—ఇప్పుడు మీరు బోధించినదానిలో నొక సంశయ

మావిర్భవించినది. ఏలన, వేదాంతవిచారణయే యెక్కువనియు, దానివల్లనే సందేహములన్నియు నివృత్తియగుననియు తెలియవచ్చుచున్నది.

ఉ:—విశుద్ధాంతఃకరణముగల నో వివేకవంతుడా ! వేదాంతవిచారణమునకన్న అధికమైనది మఱొకటిలేదు. ఇది సర్వశాస్త్రముల యొక్కయు, పరమఋషులయొక్కయు నిశ్చయమగు సిద్ధాంతము. ఏలన ప్రకాశముచే తప్ప మఱియే యుపాయముచేతను చీకటి యెట్లు నశింపదో, చీకటి నశింపనిచో వస్తువులెట్లు కానుపించవో, ఆలాగున వేదాన్తశాస్త్రవిచారణవలననే అజ్ఞానము విలయమగును. అప్పుడే నిజమగు బ్రహ్మవస్తువుయొక్క లాభము కలుగును.

15. ప్ర:— శాస్త్రములు తపస్సువల్లనే కల్మషము నశించునని (పాపము క్షయించునని) చెప్పుచుండగా, మీరేల వేదాంతవిచారమునకే యింత ఆధిక్యత నిచ్చుచున్నారు ?

ఉ:— వేదాంతమునకాధిక్యత నేనిచ్చినది కాదు. వ్యాసాది పరమర్షులున్ను, శంకరాచార్యాది పరమగురువులున్ను వేదాంతవిచారమునకే యాధిక్యత నిచ్చియున్నారు. వారినిమాత్రమే చెప్పనేల, వేదములుకూడ వేదాంతమునకే యగ్రస్థానమును కల్పించియున్నవి.

16. ప్ర:—అట్లయిన, తపస్సు మొదలైనవి వ్యర్థములేనా ?

ఉ:—వ్యర్థముకాదు. మీ ప్రశ్నలోనే దానియొక్క తత్వము నిగూఢముగా యిమిడియున్నది. అదేమన తపస్సువల్ల కల్మషము నశించుననికదా తాత్పర్యము. అదినిజము. కల్మషమనియు, పాపమనియు, కర్మయనియు, దోషమనియు నొకే అర్థమునకు పేర్లు. కల్మషము నశింపకయే ఈశ్వరసాక్షాత్కారరూపమగు జ్ఞానము గలుగునని యెచటగలదు ?

17. ప్ర:— తపస్సువలననేగదా యనేకులు పొందుటకు శక్యముగాని యనేక సిద్ధులను బొందియున్నారు ? అంతేగాక తపస్సువలన సాధింపరాని కార్యము మూడులోకములలో మఱియొకటి లేదని శాస్త్రము చెప్పుచుండుటయేగాక, అనేక ఋషులు దానినవలంబించి నందుచేతనేగదా వారికి తాపసులని పేరువచ్చినది ? మఱియు, అనేక

రాజర్షులుకూడ తపస్సుచే ఈశ్వరుని ప్రత్యక్షము చేసికొని అనేక అమోఘములగు వరములను పొందియున్నారుగదా!

ఉ:—అయ్యా! మీరు చెప్పినవాక్యములో యొక రహస్యము గలదు. దానిని మీరు చూచుటలేదు. ఋషులందఱు కార్యసిద్ధి కొఱకు తపస్సుచేసిరి. అమోఘములగు సిద్ధులను పొందిరి. ఆలాగున రాజర్షులున్ను, తదితరులున్ను తపస్సంపన్నులైరి. అందువలన అతి మహిమగల కార్యములున్ను సాధించిరి. అంతేగదా. మీరు చెప్పినది సత్యమే. మాకును అది అంగీకారమే. మేమున్ను తపస్సును యెక్కువగా గౌరవింతుము. అందఱితోను తపస్సు చేయవలెననియు చెప్పుదుము. మీ వాక్యమునందేమిగలదు — 'ఋషులు తపస్సువలన సిద్ధులను సంపాదించిరి, రాజర్షులు తపస్సువలన గొప్పగొప్ప కార్యములను సాధించిరి.' ఇంతేగదా. అట్టివారందఱు తపస్సిద్ధి గల్గినపిమ్మట ఆత్మతత్వబోధముగల బ్రహ్మనిష్ఠునివద్దకు వెళ్ళి బ్రహ్మసాక్షాత్కార జ్ఞానోపదేశమును బొందినట్లు ఉపనిషత్తులున్ను, శాస్త్రములున్ను చెప్పుట మీరు చూడలేదా? తపస్సువల్ల పాపములు నశించి అంతఃకరణశుద్ధి కలుగును. అప్పుడు నిజమైన తత్వమును తెలిసికొనవలెనను శ్రద్ధ యుదయించును. అందులకై బ్రహ్మనిష్ఠయు, అతిపవిత్రవర్తనమున్ను, సర్వప్రాణికోట్లను యుద్ధరింపవలెనను సంకల్పమును గల మహాత్ములవద్ద చేరును. వారు ఈతడు తపస్సు, ఉపాసన మొదలగు వానివల్ల బ్రహ్మజ్ఞాన ముపదేశింపబడుటకు తగిన అంతఃకరణ శుద్ధి గలవాడా యని పరీక్షింతురు. శమదమాదిగుణములున్ను, భక్తి శ్రద్ధలున్ను, వినయసౌశీల్యాదులున్ను గలవాడని తోచినమాత్రమే వానికి బ్రహ్మతత్వము నుపదేశింతురు అప్పుడు అట్టి తీవ్రముముక్షుత్వముగల జిజ్ఞాసువు ఆత్మసాక్షాత్కారసిద్ధి కోరి, సమాధినిష్ఠను శీలించును. అందువలన ఆవరణరహితమగు బ్రహ్మసాక్షాత్కారజ్ఞానము కలుగును. అత్తఱి ముక్తుడున్ను, శుద్ధుడున్ను కాగల్గును.

18. ప్ర:—ఇప్పుడు మీరు చెప్పినదానిలో నాకు అనుకూలముగాను, ప్రీతికరముగానునుండు ఒక వాక్యము లభించినది. అదేమన, 'బ్రహ్మసాక్షాత్కారముకొఱకు సమాధినిష్ఠను శీలించు'నని తమ

ముఖారవిందమునుండియే బయల్వెడలెను. సమాధిశబ్దము యోగము నందు కలదు. అట్టితి యోగసాధనవలనమాత్రమే బ్రహ్మసాక్షాత్కార జ్ఞానము కలుగునని స్పష్టమైనదికదా ?

ఉ:— బాగుగ చెప్పినావు. యోగసాధనయందు నాకును యెక్కువ ప్రీతికలదు. మంచి విశ్వాసమున్ను యుంటున్నది. ఇదిన్ని బ్రహ్మనిష్ఠులకు తప్పకయుండవలసినదని నేనున్ను చెప్పుచుందును. ఇదిన్ని తపస్సువంటిదే. దీనివలన మనస్సు యేకాగ్రతనొందును. తపస్సువల్ల పాపక్షయమున్ను, యోగమువలన చిత్తైకాగ్రతయు సిద్ధించును. ఇవి రెండును బ్రహ్మనిష్ఠచేయువారలకు యుండియేతీరవలెను. ఇవి రెండు నేత్రముల వంటివి. అయితే యివన్నియు సాధనలేగాని సాధ్యపదవి కాదని జ్ఞాపకము చేసికొనిన, నీసందేహములన్నియు తీరిపోవును. ఒక పాత్రలోగల జలము శుద్ధముగాను, నిశ్చలముగానుండునపుడు, దాని యందు సూర్యప్రతిబింబమేలాగున గనంబడునో, ఆలాగున తపస్సుచే అంతఃకరణశుద్ధియు, యోగముచే నిశ్చలత్వమున్ను గలుగునప్పుడు, అంతఃకరణమునకు సాక్షిగానున్నప్పుడు ఈశ్వరసాక్షాత్కారరూపమగు జ్ఞానము ముముక్షువులకు కలుగును. పాత్రలోగలజలము పంకిలముగాను, చంచలముగాను నుండునపుడు యేలాగున సూర్యబింబము కాను పించదో, ఆలాగున అంతఃకరణములోగల తమోగుణరూపమగు పంకి లమున్ను, చలనరూపమగు విక్షేపమున్ను నశించువఱకు బ్రహ్మానుసం ధానము కలుగదు. కావున ఆ రెండు దోషములు నశించువఱకు తపస్సున్ను, యోగధారణయున్ను అందఱున్ను అనుష్ఠింపవలసినదే.

19. ప్ర:— మల, విక్షేప, ఆవరణశక్తులని మూటిని విని యున్నాము. మీరు రెండింటిని మాత్రముగదా చెప్పితిరి. ఆవరణ మునుగూర్చి చెప్పలేదే ? ఆవరణమనగా నేమి ?

ఉ:—ఇదే దీనిలో గల రహస్యము. దీనినే గురుబోధయందురు. అనగా జ్ఞానోపదేశమని దీనికి పేరు. ఎట్లన, పాత్రలోగల జలము శుభ్రముగాను, చలనరహితముగాను యుండినను, దానిపై నొక యా వరణము గలిగియుండిన, దానిలో సూర్యప్రతిబింబము యేలాగున కనుపింపదో, ఆలాగున ఆవరణయను దోషము అంతఃకరణములో గలిగి

యుండిన, ఆత్మానుభవము సిద్ధింపదు. కావున సత్యమగు ఆత్మను గురించిన జ్ఞానోపదేశముచేతనే అట్టి యావరణము తొలగవలెను. లేనిచో పాత్రయొక్క పైభాగమున మూతకలిగి యున్నట్లుండును. అట్టిచో దానిలోగల జలము నిర్మలముగాను, నిశ్చలముగాను నుండినను యేమి ప్రయోజనము? అందు సూర్యప్రతిబింబము కనుపించదు గదా. కనుకనే జ్ఞానబోధ గొప్పదని చెప్పుటకు కారణము.

20. ప్ర:— అయితే జ్ఞానమే శ్రేష్ఠమైనచో అది యొక్కటి మాత్రమే చాలునుగదా. అతిప్రయాసముతో కూడిన తపస్సుగాని, యోగసాధనగాని యేల చేయవలెను?

ఉ:— జ్ఞానమును శ్రేష్ఠమని చెప్పినను, తక్కిన యోగ, తపసులు అవసరములేదని తాత్పర్యముకాదు. ఎట్లన, శరీరములో శిరస్సు శ్రేష్ఠమని చెప్పినచో, ఇతరావయవములు అవసరములేదని అర్థమా? కాదు. శిరస్సు ముఖ్యమైనదను తాత్పర్యమే మనము గ్రహించుకొనవలెను. అంగములు లేనిచో అంగి యుండజాలదు. ఎట్లన, దీపమువలననే అంధకారము నశించును. అయితే తైలము, వత్తి, ప్రమిదయు, గాలిలేని స్థలమును లేనిచో దీపమేలాగున నిలువగల్గును? ఇచ్చట మనము గ్రహించవలసినది యేమన, తైలముమాత్రముచే గాని, ప్రమిదమాత్రముచేగాని, వత్తిమాత్రముచేగాని, గాలిలేని ప్రదేశము మాత్రముచేగాని గృహాంతరాళములోగల తమస్సు నశింపదు. తమస్సును తొలగించుటకు దీపము, అనగా ప్రకాశము ముఖ్యకారణము. తక్కినవన్నియు దీపముయొక్క అంగములు. ఆలాగున ఈశ్వర సాక్షాత్కారజ్ఞానజ్యోతికి భక్తియను తైలము, వత్తియను యోగము, తపస్సుతోకూడిన వైరాగ్యమను పాత్రము, నిర్వాసనయనెడి గాలిలేని స్థలము అనగా ఏకాంతస్థలము, ఈ అంగములన్నియు ఉండిన మాత్రమే అచంచలమైన బ్రహ్మజ్ఞానము నిరావరణముగ నిలువగల్గును. ఈ అంగములన్నిటిలో మిక్కిలి శ్రేష్ఠమైనది దైవభక్తి. అది తైలము వంటిది. తైలమేలాగున జ్యోతియై మారుచుండునో, ఆలాగున నిష్కళంక భక్తియను తైలము జ్ఞానజ్యోతియై మారుచుండును. తైలము లేనిచో జ్యోతియేయుండదు, కావున భక్తిలేనిచో ముక్తియేగలుగదు.

21. ప్ర:—భక్తి యొక్కటిమాత్రము ముక్తిని కలుగచేయునని శాస్త్రములుద్ఘోషించుచుండగా మీరు భక్తికన్న జ్ఞానము గొప్పదని యేల చెప్పితిరి? అదిన్నిగాక భక్తియను తైలమును రక్షించునవి తపస్సు, యోగము, వాసనారహితమగు నిర్జనప్రదేశమనియు చెప్పుచున్నారే.

ఉ:— జ్ఞానమునకు ఆధిక్యతయిచ్చినను భక్తికి లోపమేమియు కలుగదు. ఏలన, సూక్ష్మబుద్ధితో దీర్ఘవిచారము చేసిన, తైలమే జ్యోతియై మారుచున్నట్లు గోచరము కాగలదు. కావున నిర్మలమైన భక్తియున్ను, నిశ్చలమైన జ్ఞానమున్ను ఒకటియే యగును. భక్తియొక్క పరిపక్వావస్థయే జ్ఞానముగా పరిణమించును. చమురు లేనిచో వెలుతురు యేలాగున యుండజాలదో, అలాగున దైవభక్తి లేనివానికి ఈశ్వర సాక్షాత్కారజ్ఞానము కలుగదు. కావున భక్తి లేనిచో ముక్తి కలుగదని చెప్పెడు రహస్యము.

22. ప్ర:—మహాత్మా! మీరు జ్ఞానవంతులైనను పురాతనపద్ధతులనుబట్టి దీపమునకు తైలము, వత్తి, ప్రమిద, గాలిలేని స్థలము యుండవలెనని పాతమాటలనే చెప్పుచున్నారు. ఇప్పటికాలమున నవీనములగు మార్పులను పొందుటయు, అతిసూక్ష్మములగు యంత్రములను కనిపెట్టుటయు చూచుటలేదా! విద్యుద్దీపము చూడఁదగును. దానికి చమురు యెచట? వత్తి యెచట? ప్రమిద యెచట? గాలిలేని చోటుయెచట? ఒక్క మర త్రిప్పిన, దీపములన్నియు ఒక్కసారి వెలుగుచున్నవి. మీవన్నియు పాతపడిన కాలములోగల మోటుజనుల దృష్టాంతములు. దృష్టాంతములతో కాలమును వృథాగా గడుపుచున్నట్లున్నది.

ఉ:—ఆధ్యాత్మికతత్వము సనాతనమైనది. దానికి ప్రాకృతవస్తువులవలె యేమార్పున్ను గలుగదు. మార్పుగల వస్తువులన్నియు కాలాంతరమున నశించును. ఇది శాశ్వతమైన సిద్ధాంతము. విద్యుద్దీపమునకు కూడ వత్తియున్ను, తైలసమానమగు విద్యుత్ప్రవాహము (ఎలక్ట్రిక్ కరెంటు)న్ను, ప్రమిదవంటి గ్లాసున్ను అవశ్యముండియేతీరవలెను. దానికిన్ని గాలి తగులని చక్కని చిమ్నిచే ఆచ్ఛాదనముండియే తీర

వలెను. దీనిని పరిశీలించనందుచేత నీవాలాగున చెప్పుచున్నావు. ఇప్పుడు భారతదేశము పరులకు పాలైనను పూర్వీకచరిత్రకారుల యాశయము చూచిన, ఆకాలమున భారతదేశము సర్వవిదేశములకన్న అధిక విజ్ఞానమున్ను, నాగరికతయు, ధనసమృద్ధియు గలిగియుండినట్లు స్పష్టముగా కనుగొనవచ్చును.

28. ప్ర:—మీరు భారతదేశాభిమానముతోగూడి, ఆత్మస్తుతిగలిగి భారతదేశమును స్తోత్రము చేయుచున్నారు. అంత యోగ్యత భారతీయులకుండిన, యేల తమ రాజ్యము పరులకు పోనీయక సంరక్షింప గూడదు?

ఉ:— నాయనా! ఇది మంచి ప్రశ్న. భారతీయులందఱును వినందగినది. తేజోవంతులగు ఋషులసంతానమున్ను, అతిపవిత్రులగు ఆర్యవంశములో పుట్టిన ప్రతి స్త్రీపురుషులును యిట్టి మనఃక్లేశకరమగు వార్త వినందగినదే. అయితే దేశమును పరులు ఆక్రమించుకొనుదానికిని, దేశనాగరికతకును, విజ్ఞానమునకును, ధనసంపత్తికిని యేలాటి సంబంధమున్ను లేదు. ఏలన, జయాపజయములు జనులయొక్క హెచ్చుతగ్గులవల్ల గలుగును. ఎట్లన, ఎంతవిజ్ఞానవంతులైనను కొద్ది జనులను అధికజనులు జయింపగలరు. ఇదిరియొక యభిప్రాయము. ఇప్పుడు జరుగుచుండు పశ్చిమదేశయుద్ధబలాబలములను మనము చూచుచున్నాము. ఎంతనాగరికతగల జనుల దేశమునైనను సామాన్య దేశజనులు అధికముగా నుండుటచేతను, యుద్ధసామగ్రి యెక్కువ గలిగినందుచేతను జయించుచున్నారు. కావున ఈయొక్క సంగతివలన జనులయొక్కయు, దేశముయొక్కయు యోగ్యతాయోగ్యతలు, జ్ఞానాజ్ఞానములు తెలిసికొనఁ జాలము. మఱియు ప్రకృతియందు ప్రవాహములోగల నిమ్నోన్నతతరంగములవలె జయాపజయములు జరుగుచునే యుండును. మఱియును యేదేశమున్ను ఒక్కస్థితిలో యెల్లప్పుడున్ను యుండజాలదు. భారతదేశముకూడ యున్నతస్థితికి రాజాలదనియు, స్వయంపరిపాలనను భారతదేశీయులు చేయజాలరనియు యెవరున్ను చెప్ప జాలరు. అదిన్ని కొలదికాలములో రాగలిగియున్నది. సూర్యోదయమునకు ముందుగా అరుణోదయము కానుపించునట్లు, దానియొక్క

చిహ్నములైన జనులయొక్క ఐక్యము, సమత్వము మొదలగు పుణ్య పుంజములిపుడే ఆవిర్భవించుచున్నవి. అయితే రాజ్యము వచ్చినను అది గొప్పసంగతి కాదు. ఏ కారణమువలన రాజ్యమును నిలబెట్టకపోయిరో, ఆ మూలతత్వమునుకూడ గ్రహించుకొనవలెను. లేనిచో ఒక వేళ రాజ్యము వచ్చినను, యిప్పుడు పాలించువారుగాని మఱియొకరు గాని రాజ్యమును కొల్లగొట్టెదరు. ఇదే గ్రహించుకొనవలసిన ముఖ్య విషయము.

24. ప్ర:— మీరిప్పుడు నిరూపించినదానిలోగల సారమిది గదా — జనులయొక్క హెచ్చుతగ్గులనుబట్టి జయాపజయములు గలుగు ననిగదా ! అట్లైన మహమ్మదీయులచే యీ దేశమాక్రమింపబడి నపుడు ఇందు జనులు లేకపోయిరా?

ఉ:— మిక్కిలి సారమైన ప్రశ్న చేసినావు. ఆర్యవంశ సంతతిలో జన్మించిన ప్రతి స్త్రీ, పురుషుడున్ను యీ మనోవేదనాకరమగు వాక్య మును విని సిగ్గుపడవలసినదే. అంతేకాదు; మనోదుఃఖముగూడ కలిగితీరవలసినదే. జడబుద్ధిగలవారున్ను, విశాలభావములేక జనులను సంస్కరించుటకు అడ్డుపడువారందఱున్ను యిట్టిమాట వినవలసినదే. కొంచమైన దేశాభిమానముగలవారైన, యీ వచనము వారికి కర్ణ కఠోరముగా నుండును. అంతేకాదు; నిశిత శరఘాతమువలె యుండును. అంతియే కాదు; వజ్రప్రహారణమువలె తోచును. వాక్యములో మాత్రము దేశాభిమానము, వేదాభిమానము గలవారివలె, నాటకము లోగల నటులవలె నటించిన యేమి ప్రయోజనము కలుగును? వ్యాధి యొక్క కారణము కనిపెట్టి ఔషధసేవ చేసిననే రోగము శమించును. అట్లు చేయనిచో ఆకాశకుసుమమువంటి వాగ్గాంభీర్యముచే యేమి ప్రయోజనము కలుగును? గగనకుసుమసుగంధ మెటువంటిదో ఈమాట లున్ను అటువంటివే.

25. ప్ర:— అయితే దేనివలన భారతదేశము పరులకు పాలైనది?

ఉ:— ఈవిషయము చెప్పవలెనని చాల కుతూహలతగలదు. అయితే, యీవిషయములో అనేకులకు అనేకవిధములగు అభిప్రాయ ము లుండవచ్చును. ప్రశ్నవచ్చినప్పుడు తనయొక్క అభిప్రాయము

మాత్రమే చెప్పవలసియుండును. నెమ్మదిగ చెప్పెద. చాల ఓర్పుతో వినవలెను. ఈతత్వము చరిత్రకారులందఱకును తెలిసియేయుండును. ఈ దేశమునకు ప్రప్రథమమున దండెత్తివచ్చినవాడు మహమ్మదు గజినీ. అప్పుడుకూడ భారతదేశమున జనులు సమృద్ధిగ లేకపోలేదు. కాని, ఆకాలము హిందూదేశరాజుల పరిపాలనక్రింద యుండెను. ఆ కాలపు పాలనలన్నియు వర్ణాశ్రమములకు చెందిన బాహ్యచిహ్నములచేతనే నడుచుచుండెను గాని వర్ణాశ్రమములలోగల సారమగు అంతరంగముపై దృష్టినుంచి ప్రవర్తించినట్లు మొత్తముపై కానుపించదు. ఎచ్చటనో సకృత్తుగా మాత్రము సారమునుజూచి ప్రవర్తించియుండవచ్చును. వర్ణాశ్రమములయొక్క స్థూలభాగముపై మాత్రము ఆధారపడియుండుటచే ఆ కాలపు నియమమునసుసరించి క్షత్రియులకుమాత్రమే ధనుర్విద్యలో ప్రవేశము గల్గియుండెను. ఇప్పుడు యేలాగున రాజన్యులు అధికసంఖ్యగలిగి యుండుటలేదో, అప్పుడున్ను ఆలాగుననే యుండవచ్చును. బలిష్ఠులున్ను, మేధాసంపత్తి గలవారున్ను యగు జనులు యితర మూడువర్ణములలో అధికముగానున్నను వారిని యుద్ధములో చేర్చి సమర్థులుగా చేయనందుచేతను, మహమ్మదీయ సైన్యమధికముగనుండుటచేతను, ఈ దేశమును విదేశీయులు ఆక్రమింప గల్గిరి. అంతేగాని హిందువులు బుద్ధిహీనులగుటచేగాని, శౌర్యపరాక్రమములు లేనివారగుటచేగాని పరాజయము నొందినవారు కారు.

26. ప్ర:— తాము చెప్పిన వాక్యమును వినినప్పుడు నా మనస్సులోగూడ భారతీయులయెడ చాల మార్పుగల్గినది. ఇదివఱలో హిందువులు అనాగరికులనియు, బుద్ధిబలము లేనివారనియు తెలిసికొనియుంటిని. అయితే యుద్ధకార్యములో క్షత్రియులుతప్ప తక్కినవారుండరాదని నిషేధముండినను సమస్తశాస్త్రములకును, విజ్ఞానములన్నిటికిని భారతదేశమే పుట్టినిల్లు అని చెప్పుచున్నారే; అట్లైన ఈ శాస్త్రములలో ప్రవీణులై, జనులకు బోధించి, మానవులను ధీరులుగాను, శూరులుగాను, జ్ఞానవంతులుగాను యేల చేయగూడదు ? శాస్త్రముచే సంస్కరింపబడినచో, బాహ్యచిహ్నము ప్రధానముకాదనియు, ఆంతరంగిక గుణమే ముఖ్యమనియు జనులు గ్రహించియుందురుకదా !

కావున సర్వశాస్త్రములకును, విజ్ఞానములన్నిటికిని భారతదేశమే కారణభూతమని చెప్పుమాటలలో బుద్ధిమంతులగువారి కెవరికి విశ్వాసము గల్గును ?

ఉ:—ఈ వ్యవహారములన్నియు ప్రపంచసంబంధములు. అధ్యాత్మోన్నతిని గుఱించినదానియందుమాత్రమే మేము ప్రవేశింతుము. అయినను సమయము వచ్చినదిగాన యిప్పుడు దీనిలోగల సారము కొంచెము చెప్పెద. శాస్త్రపాఠములోగూడ వర్ణాశ్రమబాహ్యమును మాత్రమే ఆధారపడి ప్రవర్తించునట్లు కన్పించుచున్నది. కాకతాళీయన్యాయరీతిగ ఎచ్చటయో ఒకానొకరికిమాత్రము శాస్త్రజ్ఞానము కలిగియుండవచ్చునేగాని, సత్యబుద్ధితో, న్యాయదృష్టితో పరిశీలించిన, యితరదేశీయులవలె దేనియందెవరు సమర్థులో వారిని ఆ కార్యములో ప్రవేశబెట్టి జనులను సంస్కరించెడు స్వభావము సృష్ట్యారంభమునుండి నేటివఱకు భారతదేశమున జరిగినట్లు యెంత వెదకినను కనుపించదు. బౌద్ధయుగమునమాత్రము కొంత సంస్కరణగలిగినను అదియును త్వరలోనే అడుగంటిపోయినది. అందువలననే భారతీయులు రాజ్యమును సంరక్షించుటకు సమర్థులు కాకపోయిరి. ధనుర్విద్యయందు క్షత్రియులకుమాత్రమే ప్రవేశమున్నట్లు, శాస్త్రపఠనమునందుగూడ బ్రాహ్మణులకే ప్రవేశముండెనుగాని బ్రాహ్మణేతరులకు లేకయుండెను. ప్రవేశము లేకపోయినను దోషములేదుగాని జనుల యభివృద్ధికి యేలాటి సహాయమున్ను చేయకపోయిరి. బ్రాహ్మణస్త్రీలనుగూడ తక్కిన స్త్రీలవలె విద్యావిహీనులుగా చేసిరి. ఆపాపములన్నియు చేరినందుననే హిందువులందఱిని, హిందూదేశమునుసహా పరులు పాదాక్రాంతముగా చేసికొనిరి. ఇదే దేశము పరాధీనమగుటకు కారణము. ఇంగ్లీషుప్రభుత్వమగుటచే యుద్ధములో జనులయొక్క గుణమును ననుసరించి ప్రవేశమందఱికిని యిప్పుడు కొంచెముకొంచెముగా గలిగెను. విద్యలో యింకను గుణములయోగ్యతను బట్టి సర్వజనులకును ప్రవేశము గల్గలేదు. 'విద్యావిహీనః పశుః' అని శాస్త్రకారులు వ్రాసినట్లు భారతీయజనులలో విద్యార్హత లేనివారు పశువులవలె నుండినందులకు కారణమైనది.

27. ప్ర:— అయితే మీకు వేదమందు విశ్వాసములేదా? వేదములో విధించిన రీతిననుసరించిగదా వర్ణాశ్రమము లేర్పడినవి. అప్పుడవి అంగీకరించఁదగినవిగదా?

ఉ:—వేదములోను, శాస్త్రములలోను గుణముల కాధిక్యత నిచ్చిన ప్రమాణములెన్నియో గలవు. ఆలాగున ప్రవర్తించిన, మహా కల్పమువఱకు యీ భారతదేశము పరులపాలు కాజాలదు. తగిన యోగ్యతలేనివారు శ్రేష్ఠకులములో జన్మించినను దానికి తగిన యోగ్యులు కారని యెంచబడునప్పుడును, ఉత్కృష్టగుణముకలవారు తక్కువకులములో జన్మించినవారైనను వారిని శ్రేష్ఠకులములో జన్మించినవారివలె పరిగణించే వివేకసుజ్ఞానము గలుగునప్పుడును మాత్రమే మన దేశముద్ధరింపబడును. మనదేశమేగాదు; మఱీ యేదేశమైనను ఈలాటి వివేచనము గలిగినమాత్రమే యున్నతస్థితిలోనికి రాగల్గును. ఋషుల జీవితమందాలాగుననే కానుపించుచున్నది. శ్రీవ్యాస, సూత, ఉద్ధవ, విదురాదులే యిందులకు తార్కాణము.

28. ప్ర:—గుణములకాధిక్యత యిచ్చినచో వర్ణాశ్రమములు నశించునుగదా; అప్పుడు జాతిసంకరము కలుగునుగదా?

ఉ:—వర్ణాశ్రమములు లేకుండ చేయవలెననిగాని, వర్ణ సంకరము చేయవలెననిగాని చెప్పను. అయ్యది తినుటలోను శయనించుటలోను చేరినది. అది యిష్టముండువారు చేయవచ్చును. అట్టి అభిప్రాయము మాకులేదు. విద్యలోను, అనుష్ఠానములోను, అధికారములోను అందఱికిని గుణములనుబట్టి అర్హత కలుగవలెను. అదే న్యాయమగును. అట్లుకానిది అన్యాయమేను.

29. ప్ర:— న్యాయముకాని, అన్యాయముకాని యగుగాక, వేదములో చెప్పినట్లు నడచుటయేగదా ఆస్తికుల ధర్మము?

ఉ:—వేదముల ఆశయము ఇదమిత్థమని నేటివఱకెవరున్ను నిర్ధారణ చేసియుండలేదు. వారివారి బుద్ధిననుసరించి వారువారు చెప్పిరేగాని ఒకరివాక్యమును ఇంకొక్కరు ప్రమాణమనిగాని, సత్యమనిగాని, వేదముయొక్క ఆశయమనిగాని అంగీకరించియుండలేదు,

30. ప్ర:—అట్లనా, అయితే చాల ప్రమాదము కలుగునే! వారివారి సంస్కారమునుసరించి బుద్ధి అనేకవిధములుగానుండును గాన వేదముకూడ వారివారిబుద్ధిని అనుసరించియే అర్థమగునుగదా?

ఉ:—ఇప్పుడు ఆలాగుననే జరుగుచున్నది. వేదముయొక్క నిజార్థము సర్వేశ్వరునికొక్కనికే యెఱుక. తక్కినవారందఱును వారివారి బుద్ధిననుసరించియే వేదార్థమును నిర్ణయించినారు. చూడుము; మాధ్వులు ద్వైతముగాను, శ్రీవైష్ణవులు విశిష్టాద్వైతముగాను, స్మార్తులు అద్వైతముగాను వేదార్థమును నిర్ణయించియున్నారు. వీరిలో కొందఱు మహావిష్ణువే పరబ్రహ్మమనియు, ఇంకకొందఱు పరమశివుడే పరబ్రహ్మమనియు, అద్వైతులు ఈపై యిరువురున్ను స్థితిలయములకు హేతుభూతులగువారనియు, వీరుభయులకన్న పరబ్రహ్మము విలక్షణముగా నుండుననియు చెప్పుచున్నారు. వీనిలో యేది సత్యము, యేది అసత్యము?

31. ప్ర: — ఈమతత్రయాచార్యులు శ్రుతిస్మృతిపురాణేతిహాసములను ప్రమాణములుగా చూపిగదా వేదార్థమిదియని నిర్ణయించిరి?

ఉ:—శ్రుతిస్మృతిపురాణేతిహాసములకు యేమి కొఱతగలదు? అన్నిటికిని ప్రమాణములు గలవు. బుద్ధిశక్తి యెవరికి అధికముగా నుండునో వారు శాస్త్రార్థములో విజయమును పొందుచున్నారు. వారికన్న మఱియొక్కరు బుద్ధిమంతులగునప్పుడు వారినికూడ పూర్వపక్షము చేసి తమదే సిద్ధాంతముచేయుదురు. కాలమంతయు ఈలాగుననే పోవుచున్నది. సముద్రతీరమున యిసుక రేణువులకు యెంత కొఱత గలదో శాస్త్రసాగరములో ప్రమాణములకును అంతే కొఱత గలదు. అయితే త్రిమూర్తులలో యెవరిని భజించినను, నది ననుసరించి ప్రయాణముచేయువారు సముద్రమును చేరునట్లు, జీవులు సచ్చిదానందజ్ఞానసాగరములో చేరవచ్చును; సందేహములేదు. ఈ మూర్తులందఱు ఉపాస్యులు. వీరినుపాసించుటవల్లను మోక్షలాభము కలుగును.

32. ప్ర:—అది యెట్లు సాధ్యమగును? శివవిష్ణువులకన్న పరమాత్మ వేఱుగా నుండెననికదా యిదివఱలో తాము సెలవిచ్చితిరి? అప్పుడు వారేలాగున ముక్తిని గలుగజేయుదురు?

ఉః—దీనికి విరోధము లేదు. ఏలన బ్రహ్మ, విష్ణు, శివాది త్రిమూర్తులుకూడ సృష్టిస్థితిలయములకు కారణభూతులనియు, వారి యొక్క ఉపాధులకే మార్పుగాని వారి యంతరంగచైతన్యమొకటే యనియు, అందుచే వారియందు భక్తిగలిగిన మోక్షము గల్గుటకు సందేహము లేదనియు అందఱియొక్క అభిప్రాయము.

33. ప్రః— శ్రీ దయానందస్వామివారు వ్రాసిన వేదార్థములో బ్రహ్మ, విష్ణు, శివాది వాక్యములన్నియు పరమేశ్వరునియొక్క గుణములనుబట్టి యేర్పడినవనియు, ఈలాగున ముగ్గురు దేవతలు లేరనియు, ఒకే పరమేశ్వరుడే గలడనియు, ఆ సర్వేశ్వరునే యుపాసింపవలెననియు చెప్పుచున్నారే?

ఉః—ఈ వాక్యములు శాస్త్రములో అచ్చటచ్చట కాన్పించుచున్నవి. ఆలాగున విశ్వసించువా రనేకులు గలరు. ఈ విషయమై చెప్పబూనిన చాల విస్తారమగును. దీనినిగుఱించి యిదివఱలో వ్రాసిన 'పురుష ప్రయత్న' మను భాగమందు చూడఁదగును. కావున దీనిఁగూర్చి చెప్పబూనలేదు. పరమేశ్వరుడు అందఱికన్నను, అన్నిటికన్నను గొప్పవాడగుటచే బ్రహ్మయనియు, ఆకాశమువలె వ్యాపకుడగుటచే విష్ణువనియు, ప్రకృతిరహితమగు శుద్ధమంగళస్వరూపుడగుటచే శివుడనియు పేరుగల్గెను. సృష్టికి కారణుడగుటచే బ్రహ్మయనియు, పాలనమూర్తియగుటచే విష్ణువనియు, అంత్యమున సర్వమునకు లయహేతువగుటచే శివుడనియు నామముగలిగెను. ఇది సంక్షిప్తవాక్యము.

34. ప్రః—ఈ విషయములో నొక సంశయముగలదు. అదిన్ని నివృత్తియైన, అనేకులకు మనస్సులలోగల సందేహము తొలగిపోవును. అదేమన, ఇదివరలో తాము చెప్పివచ్చిన భావముచూచిన వర్ణాశ్రమములవలననే భారతదేశమునకు పతనము గలిగినదనియు, ఇతరదేశములలో యిట్టి దోషములేదనియు, అందువలన అచట జనులు సంస్కారవంతులై ఉన్నతస్థితిలోనికి రాగల్గిరనియు తెలియుచున్నది. విదేశములలోగూడ జాతిమతభేదములు గలవనియు, దానివల్లనే వారు పరిశ్రమశీలురై పరుల జయింప శక్తిగలవారగుచున్నారనియు చెప్పుచున్నారే? దీనికి తాము యేమి సెలవిచ్చెదరు?

ఉః—— ఈ ప్రశ్న ప్రస్తుతకాలమునకు తగినది. వర్ణాశ్రమము లుండుటచేతనే భారతదేశము యిట్టిస్థితిలో యుంటున్నదనియు, వర్ణాశ్రమధర్మములు లేనిచో యీ పుణ్యభూమియగు భారతదేశము యింకను అధఃపతనము నొందియుండుననియు, వర్ణాశ్రమములోగల మహిమవలననే భారతీయుల మతమగు సనాతనధర్మము నశింపక యుంటున్నదనియు, అది లేనిచో యిప్పటికీదేశము యే మహమ్మదీయులకో, యే క్రైస్తవులకో యుండిపోవలసినదనియు చెప్పువారు కొందఱు కలరు. ఆ విషయమై యెక్కువ విస్తారముగా చెప్పబూనలేదు. మీరడిగిన ప్రశ్నకు సంగ్రహముగ సమాధానముచెప్పెద. పాశ్చాత్యవిద్యయు, ఆ దేశపరిస్థితియు తెలియనివారిని, ఆ దేశములోగూడ వర్ణాశ్రమములుగలవని చెప్పి లోబఱచుకొనుచున్నారు. పాశ్చాత్యదేశములలోగూడ కొంత భేదముండినను అది మనదేశములో గలరీతిగ బాధకరమైనది కాదు. పాశ్చాత్యభేదము పరిశ్రమలకనుకూలముగా యేర్పరచియున్నారు. ఆలాగుననే యుండవలెను. అట్లుండినమాత్రమే యత్నముచే యున్నతస్థితికి వెళ్లుటకు జనులకవకాశముగల్గును. లేనిచో సోమరితనమున కవకాశము మెండుగ నుండును. అదేరీతిగ మనదేశ భావము విశాలముగ యేర్పడి యుండలేదు. వారిది గుణకర్మలపై ఆధారపడియుండును. మనది అవిచారమగు అంధవిశ్వాసముతో కూడియున్నది. ఇది జన్మించిన కులమునుమాత్ర మాధారపఱచుకొనియుండును. పాశ్చాత్యదేశపురీతిగాను, జపాన్ మొదలగు ప్రాగ్దేశముల రీతిగాను గుణకర్మలఁబట్టి ఉచ్చనీచావస్థలుండవలెను. ఇది న్యాయబద్ధమైనది. అట్లుకానిది మహా అన్యాయము. పాశ్చాత్యదేశములో ప్రభువుల స్థానము, శ్రీమంతులగు ధనికుల స్థానము, సామాన్యజనుల స్థానమని సంగ్రహముగ మూడువిధములగు విభాగము కలదు. అయితే యిది జాతికి సంబంధించినదికాదు. పురుషప్రయత్నమునకు సంబంధించియున్నది. ఇప్పుడు సామాన్యజనుల స్థానములో నుండువారుకూడ విద్య, వివేక, జ్ఞాన, ధనములు గలవారైనచో, రేపటిదినము ధనికుల స్థానములో నుండవచ్చును. అచ్చోటనుండి ప్రభువుల స్థానమునకు తగిన యోగ్యత సంపాదించినచో చేరవచ్చును. అంతేగాని,

'వీడు శాస్త్రము చదువవచ్చును, వీడు శాస్త్రము చదువకూడదు. వీడు ఉన్నతస్థితి కర్హుడు, వీడనర్హుడు' అను భేదము కులమునుబట్టిలేదు; గుణమునుబట్టి యుండును. అట్లుండుటయే క్షేమకరము. ఆలాగున సత్యబుద్ధితో చేసినందుచేతనే విదేశములు భారతదేశమును పాదాక్రాంతముగా నొనర్చుకొన్నవి. దానిచే ప్రతివారికిని ఉన్నతస్థితి పొందవలెనని యభిలాష జనించును. ఈదేశమట్లుకాదు. అంధవిశ్వాసముతో కూడినది. ఒక్కడు హెచ్చుకులమున బుట్టిన, వాడెట్టివాడైనను శ్రేష్ఠుడు; ఇంకొకడు తక్కువకులమని చెప్పుదానిలో జన్మించిన, వాడెంత శ్రేష్ఠుడుగానున్నను తక్కువవాడే. వీనికి పైకిబోవుటకు మార్గములేదు. కనుకనే ఈ దేశము హానిసత్వమునకు కారణమైనది. పరమేశ్వరుని కృపచే యిప్పుడిప్పుడు కొందఱు విశాలహృదయులు జన్మించి, పూర్వీక అంధవిశ్వాసమును తొలగించి, జనులయొక్క గుణకర్మల కాధిక్యతనిచ్చి, అధోలోకమునకు దిగిపోయిన యీ పుణ్యభారతభూమిని పైకెత్తజూచుచున్నారు. కులమునకే యాధిక్యతనిచ్చి వచ్చిన, యిప్పుడుండు స్థితికన్న భారతదేశము యింకను అధోలోకమునకు జారిపోవుటలో సందేహములేదు. గుణకర్మల కాధిక్యత నిచ్చిన, అధోలోకములో నుంటున్న యీ పుణ్యభూమియగు భారతమాత యచిరకాలములోనే యుద్ధరింపబడును. కులమునకున్ను, సంన్యాసాశ్రమమునకున్ను గుణమును చూడక ఆధిక్యత నిచ్చినందుచే, ఉత్తమ కులములోను, సంన్యాసాశ్రమములోను యుండువారెవరైనను పూజ్యులని తలంచి తమయొక్క యోగ్యతను నిలబెట్ట జూడకపోయిరి. మఱియు, తక్కువ కులమని తలంచువారికి ఉన్నతమార్గమున బోవుట కవకాశము లేకపోయెను. కావున ఉభయులున్ను పతనమొందిరి. శాస్త్రములలో బాగుగ లోతునకు దిగి చూచిన, ఉత్తమకులములోను, శ్రేష్ఠమగు సంన్యాసాశ్రమములోను నుండువారికి తగినయోగ్యత లేకపోయిన, తప్పక పతితులు కాగలరనిగల ప్రమాణములెన్నియో గలవు. ఈ పరమార్థమును విచారించువారెవరును లేకపోయిరి. కావుననే మనదేశము పరాధీనమైపోయినది. ఈతత్వము యాచరణలో నుండిన, పైవారికి తగిన యోగ్యత లేనిచో క్రిందకి త్రోయబడుదురను భయ

ముచే వారివారి యోగ్యతను వారు సంరక్షించియుందురు. మఱియు, క్రింది తరగతిలోనుండువారు పైతరగతివారి యోగ్యత చూచి తాము కూడ అట్టియున్నతస్థానములోనికి రావలెనని సదా ప్రేరితులగుచుం దురు. ఇది చాల శ్రేష్ఠమైన పద్ధతిగానుండును. ఇట్లుగానిచో ఈ దేశ మేకాలమునకును యుచ్ఛస్థితిలోనికి రాజాలదు.

35. ప్ర:— మీరు అచ్చటచ్చట వర్ణాశ్రమములని చెప్పు చున్నారు. వర్ణమనగానేమి ? ఆశ్రమమనగా నేమి ?

ఉ:—ఇవి యొకజాతినిగూర్చి చెప్పుమాటలుకావు. మొత్తముపై సర్వజనులనుగుఱించి చెప్పినదే. వర్ణమనగా శ్రేష్ఠకులమనియు, ఆశ్రమ మనగా సంన్యాసమనియు సంక్షేపముగా గ్రహించఁదగినది. అంతే గాక, క్షత్రియాది కులములకున్ను, బ్రహ్మచర్యాది ఆశ్రమముల కున్ను ఈ వాక్యము సంబంధించియుండును. ముఖ్యముగా భారతదేశ మునుగూర్చియే ఈవాక్యము చెప్పుచున్నదని గ్రహించవలెను.

36. ప్ర:— మీరీలాగున చెప్పుటలో మీకు జాతిద్వేషము లేదా ?

ఉ:—ఈలాగున సర్వజనుల గుణకర్మయోగ్యతలఁబట్టి ఆధిక్యత గలదనియు, లేదనియు చెప్పువారే నిజముగా విచారించిన, జాతి ద్వేషము లేనివారగుదురు. ఒకజాతియందు రాగముగాని, మఱియొక జాతియందు ద్వేషముగాని యుండిన, వారిని రాగద్వేషములు గలవారని చెప్పవచ్చును. ఒకజాతికి ఆధిక్యతనిచ్చి, తక్కినజాతుల కాధిక్యత నివ్వ కుండ చేయువారే జాతిద్వేషము గలవారగుదురు.

37. ప్ర:— అట్లు గుణకర్మలపైమాత్రము ఆధారపడిన వర్ణ సంకరము కలుగదా ? వర్ణసంకరము కలుగక సంరక్షించుటగదా వేద ముయొక్క తాత్పర్యము? కావున వేదమందు విశ్వాసముగల ఆస్తికులు దానిని సంరక్షించుట ధర్మముకదా ?

ఉ:—వేదము సత్యమును చెప్పుచున్నదా, లేక అసత్యము నుపదేశించుచున్నదా ? న్యాయమును బోధించుచున్నదా లేక అన్యా యమును తెలుపుచున్నదా ? పక్షపాతము నుపదేశించుచున్నదా లేక పక్షపాతరాహిత్యము నుపదేశించుచున్నదా ?

318. ప్ర:— వేదమనగా జ్ఞానమనిగదా యర్థము? అంతేగాక వేదము దైవప్రేరితమనిగదా చెప్పుచున్నారు? వేదము ఈశ్వరుని ఆశయమనిగదా మహర్షులు బోధించుచున్నారు? పక్షపాతముతో కూడి నదైనచో అది రాగద్వేషాదులతో కూడినవారి కల్పనయేయగును. రాగద్వేషాదులు కలవాడు ఈశ్వరుడు కాజాలడు. ప్రకృతిగుణము గల వారే రాగద్వేషములు కలవారగుదురు. ఒక్కకులమునకే యాధిక్యత కలదనియు, తక్కినవారి కధికారములేదనియు చెప్పువాక్యము న్యాయ పరిశీలనగలవారు చెప్పరు.

ఉ:—అట్లైన మీకేల సందేహము కలుగవలయును? ఈశ్వరుడు సత్యపాలనము చేయువాడైనచో మీకు తప్పక సహాయము చేయును. సందేహింప బనిలేదు. అయితే మొట్టమొదట కొన్ని ప్రతిబంధములు అసత్యపాలనమనుజులచే గలిగినను, తుదకు సత్యమునకే జయము కలుగును. వేదమాలాగుననే యుపదేశించుచున్నది. ఆలాగున జరుగుచున్నదికూడను; అదియట్లే జరుగును. దీనియందు యేమాత్ర మును సందేహింపకుము. కొంత చరిత్రమును పరిశీలించిన ఈ రహస్యము గోచరము కాగలదు. కురువంశీయులగు ధర్మరాజులయొక్కయు, దుర్యోధనాదులయొక్కయు చరిత్రను బాగుగచూడుము. దుర్యోధనాదుల అసత్య, అధర్మాదులచే ధర్మరాజాదులు మొదట అరణ్యము పాలైనను తరువాత వీరికే జయముకలిగెను. మన భారతదేశములో ఈ భారతకథయే గొప్పప్రమాణమైనది. మఱియు పండ్రెండుసంవత్సరములు దుర్యోధనాదులు రాజ్యపరిపాలనము చేసినను నిరంతరము దుఃఖముతోను, వ్యాకులముతోను, భయముతోను జీవితమును గడపిరి. ధర్మరాజాదులో పుణ్యాశ్రమములలోను, పుణ్యారణ్యములలోను, పుణ్యతీర్థములలోను, పుణ్యక్షేత్రములలోను, పుణ్యపురుషుల సహవాసముతోను నిరంతరము మనస్సులో పరమసౌఖ్యము గలిగియుండిరి. పరమఋషులు, సిద్ధపురుషులు, బ్రహ్మజ్ఞానసంపన్నులు యెల్లప్పుడున్ను ధర్మమును, జ్ఞానమును వారికి ఉపదేశించుచుండిరి. సాక్షాత్ శ్రీకృష్ణ భగవానులుకూడ అప్పుడప్పుడు దర్శనమిచ్చుచు వారి కుశలతను విచారించుచుండెను. వారి కేమియు కొఱత కలుగలేదు. అక్షయమగు భోజన

పాత్రను ద్రౌపదీదేవికి సూర్యభగవానుఁ డనుగ్రహించియుండెను. ఎంత మంది సాధువులుగాని, అతిథులుగాని, బ్రాహ్మణులుగాని వచ్చినను, వంటచేయపనిలేదు. కావలసిన దివ్యములైన ప్రసాదములన్నియు ఆపాత్రలో యుత్పన్నమగుచుండెను. దీనికన్న భాగ్యమున్ను, సంతోషమున్ను యేమి కావలయును ? దుర్యోధనాదులు ఇంద్రప్రస్థములో నుండినను నిరంతరము దుష్టచతుష్టయముతోకూడి, దుష్టాలోచన చేయుచు, యితరులు వారిని తిట్టుచుండునది విని సహింపజాలక, జ్ఞానుల యొక్క నిందకు పాత్రులై, నిరంతరము క్లేశాకులితచిత్తము గలవారలై యుండిరి. వారు స్వర్గభోగము లనుభవించుచున్నారని తలంచినను నరకబాధలే యెల్లపు డనుభవించుచుండిరి. కావున మనశ్శాంతియు, నిర్మలహృదయమున్ను లేనివారు స్వర్గములోనుండినను నరకవాసు లనియే తలంచవలెను. సుఖదుఃఖములకు మనస్సే కారణముగాని దృశ్యవస్తువులు కాదు. కావున ధనవంతుడైనను ఆత్మశాంతి లేక పోయిన, అతడు పరమదరిద్రుడేయగును. మనోనిర్మలతయున్ను, చిత్తశాంతియున్ను కలవారు దరిద్రులైనను గొప్ప శ్రీమంతులే.

39. ప్ర— మహాత్ముఁడవగు తండ్రీ! ధర్మమార్గములో యెవ రెవరు విజయమును పొందిరి ?వారు మొదట యేలాటి కష్టమనుభవింప వలసివచ్చినది ? ఈ సందేహనివృత్తియైన, నేనున్ను యెంతకష్టమును సహించియైనను జనులకు సత్యధర్మముల బోధించి గుణకర్మల కాధిక్యత గలిగించుటలో జీవితమంతయు వినియోగపఱచెదను.

ఉ:—సత్యాన్వేషకుఁడవగు సోదరా! వినుము. మీాసందేహము లన్నియు నశించును. పాండవుల సంగతి తెలుపబడినదికదా! ఇక శ్రీ యేసుక్రీస్తు అవతరించినప్పుడును, మన భారతదేశీయులవలెనే పర్శీ యులనువారి యొక సంఘముండెను. వారికే సర్వాధికారమున్ను యుండెను. వారి ఆజ్ఞానుసారమే జనులు వర్తించవలసివచ్చెను. రాజు కూడ వారి యిష్టానుసారముగానే ప్రవర్తించుచుండెను. శాస్త్రము లన్నియు వారికొఱకే ఈశ్వరుఁడు చేసియున్నాడనియు, వారు తప్పులు చేసినను పాపము లేదనియు జనులకు బోధించుచుండిరి. అప్పుడు పరమ దయామూర్తియగు సర్వేశ్వరుడు తన సంతానము పడుచుండు పాటులు

సహింపజాలక, ధర్మము నుపదేశించుటకు శ్రీ ఏసుక్రీస్తును ప్రపంచము నకు పంపెను. ఆ దివ్యపురుషుడు, కారుణ్యమూర్తి జనులందఱకు గుణ కర్మలను బట్టియే యాధిక్యతగలదని బోధింపసాగెను. ఈశ్వరుఁడు తా నుపదేశించిన వేదమును అందఱికిన్ని సమానహక్కుతో సృష్టిం చెనుగాని, ఒక ప్రత్యేకజాతికి యేర్పఱచినది కాదని ఉపదేశము ప్రారంభించినప్పుడు అసత్యముతోను, అధర్మముతోను జీవించుచుండిన పర్సీయులు శ్రీ క్రీస్తుపై వైరము వహించి, రాజశాసనము తెప్పించి వారిని చిత్రవధ చేయించిరి. ఇది క్రీస్తును గుఱించిన సంక్షిప్తవివరము. విస్తారముగ గ్రంథాంతరమున గనందగును. క్రీస్తు వధింపబడినను ఆ దివ్య పురుషుని సందేశముమాత్రము, సరోవరములో తామరతీగ అల్లు కొనునట్లు, లోకమంతట వ్యాపింపసాగెను. తుదకు శత్రువులగు పర్సీయులకు ఆ దేశమున తావీయక తరిమివేసిరి. ఈ కథనింతటితో ముగించడమైనది. ఆలాగుననే శ్రీ మహమ్మదు నబిగారు అరబ్బీ దేశములో జన్మించినప్పుడున్ను జరిగియుండెను. అయితే మహమ్మదు గారిని శత్రువులు వధింపజూచినను సాధ్యముగాకుండెను. క్రమముగ శ్రీ మహమ్మదుగారి దైవబోధలను వినగా అందఱును వారి దైవ సందేశమగు మతమునే స్వీకరించవలసివచ్చెను. స్వీకరింపనివారు యుద్ధములో నిహతులైరి. ఇప్పుడు ప్రపంచములోగల క్రైస్తవులంద ఱున్ను శ్రీ యేసుక్రీస్తుయొక్క అనుయాయులే. ఆలాగున లోకమున కానుపించెడు మహమ్మదీయులందఱున్ను శ్రీ మహమ్మదుగారి శిష్య పరంపరలో చేరినవారే. ఈలాటి కథలెన్నియో గలవు, శ్రీదయానంద సరస్వతీస్వామివారున్ను యిట్టితెగలో చేరినవారనియే చెప్పవచ్చును. హిందూమతములోగల అస్వాతంత్ర్యమును తొలగించి జనుల గుణ కర్మల కాధిక్యత నిచ్చినందుచే సత్యమును, సమత్వమును సహింపని కొందఱు విషప్రయోగముచే నా దివ్యపురుషుని, న్యాయశీలుని, సత్యోపదేష్టను త్వరలోనే పరలోకమునకు పంపివేసిరి. శ్రీ దయా నందులు స్థాపించిన మతమునకే ఆర్యసమాజమని పేరు.

40. ప్ర: — అయ్యా! తమయొక్క సత్యబోధనచే నాకు చాల ధైర్యముగలిగెను. ఇప్పుడు భారతదేశపుణ్యముచే కొందఱు విశాల

హాత్ములు జన్మించి గుణకర్మల కాధిక్యత నిచ్చుచున్నారని యిది వఱలో తాము తెలిపితిరి. వారెవరెవరు? ఆ పుణ్యాత్ముల పేళ్లు విన్నను పుణ్యము కలుగునుగదా!

ఉ:— విజ్ఞానబుద్ధిగల సోదరా! వినుము. ఆర్యసమాజస్థాపకులగు శ్రీదయానందులుగారొకరు. బ్రహ్మసమాజస్థాపకులగు రాజా రామమోహనరాయ్‌గారు మరియొకరు. శ్రీ రామకృష్ణ మిషనును స్థాపించిన శ్రీవివేకానందస్వామివారు యింకొకరు. దివ్యజ్ఞానసమాజమును నెలకొల్పిన శ్రీ అనిబిసెంటమ్మగారు యింకొకరు. అయితే రామకృష్ణమిషన్‌వారున్ను, దివ్యజ్ఞానసమాజమువారున్ను దైవజ్ఞాన విషయమును బోధించుటలో యెక్కువకృషిసలిపిరేగాని, ఆర్యసమాజ, బ్రహ్మసమాజమువారివలె మతసంస్కారములో యెక్కువ యత్నము చేయలేదు. ఇంకను సామాన్యముగా కొందఱుగలరు. ప్రస్తుతము శ్రీ గాంధిమహాత్ముని ఆశయముకూడ గుణకర్మలకు ఆధిక్యతయుండవలెననియే. సత్యబుద్ధిగలవారందఱున్ను ఈలాగుననే చెప్పుదురు. అట్లు కానివారున్ను, సత్యాన్వేషణపరిశీలన చేయనివారున్ను యెవరైనను స్వార్థపరులే; సందేహములేదు. అట్టివారెంత శాస్త్రము చదివినను వారు తమకుగాని, తమవంశమునకుగాని యేలాటి మేలును చేయజాలరు. దానివల్ల వారియొక్క ఆత్మకున్ను మేలుకలుగదు. ఏలన సత్యమునకే జయము గల్గును. అసత్యమునకు ఎప్పుడైనను అపజయమే సిద్ధించును. అసత్యము గిల్టునగలవంటిదనియు, సత్యము అపరంజి బంగారమువంటిదనియు తెలుపకయుండిన, మీకున్ను శ్రేయస్సు గల్గును.

41. ప్ర:— విదేశీయులున్ను, మన మతమునకు జెందనివారున్ను నగు క్రైస్తవ, మహమ్మదీయులనుగుఱించి యింత ప్రశస్తముగా జెప్పితిరి. మనదేశములో జన్మించిన శ్రీ బుద్ధ, శ్రీ శంకరాచార్య, శ్రీ రామానుజాచార్య, శ్రీ మధ్వాచార్యుల గుఱించి యేమియును ప్రస్తావించకపోతిరి. దీనికి కారణమేమి?

ఉ:— శ్రీ బుద్ధదేవునిగుఱించి యిదివరలో కొంచెము తెలుపబడియుండెను, భరతఖండమున యవతరించినవారిలో జనులను సంస్క-

రించి గుణకర్మలకాధిక్యత నిచ్చినవారిలో శ్రీబుద్ధదేవులు ఒకరే యుండియుండిరి. శ్రీశంకర, శ్రీరామానుజ, శ్రీ మధ్వాచార్యులందఱున్ను జాతిని గుఱించి జనులను సంస్కరింప యెక్కువ ప్రయత్నము చేయలేదు. వారందఱున్ను వారివారి మతవ్యాప్తియందే అధిక ప్రయత్నపరులై యుండిరి. వర్ణాశ్రమవిషయములో వారందఱున్ను నూతన ప్రయత్నమేమియు బూనలేదు. ఆవిషయములో మామూలు ప్రకారమే యుండిరి. అద్వైతమతముకొఱకు శంకరులున్ను, విశిష్టాద్వైతము నిమిత్తము రామానుజాచార్యులున్ను, ద్వైతమతప్రచారమునకై మధ్వాచార్యులున్ను అపారకృషి సల్పిరి. శ్రీశంకరులు తమకాలమున బౌద్ధులను మతపరివర్తనులుగచేసి అద్వైతమతములో చేర్చినట్లును, శ్రీరామానుజులు బ్రాహ్మణేతరుల కనేకులకు పంచసంస్కారమొనర్చి వైష్ణవసాంప్రదాయములో చేర్చినట్లున్ను వినుచున్నాము. అయితే వారి కాలానంతరమున అట్టి సంస్కారము వ్యాప్తికి రాక నిలచిపోయెను. శ్రీమధ్వులు అనేకులను తన ద్వైతమతములో చేర్చినట్లున్ను చరిత్ర గలదు. ఆకాలపరిస్థితి ననుసరించి జనులను సంస్కరించుట కంత యవకాశము గలిగియుండలేదు. అది హిందూరాజులచే పాలింపఁబడెడి కాలము. శ్రీ కృష్ణచైతన్యులున్ను భక్తివిషయమై విస్తారముగ ప్రయత్నము సల్పిరి. అలాగుననే శ్రీ గురునానక్‌న్ను ఒక దివ్యపురుషుడనియే చెప్పవచ్చును. ఆ మహానుభావుడున్ను జనులలో కొంతవఱకు మతసంస్కరణము గావించిరి. అట్టి సంఘములో చేరినవారే సిక్కుమతస్థులు. అలాటి దివ్యపురుషులు, అపారదైవశక్తిగలవారు యిక జన్మించియే దేశములో జనులను సంస్కరించి, లోకమును ఉన్నతస్థితికి తీసికొనిరావలసియుండును.

**42.** ప్ర:—వేదమునకు సరియైన అర్థము యెవరున్ను స్థిరపఱచియుండలేదనియు, వారివారి బుద్ధిననుసరించి ఒకరద్వైతమనియు, ఇంకొకరు విశిష్టాద్వైతమనియు, మఱియొకరు ద్వైతమనియు, వేఱొకరు శివపరత్వమనియు, ఇంకొకరు విష్ణుపరత్వమనియు అర్థము చెప్పిరని యింతకుముందు తాము వచించియుంటిరి. పరమప్రమాణమనియు, ఈశ్వరనిర్మితమనియు చెప్పు వేదమునకే నిశ్చితార్థములేనిచో జనుల

గమ్యస్థానమున్ను, ఉపాసనయున్ను యెట్లు సిద్ధించును? అంతేగాక వారెట్లు వేదప్రవర్తకులైరి? జనులు వారిని యేలాగున మార్గదర్శకులుగ అంగీకరించియుండిరి?

ఉ:—ఇది చాల గొప్పవిషయము. అనేక ఋషులున్ను, పెక్కండ్రు మతకర్తలున్ను దీనిని దీర్ఘముగ విచారించి చర్చించిరి. వారి బుద్ధిపరిపక్వతననుసరించియు, సంస్కారమునుబట్టియు ఒక్కొక్క పద్ధతిని వారవలంబించిరి. వారికి దానియందు దృఢవిశ్వాసము గలిగియుండెను. అందువలన వారికి దివ్యశక్తియు, దివ్యజ్ఞానమున్ను కలిగెను. అట్లుకానిచో వారినెవ్వరున్ను అనుకరించియుండరు. వారు చెప్పిన అర్థములన్నియు వేదములో గలవు. శాస్త్రములన్నియు వానిననుసరించియే యేర్పడెను. ఇదే దీనిలోగల రహస్యము. మఱియు ఒకే జన్మములో జీవుడు తనయొక్క ఉపాధులన్నిటిని రహితమొనర్పజాలడు. అట్లు రహితమొనర్పగలవాడుండిన వాని జన్మాంతర అనుష్ఠానమే ఆలాగున చేసియుండును. కావున త్రిమతస్థులు చెప్పిన మూడుపద్ధతులను జీవుడు కొంతకాలమనుష్ఠింపవలసినచ్చును. మధ్వాచార్యులు కర్మానుష్ఠానపరముగను, రామానుజాచార్యులు ఉపాసనాపరముగను, శంకరాచార్యులు ఆత్మజ్ఞానపరముగను వేదార్థమును నిరూపించిరి. దేహేంద్రియముల శుద్ధినిమిత్తము తపస్సు మొదలగు అనుష్ఠానములుండవలయును. అంతఃకరణశుద్ధికొఱకు ఉపాసన అవసరము. స్వరూపానుసంధానానుభవము కలుగుటకు ఆత్మజ్ఞానమున్ను కావలసియుండును. కావున యీమార్గత్రయమునే వీరు ముప్పురున్ను యుపదేశించిరి. వేదముకూడ కాండత్రయాత్మకమనియు, వానిలో కర్మ, భక్తి, జ్ఞానములు కలవనియు అందఱును అంగీకరించియే యున్నారు.

43. ప్ర:— అట్లైన వీరిలో యెవరు శ్రేష్ఠులు? ఎవరు చెప్పినది నిజము?

ఉ:—ఎవరు శ్రేష్ఠులు, ఎవరు చెప్పినది సత్యము — ఈలాటి ప్రశ్నలకు దీనియందవకాశములేదు. వేదముయొక్క ఒక్కొక్క భాగమును ఒక్కొక్కరు ప్రచారముచేసిరి. ఈ మూడుమార్గములున్ను మూడుమతములున్ను యుండియేతీరవలెను. క్షుద్బాధాపీడితులకు ఆత్మ

దుఃఖనివృత్తికొఱకు ఒకడు బియ్యము పప్పు కూరకాయలు మొదలగు సామగ్రి నంతయు సమకూర్చెను; ఒకడు అన్నము వండెను; మఱి యొకడు కూరలు నేర్పఱచెను. అంతే దీనిలోగల రహస్యము. ఈ తత్త్వము తెలిసినచో వాదమున కవకాశము లేదు. అందఱికిని శాంతియు, ప్రసన్నతయు, సౌఖ్యమును గలుగును. ఏలన శుద్ధమగు కర్మానుష్ఠానముచే మలనివృత్తియు, దైవోపాసనచే విక్షేపశాంతియు, జ్ఞాననిష్ఠచే ఆవరణరాహిత్యమున్ను కలుగును. అప్పుడుమాత్రమే యే మతములోనుండువానికైనను నిరావరణమగు జ్ఞానము కలుగును. ఈ పరమసత్యమును గ్రహించిన యేలాటి సందేహమున్ను గలుగదు.

44. ప్ర:— తామిదివఱలో వేదార్థనిర్ణయవిషయమై, మఱియు మతకర్తల విషయమై తెలిపినదానిలో విశ్వాసమున కాధిక్యత నిచ్చి యున్నారు. దీనివలన ప్రతివారున్ను వారి బుద్ధిని ఉపయోగపఱచక, ఎవ రేది చెప్పినను విశ్వసించవలసినదేగదా ? అట్టి యర్థమునే మీరు తేల్చితిరి.

ఉ:—ఇదివఱలో చెప్పినదానిలో యెవరు యేమి చెప్పినను అంధప్రాయముగ విశ్వసించుకొనవలెనని భావముకాదు. దైవాను భవముగలవారున్ను, శాస్త్రప్రకారము నడచుకొనువారున్ను, సత్య వాక్కుగలవారున్ను, వేదార్థమునుగుఱించి ముముక్షువులకుగల సందేహములను శాస్త్రయుక్త్యనుభవములచే నివృత్తిచేయువారును నగు బ్రహ్మజ్ఞాన సంపన్నుల వాక్యములలోమాత్రము విశ్వాసముంచు కొనవలెననియే తాత్పర్యముగాని, కారుణ్యరహితులై, పవిత్రాను ష్ఠానములేనివారై, ధర్మదూరులై యుండువారి వచనములను విశ్వసింప వలెనని తాత్పర్యముకాదు. ఏలన, వేదార్థమును సామాన్యులు తెలిసి కొనజాలరు. అతీంద్రియజ్ఞానముగల ఋషులకుమాత్రమే అది బోధపడును. ఇంద్రియాతీతజ్ఞానముగలవారికే ఋషులని పేరు. మఱియు, మంత్రార్థ దైవమును ప్రత్యక్షము చేసికొనినవారికే ఋషులని పేరు. వేద మాత్రలను కనిపెట్టినవారికే ఋషులని పేరు. ప్రకృతికి పరమగు సత్య మును కనుగొనినవారికే ఋషులని పేరు. కావున సామాన్యజనులు తమ బుద్ధివృత్తిననుసరించి నడువరాదనుటయే యిందలి యర్థమని గ్రహించ వలయును.

45. ప్ర:— వర్ణాశ్రమములఁగూర్చి తాము విపులముగా తెలిపితిరి. ఆవిషయమై కొందఱీలాగున చెప్పెదరు — శ్రేష్ఠకులములో పుట్టినవారికిమాత్రమే ఉత్కృష్టబుద్ధి కలుగునుగాని, అట్లు కానివారికి శాస్త్రములు గ్రాహ్యములగునా? వేదార్థములు బోధపడునా? ప్రత్యక్షముగా బ్రాహ్మణేతరులలో శాస్త్రము నెఱింగినవారున్ను, శాస్త్రపాఠములను చదివినవారున్ను, చదువుచున్నవారున్ను యెంతమందియున్నారు? ఇదే దీనికి దృష్టాంతమని చెప్పుదురే. ఈ విషయమై తమయొక్క అభిప్రాయమేమి?

ఉ:—ఇందు యోచించిన యేలాటి అర్థమున్ను లేదు. శ్రేష్ఠజన్మమనుదానికి రెండువిధములగు అర్థములు గలవు. (1) శ్రేష్ఠమైన స్వభావమున్ను అనగా శ్రేష్ఠమైనగుణములున్ను, శ్రేష్ఠమైన కార్యములున్ను, శ్రేష్ఠమైన ఉత్సాహమున్ను, శ్రేష్ఠమైనకార్యములు చేయువారందఱున్ను శ్రేష్ఠకులములో పుట్టినవారనియొక అర్థము, (2) శ్రేష్ఠకులములో పుట్టి, శ్రేష్ఠతమమగు పదవియైన మోక్షమును పొందుటలో శ్రేష్ఠతరమగు బ్రహ్మనిష్ఠ, తపస్సు, శ్రేష్ఠమైన అధ్యయనము, శ్రేష్ఠతమమగు బ్రహ్మవిచారమున్ను గలిగియుండుటయని మఱియొక అర్థము. ఇది ముఖ్యార్థము. మొదటిది గౌణార్థము.

46. ప్ర:— అయితే, శ్రేష్ఠగుణములచేతనే శ్రేష్ఠకులమని చెప్పినది నిజమైనచో అన్యకులములలో పుట్టినవారున్ను శ్రేష్ఠమైన వేదశాస్త్రములలో నిపుణులు కావలయునుగదా! అట్లు కానుపించుటలేదే?

ఉ:— ఇది యెంత మూఢవిశ్వాసము! వేదాదిశాస్త్రములలో అందఱిని ప్రవేశపెట్టి, అందఱికి ఒకేవిధమగు విద్యగఱపి, పరిశోధనసల్పి, వారికి రాకపోయినచో అప్పుడీలాగున చెప్పిన సత్యమేగాని, అట్లుచేయక చెప్పుట సత్యాన్వేషకుల స్వభావముకాదు. ఇదివఱలో శాస్త్రములందఱికిని చెప్పనందుచే వారికిని రాకపోయియుండవచ్చును. ఇప్పుడు కొందఱు పుణ్యాత్ములు దయగలవారలై శాస్త్రములను తగిన శ్రద్ధగలవారికి చెప్పుటచే మామూలుగా అందఱికును అవి వచ్చుచునేయున్నవి. ప్రపంచములోగల యూనివర్సిటీలను విచారించిన ఈవిషయము స్పష్టముకాగలదు. శాస్త్రమొక్కదానియందు మాత్రము

కాదు. ఇంగ్లీషులోగాని, హిందీలోగాని, సంస్కృతములోగాని, ఇంజనీరింగ్ లోగాని, డాక్టరువిద్యలోకూడగాని దీనిని విచారించుకొనవచ్చును. ఒక బీజమును భూమిలోపెట్టి పోషింపక, పెట్టెలోనుంచి పోషించిన, భూమిలోని వృక్షములవలె ఇది యేల గొప్పవృక్షమై ఫలపల్లవపుష్పలతాదులతో ఆవిర్భవించలేదని యడిగినచో ఆవాక్యమందెంత గంభీరార్థము యుండునో, దీనిలోగల గూఢార్థమున్ను అంతియే. ఇట్టి క్షుద్రస్వభావముగలవారుండుటచేతనే భారతదేశ మింత యధోగతికి పడిపోవలసివచ్చినది. మొదటినుండి అన్నివర్ణములవారికిన్ని, స్త్రీలకును, వారివారి గుణకర్మలను జూచి శాస్త్రపఠనమునందవకాశము గలిగియుండిన, ఈ పుణ్యభూమియగు భారతదేశము యెంతో అభివృద్ధి పొందియుండెడిది. ఎందఱో జీవాత్మలు వికాసస్థితిని పొంది లోకక్షేమముకొఱకు ఉపయోగపడియుండెడివారు. ఈ సంగతి తలంచిన దుఃఖమును పొందనివారెవరు? ఎందఱో నారీమణులు లదుగంటిపోయిరి. ఎందఱో జనులు పైకి రాజాలక నశించిరి. వీరందఱి దుఃఖముచే భారతదేశము సంతాపమున క్రుంగిపోయెను. ఇప్పుడు పుణ్యవతియగు భారతమాతను యెట్లు పైకి తీసికొనిరాగలమను విచారము విశాలహృదయులకున్ను, పుణ్యజీవులకున్ను మనస్సులో కలవరము గలుగజేసినది. ఎందఱో, యెన్నియోవిధములగు ప్రయత్నములను చేయుచున్నారు. దీనియొక్క ప్రయోజనమిప్పుడు కనుపింపకపోయినను, ఇట్టి పవిత్రభావముతోగూడి చేయుప్రయత్నము వ్యర్థము కాదు. ఏలన సత్యమునకే జయముకలుగును. జీవకోట్లన్నియు భగవదంశములగుటచే వారికి సౌఖ్యము కలుగచేయుట భగవత్సంకల్పముగనే యుండును.

47. ప్ర:—అశ్వములవలె ఖరములున్ను, హంసలవలె కాకులున్ను, నందివలె పందియున్ను ఎంతయత్నించినను కాగల్గునా? ఆలాగున బ్రాహ్మణేతరులు తలక్రిందుగ తపస్సుచేసినను బ్రాహ్మణులతోటి సమానులు కాగల్గుదురా? ప్రకృతికి విరుద్ధముగా యెవరుచేయగలరు?

ఉ:—ఓ పాపాత్ముఁడా! దేనినుద్దేశించి యీ పాపవాక్యము నుచ్చరించితివి? నీకు కొంచెమైనను తెలివిలేదా? నీకు కన్నులు

గలవా ? పుట్టంధునివలె సూర్యుడు ప్రకాశించియుండు పగటిని అంధకారావృతమగు రాత్రియని చెప్పుచున్నావు. ఇది నీయొక్క అజ్ఞానాంధకారముచే నేర్పడిన గాఢతమమగు తమస్సేగాని మఱే మియుగాదు. ఇందు ప్రకృతివిరుద్ధమేమి గలదు ? గుఱ్ఱములున్ను గాడిదలున్ను దృష్టిలో యొకే రూపము, యొకే గమనము, యొకే ఆకారము, యొకే స్వరము గలిగియున్నవా ? లేవు. వేఱువేఱు వర్ణము, ఆకృతి గలిగియున్నవి. ఆలాగున మానవులలో శరీరవర్ణముచేగాని, ఆయుస్సుపరిమితిచేగాని ఉచ్చారణస్వరముచేగాని, శరీరాకృతిచేగాని, పుణ్యాపుణ్యాపేక్షణములచేగాని యేదైన భేదము నీవు చూపగలవా ? అట్లు చూపకున్నను యిట్టి పాపవాక్యములను చెప్పెదవా ? ఆలాగుననే హంసపక్షి తెల్లగాను, ముఖపాదాదులు సువర్ణమువలెను, పెద్దవిగాను నుండును. స్వరము మనోహరముగానుండును. అతివేగముగాను అతి దూరముగాను గమనముచేయును. కాకియో నలుపుగాను, చిన్నది గాను, చరణ ముఖములు నల్లవిగాను, స్వరము వికారముగాను, మంద గమనముగలదిగాను, కొలదిదూరముగా వెళ్లెడు శక్తి గలిగియుండునది గాను యుండును. రాజహంసపక్షికిని, కాకికిని యేలాటి సంబంధము గలదు ? ఆలాగున భారతదేశమానవులందు యేమి భేదము చూపగలవు ? ధనములోగాని, బుద్ధిలోగాని, దేహముయొక్కరంగులోగాని, ఆయుస్సులోగాని, శరీరాంగములలోగాని, దేనియందు నీవు భేదమును జూచినావు? అట్లే గోవును, సూకరమునువిచారించి చూచిన యెన్నియో విధముల భేదముగన్పించును. పుణ్యములోగాని, గ్రహణశక్తిలోగాని, మేధాసంపత్తిలోగాని, శరీరసౌందర్యములోగాని యేలాటిమార్పులున్ను మానవులకు గలుగనప్పుడు, యిట్టి పాపోపదేశముచేసి దేశమును పాడు చేసెదవా ? ఇకమీద నీవును బాగుగ ఆలోచించుకొనుము. ఈలాటి మాటలను చెప్పకుము. నేనైె సహించితిని. దేశాభిమానమున్ను, జనులయందు దయయున్నుగల్గి, సోదరభావము వృద్ధినొందింపజూచు వారైన వివేచనాబుద్ధిగలవారెవరైనను ఈలాటిమాటలనువిని సహించెదరా ? కావున యిట్టి దుష్టబుద్ధిని మాని యోగ్యతగలవారందఱిని గౌరవింపుము. అర్హతగలవారిని యున్నతస్థితిలోనికి తీసికొని వెళ్ళుము.

అప్పుడే మనదేశమునకు శ్రేయస్సుగల్గును. దేశము శ్రేయోదాయక మునుండినమాత్రమే మనము అధ్యాత్మజ్ఞానములో ప్రవర్తించుట కనుకూలపడును. కడుదారిద్ర్యబాధచే తపించెడు దేశములో సామాన్యముగ అందఱున్ను పరమార్థచింతనచేయజాలరు. ఒకానొకడుమాత్రము అతీంద్రియశక్తిగలవాడుగ నుండవచ్చును. దేహమారోగ్యస్థితియందుండనిచో దేహి యేమియును చేయజాలడు. అయితే దేహబలము, దేహసుఖముమాత్రము గొప్పదని తలంచరాదు. అది పశుత్వమునకు తీసికొనిపోవును. ఆత్మజ్ఞానము లేనిచో, పశువునకున్ను మానవునకున్ను యెక్కువభేదమేమియును యుండదు. మఱియు ప్రపంచములో యెంతధనముగాని, యున్నత అధికారముగాని, విద్యగాని, దేహబలము గాని యుండినను పరమశాంతిని గలుగజేయు పరమాత్మయందు యెంతవఱకు జీవునకు విశ్రాంతిగలుగదో, అంతవఱకు మానవజన్మచే పొందవలసిన నిత్యశాంతియు, పరమప్రాప్తియు, నిరతిశయసుఖమున్ను, జీవుడు అనుభవింపజాలడు. జాతిని కల్పించి, సోదరస్నేహము నంతయొందించి, దేశమును పరులపాలుజేయుటకు ఈ జాతికల్పనయే కారణమైనది. దీనివలన ఒక్కొక్కరికిన్ని వైషమ్యముపెరిగి సంఘబలము క్షీణించడమైనది. విశాలమైన శాఖలచేతను, ఫలపల్లవపత్రములచేతను అనేక జనులకు విశ్రమించుటకు ఛాయయు, భుజించుటకు ఫలములను యిచ్చెడు వృక్షముయొక్క ఒక్కొక్క శాఖను నఱికి, వేఱుచేసిన, అవృక్షమేలాగున దుర్బలతనొందునో, జనులు పొందవలసిన సౌఖ్యమేలాగున క్షీణించిపోవునో, ఆలాగున కల్పవృక్షసమానమగు మన భారతదేశమున అనేక మతములున్ను జాతులున్ను యేర్పడి పరస్పరమైత్రి నశించినందుచేతను, సంఘబలము క్షీణించినందుచేతను పరదేశీయులు ప్రవేశించుటకు కారణమైనది. ఒక్క మనుజుడెంత బలవంతుడైనను ఒక్కొక్క అంగము విహీనమైపోయిన, క్రమముగ నాతడెట్లు దుర్బలత్వమునొందునో, భారతదేశముయొక్క స్థితియు ఆలాగే పరిణమించినది. ఇక ఏమహనీయుడో, అవతారపురుషుడో ఆవిర్భవించి జనుల గుణకర్మలకాధిక్యత నిచ్చినమాత్రమే దేశము బాగుపడగలుగును.

48. ప్ర:— జాతి మొదటనుండి యెట్లు యేర్పడినది ?

ఉ:— దీనిని సరిగా నేటివఱకు యెవరున్ను చెప్పియుండలేదు. మొదట ఆర్యులను ఒక తెగవారు వచ్చిరనియు, తరువాత దేశచరిత్రలో చెప్పినట్లు మఱికొన్ని తెగలవారు ఈ దేశమునకు వచ్చినారనియు, అప్పటినుండి భేదమేర్పడెననియు కొందఱు చెప్పుదురు. మఱికొందఱు ఈశ్వరసృష్టినుండియే యేర్పడెననియు వచింతురు. దీని కేలాటి నిదర్శనమును లేదు. ఆలాగున చెప్పెడి వాక్యములు దుర్బలములు — యుక్తికిని న్యాయమునకును విరుద్ధములు. జాతినిగుఱించి విచారించిన ఈలాగున గలిగియుండవచ్చునని మహనీయులు చెప్పుచున్నారు — ఒక్కొక్క కాలమున ఒక్కొక్క మహాపురుషుడు జన్మించి అప్పుడుగల జనులకు ధర్మమును బోధించి, వారియొక్క ధర్మము నంగీకరించిన వారిని యొక్క జాతిగా అనగా సంఘముగా యేర్పఱచుకొనియుండిరి. వారే ఒకజాతిగా యేర్పడిరి. ఇది చాల సమంజసముగానున్నది. ఏలన ప్రపంచములోగల జాతులన్నియు ఈలాగుననే యేర్పడుచున్నవి. చూడుడు — క్రీస్తువవతరించి ధర్మమును బోధించినపుడు ఆ సంఘములో చేరినవారు క్రైస్తవులైరి. మహామ్మదు అవతరించి దైవతత్వము నుపదేశించినపుడు దానిలో చేరినవారు మహామ్మదీయులైరి. ఈ రెండు జాతులును పైప్రవక్తలు యేర్పడినతరువాత కానవచ్చినవి. ఆలాగున జినుండవతరించి ధర్మోద్బోధనము చేయునపుడు దాని నంగీకరించిన వారు జైనులైరి. అట్లే బుద్ధుడు జన్మించి జ్ఞానోపదేశము చేసినపుడు దాని నంగీకరించినవారు బౌద్ధులైరి. ఆవిధముగనే గురునానక్కు సిక్కులను యేర్పఱచిరి. రామానుజులు తెంగలవైష్ణవులను, దేశికాచార్యులు వడగలవైష్ణవులను యేర్పఱచిరి. మధ్వాచార్యులు మాధ్వులను యేర్పఱచిరి. శంకరులు అద్వైతులను యేర్పఱచిరి. దయానందులు ఆర్యజాతిని సృష్టించిరి. రామమోహానులు బ్రహ్మసమాజకులను యేర్పఱచిరి. ఈలాగున యేర్పడిన జాతులే ప్రపంచములో నిపుడు కాన్పించువారందఱున్నూ, ఆదిలో ఒక జన సమితి యుండి యుండవచ్చును. వారినుండి క్రమముగా ధర్మోన్ముఖులైనవారిని, ఒక్కొక్క బోధకులు జన్మించినప్పుడు వారి వాక్యములందు విశ్వాసము

గల్గింపజేసి వచ్చినందుచే జాతిపరిణామము పొందియుండవచ్చును. ఇదే నిజమైన జాతితత్వముగా నుండవచ్చును. ఇప్పుడు పైనజెప్పిన జను లందఱు ఏలాగున ఒక్కొక్క జాతిగా యేర్పడిరో, ఆలాగుననే జాతులు యేర్పడుటకు అవకాశము గలదు. అంతేగాని ఈశ్వరుని ముఖ, వక్ష, ఊరు, పాదములనుండి నాల్గువర్ణములు యేర్పడెనవని చెప్పుటలో యేలాటి ఊహాయున్ను కనుపించదు. ఈశ్వరుఁడు సర్వ వ్యాపకుడు. అట్టివానికి మనుజులకు గలిగియున్నట్లు ముఖ, వక్ష, ఊరు, పాదాదులుండవు. మఱి ఈశ్వరుడు మూడుగుణములతో కూడినవాడుకాడు. కేవలము శుద్ధజ్ఞానస్వరూపుడు. పంచదారచే చేయబడిన బొమ్మయొక్క ముఖ, వక్ష, ఊరు, పాదములన్నియు మధురములై యుండును. ఆలాగున శుద్ధజ్ఞానస్వరూపుడగు ఈశ్వరుని నుండి ఒకవేళ వారు చెప్పేలాగున ముఖాది అంగములనుండి జాతులు పుట్టినను, అందఱును జ్ఞానస్వరూపులై యుందురు. పనసచెట్టు, సీమ ఉసిరికచెట్టు, అత్తిచెట్టు మొదలగు కొన్నివృక్షములలో మొదలునుండి చివఱవఱకును కాయలుద్భవించును. అవన్నియు ఆకృతిలోను, రుచి లోను ఒకేవిధముగానుండును. కొన్ని తీపు, కొన్ని పులుపు, కొన్నివగరు, కొన్ని చేదు ఈలాగున నుండవు. అయితే ఫలములయొక్క పక్వా పక్వతల ననుసరించి మధురామ్లాదిగుణములు కలుగును. ఆలాగుననే జీవులయొక్క పరిపక్వావస్థననుసరించి సత్వాదిగుణము లేర్పడును. ముండకాదిశ్రుతులలో, అగ్నిహోత్రమునుండి మిణుగురులు లేచునట్లు సర్వేశ్వరునినుండియే జీవకోట్లు యేర్పడునట్లుగలదు. పైజెప్పిన యుక్తి కన్న ఇదే చాలశ్రేష్ఠముగానున్నది. ఏలన అగ్నిగుండమునుండి ఆవిర్భ వించు మిణుగురులు అగ్నిమయములై యుండును. వాటియందేలాటి భేదముండదు. ఉపాధితో చేరునప్పుడు శ్వేత, రక్త, పీత, కృష్ణాది భేద ములు గలుగవచ్చును. ఆలాగున సత్వాదిగుణములతోగల అంతఃకర ణముననుసరించి జీవులకు శాశ్వతమైన మోక్షము లేనప్పటికి ఆగంతుక మోక్షముగలదని చెప్పిన చాల బాగుగనుండును. వేదపురుషుని ముఖ, పాదాదులనుండి జాతులు పుట్టెనని చెప్పినను, అవన్నియు ఒకేగుణము కలిగి యుండును. అట్లుగాక సత్వరజస్తమమిశ్రగుణములతో పుట్టిన

వని చెప్పినచో దానికేలాటి యుక్తియున్ను, ధర్మమున్ను లేదు. గుణములతోను, ఆకారముతోను కూడినవాడే సర్వేశ్వరుడని నిరూపించిన ఆ యీశ్వరుడు సర్వజ్ఞుడు కాజాలడు. ఏలన ఆకారమేక దేశమందే యుండును. దానికి వ్యాపకత్వము కలుగదు. మఱియు అటువంటి ఈశ్వరుడు కాలాంతరమున తప్పక నశించును. ఏలన ఏది దేశముచే భేదింపబడునో, అది కాలముచేతను భేదింపబడును. అట్లు దేశకాలములచే భేదింపబడునది తప్పక నాశము నొందును. అట్లు నాశమొందువాడీశ్వరుడు కాజాలడు. కావున సత్వాదిగుణములనుబట్టి జాతిని నిర్ణయించుటలో ఏలాటి లోపమునులేదు. అది సత్యమునకు దూరముకానిది. తక్కిన వాక్యములన్నియు సత్యదూరములు. దీనివల్ల జీవులు ఉన్నతస్థితిలోనికి వచ్చుటకు అవకాశము గలుగనేరదు. గుణములు నిశ్చయించిన, ఉన్నతస్థితికి వచ్చుటకు అవకాశము గల్గును. అప్పుడు దేశమున్ను ఉన్నతావస్థలోనికి రాగల్గును. సత్యమునకు జయము గలుగునను వేదవాక్యము నిజమైనచో యిట్టిస్థితి లోకములో యెప్పటికైనను వచ్చియే తీరును. సంశయములేదు. ఇది సత్యము. దీనియొక్క చిహ్నము లిప్పుడే కానుపించుచున్నవి. వృక్షము పుష్పించుటకు ప్రారంభించిన, తప్పక ఫలములను కలుగచేయునట్లు, ఈ నిదర్శనమున్ను ఆలాగుననేయుండును. దీనియం దెవరికిన్ని ద్వేషమునకుగాని, విరోధమునకుగాని యెట్టి అవకాశమును లేదు. పక్షపాతమున్ను కానుపించదు.

49. ప్ర:—— మహానుభావా! తమవలన సత్యమెఱుంగుటకొఱకుగదా మీదగ్గఱ చేరితిని? అనేకులు ఆలాగున చెప్పుటవలన నా మనస్సు అట్లు మారిపోయినది. యిపుడు తమయొక్క సత్యాన్వేషణబుద్ధిసహితములగు యీ వాక్యములు వినినప్పటినుండి పరిశ్రమచేసినచో అందఱును బాగుపడగలరను నమ్మకము గలిగెను. జనులందు దోషములేదు. సంస్కారకర్తలు సరియైనవారు లేనందుచేతనే దేశము యింత దీనస్థితికి వచ్చినదనియు, జనులు శూరులున్ను, ధీరులున్ను, జ్ఞానవంతులున్ను గాకపోయిరనియు యిప్పుడు నాకు బాగుగ తెలివిగల్గెను. అయితే ఈ విషయములో ఒక సందేహము గలదు.

అదేమన సంస్కృతము మొదలగు పరిశుద్ధమైన భాషలును, వాటి యొక్క శుద్ధమైన ఉచ్చారణయు అందఱకును గలుగునా? అది శ్రేష్ఠ కులములో జన్మించి, బహుజన్మసుకృతముగల్గి, అనాది కాలమునుండి అభ్యాసపరంపరగా వచ్చినవారికితప్ప తక్కినవారందఱికిని యెట్లు గలుగును?

ఉ:—అయ్యో, మీబుద్ధికింకను దృఢమైనజ్ఞానము కలుగలేదే! మీ ప్రశ్నలో రెండుభావములు కన్పించుచున్నవి. (1) శ్రేష్ఠజన్మమును గుఱించినది. (2) అభ్యాసపారంపర్యమునను సరించినది. శ్రేష్ఠ జన్మవిషయమై యిదివఱలో తెలుపడమైనది. అభ్యాసమొకటి మీరు చెప్పినది నిజము. అందువలన యెవరికి సంస్కృతాది భాషలు రాలేదో వారికి అభ్యాసాదులు లేనందుననే రాకపోయినవి. ఇప్పుడారంభించిన వారికిన్ని అభ్యాసమువలన అవి గలుగునుగదా. కావున అభ్యాసము చేయుము. వ్యాకరణములో శబ్దములన్నియు కొన్ని దంతములచేతను, కొన్ని పెదవులచేతను, కొన్ని తాలువులచేతను, కొన్ని మూర్ధస్థానము నుండియు, మఱికొన్ని నోటిలో యితరస్థలములనుండియు పుట్టుచుండు నని గలదు. అది వ్యాకరణగ్రంథములందు వ్రాయబడియుండు విష యమే. దానికొఱకు మనము సమయము వ్యర్థపఱచపనిలేదు. మన నోరు హార్మోనియంపెట్టె వంటిది. దానిని కొన్నిరోజులు వాడక పోయిన త్రుప్పుపట్టి, స్వరములు సరిగ పలుకజాలదు. కాని తుడిచి, రిపేరుచేసిన, మఱల శుద్ధముగ పాడగల్గును. ఏవైన అంగములు లేనిచోగాని, వికారములు కలిగినగానిమాత్రము పాడజాలదు. అట్లు గానిచో తప్పక శుద్ధముగ పాడగలదు. ఆలాగున కొందఱు ఆజన్మము సంస్కృతవాక్యములు ఉచ్చరింపనికారణముచేతను, వంశ పరం పరలో బహుకాలమునుండి ఆభాష లేనందుచేతను, మొట్ట మొదట కొంచెము ప్రయాసముగానుండును. కాని కొంత అభ్యాసమలవడిన, రిపేరుచేసిన హార్మోనియం పెట్టెవలె వీరున్ను స్వచ్ఛముగ ఉచ్చరింప గలరు. మానవులందఱికిని ఈశ్వరుడేలాగున దంతోష్ఠతాలుజిహ్వాదులు సృష్టించియున్నాడో, వీరికిన్ని ఆలాగుననే గలవు. కావున వీరున్ను సుకృత జీవులేకాని పాపజీవులు కారు.

50. ప్ర:—పాపజీవులు కానిచో పాపకులమున యేలాగున పుట్టుదురు ? కావున వారిపాపము ననుసరించిన పాపఫలమగు దీనతను వారు పొందవలసినదే.

ఉ:— దయార్ద్రహృదయము గలవారెవరున్ను ఈలాగున తలంచరు. మీరేల యీలాటి కఠినస్వభావముగల్గి చెప్పుచున్నారు ? లోకజ్ఞానముకూడ కొంత తెలిసికొనియుండవలెను. ఒకజాతి పుణ్యవంతమైనదని, ఇంకొకజాతి పుణ్యహీనమైనదని పుట్టినకులమును మాత్రము ఆధారపడి నిశ్చయింప వలనుపడదు. తమయొక్క దేశాభిమానముచేతను, కులాభిమానముచేతను, జనులు వారివారిజాతి శ్రేష్ఠమైనదని తలంతురు. ఇప్పుడు భారతీయులను చూడుము. తామే శ్రేష్ఠులమని వీరు తలంచుచున్నారు. కాని విదేశీయులు భారతీయులను అనాగరికులనియు, మూఢవిశ్వాసము గలవారనియు, ఐకమత్యము లేనివారనియు, సంఘబలము బొత్తిగ లేనివారనియు చెప్పుచున్నారు. ఆలాగున జర్మనీయులే శ్రేష్ఠులని వారున్ను, అమెరికనులు ఉత్కృష్టులని వారున్ను, జపానీయులు అందఱికన్న శ్రేష్ఠులని వారున్ను, ఆలాగుననే యితరజాతీయులున్ను వారికివారే శ్రేష్ఠులమని చెప్పుకొనుచున్నారు. ఇదంతయు వారివారి జాత్యభిమానమేకాని మఱియొకటి కాదు. దీనియందుకూడ కొంతవిచారణ చేయవలసియుండును. వీరిలో శ్రేష్ఠగుణములు కలవారెవరైనను వారే శ్రేష్ఠులు. ఈ శ్రేష్ఠత్వము యితరప్రాణులకు వారుచేయు ఉపకారమువలననే గోచరమగును. అపకారమే పాపజన్మముగలవారి స్వభావముగానుండును. జీవకోట్లలో కరుణయు, దైవభక్తియు, యితరుల మేలుగోరి ప్రయత్నించుటయు, పుణ్యజీవుల స్వభావమైయుండును. ఇట్టిగుణములు లేనివారెప్పటికిని పుణ్యజీవులు కాజాలరు. కులమునకే పుణ్యమును నిశ్చయించినది సరియైనచో, ఆకులమున పుట్టినవారందఱున్ను పుణ్యస్వభావముగలవారుగానే యుండవలెను. ఏలన చీనీచెట్లు, పనసచెట్లు మొదలైన మధురఫలవృక్షములు యెచ్చటనుండినను మధురఫలములనే గల్గజేయును. ఆలాగున జాతియందే గుణము కలదని చెప్పినచో పాపజాతియని తలంచువారిలో సదా పాపగుణమే యుండియుండవలెను. ఎట్లన

ముష్టిచెట్టు, వేపచెట్టు మొదలగు చేదు వృక్షములు నెచ్చుటయుండినను వానికి చేదుఫలములే కల్గుచుండును. మానవులలో ఆలాగున కనపించుటలేదు. ఒక్క జాతిలోనే పుణ్యకార్యపరులున్ను, పాపకృత్యనిరతులున్ను కానవచ్చుచున్నారు. కావున జీవులయొక్క గుణములనే ముఖ్యముగా చూడవలెను. ఇదే నిజమైన న్యాయమగును. అట్లుగాక జాతినే ఆధారబడి పక్షపాతబుద్ధితో ప్రవర్తించిన, అది గొప్ప అన్యాయమే అగును. ఒకవేళ కొన్నిజాతులందు పారంపర్యముగా వచ్చుచుండెడు కొన్ని కార్యములలో కొంతమార్పు కనుపించినను అది పరంపరసంసర్గముచే వచ్చినదేకాని నైజమని తలంపరాదు. దానిని త్వరలోనే మార్పుచేసికొనవచ్చును. కావున సంస్కారసంఘమొకటి జనసంఘములో నుండవలెను. అప్పుడుమాత్రమే జాత్యుద్ధరణము కాగలదు.

51. ప్ర:—శాస్త్రములు చదువుట, రాజ్యముపాలించుట, వ్యాపారము చేయుట, కృషి మొదలగు పనులాచరించుట, వీనివలన పుణ్యపాపముల భేదములు తెలిసికొనవచ్చునుగదా? అనగా శాస్త్రములు చదువువారు శ్రేష్ఠతములనియు, రాజ్యపాలనము చేయువారు శ్రేష్ఠతరులనియు, వ్యాపారాదులుచేయువారు శ్రేష్ఠులనియు, కృషి మొదలగు లోకసేవాకార్యములు చేయువారు కనిష్ఠులనియు చెప్పునది నిజముకదా?

ఉ:—వానియొక్క బాహ్యస్వరూపము జూచి, ఇది శ్రేష్ఠమనిగాని, కనిష్ఠమనిగాని, నికృష్టమనిగాని నిర్ణయింప వీలులేదు. అవన్నియు సామాన్యమైన పనులే. అవి జీవనోపాయముకొఱకు అభ్యసించెడు విద్యలే. ఏలన, వారియందఱియొక్క భావమును చూచిన అందఱున్ను ఒక్క జీవనోపాయముకొఱకే ఆలాటి కార్యములు చేయుచున్నట్లు గోచరము కాగలదు. శ్రేష్ఠత్వాది గుణములుగాని, నికృష్టత్వాది గుణములుగాని, వారివారి హృదయపవిత్రతలనుబట్టి యుండును. దీనిలో పరోపకారమున్ను, దైవజ్ఞానమున్ను ముఖ్యములు, ఏ విధమైన కీడు ఏ ప్రాణికిన్ని యెవరు చేయరో వారు పుణ్యజీవులు. మానవుల పురోవృద్ధికి ఆటంకమును కల్పించుట పాపములన్నిటిలోను అధికపాపమైనది. మనదేశములో జీవనోపాయవృత్తి ననుసరించి జాతియొక్క

ఉచ్ఛత్వనీచత్వములు గ్రహించుచుందురు. తూర్పు, పడమట దేశము లలో జీవనవృత్తినిబట్టి చూడరు. వారు హృదయనిర్మలత్వ, మలినత్వ ములఁబట్టియే ఉచ్ఛత్వనీచత్వములఁబరిగణింతురు. దీనివలననే ఆ దేశస్థు లున్నతస్థితికి రాగల్గిరి. ఇట్లుచెప్పుటచే పాపకృత్యములుచేసి జీవనము గడుపవచ్చునను విపరీతార్థమును చేబట్టరాదు. కావుననే ఇతరజీవకోట్లకు ఉపకారముచేయవలెనుగాని, అపకారముచేయరాదనిముందుగా తెలిపిన కారణము. వృత్తినిబట్టిజాత్యున్నత చెప్పకూడదు. ఏలన, బ్రాహ్మణాది నాల్గువర్ణస్థులున్ను పైఁజెప్పిన విద్యా, పాలన, వ్యాపార, లోకసేవాదులు చేయుచున్నారు. వారిలో ఒక్కొక్క తెగవారిలోను పుణ్యస్వభావము గలవారున్ను, పాపగుణముగలవారున్ను కనుపించుచున్నారు. కావున బాహ్యవృత్తిగొప్పదికాదు. ఆత్మశుద్ధియే గొప్పదిగా పరిగణింపవలెను.

52. ప్ర:—ఒక్కొక్కజాతియందు పరంపరగా చేసివచ్చెడి పనులు ఆజాతివారే చేయవలెనని చెప్పునది మంచిదిగదా. ఏలన, వారి సంస్కారములన్నియు, వాటితో సంబంధించియుండుటచే వారికి వానియందు యెక్కువ ప్రావీణ్యత కలుగునుగదా, వారి వంశములో పుట్టువారు ఆ బీజములలో పుట్టుటచే వారికి దానియందు, ప్రవాహ వేగమున కనుకూలముగ నడిపెడు పడవవలె అతిశీఘ్రములో యున్నత గమనము కలుగునుగదా ?

ఉ:—ఈవిచారము అన్నిటిలోను తీసికొనుట బాగుగనుండదు. కొన్నిటిలో మాత్రమే చెల్లును. ఏలన, జీవులగుణములను పరిశీలించ వలసినదేగాని కులమును శోధించుటలో లాభమునకు బదులు నష్టమే కలుగును. భారతదేశపతనమున కిదియే ముఖ్యకారణమైనది. ఎవ రెవరి సంస్కారమేలాగుననుండునో ఆలాటి కార్యములందు వారిని ప్రవేశపెట్టినమాత్రమే, జలవేగమునసుసరించి నడిపెడు పడవవలె నుండును. లేనిచో ప్రవాహవేగమునకున్ను, వాయుగమనమునకున్ను వ్యతిరేకముగా నడుపబడు పడవచందమున గమ్యస్థానము చేరుటకు ప్రయాసమగుటయేగాక, విశేషశ్రమనుకూడ పొందినను ఫలము చాల స్వల్పముగానే యుండును. జపానీయులేగాక పాశ్చాత్యులుగూడ, ఎవ రెవరి స్వభావము దేనియందు ప్రవృత్తిగల్గియుండునో వారిని ఆలాటి

కార్యములలో ప్రవేశపెట్టుదురు. కావున వారు అన్నిటిలోను ఉన్నత స్థితి నలంకరింపగల్గిరి. ఇదే నిజమైన కార్యము. ఏలన, జీవులయొక్క స్వభావము జన్మాంతర సంస్కారము ననుసరించి యుండును. దానిని కనుగొని ప్రవర్తించుటయే ముఖ్యలక్షణముగా నుండవలెను. ఈ విషయము ప్రాపంచిక కార్యములలో మాత్రమేగాక, ఆధ్యాత్మిక విషయములలోగూడ యేర్పడవలెను. అప్పుడే విద్యయందుగాని, బ్రహ్మ విద్యయందుగాని యభివృద్ధి గలుగును. అట్లుగాక, ఈ జాతివారే బ్రహ్మ విద్య కర్హులు, ఈజాతివారనర్హులు అని గల యేర్పాటువలననే అధ్యాత్మికజ్ఞానముకూడ అడుగంటిపోయెను. పూర్వీకఋషులలో చూడుము. వసిష్ఠాది బ్రాహ్మణులున్ను, విశ్వామిత్రాది క్షత్రియులున్ను, తులాధారాది వైశ్యులున్ను, సూతాది బ్రాహ్మణేతరులున్ను ఎంత మహావిజ్ఞానసంపన్నులైరి! నిర్వాణమున కర్హులైరి! ఈలాగుననుండుటయే లోకక్షేమమునకు కారణమగును. ఈవిధి స్త్రీలలోగూడ యుండవలెను. స్త్రీలలోగూడ యెందఱో పుణ్యజీవులుగలరు. స్త్రీలకు బ్రహ్మవిద్యయందు నిషేధముండిన, ఋషిమండలిలో ప్రాథమికుడగు యాజ్ఞవల్క్యమహర్షి తనభార్యయగు మైత్రేయికి బ్రహ్మవిద్య నుపదేశించియుండడు. ఈ మహోన్నతవిషయము బృహదారణ్యకశ్రుతి సమ్మతము. ఆలాగుననే ఋషులలో గొప్పవాడగు యాజ్ఞవల్క్య మునీంద్రునితో మహర్షిమండలియందు, నానాదేశమహాపండితుల సభయందు, జనకాది రాజర్షులచే నిర్వహింపబడిన సత్రయాగమందు బ్రహ్మచారిణియగు గార్గియను పేరుగల తపస్విని శాస్త్రార్థముచేసియుండదు. ఇదిన్ని శ్రుతిసమ్మతము. ఆలాగుననే యోగవిద్యయందు అణిమాది సిద్ధులనుబడసిన సులభయను రాచకన్య, బ్రహ్మచారిణి, తపోమహిమగల్గి జనకునితో బ్రహ్మవాదము చేసియుండదు. ఇది భారతమున గనందగును. శాస్త్రమందు స్త్రీలకు పరాపరవిద్యలందు నిషేధముండిన, ఈ మహత్తరమైన కార్యము జరిగియుండజాలదు. సులభయు బ్రహ్మచారిణియే. కేవలము కులవృత్తి ననుసరించియే స్వభావముగల్గి యుండునని చెప్పునది నిజమైనచో, పండితుల పుత్రులు పాండిత్యముగల వారుగను, ధనవంతుల పుత్రులు శ్రీమంతులుగను, పామరుల సంతతి

పామరత్వముతోకూడియు, దరిద్రుల వంశమును దారిద్ర్యముతోకూడియు నుండవలెను. అలాగున నెచ్చటను కనుపించుటలేదు. పండితుల వంశములలో నెందఱో పాండిత్యహీనులుగను, ధనవంతుల బిడ్డ లెందఱో దరిద్రులుగను, దరిద్రుల బిడ్డలెందఱో మహాశ్రీమంతులు గను, ఇదివఱలో విద్యలేనివారిలో నెందఱో మహావిద్వాంసులుగను కనఁబడుచున్నారు. ఇవన్నియు జీవియొక్క సంస్కారము ననుసరించి యుండును. అలాగుననే జ్ఞానుల వంశములో జ్ఞానములేనివారున్ను, జ్ఞానములేనివారి కుటుంబములో మహాజ్ఞానులున్ను పుట్టుచున్నారు. దీనికిన్ని జీవుల సంస్కారమే కారణము. దేహముననుసరించి, లేక జాతిననుసరించి జీవులుండరు. జీవులు వారివారిసంస్కారము ననుస రించి, యిప్పుడు బ్రాహ్మణవంశములోగల జీవి మఱల శూద్రవంశము లోను, శూద్రవంశములోగల జీవి మఱల బ్రాహ్మణవంశములోను పుట్టుట లోకప్రసిద్ధము. ఆరోగ్యముగల తల్లిదండ్రులకు రోగులైన బిడ్డలున్ను, రోగులైన తల్లితండ్రులకు ఆరోగ్యవంతులగు పుత్రులున్ను, అంగవైకల్యముగలవారికి సర్వాంగసుందరులును, సర్వవిధ సౌందర్యము గలవారికి మహాకురూపులున్ను జన్మించుచున్నారు. దీనికి జాతియు, జీవనవృత్తియు కారణమని యెవరైన చెప్పగలరా?

53. ప్ర:— ఇప్పుడు సెలవిచ్చినది మహత్తరమైన సంగతి. అయినను ఇది యేదో జన్మాంతరసుకృత విశేషముచే లభించఁదగినదే గాని, విషయసౌఖ్యమే ముఖ్యమనితలంచెడు చంచలస్వభావముగల స్త్రీలందఱికిని యిప్పుడాలాగున గల్గునా? అంతేగాక, ఇది కలియుగము; పైఁజెప్పినవారందఱున్ను త్రేతాయుగమున నుండినవారు.

ఉ:— ఇప్పుడు మీరు చెప్పినదానిలో రెండు విషయములు ముఖ్యములై యున్నవి. (1) జన్మాంతరసుకృతము. (2) కృతత్రేతాది యుగ మాహాత్మ్యము. ఈ రెంటికిన్ని ఏలాటి అర్థమున్ను లేదు. ఏలన, జన్మాంతరసుకృతవిశేషమంగీకరించదగినదే. అయితే జన్మాంతర పుణ్యవిశేషముచేతనే భక్తిజ్ఞానవైరాగ్యాదులు కలుగునని చెప్పినది మీకు నమ్మకమైనచో యిప్పుడుకూడ జ్ఞానమార్గములో నభిలాష గల వారికి జన్మాంతరసుకృతమని యేల చెప్పరాదు? కావున ముముక్షు

త్వము గలవారందఱినిగూర్చియు జన్మాంతరవిశేషసుకృతముచే వారికట్టి ముముక్షుత్వము కలిగినదని యేల నిశ్చయింపగూడదు? రెండవది, యుగభేదములు స్త్రీలకుమాత్రమే గలవని యేశాస్త్రమందైనగలదా? యుగప్రభావముండినను, స్త్రీపురుషులకందఱికిని అది సంబంధించియే యుండును. కావున ఇష్టముగల పురుషులకు జ్ఞానాధికారముండి స్త్రీలకు మాత్రము లేదని యెవరును చెప్పజాలరు. ముందు నిరూపించిన మైత్రేయి, గార్గి, సులభ, చూడాల మొదలగువారికి జన్మాంతర సుకృతమువలన జ్ఞానము కలిగినదని చెప్పినచో, అది కాకతాళీయ న్యాయప్రకారము అప్రయత్నముగానే యుండవలెను. సంస్కార విశేషబలముచేతనే శుభేచ్ఛగలుగును. అది నిస్సందేహము. కాని, ఈతపస్వినులు వేదశాస్త్రములలో అపారమైన పాండిత్యముకూడ గలిగి యున్నవారు. అందువలన వారిహృదయములలో నంకురించిన బ్రహ్మ జిజ్ఞాసయను జ్ఞానాంకురమునకు శాస్త్రపఠనమను దోహదము గలిగినందుచేతను పరమర్షి మండలియందు శాస్త్రార్థము చేయుశక్తి వారికి గలిగినది. అటులగుటనే కాననప్రదేశ పుణ్యాశ్రమములయందు వసించియే సులభయను క్షత్రియవంశజాతయగు బ్రహ్మచారిణియు మహాజ్ఞాననిధియగుటకు కారణమైనది. మఱియు జనకునికూడ విస్మయమొందింపశక్తిగలిగియుండెను. కావున వారున్న శాస్త్రపఠనముచేతను, తపస్సువల్లను, యోగానుష్ఠానమువల్లను అట్టి మహిమను పొందినట్లు తెలిసికొనవచ్చును. అటులగుచు చూడాల గృహస్థాశ్రమములో నుండి శిఖిధ్వజమహారాజుయొక్క అంతఃపురస్త్రీయగు ధర్మపత్నిగా నుండెను. ఈచరిత్రమును శ్రీ యోగవాసిష్ఠములో చూడవచ్చును. వీరు జ్ఞానమందు అద్వితీయపాండిత్యముగలవారై, మఱల యోగవిద్యయందభ్యాసముగల్గి, అణిమాద్యష్టయిశ్వర్యములనుగూడ పొందినవారు. కావున వీరికి జన్మాంతరసుకృతి యొక్కటి దానివలననే అట్టి మహిమాతిశయముగల్గెనని చెప్ప వీలులేదు. ఈప్రకారము వారు శాస్త్రము నధ్యయనము చేసినవారైయే యుండిరి.

54. ప్ర:— ఈ విషయములన్నియు యుగాంతరసంగతులే. ఈ కలియుగమున అట్లు జరుగునా?

ఉ:—ఏల దీర్ఘాలోచన చేయక చెప్పుచున్నారు? కలియుగమున పురుషులకు జ్ఞానము కలుగవచ్చునని యొప్పుకొనిన, స్త్రీలకు మాత్రమేల కలుగకూడదు? కలియుగమునకదా శ్రీ శంకరభగవత్పాదులు, శ్రీ రామానుజులు, శ్రీ మధ్వులు, శ్రీ కృష్ణచైతన్యులు, శ్రీ గురునానక్ మొదలగు అనేక బ్రహ్మజ్ఞానసంపన్నులేర్పడి యుండిరి. ఆలాగున పండరీపురములో శ్రీ ముక్తాబాయి, తిరుపతిలో శ్రీ తరిగొండ వెంకమాంబగారు మొదలగు స్త్రీరత్నములెందఱో ఈ దేశమున యుద్భవించిరి? కొలదికాలముక్రిందట యుండిన శ్రీ అనిబిసెంటమ్మగారుకూడ గొప్ప బ్రహ్మనిష్ఠురాలై యుండిరి. వీరికి బ్రహ్మజ్ఞానము లేదని యెవరైన చెప్పగలరా? యుగభేదమునుగుఱించి శుష్కవేదాంతతమోభాస్కరమున విస్తారముగ గనందగును. ఇది వఱలో ఆవిషయముబ్రాసియుండినందున మఱల యిచట తెలుపలేదు.

55. ప్ర:— చూడాలమొదలగు నారీమణులకు అణిమాది సిద్ధులు గలిగియున్నట్లు తెలిపితిరి. వారున్ను జ్ఞానము కలిగినపిమ్మటనే యోగము శీలించి సిద్ధులను పొందినట్లున్ను తెలిపితిరి. అత్తఱి జ్ఞానము వేఱుగాను, యోగము వేఱుగాను నుండునా ?

ఉ:— జ్ఞానమువేఱు, యోగమువేఱు. ఆలాగున భక్తి వేఱు గాను, నిష్కామకర్మయోగము వేఱుగాను నుండును. ఈ జ్ఞాన, యోగములు వేఱువేఱుగానే యుండును.

56. ప్ర:—జ్ఞాన, యోగములలో నేది మోక్షమునిచ్చును ?

ఉ:—"జ్ఞానాదేవ హి కైవల్యం" — జ్ఞానమొక్కదానివలననే మోక్షముకలుగును.

57. ప్ర:—అట్లయిన యోగమేల యభ్యసింపవలెను ? శాస్త్రములలో యోగమునకేల యాధిక్యత నివ్వవలెను ? మోక్షము గల్గచేయుని ప్రమాణమునకుగాని, అనుష్ఠానమునకుగాని ప్రాణమే లేదుకదా?

ఉ:—యోగమువలన ఫలితములేదని చెప్పరాదు. అది అంతఃకరణము లోగల దోషములను దహింపజేయుటలో అగ్నివలెనుండి కర్మకట్టెలను భస్మమొనర్చును. అంతేగాక చిత్తమున కేకాగ్రతయు కలుగచేయును. బుద్ధిని శుద్ధమొనర్చును. సంకల్పసిద్ధులు కలుగజేయుటలో యోగమ్ము

కల్పవృక్షమువంటిది. జ్ఞానమునకు చాల ఉపకారి. బుద్ధిని శుద్ధిపఱచి దానికతితీవ్రత్వ్ము కలుగజేయును. దీర్ఘకాల అగాధచింతనలు ఉద్భవించే లాగున చేయును. మహాగ్రహణశక్తికూడ కలుగును. శరీరమునకు మంచి ఆరోగ్యమును, స్వచ్ఛతను కలుగజేయును. అంతఃకరణ శుద్ధియు, చిత్తైకాగ్రతయు లేనివారికి జ్ఞానానుష్ఠానములో బుద్ధికి త్వరితముగా ప్రవేశము కలుగదు. కావున జ్ఞాననిష్ఠులు యోగనిష్ఠనుకూడ శీలించుదురు. "యోగం జ్ఞానం చ యస్యాస్తి తీర్ణస్తేన భవార్ణవః"— అనగా యోగమున్ను, జ్ఞానమున్ను యే సాధకునికి గల్గియుండునో, ఆతడు సంసారసాగరమును తరించుటకు సమర్థుడగునని శాస్త్రముద్ఘోషించుచున్నది. మఱల సిద్ధుల నుద్దేశించువారికి అవిఘ్నిగలుగును. కావుననే యోగమునుగుఱించి ముఖ్యముగా చెప్పెడు హఠయోగాది గ్రంథములలో "ఆరోఢుమిచ్ఛోఃరధిరోహిణీవ" — అనగా, సౌధమును యారోహించువానికి నిచ్చెనయెటువంటిదో, ఆలాగున ముక్తిసాధమునకు యోగము సోపానమువంటిదగును అని చెప్పబడినది.

58. ప్ర:— భక్తివల్లనే ముక్తి కలుగునని శాస్త్రములనంతముఖములుగా చెప్పుచుండగా అతిప్రయాసకరమగు ఈ వేదాంత విచారణయు, కఠినమైన యోగమున్ను యేల శీలించవలయు? సులభమార్గముండగా దుర్గమమార్గములో యేల ప్రయాణము చేయవలెను?

ఉ:— జ్ఞానమునకు యోగమేలాగున ఉపయుక్తమో, ఆలాగున మోక్షమున భక్తియున్ను ఉపయోగకరము. భక్తివలన భగవత్కరుణ గల్గునపుడు ప్రకృతిదోషములు నశించి నిజమైన ఆత్మతత్వము గోచరమగును. అట్టిదానినే జ్ఞానమందురు. చిల్లగింజచూర్ణముచే మట్టినీరేలాగున శుద్ధమగునో, అప్పుడడుగుభాగముననుండు సూక్ష్మవస్తువులెట్లు కానుపించునో, ఆలాగున భక్తివల్ల మాయామాలిన్యము నశించునపుడు ప్రకృతిదోషము లయమొందును. కావున అప్పుడు అతిసూక్ష్మముగ హృదయములో వ్యాపించియుండు ఆత్మతత్వము బోధపడును. అప్పుడు అనాత్మనుండి జీవునకు విముక్తిగలిగి తన నిజస్వరూపమగు ఆత్మయందు నిలుకడ కలుగును. అట్టిస్థితి జ్ఞానమనంబడును. అదికూడ,

జ్ఞానమువల్లనే మోక్షము కలుగునని సిద్ధించెడు వేదాంతశాస్త్రమునకు అనుకూలమే గలుగచేయును.

59. ప్ర:— అష్టాంగ యోగ, జ్ఞానాదులు కఠినమార్గములనియు, భక్తి ముక్తికి సులభమార్గమనియు యేల చెప్పవలెను ?

ఉ:— సులభమార్గమని చెప్పుటకు కారణమేమన, సర్వజనులకు సర్వసమయములందును భక్తి నభ్యసించుటకు సాధ్యమగును. శ్రీరామ, శ్రీకృష్ణాది యవతారమూర్తులనుగాని, లేక శివవిష్ణ్వాది స్వాయంభువమూర్తులనుగాని ఉద్దేశించి చేయు భజన, పూజా, స్మరణ, కీర్తనాదులనే భక్తి యనంబడును. ఇది యధికముగా సాకారము ననుసరించియేయుండును. దీనివలనగూడ క్రమముగా హృదయము శుద్ధమై, విషయవిరక్తిగల్గి, మేఘము గాలిచే వదలిపోవునపుడు ఆకాశమండలమున సూర్యుడు కనుపించునట్లు, చిదాకాశము శుద్ధమగునపుడు అంతర్యామిగా ప్రకాశించుచుండు ఆత్మదేవుని కనుగొనగలరు. అదియే మోక్షమనంబడును. ఇచటగూడ జ్ఞానమే కలుగుచున్నది. కావున జ్ఞానమువలన మోక్షమని చెప్పెడు శ్రుతివాక్యముల కేలాటి బాధయును లేదు.

60. ప్ర:— మీరు భక్తి సాకారమని సెలవిచ్చితిరి. నిరాకారమైన ఈశ్వరోపాసనను భక్తియని చెప్పరా ?

ఉ:— నిరాకారమగు దైవోపాసనకుకూడ భక్తియను పేరుగలదు. అధికజనులు సాకారోపాసనే భక్తియని చెప్పుదురు. కావున ఆలాగున చెప్పడమైనది. మఱియు, భక్తియను పదమునకు సేవయనియే అర్థము. అది ప్రభువును భృత్యులుగాని, భర్తను భార్యగాని, గురుని శిష్యులుగాని సేవించు విధముగా, భగవంతుని భక్తులు వుపాసించెడు విధముగా నుండును. ఆత్మజ్ఞాన విషయములో ఆలాగున జీవేశ్వరులకు భేదము చెప్పబడక యేకత్వమే ఉపదేశింపబడుచుండును. రెండవది యెచ్చటుండునో, అచ్చట ద్వైతముండును. ద్వైతమెచ్చటగలదో అచ్చట భేదముండును. భేదమెచ్చట గలుగునో అచ్చట సమత్వము సిద్ధింపదు. సమత్వమెప్పుడులేదో అప్పుడు క్లేశముగలుగుట నిశ్చయము. మోక్షమనిన, నిశ్శేషక్లేశరాహిత్యమున్ను, నిరతిశయానంద

సుఖమున్ను గలిగియుండవలెను. అంతియేగాక, ముక్తిదశయందు సర్వస్వాతంత్రము జీవునకు గలుగును. ఇది భేదముండు స్థలములో యెచ్చట సిద్ధించును? "ద్వితీయాద్వై భయం భవతి" అనగా భేద ముండు స్థలములో బాధయుండును. "మృత్యోస్స మృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి" అనగా, భేదబుద్ధి గల్గియుండువఱకు మృత్యువునుండి మృత్యువునే జీవుడు పొందుచుండును.

61. ప్ర:—ఇప్పుడు మూడుమార్గములుపదేశించితిరి? అయితే కర్మ యోగమునుగూర్చి యేల చెప్పలేదు?

ఉ:—ఆ విషయమును అడుగలేదు; కావున చెప్పలేదు. కర్మ యోగమునకు నిష్కామకర్మయోగమనియే మనము అర్థము గ్రహించ వలెను. ఇదియే శ్రీ కృష్ణభగవానులుపదేశించిన శ్రీగీతాశాస్త్రము. అంతేగాని మీమాంసకులు తెలిపెడు కామ్యకర్మము కాదు. వారు వేదమునకు కామ్యకర్మముతప్ప మఱొక అర్థమే లేదని చెప్పిరి. దాని యొక్క మూలపురుషుడగు జైమినిమహర్షి ధర్మసూత్రములలో ఆలాగున లిఖించెను. అయితే ఈ విషయమిపుడెవరున్ను అంగీకరించు వారు లేనందున అది మనకక్కఱలేదు. ముందుచెప్పిన భక్తియోగము వలె నిష్కామకర్మయోగముకూడ పాపక్షయమునకును, పుణ్యప్రాప్తి కిన్ని, భగవత్కృపకున్ను కారణమగుచుండును. దానివల్ల జీవుని యొక్క మలము నశించును. మలినవస్త్రమును చాకలివాడు చవుడు మట్టితో ఉడుకపెట్టి శుద్ధముగా యుతుకునప్పుడు ఏలాగున నిర్మల వస్త్రముగానుండునో, ఆలాగున నిష్కామకర్మయోగముచే జీవుడు శుద్ధుడు కాగల్గును. అప్పుడు తనయొక్క ఆత్మదేవుని కనుగొనుస్థితి వానికి లభించును. అత్తఱి ఆత్మయొక్క జ్ఞానమున్ను మోక్షమని చెప్పెడు స్థితిలోనికే రావలసియుండును.

62. ప్ర:— ఈ చెప్పబడిన జ్ఞాన, యోగ, భక్తి, కర్మలకు యెట్టి సంబంధము గలదు? ఒక్కొక్కటిమాత్రము ప్రత్యేకముగా నుండునా? ఉండిన ఒకదానివల్లనే ముక్తి లభించునా?

ఉ:— జీవకోట్ల సంస్కారములనేకములగుటచే, ఒక్కొక్కరి కిన్ని ఒక్కొక్కదానిలో మనస్సుయొక్క ప్రవేశము గల్గుచుండును.

మొత్తముపై పూర్ణజ్ఞానావస్థ గల్గునప్పటికి ఈ నాల్గింటిలోను ఒకటి ముఖ్యముగాను, తక్కినవి గౌణములుగాను యుండును. అనగా ఒకరికి జ్ఞానము ముఖ్యముగానుండినను, చిత్తైకాగ్రతయను యోగముచేతనే అది కలుగును. చిత్తమునకు నిశ్చలావస్థ కలుగకపోయిన, మనననిది ధ్యాసనములలో నిలుకడ కలుగదు. ఆలాగున దైవభక్తి మొదటనే కలుగనిచో బలమైన ప్రకృతిదోషము క్షయించదు. పుణ్యకర్మలు నిష్కామబుద్ధితో చేయనిచో పాపసంస్కారములు నశించి హృదయ శుద్ధి సిద్ధింపదు. కావున పైజెప్పిన నాల్గింటికిని, వస్త్రమునకు ఓత ప్రోతములవలె పరస్పరసంబంధముండును. ఆలాగున భక్తియోగ మైనను, ధ్యానయోగమైనను, నిష్కామకర్మయోగమైనను అన్యోన్య సంబంధము గల్గియేయుండును. కర్మయోగియైనను వానియొక్క కర్మమునకు పర్యవసానఫలము జ్ఞానమేగదా! ఆలాగున పరమ భక్తుడైనను వాని భక్తివలన కలుగు ఫలమున్ను జ్ఞానమే యగును. అట్లే అష్టాంగయోగనిష్ఠుడైనను జ్ఞానమేగదా వాని యోగము యొక్క ఫలితముకూడ. ఏభక్తుడైనను ధ్యానము చేయనివాడుండునా? ఏ నిష్కామకర్మయోగియైనను ధ్యానములేనివాడు కలడా? ఏ ధ్యాన యోగనిష్ఠుడైనను ఈశ్వరచింతనచేయక యుండగల్గునా? సుఖముగా భోజనము చేయవలసియుండిన, బియ్యము మొదలగు పదార్థములు, అగ్ని, జలము, పాత్ర కట్టెలు మొదలైనవి ఉండియేతీరవలెను. ఆ లాగున ఒక్కొక్కదానికి ఒక్కొక్కటి సంబంధపడియే యుండును. ఈ తత్త్వము తెలిసినవారే పూర్ణజ్ఞానులు. వారికి భేదములుండవు. పూర్ణజ్ఞానులుకానివారైన, భేదము గల్గియుందురు. మార్గములు వేర్వే రుగానున్నను గమ్యస్థానమొకటియే. అచ్చట ఏకత్వమేయుండును. నదీనదములు భిన్నభిన్నమార్గములుగా ప్రవహించినను సముద్రములో చేరునప్పుడు యేకమైపోవును. అచ్చట నానాత్వమెట్లుండును? ఒక నదీజలమును సముద్రమునుండి ప్రత్యేకముగా వేరుపరుపసాధ్యమగునా? సముద్రముచేరువఱకు ఆ నదీజలము భిన్నముగానేయుండును. ఇది ప్రత్యక్షముగదా.

63. ప్ర:—కొందఱు 'భక్తివలననే ముక్తి' యని వాదించుచున్నారే?

ఉః—భక్తియనుదానిచేతమాత్రమేకాదు. కొందఱు యోగము చేతనే ముక్తియని వాదింతురు. మఱికొందఱు నిష్కామకర్మయోగమే మోక్షమునిచ్చునని చెప్పుదురు. ఇకకొందఱు జ్ఞానములేనిచో మోక్షమే గలుగదని హఠముచేయుదురు. ఇవన్నియు పూర్ణావస్థ జెందనిచో గల్గెడు లోపములే. అయితే ఒక్కొక్కరున్ను ఒక్కొక్కమార్గ మవలంబించి మోక్షస్థానము చెందియుందురు. దానివల్ల ఆలాగున చెప్పుదురేకాని మఱియొకటి కాదు.

64. ప్రః—జ్ఞాన, యోగాది నాల్గింటిలో యేది ముఖ్యమైనది?

ఉః—ఇదిన్ని యిదివఱలో చెప్పినవాక్యమే. ఒకటిముఖ్యముగా యొకరికుండును. వేఱొకరికి ఇంకొకటి ముఖ్యముగా నుండును. వారు వారు దానినే ముఖ్యముగా చెప్పుట స్వభావము. నిజముగా చూచిన, గోవునకు నాల్గుపాదములుండ, వానిలో యేదిముఖ్యము, ఏది ముఖ్యము కానిది? ఆలాగున, ఒకమండపమునకు నాల్గుస్తంభములుండును. వానిలో యేది ఆ మండపమును మోయుటలో శ్రేష్ఠమైనది, ఏది శ్రేష్ఠము కానిది? నాల్గున్ను సమానములే. మోక్షమండపమునకు భక్తి, జ్ఞాన, యోగ, నిష్కామకర్మములు నాల్గున్ను సమానమైన పాదములే. మోక్షమనెడు కామధేనువునకు భక్తి, కర్మాది చతుష్పాదములు గలవు. అవి నాల్గున్ను యథార్థముగ సమానములే.

65. ప్రః— భక్తిమార్గములో కొందఱు కృష్ణభక్తియే అధిక మైనదనియు, మఱికొందఱు రామభక్తియే ముఖ్యమైనదనియు, ఇంక కొందఱు శివభక్తియే శ్రేష్ఠమైనదనియు, వేఱుకొందఱు విష్ణుభక్తియే ముఖ్యమనియు చెప్పుచున్నారే? మఱియు వానికి ప్రమాణములను కూడ చూపుచున్నారే?

ఉః—శివభక్తి గొప్పదని కొందఱు, విష్ణుభక్తి గొప్పదని కొందఱు ఈలాగున చెప్పుదురు. ఇదిన్ని వారువారు పొందిన మార్గమునను సరించి చెప్పెడు స్వభావమేగాని యింక విశేషమేమియును లేదు. శాస్త్రము లనంతములు—ఎవరి బుద్ధికెంత సమర్థతగలదో, అంత వారు గ్రహించుకొనవచ్చును. దీనికన్న ఈవిషయమై యేమియు తలంచవలసిన పనియేలేదు. భక్తి గొప్పదికాదా, యోగముగొప్పది

కాదా, కర్మయోగము గొప్పదికాదా, జ్ఞానవిచారము గొప్పదికాదా అని వాదించిన, యేమియు ప్రయోజనము లేదు. గుణమొక్కటి మాత్రమే గొప్పది. గుణము మంచిదిగానిచో పైఁజెప్పినవన్నియు కళాయిలేని పాత్రలో వండిన పప్పుపులుసువంటిదేయగును. కావుననే అపుడు శాంతి, శమ, దమాది సాధనములన్నియు ఊషరక్షేత్రములో చేసెడు కృషివలె వ్యర్థమని శాస్త్రములు చెప్పుటకు కారణమైనది. 'శుభం బీజమివోషరే' దీనిని నిజముగ నమ్ముము. తక్కినవన్నియు అభిమానపూర్వకమైన వాక్యములే.

66. ప్ర:— ఒక్కొక్కకాలమున ఒక్కొక్కరు జీవన్ముక్తులు, మతకర్తలు, జ్ఞానబోధకులు అవతరించినప్పుడు వారవలంబించిన మార్గమే వేదమార్గమనియు, మోక్షమునకు సులభమనియు ఉపదేశించి యున్నారే, అదేమి?

ఉ:—ఇదిన్ని పైజెప్పినదానిలో యంతర్భూతమే. మఱియొక కాలమున మఱియొక మహాపురుషుఁడవతరించినపుడు ఆతడవలంబించిన పద్ధతియే వేదముయొక్క సిద్ధాంతమని చెప్పునదిన్ని ఇదేరీతిగానే యుండును. అయితే దీనియందొక రహస్యముగలదు. వేదములలో నాల్గు మార్గములు గలవు. ఇవి సనాతనములు. వీనిలో దేనియందు క్షీణదశ కలుగునో అప్పుడు దానినుద్ధరించుటకొఱకొక దివ్యపురుషుడు జన్మించును. ఆతడామార్గము నుద్ధరించును. మఱియొక కాలమున ఇంకొక దానియందు కొఱఁతగల్గిన, దానిని భర్తిచేయుటకు దివ్యపురుషుఁడొకడు భూలోకమునకు వచ్చును. ఆతడు వచ్చినపని పూర్తిచేయును. ఈలాగున అనంతకాలమువఱకు జరుగుచునే యుండును. దీనిలో యేలాటి ఆశ్చర్యముగాని, ఆధిక్యతగాని లేదు. ఈశ్వరుని నియతి ఆలాగుననే యుంటున్నది. ఒకడు మలబద్ధకవ్యాధిచే కష్టపడుచుండెను. అతనికొక ఔషధ చూర్ణముచే మలబద్ధముపోయి సుఖము సిద్ధించెను. అదే వ్యాధితో మఱియొకడు బాధపడుచుండెను. అతనికి ఓషధిచే చేయబడిన ఒక లేహ్యముచే మలబాధనివృత్తిగలుగ, అతడున్ను సుఖపడెను. వేఱొకడు అట్టిరోగముచే మిగుల సంకటపడుచుండెను. అతనికి ఒక కషాయముచే శాంతికలిగెను, అతడున్ను మంచి ఆరోగ్యముగల్గి

రోగవిముక్తుడయ్యెను. అదేరీతిగా రోగముగల మఱియొకడు ఒక మాత్రచే సుఖవంతుడయ్యెను. వీరందఱున్ను తమకు మందిచ్చిన వారినే ఎక్కువగా పొగడసాగిరి. ఆ యా ఔషధములనే వర్ణింపఁ బూనిరి. వీనియందేది సత్యము? ఏది అసత్యము? అన్నియు సత్య ములే. ఇవన్నియు ఆయుర్వేదములో గలవు. అదేరీతిగ ఒకడు భక్తిచే భవరోగవిముక్తుడయ్యెను. ఇంకొకడు జ్ఞానముచే అజ్ఞానమునుండి విడుదల నొందెను; మఱియొకడు యోగముచే అవిద్యనుండి విమో చనమునొందెను. నాల్గవవాడు నిష్కామకర్మయోగముచే భవరోగ రహితుడయ్యెను. ఇదే దీనిలోగల రహస్యము.

67. ప్ర:— కర్మయందు తమకు విశ్వాసముగలదా? ఉండిన ఒక్కొక్కజీవుని జన్మాంతరకర్మనుబట్టిగదా, ఆతడాయా జాతిలో జన్మించును? దాని నెవరు మార్పగలరు?

ఉ:— కేవలము కర్మనుబట్టి జాతి కలుగుటలేదు. అట్లయిన, సంస్కారక్రియ శాస్త్రమందేల యేర్పడి యుండవలెను? జన్మాంతర కర్మదోషముచే వ్యాధి యేర్పడినది నిజమైనను, దానికి కర్మనివృత్తి పరమగు ఔషధమును ఈశ్వరుడే సృష్టించియున్నాడు. కేవలము కర్మయందే ఆధారపడియుండిన, ఔషధముచే ఏ వ్యాధియు కుదిరి యుండక యుండవలసియుండును. అట్లు కానుపించుటలేదు. ఆయుర్వే దముకూడ వేదములో నొకయంగమే. ధన్వంతరి విష్ణ్వంశములో జన్మించి ఆయుర్వేదమును చరకాది ఋషుల కుపదేశించి లోకమున వ్యాపింపజేసెను. మఱియు, జ్యోతిషముకూడ వేదాంగమే. దానిలో జన్మాంతరకర్మదోషమునకు ప్రాయశ్చిత్తాది విధులు గాన్పించుచున్నవి. ఈ జ్యోతిశ్శాస్త్రమును వ్యర్థమని యెవరైనను చెప్పగలరా? మఱి యు, మనశ్చాంచల్య ముడుగుటకు యోగశాస్త్రమేర్పడెను. ఇదిన్ని వేదాంగమే. ఇదిన్ని ఉపయోగములేనిదని తలంచువారుగలరా? కావున కర్మలను పరిహరించుకొనుటకు మార్గమే లేనిచో ఈ శాస్త్రము లన్నియు నిరుపయోగములు కావలసియుండును. అదిన్నిగాక, మాన వుల కభివృద్ధికరములగు కార్యములున్ను, బంధవిచ్ఛేదనకరమగు ముక్తియు శాస్త్రముపదేశింపకయే యుండవలెను. మఱియు అజ్ఞాన

నివృత్తికొఱకేర్పడిన దైవభక్తి, ఉపాసన, ధ్యానము మొదలైన వన్నియు నిష్ప్రయోజనములు కావలసివచ్చును.

68. ప్ర:—ఆలాగున కర్మనివృత్తికరములగు కార్యములను మీరుచేసి చూపగలరా? అట్లైనచో మీరు చెప్పినది నిజమని లోకమంగీకరించును.

ఉ:—ఏలాటి సందేహమునులేదు. ప్రత్యక్షముగ రాజవీధిలో సూర్యుడు ప్రకాశించుచున్నపుడే చూపెదను. జన్మాంతరకర్మదోషముచే ఒకరికి సర్పము కఱచి విషమెక్కిన, దానిని మంత్రముచేగాని, ఔషధముచేగాని నివృత్తిచేయునది చూచుటలేదా? జన్మాంతరకర్మదోషముచే యొకరికి భూతప్రేతపిశాచాది గ్రహముల యావేశము గలిగిన, వెంటనే భూతవైద్యుడు దానిని బాగుపఱచుచున్నాడుగదా. ఈలాటి కార్యములన్నియు కర్మనివృత్తికార్యములు కావా? రోగనివృత్తికి ఔషధముండిన, కర్మనివృత్తికిని మార్గముండును. ఇదియెల్ల ఈశ్వరనిర్మితమేగాని, ఈశ్వరాజ్ఞ నతిక్రమించి చేయబడినది కాదు. ఉత్సాహము, కార్యమందు ప్రయత్నము, పనియందు శ్రద్ధ, దైవమందు భక్తిమొదలగు ఆఱుగుణము లేజీవియందుండునో అతనికి ఈశ్వరుడున్ను సహాయపడునని శాస్త్రము బోధించుచున్నది. ఎట్లన,

ఉత్సాహం సాహసం ధైర్యం బుద్ధిశ్శక్తిః పరాక్రమః।
షడేతే యత్ర తిష్ఠన్తి తత్ర దేవోఽపి తిష్ఠతి॥

69. ప్ర:—ఏలాగున ఒకసభలో గవర్నరు, కలెక్టరు, సూపరింటెండెంటు, సర్కిల్ ఇన్స్పెక్టరు, సబిన్స్పెక్టరు, పోలీసు జమాను మొదలగువారి కేర్పఱుపబడిన స్థానములలో వారువారు కూర్చుండుట న్యాయముగాని, జమాను తానుండవలసిన స్థానములో నెమ్మదిగనుండక అహంకార మవలంబించి సూపరింటెండెంటు స్థానములో కూర్చుండుటయు, గుమాస్తాకేర్పఱుపబడిన స్థానములో గుమాస్తా నమ్రతగనుండక కలెక్టరునకుగాని గవర్నరునకుగాని యేర్పఱుపబడిన స్థానములలో దుర్మదముతో వెళ్ళి కూర్చుండుటయు యెంత అన్యాయమో, అట్లుచేయువార లేలాగున శిక్షార్హులగుదురో, ఆలాగున జన్మాంతరకర్మలననుసరించి వర్ణాశ్రమము లేర్పడెనుకావున న్యాయశీలురందఱున్ను వారివారి కేర్పఱచిన వర్ణాశ్రమములలోనే యుండవలసి

నదేకాని, వేఱువిధముగ యేమాత్రమును చేయకూడదు.

ఉ:—ఈ పాపపుప్రశ్న మీహృదయములో యెచ్చట దాగి యుండెను? ఏ క్రూరులు మీకీలాటి విషప్రయోగమువంటి దుష్టోప దేశముచేసిరి? దీనివల్లగదా పుణ్యభూమియగు భారతదేశము హీన స్థితిలోనికి వచ్చినది! ఇది యెటువంటిదనగా, పాఠశాలలో మొదటి తరగతిలో చేరు బాలురకు ఆ జన్మమంతయు ఆ తరగతిలోనే చదువ వలెనని చెప్పినట్లును, చిన్నకాలమున పిల్లలకు పెట్టెడు అహారము మాత్రమే యెంత పెద్దవారైనను పెట్టవలెనని చెప్పెడు వచనము వంటిదని గ్రహించుకొనవలెను. అయ్యో! మానవుల బుద్ధి సత్య విచారమునుండి యెంత దూరమైపోయినది! స్వయం విచారణ, విచ క్షణాశక్తి ఎంత నశించిపోయినది! ఓహో! పశుప్రాయుడైనను ఇట్టి దురన్యాయమును నమ్మునా! ఆహా! కష్టము! కష్టము! ఓ నాయనా! మీరు చెప్పిన వాక్యములను కొంచెమైనను మీరు విచారణ చేసినట్లు కాన్పించుటలేదు. ఏలన గవర్నరు, కలెక్టరు, సూపరింటెండెంటు మొద లైనవారిలోను, గుమస్తాలలోను, జమానులలోను, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర, తదితర జాతిభేదము యేదైనగలదా? ఎవ రెవరు యెంత పరీక్ష ప్యాసు అయిరో వారివారికి ఆలాటి ఉద్యోగములు దొఱకుచున్నవి. దీనివల్లనే గుణములకే ప్రాధాన్యముగాని, కులము నకుగాని, సంన్యాసాశ్రమమునకు గాని లేదని తెలిసికొనగూడదా? మీరు చెప్పినయుక్తిలోనే యీన్యాయము గల్గియున్నదే. మఱల యేల సంశయించుచున్నారు? గుమస్తాలలో అన్ని జాతులవారును ఉన్నారు. కలెక్టరులలోను, సూపరింటెండెంటులలోను సర్వజాతులవారును ఉంటు న్నారుగదా. ఈ పరమసత్యమును మఱువకుము. ఈ ఉద్యోగములలో హిందువులుమాత్రముకాదు, క్రైస్తవులున్ను, మహమ్మదీయులున్ను, ఇతరజాతులవారున్నుకూడ యున్నారు. వారివారి పరిశ్రమ ననుస రించియే ఉన్నతస్థానములోనికి వారు వచ్చియున్నారు.

70. ప్ర:— నైజమునకు సంస్కారములచే మార్పుకలుగునా? నైజమనినను, సనాతనమనినను యొకే అర్థముగదా?

ఉ:—ఈ ప్రశ్నలన్నియు కేవలము జడస్వభావముగలవారికి

సంబంధించినవి. ఫలన స్ఫుటముచే తామ్రము సువర్ణమగును. మఱియు హీనలోహములు కలిసిన బంగారము స్ఫుటముచే శుద్ధమగుచున్నది. విషయయుక్తమగు పాషాణాదిద్రవ్యములన్నియు స్ఫుటాదులచే, అనగా సంస్కారముచే శుద్ధదివ్యౌషధములుగా మారుచున్నవి. రోగముతోకూడి వికారయుతమైన శరీరము కల్పముల సేవనముచే దివ్యకాయమగుచున్నది. మలినహృదయుడు భక్తివైరాగ్యాదులచే శుద్ధాత్ముడున్ను, జ్ఞానవంతుడున్ను యగుచున్నాడు. సంస్కారములచే మానవుడు దేవుడగుచున్నాడు. దేవుడు మఱల దుష్టసంస్కారముచే తిర్యగ్జీవి యగుచున్నాడు. నహుషుడనువాడు భూలోకములో రాజై యుండిన ఆ జన్మములోనే దేవేంద్రుని పట్టణమున కధిపతి యయ్యెను. కాని తరువాత ఆ జన్మములోనే పాపకర్మముచే అజగరమై భూలోకమున పడిపోయెను. పై జెప్పిన చరిత్రములన్నియు శాస్త్రసమ్మతములు. మీ ప్రశ్నలో ఒక రహస్యముగలదు. అదేమన, నైజమునకు మార్పుగలుగగూడదని. అట్లయిన యీ జీవకోట్లన్నియు ఈశ్వరాంశములు కావా? వాని యీశ్వరత్వమునకు మార్పు కలుగగూడదుగదా. మఱల యేల యిట్లు చెప్పెదవు? చిన్న ఉద్యోగములలో నుండువారెల్లప్పుడున్ను ఆలాగుననే యుండవలెనను నియమమేలాగున లేదో, ప్రయత్నములచేతను, మంచిగుణములచేతను యేలాగున పై స్థానములలోనికి పోవచ్చునో, ఆలాగున మానవుడుకూడ మంచిపరిశ్రమయు, మంచిగుణములున్ను గలిగియుండిన ఉన్నతస్థితిలోనికి వెళ్లవచ్చును. ఆలాగుననే ఉన్నతస్థితిలోనుండువారు దానికి సరియైన ఉన్నతగుణములు గల్గియుండనిచో క్రిందిస్థానములోనికి తప్పక పోవుచున్నారనియే సత్యశాస్త్రముయొక్క అభిప్రాయము.

మూ॥ ధర్మచర్యయా జఘన్యో వర్ణః పూర్వం
పూర్వం వర్ణమాపద్యతే జాతిపరివర్తౌ।
అధర్మచర్యయా పూర్వో వర్ణో జఘన్యం
జఘన్యం వర్ణమాపద్యతే జాతిపరివర్తౌ॥

అనగా, క్రిందితరగతిలోనుండువారు బ్రహ్మచర్యతపోధ్యానాది అనుష్ఠానములచే ఊర్ధ్వగతి పొందుచుందురు. జాతి చక్రమువలె

పరివర్తనముతో కూడినది. ఆలాగున ఉన్నతస్థితిలోనుండువారు దానికి తగిన ధర్మానుష్ఠానములేనిచో క్రిందిస్థానమునకు వెళ్ళుచుందురు. జాతికి స్థిరత్వమనునది లేదు. అది సుగుణ, దుర్గుణములఁబట్టి ఘటీయంత్రము వలె క్రిందకును, పైకిని పోవుచుండును.

71. ప్ర:—జీవులు ఈశ్వరాంశులనియు, సనాతనులనియు, అందువల్ల నైజమునకు మార్పుగలుగదనియు ముందుచెప్పిన వాక్యమునకు నిజమైన అర్థము నాకింకను స్పష్టము కాలేదు. కావున విశదముగా చెప్పగోరుచున్నాను.

ఉ:—నాయనా! అదంతయు నిప్పుడు చెప్పిన యేమియు ప్రయోజనము లేదు. శాస్త్రమంతయు ఇప్పుడు గ్రంథములలో గాఢ సుషుప్తియందున్నది. జనులు వాక్కుతోమాత్రము స్వప్నములో నుండువారివలె మాట్లాడుచున్నారు; క్రియయందెవరున్ను అట్లు నడుచువారు లేరనియే చెప్పవచ్చును. ఉండిన, అతిస్వల్పసంఖ్యాకులు మాత్రమే. వారు ఈలాటి వర్ణాశ్రమవ్యవహారములకు రారు. అట్టివారు గుణములకుమాత్రమే యాధిక్యత తెలుపుచుందురు. సత్యముయొక్క రహస్యము వారికి తెలియును. శ్రీ రామకృష్ణపరమహంసాది దివ్యపురుషులే యిందుకు తార్కాణము. పైఁజెప్పిన ఈశ్వరాంశ జీవుల రహస్యమేమన, ప్రజ్వలించుచుండెడు అగ్నిగుండమునుండి మిణుగురులు లేచునట్లు, ఈశ్వరునినుండియే జీవకోట్లన్నియు యేర్పడినట్లును, అందువల్ల జీవులు ఈశ్వరస్వరూపులనియును ముండకాది శ్రుతులు సాక్ష్యమిచ్చుచున్నవి. ఈ సత్యము నెవరు విందురు? అయినను ఈ భావముకూడ అంతగొప్పదికాదు. వేదాంతవేత్తలు దీనికన్న గొప్పదైన అర్థమింకొకటి చెప్పుదురు. అదేమన, ఈశ్వరుడు సృష్టిని సంకల్పించెను. భూతకోట్లలో ప్రవేశించెను. అందువలన అందటిలోను గల చైతన్యము ఈశ్వరుడే. ఓహో! ఇది యెంత గొప్ప అర్థము! ఎంత గొప్పమహిమ గలది! ఎంత ప్రేమవాక్యము! ఎట్టి దివ్యతత్వమును ఋషులు బయలుపఱచిరి! పరమపవిత్రుడవగు ఆత్మసోదరా! దీనికన్న మిక్కిలి హెచ్చైన ఒక గొప్ప అర్థమును, వేదము కడవఱకు చదివి వేదాంతార్థమును మననముచేసిన వేదజ్ఞులు చెప్పుచున్నారు. అదే

మన, రజ్జుసర్పన్యాయము. దీనినే శాస్త్రములలో వివర్తవాదమందురు. ఇదియే వేదాంతముయొక్క అంతిమోపదేశము. అనగా జీవులున్ను, జగత్తున్ను, అంతయు ఈశ్వరస్వరూపమే. అనగా పరబ్రహ్మస్వరూపమే. అనాదియగు అవిద్యయొక్క ప్రభావముచే, త్రాడును జూచి సర్పమని భయపడినట్లు, పరబ్రహ్మమునుజూచి జగత్తను భ్రాంతిగలుగుచున్నదేగాని మఱి యేలాటిమార్పున్ను గలిగియుండలేదు. కావున అందఱున్ను, అన్నియున్ను పరమాత్మస్వరూపములే, పరబ్రహ్మమే. ఓహో! ఎంత అమృతసదృశమగు ఉపదేశము! మాయగలవారికే భ్రాంతిగలదనియు, తక్కినవారికి లేదనియు చెప్పుదురు. అట్లైన మాయగలవారి మాటలు అసత్యములుగదా! అసత్యవాక్యములను మనమేల నమ్మవలెను? మాయలేనివారి సత్యవాక్కులను నమ్మిన చాలునుగదా. అయితే ఈ దివ్యోపదేశప్రకారము బోధించెడు ఆచార్యులు, ఆచరణగలవారు ప్రపంచమున ఉంటున్నారా? అని యడుగవలదు. ఆ యుపదేశములన్నియు అతిపవిత్రమగు వేదముల లోపలి పత్రములలో నిశ్శబ్దముగ నిర్జనప్రదేశమున నిర్వికల్పసమాధిలో నున్నవి. సమాధినుండి ఉత్థానదశ కలిగేకాలము వచ్చిన, అప్పుడు మాత్రమే ప్రశ్నించవలెను. మనదేశమున గలిగిన హానియంతయు, చెప్పేలాగున చేయువారు లేకపోవుటచేతనే.

72. ప్ర:—జీవకోట్లన్నియు ఈశ్వరాంశములని చెప్పెడు శాస్త్రవాక్యమెంత అమృతసమానముగా నున్నది! అట్లైన నది సహోదర వాక్యమునకు సమానముగానుండును. రెండవది, అపారమైన మహిమ గలిగినదిగా తోచుచుండును. ఈ దివ్యవాక్యము వేదముయొక్క రహస్యమనికూడ సెలవిచ్చితిరి. అట్లైన నొకడు శ్రేష్ఠుడనియు, ఇంకొకడు నికృష్టుడనియు నెట్లు చెప్పెదరు? ఇక, రెండవదానిలో సోదరభావము కూడ మించిపోయినది. ఏలన, ఒకేవస్తువుగానున్నప్పుడు రెండవది యెచట గల్గును?

ఉ:—అదేమియు అడుగవలదు. ఆబోధలన్నియు ఉపన్యాస వేదికనుండి దిగువఱకుమాత్రమే ఆయుస్సుగల్గియుండును. ఇక యేదైన

నిష్కర్షించి అడిగినచో — అది గ్రంథములలో గలదు, దానియం దీలాగున చెప్పుచున్నదనిమాత్రము సమాధానము మీకు లభించును. అట్లుకానిచో, కొంత ప్రశాంతబుద్ధిగలవారైనచో, ఆ యుపదేశ మంతయు జ్ఞానులకొఱకు కేర్పడినదని చెప్పవచ్చును. దీనికన్న అధిక మేమియు మనకు సమాధానము లభింపజాలదు. కావుననే హిందూ మతమునకు పతనముగల్గినది. శాస్త్రములన్నియు బాగుగా చెప్పేవారే గాని, చేయువారు లేకపోయిరి. అందువలన ఔషధోచ్చారణచే రోగము శమించనట్లును, పంచభక్ష్యపరమాన్నాదుల వచనములచే ఆకలి శమించనట్లును, భారతీయుల తాపత్రయాగ్నిచే గల్గిన బాధ తొలగకపోయెను. ప్రాక్పశ్చిమదేశీయులు చెప్పేలాగున చేయుచుండఁ గిరి. కావున వారు ఉన్నతస్థితిలోనికి వచ్చుట కవకాశము గలిగెను. ప్రాగ్దేశములనగా మనకు తూర్పుననున్న జపాను మొదలగు దేశములని గ్రహింపవలెను.

73. ప్ర:— పైఁజెప్పిన శ్రుతివాక్యములకు వారేమి సమాధాన మిచ్చెదరు ?

ఉ:— అది వ్యవహారదశయేగాని పారమార్థికముకాదనియు, లేక సంస్కారముల భేదములనియుమాత్రమే అడిగినవారికి సమాధానము లభించును.

74. ప్ర:— సనాతనవస్తువునకు మార్పుగలుగదని ముందుచెప్పి యిప్పుడు వ్యావహారికమనియు, పారమార్థికమనియు సంస్కార ములచే, భేదముగలదని చెప్పినందున మీ వాక్యములలో పూర్వో త్తరవిరోధము కాన్పించుచున్నది. సంస్కారము నమ్మినచో, మంచి సంస్కరణమువల్ల చెడు సంస్కారమును పోగొట్టవచ్చునుగదా. ఏలన వస్త్రము శుభ్రముగానుండినను, మాలిన్యముచే మలినత్వము నొంద వచ్చును. అయితే చవుడు, సబ్బు మొదలగు క్షారాదులచే దానిని శుద్ధపఱచవచ్చునుగదా. కావున పారమార్థికమును ఒప్పుకొనకపోతిరి. వ్యావహారిక సంస్కారమును అంగీకరింపజాలరైతిరి. ఇక న్యాయ మెచట నున్నది ?

ఉ:— న్యాయమా అన్యాయమా అని యడిగిన, ఇది కలి

యుగమనియెదరు. ఏమి చేయవలెను ? ఈశ్వరుడొక్కడే శరణ్యుడు. వేఱేమియు గతి కనుపించుటలేదు. అట్టి పరమ కారుణికుడగు జగత్పితను గుఱించి తపమొనర్చుటయో, లేక ప్రార్థించుటయో తప్ప వేఱు మార్గము లేదు.

75. ప్ర:— తపమొనర్చి పరమేశ్వరుని ప్రత్యక్షమొనర్చుకొనుట సామాన్యమైనపనియా ? ప్రార్థనచేయుటయు అందఱకును సులభ సాధ్యమా ?

ఉ:— ఈశ్వరునిగుఱించి తపస్సుచేసి వానిని ప్రత్యక్షము చేసికొనకున్నను, భక్తుల కష్టముల నివర్తింపజేయుట సర్వేశ్వరునియొక్క ఒక పనియైయుండును. పూర్వీకులందఱును దుస్సాధ్యకార్యములన్నింటిని తపస్సుచేతనే సాధించియుండిరి. రాక్షసాదుల బాధ యోర్వజాలనప్పుడు దేవతలున్ను బ్రహ్మాది ఋషులున్ను భగవంతునిగూర్చి ప్రార్థన చేసినట్లున్ను, భగవంతుడు వారి కష్టములను తొలగించినట్లున్ను శాస్త్రములలో కాన్పించుచున్నది. భక్తులయొక్క ప్రార్థన వ్యర్థముకాదు. మఱియు భగవంతుడు భక్తవత్సలుడు, దీనబాంధవుడు, కరుణాసముద్రుడు. ఈ బిరుదులన్నియు ఋషులందఱును పరమేశ్వరునకు కల్పించియున్నారు. కావున, సర్వేశ్వరుడు పరమఋషుల వాక్యములను తప్పక పాలించును. రెండవది, భగవంతుడు భక్తులయందు అపరిమితమైన ప్రీతిగలవాడు. ఈ రెండుకారణములచే తపఃప్రార్థనాదులకు తగిన ఫలము తప్పక కలుగును. మఱియు స్వాతంత్ర్యములేనివారందఱున్ను సత్కర్మపరులై యుండవలెను. మఱియు ధర్మనిరతులుగాను, పుణ్యకర్మపరులుగాను కావలసియుండును. ఏలన కర్మఫలము తప్పక కలుగును. కర్మయొక్క శక్తి అపారమైనది. కావున, సత్కర్మలవలన మంచిఫలము గలుగుట నిక్కము.

76. ప్ర:— సత్కర్మచేయుటకు ధనము కావలెనుగదా. అట్టిచో, బీదలు ఏలాగున సత్కర్మ ఆచరింపగలరు ?

ఉ:— ధనముతోచేయు సత్కర్మలకంటె భక్తితోచేయు ప్రార్థన యెక్కువయైనది. ఋషులందఱున్ను భక్తిచేతను, తపస్సుచేతను సర్వేశ్వరుని కృపకు పాత్రులైరి. గీతలో యజ్ఞములకన్నను, దానముల

కన్నను, వేదాధ్యయనములకన్నను భక్తికే ప్రాధాన్యమిచ్చియున్నారు. "భక్త్యా తుష్యతి," "భక్త్యా మామభిజానాతి"—భక్తివల్ల భగవంతుడు సంతుష్టిగలవాడగును. అట్టి భక్తి ధ్యానాదులున్ను, ప్రాణికోట్లయందు దయయు గల్గియుండుటకంటె అధికమైన దింకొకటిలేదు. ఇందులకెన్నియో ప్రమాణములు గలవు.

యద్దుష్కరం యద్దురాపం యద్దుర్గం యశ్చ దుస్తరమ్।
తత్సర్వం తపసా ప్రాప్యం తపో హి దురతిక్రమః॥

తా॥ ఏది దుష్కరమో, ఏది దుష్ప్రాప్యమో, ఏది దుర్గమమో, ఏది దుస్తరమో అదియంతయు తపస్సుచేతనే ప్రాప్తించుచున్నది. తపస్సుచేత పొందతగని స్థానమే లేదు.

77. ప్ర:—గుణకర్మలకు అధిక్యతనిచ్చెడు మతమే న్యాయమైనదని తాము సెలవిచ్చియున్నారు. అట్టిమతము ప్రస్తుతము ప్రపంచములో యేదిగా నుండును? దానినెఱింగిన, ఆమతమున చేరి ప్రపంచములో ధర్మమును బోధించెద.

ఉ:—మతములో చేరుటయనగా మతిని మార్పుచేసికొనుటయే. అనగా, మనస్సును మార్పుచేసికొనుటయే మతమును మార్పుచేసికొనుటయగును. అంతేగాని వేషమును, భాషను, పేరును మార్పుచేసికొనుటకాదు. పామరులుమాత్రమే భాషను మార్పుచేయుటయు, వేషమును మార్చుటయు, పేరును పరివర్తించుటయు గొప్పతనమని తలంతురు. అదిన్ని యొకవిధమగు మూఢనమ్మకమేగాని దానియందు సత్యమేలేదు. లోకములో అదియొక వాడుకమీాద వచ్చెను. తమ సంఘమును బలపఱచుటకు అదియొక కారణముగా చెప్పెదరు. అది యీకాలమున కక్కఱలేదు. మనస్సు శుద్ధముగను, దయాన్వితముగను, దైవభావనతో గూడినదిగను నుండినచాలును. పాత్ర యేలోహముతో గాని, ఆకృతితోగాని, రంగుతోగాని యుండినను విరోధము లేదు. దానియందుండు జలముమాత్రము శుద్ధముగానుండిన చాలును. అపుడు సర్వత్ర ప్రకాశించు సూర్యుడందు స్వచ్ఛముగా ప్రకాశించును. ఆలాగున, హృదయశుద్ధిగలిగిన, సర్వవ్యాపకుడగు సర్వేశ్వరుడు అట్టివారి మనస్సులో ప్రత్యక్షమగును. శ్రీ రామకృష్ణమిషనువారి

యొక్కయు, దివ్యజ్ఞానసమాజమువారియొక్కయు సిద్ధాంతమిదియే. ఈ యుభయసంఘములలో అన్నిమతస్థులవారున్ను గలరు. విశ్వాసముచే మనస్సు శుద్ధము గావించుకొనిన చాలుననియే వారియొక్క సిద్ధాంతము. దేహములో కొన్ని చిహ్నములుగాని, వస్త్రధారణలో కొన్ని మార్పులుగాని కలిగించినను, ఆత్మకు దానివల్ల ఏలాటి శుద్ధియున్ను గలుగదు. కావలసినది ఆత్మశుద్ధియే. అదియొక్కటియే ఫలమును గలుగజేయును. మఱియు, ఏమతములో సర్వాధికారము గుణకర్మల ననుసరించి గలుగునో ఆమతమున, కావలసియుండినచో చేరవచ్చును.

78. ప్ర:—తాము సెలవిచ్చినట్లు, క్రైస్తవమతములోగాని, మహమ్మదీయమతములోగాని, బౌద్ధమతములోగాని చేరిన, సర్వ జనులకున్ను సమానహక్కు కలుగునుగదా? సోదరభావమున్ను ఉండునుగదా?

ఉ:—క్రైస్తవ, మహమ్మదీయమతములలో సోదరభావము, సమత్వమున్ను గలదు. కాని ఒకమతమున చేరవలసియుండిన, పూర్వము ఉండిన మతముకన్న అధిక ఆత్మశుద్ధిగలుగుటకు తగిన అనుష్ఠానము గలిగియుండవలెను. పైఁజెప్పినవాటిలో ప్రార్థన, సమత్వము, సోదర భావము గలవుకాని మీరిప్పుడుండు సనాతనమతమునందలి వాటికంటె ఆహారనియమము, దైవచింతనము, బ్రహ్మచర్యము, తపస్సు మొదలైనవి అందెక్కువగానుండిన చేరవచ్చును. లేనిచో యేమి ఫలము? ఆలాగున బౌద్ధమతమున్ను శుద్ధమైనదే; దయతో కూడినదే. కాని ఈశ్వరవిషయమై బుద్ధదేవుడు కలడనిగాని, లేడనిగాని చెప్పనందుచే దైవభక్తికిన్ని, దైవమార్గమునకున్ను అవకాశమందు లేక పోవుచున్నది. కావున అదిన్ని అంత ఉపయోగకరముగా తోచుటలేదు.

79. ప్ర:— అట్లయిన ద్వైత, అద్వైత, విశిష్టాద్వైతములలోచేరిన మంచిదేగదా?

ఉ:—మనస్సు మంచిదైన చాలును. అయితే అది అందఱికిని సాధ్యముకాదు. అంతేగాక ఇప్పుడు చేరువారు, అనగా దానిని నమ్మువారు మనశ్శుద్ధి గల్గిన చాలునని తలంచినను, తరువాత వచ్చు

వారికి ఈ పరమసత్యము గోచరముకాదు. కావున ఒకమతము స్వీక రించుటయే మంచిది. ద్వైతమతమున అందఱిని చేరనివ్వరు. చేరినను దానియందు జీవజీవభేదము గలదని చెప్పుటచే సమత్వము గల్గుటకు అవకాశము లేదు. సోదరభావమున్ను కలుగదు. కావున అదిన్ని అంత ఉపయోగకరముగా తోచుటలేదు. విశిష్టాద్వైతము మంచిదే. అందు జీవులందఱున్ను ఈశ్వరాంశులే. కావున సోదరభావములో భంగము కలుగదు. కాని వారిలో చాలమందికి ఈశ్వరదూషణగలదు. కావున సర్వజనులందు సమత్వము గల్గుటకవకాశములేదు. అద్వైతము అతి పవిత్రమైనది. అంతయు ఈశ్వరభావముతప్ప మఱియొకటి ఏమియు లేదను గొప్ప ఆదర్శము గలిగియున్నది. మఱియు నెచట భేదము గలదో అచట భయమున్ను తప్పక గలుగుచుండును. అద్వైతమందు "ఏకమేవాద్వితీయం", "నేహ నానాస్తి కించన", "సర్వం బ్రహ్మమయం" అను అతిపావనమైన అర్థము గల్గియున్నది. కాని అదిన్ని పుస్తకములలో మాత్రము గలదు. ఆచరణలో యెవరియందున్ను కనుపించుట దుస్తరము. చెప్పేలాగున చేయనివారి వాక్యములో సత్యములేదు. కావున అదిన్ని అంత యోగ్యముకాదు. ఈ మూడు మతములలోను సర్వజనులకు గుణకర్మల యోగ్యత ననుసరించి అధికారము లేదు. కావున ఈ మూడున్ను అంత యోగ్యమను తలంపు గలుగుటలేదు. ఆలాగున శైవమతమున్ను శివభక్తిని బాగుగ చెప్పినను, వీరిలో కొందఱికి విష్ణుద్వేషముకలదు. కావున అదిన్ని అంత మంచిదికాదు. అంతేగాక, ఈ నాల్గుమతములున్ను అనేకదైవములను నమ్ముచున్నవి. దైవమొక్కటియని నమ్మకము గల్గియుండవలెను. మఱల జీవేశ్వరులకు ఏకత్వమా, భిన్నత్వమా యను ప్రశ్న అంత గొప్పదికాదు. ఎట్లయినను ఆత్మశుద్ధిగల్గిన, జ్ఞానప్రాప్తిగల్గును. అప్పుడు జీవన్ముక్తి సిద్ధించును. జలములోనికిచేరిన ఉప్పు జలముతో 'నీవు నన్ను నీరూపముగ చేయు'మని చెప్పనక్కఱలేదు. ఆలాగున కరుణాస్వరూపు డగు సర్వేశ్వరుని సమీపించిన, సర్వేశ్వరమయముగా చేసెడి శక్తి వానియందు గలదు. అట్లే అగ్నిలోనికి ప్రవేశించిన కట్టెలను అగ్నియే తన రూపముగా చేయును. ఇప్పుడుగల ప్రశ్న మోక్షమును గుఱించి

కాదు. మోక్షప్రాప్తికి, ఆయామతములలో గల సాధనలు చేయుటకున్ను, దానికి సంబంధించిన శాస్త్రములు పఠించుటకున్ను అవకాశము గలుగవలెననియే యుండును.

80. ప్ర:— అట్లయిన బ్రహ్మసమాజము మంచిదికదా? బాహ్యచిహ్నములతో వారికి సంబంధములేదు. సర్వజనులకు సమత్వము, సోదరభావము గల్గియున్నది. కావున అది మంచిదిగదా?

ఉ:— అదిన్ని మంచిదే; ప్రార్థన, పరోపకారము మొదలగు మంచిగుణము లందుకలవు. కాని చిత్తము శుద్ధపడుటకు వలసిన తపస్సు, బ్రహ్మచర్యవ్రతము, వేదాధ్యయనము మొదలగు ఉత్తమసాధనలు మతములో నుండవలెను. విద్యయందు మంచి నిష్కర్ష లేనిచో ఆ జాతి యున్నతస్థితికి రాజాలదు. తపస్సున్ను, బ్రహ్మచర్యవ్రతమున్ను దృఢముగ లేనిచో అధ్యాత్మజ్ఞానశక్తి గలుగదు. బ్రహ్మనిష్ఠయు, శుద్ధమైన తపస్సున్ను లేని మతము ప్రాణములేనిదే. అది చిరకాలము నిలువజాలదు. శాశ్వతత్వము దానికుండదు. ఏలన పరబ్రహ్మమొక్కటే శాశ్వతము. తక్కినవాటికి శాశ్వతత్వములేదు. కావున అట్టి పరబ్రహ్మ సాక్షాత్కారమునకు తపస్సు, బ్రహ్మచర్యము, యోగసాధన అవశ్యముగా నుండవలెను. ఇవన్నియు నుండిన చాలదు. మఱల సర్వజనులకున్ను యోగ్యతననుసరించి మతములోగల సర్వాధికారముండవలెను. అట్లుగానిచో తపస్సు, బ్రహ్మచర్యము, యోగధ్యానాది సాధనలు పైజెప్పిన త్రిమతస్థులలో గలవు. సమత్వముమాత్రము లేదు. దానివల్లనేగదా ఈ ప్రశ్నలు వచ్చినవి.

81. ప్ర:— అయితే ఆర్యసమాజము మంచిదికదా? దానిలో వేదాధ్యయనము, బ్రహ్మచర్యవ్రతము ముఖ్యముగా నుంటున్నవి. కావున, దానిలోచేరిన మంచిదిగదా యని తోచుచున్నది.

ఉ:— మనుష్యనిర్మితములగు మతములన్నిటిలోను యేదో కొంత లోపముండియేయుండును. అదిలేని మతమే లోకములో లేదు. ప్రతి మతస్థులున్ను వారివారి మతములే ఈశ్వరాజ్ఞచే యేర్పడినవని చెప్పుదురు. కాని దానియందు యెవరున్ను పూర్ణవిశ్వాసముంచుటలేదు. మతముపై విశ్వాసము కలుగుట కాలాగున చెప్పిరి. ఆ మతములు

ఈశ్వరాజ్ఞ ననుసరించునవైనను, బోధించు ఆచార్యులు, ప్రవక్తలు మనుష్యులే; కాని వారు సామాన్యులుకారు. గొప్ప దైవశక్తి గల వారే. అయినను వారు చెప్పిన వాక్యములన్నియు నిర్దోషములని నమ్మపనిలేదు. సర్వజ్ఞుడగు సర్వేశ్వరుడొక్కడుమాత్రమే నిర్దోషిగాను, సర్వజ్ఞుడుగాను నుండును. అయితే వేదమతము మానవ ప్రోక్తముకాదని చెప్పుదురు. దైవాజ్ఞయనియే తెలుపుదురు. ఇదే మాదిరి అందఱున్ను వారివారి మతము ఈశ్వరాజ్ఞయనియే చెప్పుచున్నారు. వేదార్థనిరూపణమును గుఱించి యిదివఱకే నిరూపింపబడియుండెను. అదెట్లున్నను మతమును ప్రపంచములో బోధించువారు మానవులే. సర్వేశ్వరుఁడొక్కడుతప్ప తక్కినవారెంత గొప్పవారైనను అట్టిస్థితి గల్గియుండజాలరు. కావుననే ఒక్కొక్కమతమునకు ఒక్కొక్క మతము విరోధము కలిగియుండుటకు కారణమైనది. కావున ఆర్యసమాజము వారు అవతారపురుషులను నమ్మకపోయినను, వారియందు భక్తి లేకపోయినను, విగ్రహారాధనను వారు తొలగించినను అది గొప్పదోషము కాదు. వాటిని ముఖ్యమని నమ్మువారుకూడ ప్రపంచములో యెక్కువ మందిలేరు. ఇప్పుడుండే మతములన్నిటిలోను ఆర్యమతము ప్రస్తుతము బాగుండును. ఏలాగుననగా, అది వేదాధ్యయనము, బ్రహ్మచర్యవ్రతము ముఖ్యముగా గలిగియున్నది. తపస్సున్ను సామాన్యముగా అందు యుంటున్నది. యోగ్యతగలవారికి సంన్యాసమున్ను గలదు. సంన్యాసవిధి ముఖ్యముగా నుండవలెను. లేనిచో స్వాతంత్ర్యము గలుగదు. అంతే గాక బంధరహితులై లోకములో ధర్మమును బోధించుటకు సాధ్యము కాదు. అయితే సోమరులైనవారందఱికి సంన్యాసమివ్వవలెనని కాదు. ఈశ్వరుని విషయములో, జీవేశ్వరులకు ఏకత్వమా, భిన్నత్వమా యను విషయముపై మనము ప్రస్తుతము ఆధారపడియుండలేదు. జనుల యొక్క జ్ఞానాభివృద్ధికిన్ని, స్వాతంత్ర్యమునకున్ను అవకాశముకలదా, లేదా యను విషయముపై దృష్టినుంచియే చెప్పడమైనది. ఇక సిక్కుమతమున్ను మంచిది; కాని ఈ ప్రాంతములో అట్టివారెక్కువ మంది లేనందుచేతను, ఆమతములో జనులసంఖ్య చాల స్వల్పమగుటచేతను, దానిఁగూర్చి యేమియు చెప్పఁబనిలేదు. కాని శ్రీ గురునానక్

స్థాపించినదగుటచే సోదరభావమున్ను, పవిత్రతయు, ప్రేమయు, సాధువులపై విశ్వాసమున్ను గలిగియున్నది. ఈ లోకమునకు సంబంధించిన శూరత్వమున్ను, ధీరత్వమున్ను వారిలో మూర్తీభవించియున్నవి. రాధాస్వామిమతమను మఱియొకటి గలదు. దానికి సత్సంగమనియు పేరు. దీనికిముఖ్యస్థానము దయాల్ బాగ్. దీనియందు సమత్వము, సోదరభావము, యోగ్యతననుసరించి అందఱికి అధికారము గలిగియున్నది. 'సురత్' అభ్యాసమను బ్రహ్మనిష్ఠయు సామాన్యముగనుండును. గొప్ప బ్రహ్మచర్యము, తపస్సు, వేదాధ్యయనమున్ను యిందు లేవు. దీని యొక్క పూర్వాచార్యులగు శ్రీ పరమగురు హుజూర్ సాహేబ్ మొదలైనవారు మంచితపస్సున్ను, మంచినిష్ఠయున్ను గలిగియుండిరి. ఇప్పుడుండువారిలో తపస్సు తగ్గిపోవుచున్నది. తపస్సులో నేకాలమునందున్నా లోపము కలుగకూడదు.

"తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ। తపోబ్రహ్మ।
తపసా కల్మషం హన్తి। తపసా ప్రాప్యతే స్థానమ్॥"

అనునీ వేదవాక్యముల నెప్పటికిని మఱువగూడదు. తక్కినమతము లెన్నియో గలవు. అవియన్నియు సామాన్యములు. అవి యిదివఱలో చెప్పినవాటిలోనే యంతర్భూతములు.

వర్ణవిభాగము సమాప్తము.

ఓం తత్ సత్.



ఓమ్ తత్ సత్.

# 3. జ్ఞానవిభాగము.

ఈశ్వరానుగ్రహాదేవ పుంసామద్వైతవాసనా।
మహాభయపరిత్రాణా ద్విప్రాణాముపజాయతే॥

1. ప్రశ్న:— గురువరా! సూర్యతేజముచే మంచున్ను చీకటిన్ని నశించునట్లు తమ బోధనాసూర్యప్రకాశముచే నా హృదయగత సందేహతమస్సున్ను, అశక్తతయున్ను తొలగెను. వర్ణాశ్రమము లకు సంబంధించినవియు, కర్మనుగూర్చినవియునగు సందేహములున్ను చాలవఱకు నివర్తించినవి. కాని, కారుమేఘముచే సూర్యమండలము ఆచ్ఛాదితమగునట్లు, యిపుడు జ్ఞానయోగవిషయమైన గొప్పసంశ యము నాయొక్క విజ్ఞానసూర్యుని హృదయాకాశములో మరుగు పఱచుచున్నది. అద్దానిని తమ వివేకజ్ఞానబోధనారూపమగు ప్రచండ వాయువేగముచే నెగురగొట్టి నన్ను నిస్సంశయయుతునిగ జేయ ప్రార్థించుచున్నాను. — భక్తియు, యోగమున్ను ఉండగా మఱల జ్ఞానవిభాగము నేల ప్రారంభించితిరి? భక్తియోగము అవసరములేదని తమ యభిప్రాయమా?

ఉత్తరము:— భక్తి, యోగాదులనుగురించి యిదివఱలో వ్రాసియుండుటవలన యిప్పుడు మానివేయడమైనదిగాని అవసరము లేదను భావముగాదు. కావుననే శ్రీ దత్తాత్రేయులుపదేశించిన మంగళ శ్లోకమును ముందుగా తెలుపుటకు కారణమైనది.

"యోగహీనం కథం జ్ఞానం మోక్షదం భవతి ధ్రువమ్।
తస్మాద్యోగం చ జ్ఞానం చ ముముక్షుర్దృఢమభ్యసేత్"॥

అని యోగజ్ఞానమెఱింగిన సిద్ధపురుషులుపదేశించిరి. పూర్వోక్త ఋషుల యాశయము ననుసరించియే ఈ భక్తియున్ను, యోగమున్ను అంగీకరించుటకు కారణమైనది. నిష్కామకర్మయోగముయొక్క లక్ష్యము ఈ గ్రంథములో కర్మవిభాగమున తెలుపబడియుండినందున

కర్మ, భక్తి, యోగ, జ్ఞానములనెడు పురాతనఋషుల మతము ననుసరించి పోవుటయే సుఖకరముగానుండును. భక్తియొక్క యాచరణవలననే క్రమముగ జ్ఞానమున్ను గలుగుచుండును. ఏలన, భక్తులను భవసాగరమునుండి యుద్ధరించెదనను భగవత్ప్రతిజ్ఞావాక్యము మిథ్యకాగూడదు. అది యెప్పటికిన్ని మృషావచనము కాగూడదనియే భగవత్సంకల్పము. దీనిని యెవరును ఆక్షేపింపజాలరు. ఆక్షేపించిన, భగవద్వాక్యమందు విశ్వాసము లేనివారే యగుదురు. అప్పుడు భగవత్సంకల్పరూపమగు వేదవాక్యమునందుకూడ వారికి విశ్వాసము లేదనియే నిశ్చయించవలెను. అట్టివారినిగురించి మనమేమియు చెప్పనక్కరలేదు. వారినిగురించి శాస్త్రమేమి చెప్పియున్నదో అదే మనకున్ను ప్రమాణము. భక్తిచే జ్ఞానము గలుగునని చెప్పినదానికి కొన్ని ప్రమాణవాక్యముల నిచట నిరూపించెద.

(రుద్రసంహిత) శివ ఉవాచః—

ఇత్థం సాంగోపాంగభక్తిర్మమ సర్వోత్తమా ప్రియే।
జ్ఞానవైరాగ్యజననీ ముక్తిదాసీ విరాజతే ॥

తా॥ శివుడు చెప్పుచున్నాడు:— ఓ ప్రియురాలవగు పార్వతీ! అంగములతోను, ఉపాంగములతోను గూడినదియు, పూర్వము నాచే నిరూపింపబడినదియునగు నాయందలిభక్తి సర్వోత్తమమైనది. అయ్యది జ్ఞానవైరాగ్యముల గలుగజేయును. అద్దానికి ముక్తి దాసియైయుండును.

సర్వకర్మఫలోత్పత్తిస్సర్వదా త్వత్సమప్రియా।
యచ్చిత్తే సా స్థితా నిత్యం సర్వదా సోఽతి మత్ప్రియః ॥

సమస్తకర్మలఫలములకు భక్తిపుట్టుచోటు. ఆ భక్తి యెల్లపుడు నీవలె నాకు మిక్కిలి ప్రీతిపాత్రమైయున్నది. ఆ భక్తి యెల్లపుడు యెవని హృదయమున గలదో అతడు నా కనవరతము మిక్కిలిప్రియుడు.

త్రైలోక్యే భక్తిసదృశః పంథా నాస్తి సుఖావహః।
చతుర్యుగేషు దేవేశి కలౌ తు సువిశేషతః ॥

మూడులోకములలో భక్తితో సమానమగు సుఖకరమైన మార్గము మరియొండు లేదు. పార్వతీ! ఒక యుగముననే కాదు, నాల్గు యుగములలో వెదకినను భక్తికి సమమై, ఉత్తమమైనది లేదు.

ఇతర యుగములకన్నను కలియుగమున యెంత వెదకినను దీనికి సమ మైనది గనుపింపదు.

కలౌ తు జ్ఞానవైరాగ్యౌ వృద్ధరూపౌ నిరుత్సవౌ ।
గ్రాహకాభావతో దేవి జాతౌ జర్జరతామతి ॥

కలియుగమున జ్ఞానవైరాగ్యములు సంతోషవిహీనములై ముసలితనముగలవై యుండును. పార్వతీ! ఈ జ్ఞానవైరాగ్యముల స్వీకరించి ఆచరణలోనుంచు మానవుడు గనుపించనందున, ఇయ్యవి మిక్కిలి జర్జరప్రాయములై (శిథిలతను పొందినవై) యుండును.

కలౌ ప్రత్యక్షఫలదా భక్తిః స్సర్వయుగేష్వపి ।
తత్ప్రభావాదహం నిత్యం తద్వశో నాత్ర సంశయః ॥

భక్తి కలియుగముననే కాదు, సమస్తయుగములయందును ప్రత్యక్షఫలము నొసంగును. ఆ భక్తిప్రభావమువలననే నేనెల్లపుడు ఆ భక్తిగలవానికి వశుడనైయుందును. ఇట సందియము లేదు.

యో భక్తిమాన్పుమాంల్లోకే సదాఽహం తత్సహాయకృత్ ।
విఘ్నహర్తా రిపుస్తస్య దండ్యో నాత్ర చ సంశయః ॥

ఈ లోకమున యెవడు భక్తిగలవాడై యుండునో, అతనికి నేనెల్లపుడు సహాయము చేయుచుందును. అతనికిగల్గు విఘ్నముల పోగొట్టుచుందును. అట్టి పరమభక్తునికి యెవడు విరోధియో అతడు తప్పక దండింపతగినవాడు. ఇందు సంశయింపనవసరములేదు. అని రుద్రగీత. మఱియు—

జ్ఞానం తు దుష్కరం లోకే భజనం సుకరం మతమ్ ।

లోకములో బుద్ధికతీతమగు జ్ఞానము చాల దుష్కరము; భజన సుకరమని ఈశ్వరుఁడు తనమతమునిట్లు తెల్పెను.

విజ్ఞానం న భవత్యేవ ద్విజా భక్తివిరోధినః ।
శంభుభక్తికరస్యైవ భవేజ్జ్ఞానోదయో ద్రుతమ్ ॥

ఓ ఋషులారా! భక్తియందు ప్రీతిలేనివారికి జ్ఞానము లభింపదు. దైవభక్తి యెవనియందుగలదో వానికి శీఘ్రముగ జ్ఞానోదయము గల్గును.

యథా చ మలినే వస్త్రే రంగః శుభతరో నహి।
క్షాలనే హి కృతే శుద్ధే సర్వో రంగః ప్రసజ్జతే॥

ఏలాగున మలినమైన వస్త్రముపై శ్రేష్ఠమైన రంగువేసినను అది అంటుకొనదో, దానిని శుభ్రపఱచిన తరువాత యేరంగు అద్దినను శుద్ధముగా అంటుకొనునో, ఆలాగున ఈశ్వరభక్తియను జలములో విషయమాలిన్యముగల హృదయమను వస్త్రమును ముందుగా శుద్ధపఱచుకొనవలెను. తరువాత జ్ఞానమను రంగువేసిన వెంటనే అంటుకొనును.

కిం బహూక్తేన దేవేశి భక్తాధీనస్సదా హ్యహమ్॥

ఓ పార్వతీ! వెయ్యేల, నే నెల్లప్పుడును భక్తపరాధీనుడనై యుందును.

భగవత్కటాక్షసంపర్కాత్పశుర్పశుపతిర్భవేత్।

భక్తిచే భగవత్కటాక్షముగలిగిన, పాశ బద్ధుడగు జీవుడు పశుపతియగు ఈశ్వరసదృశుడగును. భక్తిని గుఱించి సూక్ష్మముగా తెలుపడమైనది. ఇపుడు యోగమునుగుఱించియు సంగ్రహముగా తెలిపెద. ఇది శ్రీ పాతంజల యోగదర్శనమున గనందగును.

సూ॥ తదా ద్రష్టుః స్వరూపేఽవస్థానమ్।

తా॥ చిత్తవృత్తులు నిగ్రహమైయుండు (యోగావస్థయందుండు) కాలమునందు చిన్మాత్రుడైన పురుషుడు నిజస్వరూపమునందుండుట సంభవించుచున్నది. వి॥ ఇట్లు యోగము ఒకేవాక్యములో తెలుపడమైనది. యోగనిష్ఠులు యిట్టి స్థితి తమకు కలిగినదా యని ఆత్మలో చూచుచుండవలెను.

సూ॥ తత్ర స్థితౌ యత్నోఽభ్యాసః।

తా॥ చిత్తవృత్తులను లయింపఁజేయుటకును, చిత్తైకాగ్రతను కలుగఁజేయుటకును, ప్రయత్నపడునట్లుచేయుట అభ్యాసమనంబడును.

సూ॥ స తు దీర్ఘకాలనైరన్తర్యసత్కారసేవితో దృఢభూమిః॥

ఆ యభ్యాసము బహుకాలమువఱకును ఎడతెగక ఆదరాతిశయముతో సేవింపబడినయెడల దృఢమైన దశ (స్థిరమైన అవస్థ) కలుగును. వి॥ ఋషివచనమిట్లుండుటచే దీర్ఘకాల మభ్యసింపనొల్లక

కొద్దికాలము శీలించి ఫలము కనుపించక విడచిపెట్టరాదని యీ సూత్రమువలన తెలుపడమైనది. ఒక వృక్షముపెట్టి ఫలము గలుగు కాలమువఱకు దానిని పోషింపక, కొంతకాలము సంరక్షించి ఫలావిర్భావము కనుబడనందుచే ఉపేక్షించుట యెంత విశ్వాసరాహిత్యమో, యిదిన్ని అటువంటిదే. మఱియు యే వృక్షమునుండి యెక్కువ ఫలములు గలుగునో, అది ఫలించుటకున్ను కాలమెక్కువ పట్టును. కొద్దిఫలమిచ్చెడు వృక్షము త్వరలో ఫలించును. మోక్షఫలము గలిగిన, అది అనంతానందఫలమై అనంతకాలమువఱకు నశింపనిదిగానుండును.

సూ॥ మైత్రీకరుణాముదితోపేక్షాణాం సుఖదుఃఖపుణ్యాపుణ్యవిషయాణాం భావనాతశ్చిత్తప్రసాదనమ్॥

తా॥ సుఖము, దుఃఖము, పుణ్యము, పాపము (అపుణ్యము) అనువానినిగుఱించిన మైత్రి (స్నేహము), కరుణ (దయ), ముదిత (సంతోషము), ఉపేక్ష (ఉదాసీనము) అనునీవృత్తులను భావనచేయుట వలన చిత్తమునకు స్వేచ్ఛ (ప్రసాదనము) కలుగుచున్నది.

వి॥ బ్రహ్మనిష్ఠులకు నిరంతరము మనఃప్రసన్నతయు, ప్రశాంతతయు గలుగుటకు యిట్టిగుణములు గలిగియుండవలెను. మైత్రియనగా సుఖించుచున్న సాధువులయందు మిత్రభావము నవలంబించుట; కరుణ యనగా దుఃఖించుచున్నవారియందు కనికరము వహించుట; ముదిత యనగా పుణ్యముగలవారినిజూచి సంతోషపడుట; ఉపేక్షయనగా పాపులందుదాసీనుడై యుండుట.

సూ॥ తత్ర ప్రత్యయైకతానతా ధ్యానమ్॥

తా॥ ధారణాస్థలమునందు జ్ఞానముయొక్క ధ్యానేతరవస్తువులను చిత్తమునందు రానీయక చేయుటయే ధ్యానమనఁబడుచున్నది.

వి॥ ధ్యానకాలములో ధ్యేయాకారభావముతప్ప తక్కిన యే భావముగాని ఆత్మలోనికి రానీయక చూచుచుండవలెను. ఇది చాల జాగ్రతగలవారికిన్ని, చిత్తశుద్ధి గలవారికిన్ని, ఏకాగ్రత గలవారికి మాత్రమే సాధ్యమగును. దీనియందు దృష్టినుంచి చూచిన చిత్తములో గల సంస్కారము నశించినదా, లేదా యనునది గోచరించును.

సూ॥ తదేవాత్మమాత్రనిర్భాసం స్వరూపశూన్యమివ సమాధిః॥

తా॥ ముందు జెప్పినధ్యానము ధ్యానించు వస్తువుయొక్క స్వరూపమై ఆ ధ్యానము లేకుండుటయే సమాధియనఁబడును.

వి॥ బీజము వృక్షమై పరిణమించినప్పుడు ఏలాగున నది శూన్యమైపోవునో, జలములో ఉప్పుకల్లు లయించినప్పుడు యేలాగున లవణరూపము కన్పించదో, కర్పూరము అగ్నిలో దహించిన కర్పూరరూపమేలాగున లేకపోవునో, ఆలాగున ధ్యానముచే ధ్యేయాకారము గలుగునప్పుడు దానికన్యముగ ధ్యాత మఱియొకటి యుండదు.

సూ॥ తారకం సర్వవిషయం సర్వథా విషయమక్రమం చేతి వివేకజం జ్ఞానమ్॥

తా॥ వివేకమువలనఁ బుట్టిన జ్ఞానమునకు తారకమని నామము. ఈతారకజ్ఞానము మహాదాది సమస్తతత్వములు విషయముగాగలది. మఱియు క్రమరహితమైనది. ఇది వివేకమువలనఁ బుట్టిన జ్ఞానము.

వి॥ ఇచట జ్ఞేయమునే తారకమని యుపదేశించడమైనది. జననమరణభవసాగరమునుండి తరింపజేయునదగుటచే తారకమను పేరువచ్చెను. వారివారికి ప్రీతిగల మంత్రములుకూడ తారకమనియు చెప్పుదురు. మంత్రముయొక్క అర్థముదయించునప్పుడే తారకశబ్దము సార్థకమగును. మంత్రార్థమనినను, ధ్యేయమనినను, జ్ఞేయమనినను, జ్ఞానమనినను ఒక్కదానియొక్క పర్యాయవాక్యములే. అట్టిజ్ఞానము కలిగినమాత్రమే జీవుడు సంసారసాగరమునుండి తరింపగల్గును. కావున మంత్రమును జపించువా రిట్టిస్థితి తమకు గలిగినదా యని యోచించుకొనవలెను.

సూ॥ సత్త్వపురుషయోశ్శుద్ధిసామ్యే కైవల్యమ్॥

తా॥ చిత్తముయొక్క సత్త్వమునకును, పురుషునకును ఏకకాలమునందు నిర్మలత్వము కలుగుటయే కైవల్యము.

వి॥ ఈసూత్రార్థమును ముముక్షువులు, అభ్యాసులు బాగుగ యోచింపఁదగినది. చిత్తములోగల సమస్తవిషయవాసనాసంస్కారము నశించుటయు, సాక్షిచైతన్య ఆత్మలోగల ఆవరణములు తొలగుటయు నేకకాలమున గలుగునపుడుమాత్రమే ముక్తి సంభవించును.

ఈ సూత్రవాక్యమువలన ఇంద్రియములు విషయములలో ప్రవర్తించి నను, సాక్షియగు శుద్ధాత్మకు యేలాటి లోపమున్ను గలుగదని వచించెడు శుష్కవేదాంతము దూరీకరించఁదగినది.

సూ॥ వ్యాధి స్త్యాన సంశయ ప్రమాదాలస్యావిరతిర్భ్రాంతిదర్శనాలబ్ధ భూమికత్వానవస్థితత్వాని చిత్తవిక్షేపాస్తేఽన్తరాయాః.

తా॥ రోగములు, యోగకర్మానర్హత, సందేహము, అజాగ్రత్త, మత్తత, అతృప్తి, భ్రమ, సమాధిస్థితి కుదురకపోవుట, చిత్తస్థైర్యము లేకుండుట యను నీ చిత్తవికారములు యోగవిఘ్నములనఁబడును.

వి॥ బ్రహ్మనిష్ఠ శీలించువారికి జన్మాంతరకర్మదోషముచే నిట్టి విఘ్నములు గలుగుచుండును. దానియొక్క నివృత్తి, ఈశ్వరార్పణ బుద్ధితో అనుష్ఠానముచేయుటయే. మఱియు,

సూ॥ అనిత్యాశుచిదుఃఖానాత్మసు నిత్యశుచిసుఖాత్మఖ్యాతిరవిద్యా.

తా॥ అనిత్యములైన వస్తువులందు నిత్యత్వమును, అపరిశుద్ధమైన దేహాదులందు శుచిత్వమును, దుఃఖాదులైన ప్రపంచవిషయములయందు సుఖత్వమును, ఆత్మకాని శరీరమునందు ఆత్మతత్వమును భావించుటయు అవిద్యయనఁబడును.

వి॥ ఇవి మాయాదోషముండువఱకుమాత్రమే గలుగును. మాయాభ్రాంతిని గలుగజేయునదగుటచే విపరీతబుద్ధిని యుద్భవింపజేయును. అట్టిమాయాదోషము నశించునపుడు అనిత్యవస్తువు నిత్యము కాదనియు, అశుచివస్తువు శుచిత్వము లేనిదనియు, దుఃఖవస్తువు సుఖరూపము గాదనియు, అనాత్మవస్తువు ఆత్మవస్తువుకాదనియు దృఢమగు బోధము గలుగును. అట్టిస్థితి గలిగిన, మఱల జీవులు భ్రమలో పడరు. అట్టిస్థితి గలుగనందుచేతనే భ్రాంతిలో పడిపోవుచున్నారు. ఈ మాయాదోషములున్ను, యోగసిద్ధికి విఘ్నములున్ను నశించుటకు శ్రీ పతంజలి మహర్షియే యీ సూత్రమును నిర్మించిరి.

సూ॥ ఈశ్వరప్రణిధానాద్వా.

తా॥ ఈశ్వరోపాసకుడు విధ్యుక్తకర్మలాచరించి భక్తితో సమష్టి

మును ఈశ్వరార్పణముగ చేయుచేని, వానికి త్వరగా యోగము సిద్ధించును. విఘ్నములన్నియు నశించును. మాయాభ్రాంతి తొలగును. ఈ విషయమై ఉపనిషత్తులున్ను స్వరూపజ్ఞానమునే యుపదేశించుచున్నవి.

స ఆత్మా స చ విజ్ఞేయః సర్వైరపి ముముక్షుభిః।
తుర్యాత్మజ్ఞానహీనానాం న ముక్తిస్స్యాత్కదాచన॥

తా॥ ముముక్షువులందఱున్ను ఆయాత్మస్వరూపము నొక్కదానినే విశేషముగా తెలిసికొనవలెను. తురీయాత్మజ్ఞానము గలుగనిచో యొకప్పుడున్ను ముక్తి గలుగదు. కావున తురీయపదములో త్వరితముగ ప్రవేశించుటకు చూడవలెను. తురీయ పదములలో ప్రవేశించవలసియుండిన, ఆత్మకుగల యాటంకములన్నియు తొలగిపోవలెను.

వివేకం పరమాశ్రిత్య బుద్ధ్యా సత్యమవేత్య చ।
ఇంద్రియారీనలం భిత్వా తీర్ణో భవ భవార్ణవాత్॥

కావున, శ్రేష్ఠమగు వివేకమునవలంబించి, బుద్ధివల్ల సత్యమగు ఆత్మనవలోకనముచేసి, యింద్రియవృత్తులనెడు శత్రువులను భేదించి, జననమరణరూపమగు సంసారారణ్యమునుండి యుత్తీర్ణుఁడవుగమ్మని శ్రీ వసిష్ఠులు శ్రీరాములకుపదేశించిరి.

అతో మద్భక్తియుక్తస్య జ్ఞానవిజ్ఞానమేవ చ।
వైరాగ్యం చ భవేచ్ఛీఘ్రం తతో ముక్తిమవాప్నుయాత్॥

అందువలన భగవద్భక్తుడై యుండువానికి జ్ఞానమున్ను, విజ్ఞానమున్ను, శుద్ధమైన వైరాగ్యమున్ను త్వరలో గలుగును. భక్తి, జ్ఞాన, వైరాగ్యములచే శ్రమ లేక ముక్తియు శీఘ్రముగ లభించును.

యన్నామకీర్తనం భక్త్యా విలాపనమనుత్తమమ్।
మైత్రేయాఽశేషపాపానాం ధాతూనామివ పావకః॥

భక్తితో భగవత్సంకీర్తనము చేయుటయు, ముక్తిగలుగలేదని మనస్సులో విలపించుటయు గలిగియుండిన, ధాతువులు అగ్నివలన స్ఫుటముచేసిన యెట్లు శుద్ధమగునో, ఓ మైత్రేయమహర్షీ! ఆలాగుననిశ్శేషపాపమున్ను నశించును.

జ్ఞానతోఽజ్ఞానతో వాపి వాసుదేవస్య కీర్తనమ్।
తత్సర్వం విలయం యాతి తోయస్థం లవణం యథా॥

భగవద్భక్తి తెలిసిచేసినను, తెలియకచేసినను విరోధమేమియు లేదు. నీటిలోనుంచబడిన ఉప్పుకల్లు యేలాగున జలమైపోవునో, ఆలాగున ఈ భక్తునియొక్క పాపములన్నియు నశించి భగవంతునియం దైక్యమైపోవును. జలములో నుంచిన ఉప్పుగడ్డ తన్ను జలములో నైక్యముచేయవలెనని జలముతో చెప్పకపోయినను, జలముయొక్క నైజస్వభావము ఉప్పు నేలాగున కరగించి తనయం దైక్యమొనర్చుకొనునో, ఆలాగున భగవంతుని సేవించువారు విధినిషేధములు తెలిసి చేసినను, తెలియక చేసినను హానిలేదు.

కర్పూరమనలే యద్వత్సైంధవం సలిలే యథా।
తథా సంధీయమానాం చ మనస్తత్వే విలీయతే॥

ఏలాగున కర్పూరమగ్నియందును, ఉప్పు నీటియందును ఏకత్వము నొందిపోవునో, ఆలాగున పరమాత్మానుసంధానము చేయువాని మనస్సు పరతత్వములో లీనమై, ఆత్మయు పరమాత్మలో నేకత్వము నొందును.

బహుజన్మ సుకృతైః పుణ్యైర్వైరాగ్యం ఖలు జాయతే।
వైరాగ్యేణ వినా జ్ఞానం కదాచిన్నోపజాయతే॥

అనేకజన్మములలో చేసిన సుకృతవిశేషముచేతనే శుద్ధమైన వైరాగ్యము దృఢముగ గలుగును. అట్టి నిర్మలమైన వైరాగ్యములేక జ్ఞానమెప్పుడున్ను గలుగజాలదు.

సర్వధర్మసమోపేతా శ్శివభక్తిపరాయణాః।
ప్రసాదాదేవ రుద్రస్య జానన్తి జ్ఞానవైభవమ్॥

సర్వధర్మములను చక్కగ నాచరించువారును, ఈశ్వరభక్తియం దమరిన మనస్సు గలవారునుమాత్రమే సర్వేశ్వరానుగ్రహము వల్ల సర్వేశ్వరజ్ఞానవైభవమును తెలిసికొనగలుగుదురు. భక్తివలనను, యోగాద్యనుష్ఠానమువలనను యింద్రియములు, మనస్సు, బుద్ధి శుద్ధములగునపుడుమాత్రమే జ్ఞానమును భావనచేయుటకు తగిన యోగ్యత కలుగును. బుద్ధి శుద్ధమగునపుడుమాత్రమే ఏకాగ్రతగలిగి,

జ్ఞానమును ధరించుటకు శక్తిగలిగియుండును. అంతేగాక, యోగము, భక్తి మొదలైనవి మనస్సుతోను, బుద్ధితోను అవలంబించుటకు సాధ్యమైనవి. జ్ఞానమైననో వీటివలన తెలిసికొనుటకు సాధ్యమైనదికాదు. ఏలన, జ్ఞానమయాత్మరే ఈ యింద్రియములు, మనస్సు, బుద్ధి మొదలగువానిని తెలిసికొనుచున్నది. సామాన్యముగా చెప్పునపుడు మనస్సే అన్నిటికిని కారణమని చెప్పుదురు. కాని అట్టిమనస్సు జ్ఞానవిషయముతో సరిపోల్చునపుడు జడము, అచేతనము. చేతనమగు ఆత్మయొక్క సాన్నిధ్యముచేతనే మనస్సునకు చైతన్యము లభించుచున్నది. అగ్నియొక్క సంపర్కమువలననే యినుమునకు ప్రకాశత్వము, ఉష్ణత్వము సిద్ధించుచున్నవి. కాని వ్యావహారికవిషయములో యినుము కాలుచున్నది, యినుము ఉష్ణముగానున్నది యనిచెప్పినను విచారణ చేసిన, వేడిమి యనునది అగ్నిసంబంధమేగాని, యినుమునకు సంబంధించినది కాదని తెలియును.

అగ్నిసంగాద్యథా లోహ మగ్నిత్వమధిగచ్ఛతి।
ఆత్మసంగాత్తథా గచ్ఛత్యాత్మతామింద్రియాదికమ్॥

దీని తాత్పర్యము పైన జెప్పినదే. సామాన్యజనులందఱికిని భక్తియున్ను, యోగమున్ను సులభమార్గములు. ఏలన, వానిలో యేలాటి విచారణయు చేయనక్కఱలేదు. కర్మయున్ను అటువంటిదే. వాటినన్నింటిని చేయవలసిన విధిననుసరించి చేయుచుండిన చాలును. కర్మయందు శ్రద్ధయు, విశ్వాసమున్ను, క్రియయందు లోపము గలుగక చూచుటయు చాలును. ఆలాగున భక్తునియొక్క భజనయు, స్మరణయు, పూజయు భక్తితో చేయవలసిన విధిననుసరించి చేసిన చాలును. దైవభావము మఱుపుగలుగక యుండవలెను. వేఱుగ భక్తుడేమియు చింతింపవలసినది యుండదు. ఆలాగున యోగమునను ఆసనమో, ప్రాణాయామమో, ధారణయో, ధ్యానమో, జపమో గలిగియుండిన చాలును. కాని యిక సందేహమియు ప్రత్యేకముగా చింతింపవలసిన కార్యము కనుపించదు. యోగమునియొక్క లక్ష్యము మనోనిగ్రహము కలుగుట, చిత్తము శుద్ధమగుట, ధ్యానములో స్థిరతనొందుట, సమాధ్యభ్యాసమును వృద్ధినొందించుటయే యగును. యథార్థముగ విచారించిన నివి

అనాత్మవస్తువులే. అయితే, ఈ భక్తివల్లను, యోగమువల్లను అంతఃకరణశుద్ధి గలుగనిచో జ్ఞానమార్గములో ప్రవేశము గలుగదు. అట్లు హృదయశుద్ధి, ఏకాగ్రత గలుగనిచో జ్ఞానావలంబనము ప్రయోజనకారి కాజాలదు. కాని యివి అందఱికిని సాధ్యమైనవే. సామాన్యముగా కొంత మందబుద్ధిగలవారుకూడ యివి సాధింపవచ్చును. జ్ఞానాభ్యాసమటువంటిది కాదు. జ్ఞేయవస్తువును బాగుగ తెలియఁదగిన బుద్ధియోగ్యత గలవారికిమాత్రమే యది సాధ్యమగును. మురికివస్త్రమైనను చవుడుచేతను, శుద్ధజలముచేతను ఉతుకునపుడు, మాలిన్యము వదలి శుద్ధవస్త్రమగునట్లు, యోగముచేతను, భక్తిచేతను ఆత్మకు గలిగియుండు దోషములన్నియు తొలగును. కావున యోగము, భక్తి సామాన్యములని తలంచవలదు. అట్టి భక్తి యోగము ఈజన్మములో నభ్యసింపకయున్నను, యెవరైన జ్ఞానము గలిగియుండినచో, వారు జన్మాంతరములో రెంటిని యవలంబించినవారనియే శాస్త్రము చెప్పుచున్నది. కావున, యెవరైనను పైజెప్పిన నిష్కామకర్మ, భక్తి, యోగము అవలంబించియే తీరవలెను.

2. ప్ర:—కొందఱీలాగున చెప్పుచున్నారే—అదేమన, 'కర్మయు, భక్తి యోగము మొదలైనవి గొప్పవికావు. జ్ఞానమే గొప్పది. కావున తక్కువస్థితిలోనుండు భక్తితోను, యోగముతోను మాకేమిపని? మేము జ్ఞానమార్గావలంబులము.'

ఉ:—జ్ఞానము శ్రేష్ఠమని కొందఱున్ను, భక్తియే శ్రేష్ఠమని మఱికొందఱున్ను, యోగమే యుత్కృష్టమని యింకకొందఱున్ను చెప్పుదురు. దానికి సంబంధించిన శాస్త్రము లసంఖ్యాకములు గలవు. కర్మయోగాది మూడింటియొక్క లక్ష్యము జ్ఞానమే. కావున జ్ఞానమునకు శ్రేష్ఠత్వముగలదు. కాని, భక్తిలేనివారి జ్ఞానము మురికివస్త్రముపై రంగువేసినట్లుండును. ఆలాగున యోగముచే చిత్తైకాగ్రత లేనివారికి జ్ఞానముగలుగదు. లక్ష్యమందు యేకాగ్రత గలుగని బాణమేలాగున గుఱుతును భేదింపజాలదో, భక్తిలేనివారి జ్ఞానమున్ను అటువంటిదే. మఱియు, చేతులు, కాళ్ళు వణకుచుండువాని బాణము సరిగా వెళ్ళనట్లు, వీరియొక్క చింతనయు బ్రహ్మమును తెలిసి

కొనజాలదు. కావుననే శమదమాది సాధనచతుష్టయసంపన్నత గలవారే జ్ఞానమున కర్హులని శాస్త్రము విధించుటకు కారణము. ఇంజనీరింగ్ పనియందుగాని, డాక్టరుపుద్యోగమందుగాని చేరవలసి యుండిన, వాటికి సంబంధించిన పరీక్షలందు తీర్ణులు కావలసియుండును. లేనిచో అట్టిఉద్యోగములకర్హులుకాజాలరు. మఱియు, రత్నముచాల గొప్పది. అయితే అది యెంతదుర్లభమో అదిన్ని యోచించుకొనవలెను. అట్లే సార్వభౌముని స్థానము, స్థానము లన్నింటిలోను గొప్పది. కాని, సార్వభౌములెందఱున్నారో అదిన్ని గ్రహించఁదగినది. ఆలాగుననే గవర్నరు ఉద్యోగము గొప్పది. అయితే ఒకరాజ్యములో నట్టివా రెందఱుగలరు? ఇదిన్ని చింతించవలసినదే. అట్లే జ్ఞానమే యెక్కువ యైనది. కాని నిజమైన జ్ఞానులెందఱున్నారో, జ్ఞానియొక్క లక్షణ మెటువంటిదో, యిదిన్ని వారిలక్ష్యములో నుండవలెను.

3. ప్ర:—జ్ఞానమనగానేమి?

ఉ:—జ్ఞానశబ్దముయొక్క నిజార్థము, ఉన్నది ఉన్నట్లు తెలిసి కొనుటయేయగును. మఱియొక అర్థము దీనియందులేదు. కొందఱు, జగజ్జీవేశ్వరులు మూడును ఒక బ్రహ్మమేగాని మఱియొకటి కాదని తెలిసికొనుటయే జ్ఞానమని యందురు. అట్లుకానిది అజ్ఞానమగును. మఱికొందఱు జగజ్జీవేశ్వరులు మూడున్ను వేఱువేఱుగానే యుంటున్నవి. వాటినట్లు తెలిసికొనుటయే జ్ఞానముగాని, ఒకటియని యెఱుంగుట అజ్ఞానమని యనెదరు. ఇఁక కొందఱు జగజ్జీవేశ్వరులు ముఖ్యముగా మూడుగా నుండినను, జగత్తెలాగున యనేకగుణములు గలిగియుండునో, ఆలాగున జీవులుకూడ యనేకములుగా నుంటున్నవి. ఇట్లెఱుంగుటయే యథార్థమగు జ్ఞానముగాని, అట్లుకాని జ్ఞానము జ్ఞానముకాదు, అజ్ఞానమేయని వాదించుచున్నారు. అద్వైత, విశిష్టా ద్వైత, ద్వైతమతములయొక్క సూక్ష్మమైన స్వరూపమిది. తక్కిన మతములన్నియు నీమూడింటిలో యంతర్భూతములే. కావున నిది గ్రహించిన చాలును. దీనిని స్థాపించుటకు త్రిమతస్థులున్ను, వారి యనుయాయులున్ను, తమ బుద్ధినంతయు వినియోగపఱచుచున్నారు. అసంఖ్యాకములగు యుక్తులున్ను, దృష్టాంతములున్ను, చరిత్రలున్ను,

శాస్త్రములున్ను ఉపయోగపఱచుచున్నారు. ఇవి మూడున్ను ఒక్కొక్కతత్త్వమును బయలుపఱచుచున్నవి. వేదము కాండత్రయ మగుటచే ఒకరు కర్మకాండమును, మఱియొకరు ఉపాసనాకాండమును, యింకొకరు జ్ఞానకాండమును తెలుపుచున్నారనియే మనము గ్రహించ వలెను. దేనివల్లనైనను ఆత్మ శుద్ధమైనచో మోక్షముగల్గును. అద్వైతము శుద్ధాత్మనుగుఱించియు, విశిష్టాద్వైతము మలినాత్మ శుద్ధమగు విధినిగుఱించియు, ద్వైతము దేహేన్ద్రియాదుల నిర్మలత్వమునుగుఱించియు ఉపదేశించుచుండును. ఒక మనుజుడు శుద్ధజ్ఞానము పొందవలసి యుండిన దేహేంద్రియమనంబుల శుద్ధియు, మలినస్వభావముగల జీవుడు శుద్ధతనొందుటయు, శుద్ధాత్మజ్ఞానముయొక్క బ్రహ్మైక్య మున్ను గలుగవలసియుండును. ఎట్లన, ఒకడు సౌఖ్యముగా నుండ వలసియుండిన దేహేంద్రియాదులారోగ్యదశలో నుండవలెను. దేహా మారోగ్యముగానుండినను మనోవ్యాధియుండిన సుఖముగలుగదు. ఆలాగున ఆత్మయొక్క శాంతియు శుద్ధియు లేనిచో నిరంతరసౌఖ్యము కలుగదు. కావున నీమూడుమతములున్ను యవసరములే. అట్లు కానిచో దైవసంకల్పమగు వేదములో నివియంతర్భూతములై యుండవు. ఒక్కొక్కమతాచార్యుల దృష్టియు వానిలో లగ్నమై, సత్యమగు బోధ గల్గియుంటున్నది. లేనిచో వారు నమ్ముటకున్ను, ఆచరించుటకున్ను, ఉపదేశించుటకున్ను అర్హులుకారు. దైవసంకల్పమాలాగున యుం టున్నది. ఒకరథము నడువవలసియుండిన, నాభి (కుండ), అరములు (ఆకులు), నేమి (వంపులు) యుండవలసియుండును. అపుడే చక్రము దృఢపడి, అపాయము గలుగనీయక, రథమును గమ్యస్థానమునకు చేర్చు చుండును. ఆలాగున బ్రహ్మరథము మోక్షమార్గమున అపాయము లేక నడువవలసియున్నచో, ఈమూడుమతములును అవసరములే. ఒకడు చక్రముయొక్క నాభిని నిర్మించెను. మఱియొకడు చక్రమున కరములేర్పఱచెను. ఇంకొకడు నేమిని తయారుచేసెను. ఈ మూడున్ను లేనిచో రథముపని పూర్తికాదు. మూడున్ను, రొక్కొక్కదాని కొక్కొక్కటి సంబంధపడియుండునట్లు, ఈత్రిమతములున్ను సంబంధపడి యే యున్నవి. అద్వైతము నాభివంటిదనియు, విశిష్టాద్వైతము అరముల

వంటిదనియు, ద్వైతము నేమివంటిదనియు మనము గ్రహించినచాలును.

4. ప్రః—జ్ఞానమెన్ని విధములు ?

ఉః—పరోక్షమనియు, అపరోక్షమనియు జ్ఞానము రెండువిధములు. గురుశాస్త్రోక్తములచే యీశ్వరుడు కలడని తెలిసికొను జ్ఞానము పరోక్షమనఁబడును. ఆ ఈశ్వరుడే జీవరూపముగా వెలుంగుచున్నాడను జ్ఞానము, సాక్షాత్కారమగునపు డయ్యది అపరోక్షమని చెప్పఁదగును. అక్షికి (నేత్రమునకు) పరమగుటచే పరోక్షమగును. అనగా దృష్టికి గోచరము కానందుచే పరోక్షమందురు. అక్షికి పరము కానందుచే అపరోక్షమగును. అనగా, నేత్రమునకు ప్రత్యక్షముగ కానుపించినపుడది అపరోక్షమగును. ఆ బ్రహ్మమే తన ఆత్మయై యుంటున్నదను బోధము గలుగుటయే అపరోక్షము. మఱల వాచాజ్ఞానమనియు, అనుభవజ్ఞానమనియు రెండుగలవు. వాచాజ్ఞానమనగా శాస్త్రములుమాత్రము చదువుకొని ఆచరణలేనిది. శాస్త్రములలో చెప్పినట్లాచరణగలిగి, అనుభవమునకు వచ్చునపుడుగల జ్ఞానమును అనుభవజ్ఞానమందురు.

అస్తి చేద్బ్రహ్మవిజ్ఞానం స్త్రియో వా పురుషస్య వా।
వర్ణాశ్రమసమాచార స్తస్య నాస్త్యేవ సర్వదా॥

అట్టి బ్రహ్మసాక్షాత్కారజ్ఞానము స్త్రీకైనను, పురుషునకైనను గలిగెనేని, అట్టివారికి వర్ణాశ్రమసమాచారములతో నొకప్పుడైనను సంబంధములేదు. అనగా నట్టిజ్ఞానము గలుగుటకు వర్ణముగాని, ఆశ్రమముగాని ప్రధానమైనదికాదు. అది స్త్రీలకైనను, పురుషులకైనను గలుగవచ్చును. బ్రాహ్మణులకైనను, క్షత్రియులకైనను ఉదయించవచ్చును. గృహస్థులకైనను, యతులకైనను లభించవచ్చును. ఇది వారివారి జన్మాంతరసంస్కారమనియే తలంచవలెను.

పరోక్షమపరోక్షం చ ద్వివిధం జ్ఞానమిష్యతే।
పరోక్షమస్థిరం ప్రాహురపరోక్షం చ సుస్థిరమ్॥ 1
హేతూపదేశగమ్యం య త్తత్పరోక్షం ప్రచక్షతే।
అపరోక్షం పునస్త్వేషాదనుష్ఠానాద్భవిష్యతి॥ 2
న పరోక్షాదృతే మోక్ష ఇతి కృత్వా వినిశ్చయమ్।
శ్రేష్ఠానుష్ఠానసిద్ధ్యర్థం ప్రయతధ్వమతన్ద్రితః॥ 3

౧. పరోక్షమనియు అపరోక్షమనియు జ్ఞానము రెండువిధములుగా నున్నది. పరోక్షజ్ఞానమస్థిరమనియు, అపరోక్షము స్థిరమనియు నిశ్చయము. గురుశాస్త్రాది హేతువులచే పొందబడిన జ్ఞానమేదిగలదో దానిని పరోక్షమందురు.

౨. గురుశాస్త్రోపదేశములను వినినతరువాత శ్రేష్ఠమైన అనుష్ఠానముచేత సాక్షాత్కరింపబడునది అపరోక్షమనంబడును.

౩. కావున పరోక్షజ్ఞానమువలన మోక్షము లభించునని నిశ్చయించుకొని, శ్రేష్ఠమైన అనుష్ఠానమవలంబించి, ఇంద్రియనిగ్రహముగలవారై, పవిత్రమగు బ్రహ్మసాక్షాత్కారజ్ఞానము సంపాదించుకొనవలెను అని యీశ్వరుఁడుపదేశించెను.

నవచ్ఛిద్రాణ్యతా దేహాః స్రవన్తి గళికా ఇవ
నైవ బ్రహ్మ న శుద్ధస్స్యాత్ పుమాన్బ్రహ్మ న విన్దతి.

తొమ్మిదిరంధ్రములుగల ఘటమునుండి జలము స్రవించునట్లు, యెవనియొక్క యింద్రియములద్వారా విషయములలోనికి మనః ప్రవాహము గలుగుచుండునో, అట్టివాని జ్ఞానము శుద్ధముగానుండదు. ఆతడు బ్రహ్మము పొందజాలడు. ఒక్కరంధ్రముద్వారా జలము కారుచుండిన, యెంత నిండుకుండయైనను, దానిలో జలము త్వరలోనే కారిపోవును. అట్లుండ, తొమ్మిదిరంధ్రములుండిన, దానియెందెంత నిండుగ నీళ్లుండినను, లేక యెంతనిండుగ పోసినను, నిలువక యేలాగున కారిపోవునో, ఆలాగున ఒక్క ఇంద్రియముయొక్క నిగ్రహములేనిచో, మనుజునకు తా నార్జించిన భక్తి, తపస్సు, పుణ్యము నశించుచుండగా, నవద్వారములు బంధింపక తెఱచియుంచినవాని జ్ఞానమెంత గొప్పదైనను, లేక యాతడెంతజ్ఞానమును సంపాదించినను త్వరలోనే నశించిపోవును.

ఉత్పన్నాత్మప్రబోధస్య హ్యద్వేష్టృత్వాదయో గుణాః
అయత్నతో భవన్త్యేతే న తు సాధనరూపిణః.

ఆత్మప్రబోధ ముత్పన్నమైనవానికి ప్రయత్నములేకనే అద్వేష్టృత్వాది గుణములన్నియు గలుగుచుండును. అట్టివానికి వానిని సాధించుటకు ప్రయత్న మవసరములేదు. అనగా అభ్యాసికి ప్రయత్నము

రూపముగాను, ఆరూఢునకు స్వభావసిద్ధముగాను నుండును. అద్వేష్టృత్వాది గుణములు గీతలో ద్వాదశాధ్యాయమున గనందగును. అట్టి లక్షణములన్నియు పరమభక్తున కుండవలెనని శ్రీభగవంతుఁడుపదేశించియున్నాడు.

సంసారజసుఖాసక్తం బ్రహ్మజ్ఞోఽస్మీతివాదినమ్
కర్మబ్రహ్మోభయభ్రష్టం తం త్యజేదన్త్యజం యథా.

సంసారసుఖమందాసక్తిగల్గి 'నేను బ్రహ్మజ్ఞుడ'నని చెప్పువాడు కర్మబ్రహ్మల రెంటినుండియు పతితుడగును. పరిశుద్ధమగు యజ్ఞమున, (పాపకర్మముచేసి) కులభ్రష్టుడైనవాని నెట్లు త్యజింపఁదగునో, యట్టివాడును సాధుసంఘమునుండి యుపేక్షింపఁదగినవాడు.

శ్రుతేశ్శతగుణం విద్యాన్మననం మననాదపి
నిదిధ్యాసం లక్షగుణ మనన్తం నిర్వికల్పకమ్.

వేదాంతశ్రవణమునకన్న మననము నూఱంతలు మేలు. అట్టి మననముచేసినదానిని ధ్యానముచేయుట (నిదిధ్యాసనము) లక్షంతలు మేలు. నిర్వికల్పస్థితి అనగా సాక్షాత్ స్వరూపస్థితియందు నిలుచుట నిదిధ్యాసనముకన్న యెన్నియో కోట్లరెట్లుగొప్పది. దానియొక్క ఫలమనంతము.

ఉత్తమం మానసం జాప్యముపాంశుశ్చైవ మధ్యమమ్
అధమం వాచికం ప్రాహురాగమార్థవిశారదాః.

మానసజప ముత్తమము, ఉపాంశువు మధ్యమము, వాచిక మధమమని శాస్త్రార్థవిశారదులు తెలిపిరి. ఈ మూడింటియొక్క లక్షణము క్రింద తెలిపెద.

యదుచ్చనీచ స్వరితైః స్పష్టాస్పష్టపదాక్షరైః
మంత్రముచ్చారయేద్వాచా వాచికోఽయం జపస్స్మృతః. 1
జిహ్వామాత్రపరిస్పందాదీషదుచ్చారితోఽపి వా
అపరైరశ్రుతః కించిచ్ఛ్రుతో వోపాంశు రుచ్యతే. 2
ధియా యదక్షరశ్రేణ్యా వర్ణాద్వర్ణపదాత్పదమ్
శబ్దార్థచింతనం భూయః కథ్యతే మానసో జపః. 3

తా॥ (1) ఉదాత్త, అనుదాత్త స్వరితములను స్వరములచేతను,

స్పష్టములును, అస్పష్టములును నగు పదవర్ణములచేతను, వాక్కుచే యే మంత్రముచ్చరింపబడునో అయ్యది వాచిక జపంబగును.

(2) నాలుకమాత్రము కదలునట్లు కొద్దిగ ఆ మంత్రముచ్చరింపబడుచో, అయ్యది యితరులకు వినిపించక పోయినను, లేక కొద్దిగ వినబడుచున్నను ఉపాంశు జపమనంబడును.

(3) ఆ మంత్రాక్షరపంక్తియందలి ఒక అక్షరమునుండి మఱియొక అక్షరమునకును, ఒకపదమునుండి మఱియొక పదమునకును మనస్సు బోవులోన (స్మరించులోన) తనబుద్ధితో ఆ మంత్రశబ్దార్థమును ఊహించుచో అయ్యది మానస జపంబనబడును.

వాచికస్త్వేక ఏవ స్యాదుపాంశుః శతముచ్యతే
సాహస్రం మానసః ప్రోక్తః సగర్భస్తు శతాధికః. 1
ప్రాణాయామసమాయుక్తస్సగర్భో జప ఉచ్యతే
ఆద్యంతయోరగర్భోఽపి ప్రాణాయామః ప్రశస్యతే. 2

తా॥ (1) వాచికజపము యొకింతఫలము నొసంగును. ఉపాంశువు నూఱింతలు, మానసజపము వెయ్యింతలు ఫలమును చేకూర్చును. ఆ మానసిక జపమే సగర్భమైనచో నూఱింతల అధికమగు ఫలమొసంగును.

(2) ప్రాణాయామముతో గూడియున్నచో నది సగర్భజపమనంబడును. ఆ ప్రాణాయామమున్ను ఆద్యంతములందు అగర్భమైనను యుత్తమమైనదే.

జ్ఞానాద్ధ్యానం భవేద్ధ్యానాజ్జ్ఞానం భూయః ప్రవర్తతే
తదుభాభ్యాం భవేన్ముక్తి స్తస్మాద్ధ్యానరతో భవేత్.

జ్ఞానముచేత ధ్యానమభివృద్ధినొందును. ధ్యానముచేత జ్ఞానము మఱల మఱల వృద్ధినొందుచు. ఈ జ్ఞానమున్ను, ధ్యానమున్ను యెవని యందభివృద్ధిగలిగియుండునో, వానికి ముక్తికలుగుటలో నేలాటిసందియమున్నలేదు. కావున ధ్యానరతుడుగాను, జ్ఞాననిష్ఠుడుగానుకావలెను.

నైకాగ్రం చేచ్చివే చిత్తం కిం కృతేనాపి కర్మణా
ఏకాగ్రమేవ చేచ్చిత్తం కిం కృతేనాపి కర్మణా.

ఈశ్వరునియందు చిత్తముయొక్క యేకాగ్రత లేనిచో, యెన్ని

ధ్యానానుష్ఠానాది కర్మలు చేసినను ప్రయోజనము గలుగదు. ఈశ్వరునియందు చిత్తైకాగ్రత గల్గియుండెనేని కర్మలు చేయకున్నను కృతార్థుఁడగును.

5. ప్ర:—అందఱి ఆత్మ ఈశ్వరస్వరూపముగా యుంటున్నప్పుడు అందఱికేల యట్టి ఈశ్వరానుభవము కలుగుటలేదు ?

ఉ:—అవిద్యయనియు, అజ్ఞానమనియు, మాయయనియు, ప్రకృతియనియు పేర్లుగల యొక మహాశక్తి గలదు. అది ఆత్మను తెలియనీయక చేయుచున్నది. కనుక అందఱికిని ఆత్మ గోచరించుట లేదు. ఆ యవిద్య నాలుగువిధములుగ జీవులకు భ్రమను గలుగజేయుచున్నది. విపరీతముగ తోఁచులాగున చేయుటయే దానియొక్క స్వభావము. ఆ విషయమై పతంజలిమహర్షి యోగదర్శనములో తెలిపియున్నారు. అది అనిత్యమందు నిత్యత్వబుద్ధి, అశుచియందు శుచిత్వబుద్ధి, దుఃఖమందు సుఖత్వబుద్ధి, అనాత్మయందాత్మత్వబుద్ధి గలుగజేయును. ఈ ప్రకృతిదోషము నశించిన అందఱికిని ఆత్మస్వరూపము కేవిధముగనే గోచరించును. సూర్యుడంతటను యొకేప్రకారము ప్రకాశము గలిగియున్నప్పటికిని, స్వచ్ఛమగు దర్పణములోమాత్రము యెట్లు నిర్మలముగ కనుపించునో, మలినదర్పణములో యెట్లు కనుపించదో, ఆలాగున మలినాంతఃకరణముగలవారికి ఆత్మ గోచరింపదు.

6. ప్ర:—భ్రమ యనగానేమి ? అదియెట్లు జీవుని బాధించును?

ఉ:—ఈ భ్రమ యైదువిధములుగా జీవుని నిజస్వరూపమును తెలియనీయక చేయుచుండును. శ్రీ అన్నపూర్ణోపనిషత్తునందు ఋభు నిదాఘసంవాదమున యిది పేర్కొనబడినది. ఎట్లన,

భ్రమః పంచవిధో భాతి తదేవేహ సముచ్యతే
జీవేశ్వరౌ భిన్నరూపావితి ప్రాథమికో భ్రమః. 1
ఆత్మనిష్ఠం కర్తృగుణం వాస్తవం వా ద్వితీయకః
శరీరత్రయసంయుక్తజీవః సఙ్గీ తృతీయకః. 2
జగత్కారణరూపస్య వికారిత్వం చతుర్థకః
కారణాద్భిన్నజగతః సత్యత్వం పంచమో భ్రమః. 3
పంచభ్రమనివృత్తిశ్చ తదా స్ఫురతి చేతసి

బింబప్రతిబింబదర్శనేన భేదభ్రమో నివృత్తః. 4
స్ఫటికలోహితదర్శనేన పారమార్థికకర్తృత్వభ్రమో నివృత్తః
ఘటమఠాకాశదర్శనేన సఙ్గీతి భ్రమో నివృత్తః. 5
కనకరుచకదర్శనేన వికారిత్వభ్రమో నివృత్తః
రజ్జుసర్పదర్శనేన కారణాద్భిన్నజగతః సత్యత్వభ్రమో నివృత్తః.
తదా ప్రభృతి మచ్చిత్తం బ్రహ్మాకారమభూత్స్వయమ్
నిదాఘ త్వమపీత్థం హి తత్త్వజ్ఞాన మవాప్నుహి. 7

తా॥ అయిదువిధములగు భ్రమలుగలవు. వానినిచట తెలిపెద— జీవేశ్వరులు భిన్నరూపులని గలిగెడుభ్రమ ప్రథమభ్రమయనబడును. ఆత్మయందు కర్తృత్వము వాస్తవమనుట ద్వితీయభ్రమ. శరీరత్రయముతో సంబంధించినవాడే జీవుడని తోచుట తృతీయభ్రమ యనబడును. జగత్కారణరూపమునకు వికారిత్వము కలుగుననుట చతుర్థభ్రమ. కారణమునకన్యముగ జగత్తుకలదని తోచుట పంచమభ్రమ. ఈభ్రమలైదింటికి యెపుడునివృత్తియగునో, అపుడు జీవుని హృదయమున స్వయముగ పరబ్రహ్మజ్ఞానముదయమగును. సూర్యబింబముయొక్కయు, జలములో ప్రతిబింబించిన ప్రతిబింబముయొక్కయు యేకత్వజ్ఞానముగలిగిన, మొదటిభ్రమ నివృత్తమగును. స్ఫటికసాన్నిధ్యమందుగల రక్తవర్ణపుష్పమునకును, స్ఫటికమునకునుగల సంబంధము తెలిసికొనిన, కర్తృత్వభ్రమయను రెండవది నివృత్తమగును. ఘటమఠాకాశముల యేకత్వమెఱింగిన మూడవభ్రమ నివృత్తమగును. సువర్ణమునకును, ఆభరణములకును గల యేకత్వమెఱింగిన వికారిత్వమను నాల్గవభ్రమ నివృత్తమగును. రజ్జుసర్పముల యభేదమెఱింగిన కారణమునకు భిన్నముగ జగత్తుకలదను అయిదవభ్రమ నివృత్తమగును. ఇట్టి భ్రమనివృత్తిపరమగు జ్ఞానము గలిగిన, శుద్ధబ్రహ్మమగు ఆత్మయొక్క జ్ఞానము హృదయములో స్ఫురించును. మాయయొక్క శక్తిచేతనే ఈ యైదువిధములగు భ్రమ కలుగుచుండును. మాయ నశించిన, ఈ భ్రమకూడ తొలగిపోవును.

వస్త్వేకత్వం మహావాక్యాదేవ జానన్తి యే జనాః
తే ముచ్యన్తే హి సంసారాద్యథా స్వప్నప్రబోధవత్.

మహావాక్యబోధమువలన యేకత్వమగు బ్రహ్మమును యే మానవులు తెలిసికొనెదరో, వారు, యేలాగున స్వప్నమునుండి జాగ్రదవస్థకు వచ్చినవారికి స్వప్నలోకము మిథ్యయను బోధము గలుగునో, అలాగున సంసారమోహమునుండి విముక్తులగుదురు.

సంసారార్ణవమగ్నానాం జన్తూనామవివేకినామ్।
అగతీనాం గతిస్సాక్షా జ్ఞానమేవ హి కేవలమ్॥

తా॥ సంసారదుఃఖమనెడు భవసాగరములో పడియుండు వివేకజ్ఞానము లేనివారును, వేఱుమఱేమార్గము లేనివారునునగు జీవకోట్లకు సాక్షాత్ బ్రహ్మజ్ఞానమొక్కటియే శరణ్యమగుచున్నది.

సంసారదుఃఖతప్తానామాత్మజ్ఞానామృతాంభసా।
తాపశాంతిర్న చాన్యేన సత్యమేవ న సంశయః॥

తా॥ సంసారదుఃఖమనెడు తాపత్రయాగ్నిచే తపించెడు జీవకోట్లకు ఆత్మజ్ఞానమనెడు అమృతమొక్క—దానివల్లనే తాపశాంతి గలుగును. వేఱుమార్గములేదు. ఇది సత్యము. సంశయింపకుము.

7. ప్ర:—ఈ భ్రమ యెట్లు నివృత్తమగును ?

ఉ:—విచారణజ్ఞానమువలననే నివృత్తమగును.

8. ప్ర:—విచారణయందేల జీవులకు యత్నము కలుగుటలేదు ?

ఉ:—కాలపరిపక్వము గలుగనందుచే ఆత్మానాత్మవిచారణయందు మనస్సునకు ప్రవేశము కలుగుటలేదు. ఈకర్మకు మాయయనియు, సంస్కారమనియు పేర్లుగలవు. జీవులు మాయకు వశులైయున్నారు. అట్టి మాయ ఈశ్వరాధీనముగా నుంటున్నది. కావున, ఈశ్వరానుగ్రహముగలవారికి మాయ మోహమును గలుగజేయదు. రాజాజ్ఞచే నిరోధింపబడిన మార్గమందు రాజభటులు జనులనెట్లు పోనీయరో, ఆలాగున, మాయవలన యేర్పడిన కర్మబలము జీవులను మోక్షమార్గములోనికి పోనీయదు. వెళ్ళుటకు రాజాజ్ఞయుండిన, ముందు యేభటులు నిరోధించిరో వారే వినయముతో, ప్రేమతో వారినాహ్వానించి మార్గనిరోధమును తొలగించి, సంతోషముతో పంపివేయుదురు. కావున దైవకృపగలిగిన మాయగాని, మాయాగుణములు

గాని, విఘ్నదేవతలుగాని, ఆటంకములుగాని జీవులకు యేవిధమగు బాధ కలుగజేయవు. కావుననే ముందుగా దైవభక్తి గలిగియుండవలెనని చెప్పుటకు కారణము. గీతాచార్యులీతత్త్వమునే యుపదేశించిరి.

దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా
మామేవ యే ప్రపద్యన్తే మాయామేతాం తరన్తి తే.

త్రిగుణాత్మకమగు యీ దైవమాయను దాటుట దుస్తరము. కాని, యెవరికి దైవకృప గలుగునో వారు ప్రయాసములేకనే యీ మాయను దాటగలరు.

9. ప్ర:—మాయ యేవిధముగ జీవులను బంధించును? భ్రమ యనగా నెట్లుండును?

ఉ:—ఈభ్రమయే యిదివఱలో చెప్పఁబడిన పంచభ్రమలైయున్నది. విషయవాసనలనెడు పాశములచే మాయ జీవులను సంసారములో బంధించును. దీనిని సంసారపాశమనికూడ చెప్పుదురు. కొందఱికి గొప్ప పట్టణప్రదేశములలోను, సముద్రప్రాంతములలోను, పర్వతపంక్తులలోను, తూర్పు పడమరగాను, పడమరతూర్పుగాను, దక్షిణముత్తరముగాను, ఉత్తరము దక్షిణముగాను యేలాగున తోచుచుండునో, ఆలాగున మాయయనెడు భ్రమవల్ల దుఃఖము సుఖముగాను, సుఖము దుఃఖముగాను, పాపము పుణ్యముగాను, పుణ్యము పాపముగాను, కర్తవ్య మకర్తవ్యముగాను, అకర్తవ్యము కర్తవ్యముగాను తోచుచుండును. మఱియు, శూద్రగ్రహావిష్టుఁడైన బ్రాహ్మణోత్తముడు గ్రహావేశకాలమున తనబ్రాహ్మణత్వమును మఱచి శూద్రత్వమును ప్రకటించునట్లును, నీచాహారమును భుజించునట్లును, హీనచేష్టలు చేయునట్లును, మాయ యనుగ్రహము జీవులను భ్రమరూపముగా బాధించును. మంచి భూతవైద్యుని సహాయమున యాగ్రహమును ఉచ్చాటనముచేయునపుడు వానికి తనబ్రాహ్మణత్వమెట్లు బోధపడునో, ఆలాగున భవభూతమునుపారద్రోలు బ్రహ్మవేత్తయనుభూతవైద్యుని యవలంబించి, వానివలన ఆత్మజ్ఞానబోధముచే సంసారపిశాచమును పారద్రోలిన, నిజబోధమగు ఆత్మతత్త్వముదయమగును. కాని, వారొక రక్షరేకు (యంత్రము) కట్టుదురు. దాని నజాగ్రత్తచే బోగొట్టుకొనిన

వెంటనే యీదుష్టగ్రహము మఱల ప్రవేశించునట్లు, ఆత్మతత్వముపదేశించిన గురువులు బోధించిన యనుష్ఠానమును పోగొట్టుకొనిన, మఱల మాయాగ్రహము మనుజులను బాధించును.

10. ప్ర:—ఆయంత్రములో యేమైన దివ్యశక్తిగల బీజాక్షరములు గలవా?

ఉ:—మహాప్రభావము గలిగిన మూఁడు బీజాక్షరములుగలవు. అవి యేవన, (1) యుక్తాహారము, (2) వివిక్తవాసము, (3) బ్రహ్మచింతనము. ఈ బీజాక్షరములతో కూడిన యంత్రము తమదేహముపై యెంతవఱకుండునో, అంతవఱకు మాయాగ్రహము జీవులకు సోకజాలదు. బ్రహ్మనిష్ఠులెవరైన మాయామోహములో పడిపోయి యుండెరేని, ఈ దివ్యశక్తిగల యంత్రము వీడిపోయియుండెననియే తలంచవలెను. లేనిచో యేకాలమందున్న వారికి పతనము గలిగియుండదు.

విహితస్యాననుష్ఠానా న్నిషిద్ధస్య చ సేవనాత్।
అనిగ్రహాస్త్యేన్ద్రియాణాం నరః పతనమృచ్ఛతి॥

విహితానుష్ఠానము చేయకపోవుటచేతను, నిషిద్ధకార్యము చేయుటవల్లను, ఇంద్రియములయొక్క నిగ్రహము లేనందుచేతను మనుజుడు పతనమొందుచుండును.

యస్య నాస్తి స్వయం ప్రజ్ఞా శాస్త్రం తస్య కరోతి కిమ్।
లోచనాభ్యాం విహీనస్య దర్పణః కిం కరిష్యతి॥

ఎవనికి స్వయంప్రజ్ఞ గల్గియుండలేదో, అనగా సత్యధర్మబుద్ధి లేదో, అట్టివాడు యెన్ని శాస్త్రములు చదివినను యేమి ప్రయోజనము? నేత్రములు రెండున్ను లేనివానికి శ్రేష్ఠమైన అద్దము దొఱకినను, ఆతడు తనముఖము నద్దమునందు చూడగల్గునా? లేక, మంచి శ్రేష్ఠమైన సులోచనములు లభించినను, అంధునకవి యేమి ఉపయోగపడును? కావున శాస్త్రము శ్రేష్ఠమైనదైనను, వివేకదృష్టి లేనివానికది యేమిచేయగలుగును? ఇపుడు ప్రపంచములోగల పతనమంతయు యీలాగుననే యుంటున్నది. కనుకనే శ్రీ శంకరభగవత్పాదు లిట్లుపదేశించుటకు కారణమైనది—

యావజ్జీవం త్రయో వంద్యా వేదాంతగురురీశ్వరాః।
ఆదౌ విద్యాప్రసిద్ధ్యర్థం అంతే విఘ్ననివృత్తయే॥

ఎంత బ్రహ్మవేత్తయైనను, తన దేహపతనమువఱకున్ను వేదాంతశాస్త్రవిచారణ, గురువాక్యమున విశ్వాసము, ఈశ్వరుని యందు భక్తి యను నీమూటిని విడువరాదు. అవి పూజ్యపదములు. మొమ్మొదట ఈమూడింటివలననే బ్రహ్మవిద్యాప్రాప్తిగలిగెను. మఱియు నవి అంత్యకాలమువఱకు విఘ్నములు గలుగనీయక సంరక్షించును. కాన పైనుపదేశించిన మూడువాక్యములను మఱువరాదు. మఱచినవాడు కృతఘ్నుడగుటయేగాక పతితుడుకూడ యగును. కనుకనే శ్రద్ధాభక్తులు లేనివానికి, గురు శాస్త్ర ఈశ్వరులయందు విశ్వాసములేనివారికి బ్రహ్మవిద్య నుపదేశింపగూడదనుటకు కారణమైనది.

శ్రద్ధాహీనాయ న వాచ్యమయతాయ దురాత్మనే।
ఉక్తాఽపి విఫలా హ్యేషా స్యాదూషరే యథా కృషిః॥

శ్రద్ధాభక్తులు లేనివానికి, ఆత్మసంయమములేనివానికి, దురాచారము గలవానికి ఈ బ్రహ్మవిద్య బోధింపతగదు. ఒకవేళ ఉపదేశించినను, విఫలమైపోవును. ఊషరక్షేత్రమందు చేసిన కృషివలె యది ఫలమును గలుగజేయదు.

మోక్షేచ్ఛా యది తే వత్స విషయాన్ దూరతస్త్యజ।
శమో దమస్తపశ్శ్రద్ధా సత్యం పీయూషవద్భజ॥

ఓ పుత్రుడా! మోక్షేచ్ఛ నీకు గలదేని, ఇంద్రియవిషయములను విషమువలె దూరముగ లెస్సగ త్యజింపుము. శమము, దమము, తపస్సు, శ్రద్ధ, సత్యము వీటిని అమృతమువలె భజింపుము.

11. ప్ర:—ఈఅవిద్యాపిశాచ మేరూపముగ జీవకోట్లను బాధించును?

ఉ:— ఏయే రూపముగా బాధించునని చెప్పుటకలవిలేదు. దానియొక్క శక్తియు, మహిమాతిశయమున్ను అపారము. జ్వరాది రోగములచే జిహ్వా యరుచిని పొందినవానికి యెంత మంచివస్తువైనను యెట్లు రుచిగనుండదో, అలాగున మాయయను రోగము గలవారికి మంచికార్యమెంతమాత్రమున్ను రుచింపదు. సర్పముచే విషమునొందిన వానికి ఉప్పు చప్పగానుండును. చేదగు వేపాకు తీపిగానుండును.

కారముగల మిరియములు కారములేనివిగ తోచును. కాని, మాంత్రికుని మంత్రముగాని, విషవైద్యుని మూలికగాని ప్రయోగింపబడినప్పుడు విషము తగ్గిపోవుచుండిన, యథారీతి చేదు చేదుగాను, కారము కారముగాను, ఉప్పు ఉప్పుగాను గోచరమగునట్లు, ఈశ్వరభక్తివల్లను, పుణ్యకర్మలవల్లను అవిద్య క్షయమునొంద, పాపము పాపముగాను, పుణ్యము పుణ్యముగాను గోచరము కాగల్గును. అంతవఱకు విపరీత స్వభావము గలిగియేయుండును. మఱియు, సన్నిపాతమువలన స్మృతి తప్పినవానికి తానెవరనునది ఎట్లు తెలియదో, వైద్యుని సహాయముచే ఔషధమువలన రోగశాంతి కలుగునపుడు ఆ సంధిదోషము తొలగిన, తానెవరైనది యెట్లు తెలిసికొనునో, ఆలాగున మాయా జ్వరముచే సంధి (గుణము) గలిగినవారికి అజ్ఞాననివృత్తినిజేయు బ్రహ్మవేత్త యొక్క యుపదేశముచేతను, అనుష్ఠానముచేతను అజ్ఞానవ్యాధి శమించునపుడు నిజమగు ఆత్మానుభవము కలుగును.

12. ప్ర:—సప్తావస్థలననేమి ?

ఉ:—(1) అజ్ఞానము (2) ఆవరణము (3) విక్షేపము (4) పరోక్షము (5) అపరోక్షము (6) అనర్థనివృత్తి (7) ఆనందావాప్తి అనెడు ఈ సప్తావస్థలందును మొదటి మూడవస్థలు బంధహేతువులు, తక్కిన నాలుగవస్థలు మోక్షహేతువులు. మేఘము సూర్యుని కనుబడకుండ చేయునట్లు, ఆవరణశక్తి ఆత్మను తెలియనీయక నిరంతరమాచ్ఛాదించుచుండును. ఈ రహస్యము తెలియుటకొఱకే పూర్వకాలపు మహారాజుల గృహములు యేడు అంతస్తులు గలిగియుండుటకు కారణము. అదేరీతిగ శ్రీ వేంకటేశ్వరుల స్థానమునకు యేడు కొండలేర్పడుటకును, అట్లే శ్రీ రంగనాథదేవళమునకు సప్తప్రాకారములు గల్గియుండుటకును కారణమైనది. ఈ యేడింటిని దాటినమాత్రమే మూలస్థానములోనికి వెళ్లుటకు సాధ్యపడును.

13. ప్ర:— ఆ ప్రాకారములనెట్లు దాటవచ్చును ?

ఉ:—శ్రవణ, మనన, నిదిధ్యాసనములచే దాటవచ్చును. (1) శ్రవణము (2) మననము (3) నిదిధ్యాసనము వీని వివరమిదివఱలో వ్రాయబడియున్నది. మఱల భక్తిమార్గములో (1) జపము (2) ధ్యా

నము (3) సమాధి, యోగమార్గములో (1) ధారణ (2) ధ్యానము (3) సమాధి (సాక్షాత్కారము), తపస్సునందు (1) తపస్సు (2) నిగ్రహము (3) ఐక్యము. ఈలాగున జ్ఞానమందును, యోగమందును, తపస్సునందును మూడుమూడు మార్గములు గలవు.

యథా ప్రకృష్టం శైవాలం క్షణమాత్రం న తిష్ఠతి।
ఆవృణోతి తథా మాయా ప్రాజ్ఞం వాపి పరాఙ్ముఖమ్॥

ఏలాగున పాచి నీటిని కనుబడకుండ ఆవరణము చేయుచుండునో, ఆలాగున మాయయు ఆత్మస్వరూపమును కనుబడకుండ చేయును. జలార్థమాపాచిని తొలగించినను వెంటనే మఱల జలమును మూసివేయును. అట్లే మాయయు యెంత ప్రజ్ఞావంతునైనను ఆత్మదృష్టినుండి బహిర్ముఖునిగజేయును. సరోవరములో పాచియుండునంత వఱకది యీలాగుననే కప్పుచుండును. కాని, కొంచెము కొంచెముగా ప్రతిదినము దానిని తీసివేయుచు రాగారాగా కొన్నిరోజులకది యెట్లు సంపూర్ణముగ లేకుండపోవునో, అపుడు సరోవర జలమెల్లపుడెట్లు స్వచ్ఛముగానుండునో, ఆలాగున వైరాగ్యమవలంబించి ప్రకృతిదోషమును రహితమొనర్చుచువచ్చిన, కొంతకాలమునకది నశించును. ఇదియే అభ్యాసముయొక్క ప్రయోజనము.

ఓంకారాది జపోఽప్యేవం భావగర్భో హ్యుదాహృతః।
ధ్యేయవస్తుస్వరూపస్య దార్ఢ్యాయ హి జపో మతః॥

ఓంకారాది దివ్యమంత్రములు గొప్ప భావగర్భితములై యున్నవి. అనగా గొప్ప దివ్యశక్తిగలిగియున్నవి. కావున జ్ఞేయమగు బ్రహ్మవస్తువుయొక్క దృఢత్వము గలుగుటకొఱకే జపము యేర్పడినదని మహర్షులమతము. అనగా, జపముజేయువారు జ్ఞేయమగు బ్రహ్మమందు మనస్సునుంచి చేయవలెను. జ్ఞేయబ్రహ్మముయొక్క దృఢత్వము గలుగుటకొఱకు జపము మిక్కిలి సహాయకారిగనుండును.

ఫలం కతకవృక్షస్య యద్యప్యంబు ప్రసాదకమ్।
న నామ గ్రహణాదేవ తస్య వారి ప్రసీదతి॥

కతకరేణువు మలినజలమును శుద్ధముచేయునదైనను, దాని నామోచ్చారణచేమాత్రము జలమేలాగున స్వచ్ఛముకాజాలదో,

ఆలాగున శాస్త్రములఁ బఠించుటవలనఁగాని, జ్ఞానము, యోగము, భక్తి మొదలగువాని చిహ్నములఁ ధరించుటచేఁగాని హృదయము శుద్ధము కానేరదు. చిల్లగింజను అరగదీసివేసినమాత్రమే జలము నిర్మలమగు నట్లు హృదయమున సరియైన అనుష్ఠానముగలవారి ఆత్మమాత్రమే శుద్ధమొందును.

సహస్రేభ్యః సహస్రేభ్యః కశ్చిదుత్థాయ వీర్యవాన్।
భినత్తి వాసనాజాలం పంజరం కేసరీ యథా॥

వేలకొలఁది మనుజులలో యొకానొకనికిమాత్రమే నివృత్తి మార్గమం దభిరుచి గలుగును. అట్టి ప్రవృత్తిగలవారిలో యొక్కఁడు మాత్రమే దృఢప్రయత్నము గల్గియుండును. ఆతఁడుమాత్రమే భవబంధనమును త్రుంచివేయును. ఏలాగున బోనులోపడిన సింహములలో బలముగల యొకానొకటిమాత్రము దానిని భేదించి బయటకు పోగల్గునో, మఱియు చేపలుపట్టువారి వలలో తగుల్కొనిన మత్స్యములలో బలముగలదైన యొకానొకటిమాత్రము ఆ వలను ఛేదించి బయటకు పోగల్గునో, ఆలాగున ప్రకృతియను చేపలుపట్టువాని విషయవాసనయను వలలో చిక్కుకొనిన జీవులను మత్స్యములలో వైరాగ్యనిష్ఠగల తీవ్రముముక్షువొక్కఁడే యీ మాయాజాలమగు వలను భేదించి బంధరహితమగు ఆత్మయొక్క స్వరూపముగల్గిముక్తుఁడు కాగల్గును.

సాధనచతుస్సంపత్తిర్యస్యాస్తి ధీమతః పుంసః।
తస్యైవ తత్ఫలసిద్ధిః నాన్యస్య కించిదూనస్య॥

ధీమంతుఁడగు యేపురుషునకు సాధనచతుష్టయసంపత్తి కొఱఁత గలుగకయుండునో, వానికి మాత్రమే జ్ఞానమనెడు ఫలసిద్ధి గలుగును. దానియందు కొంచెమైనను న్యూనతగల యన్యునకు జ్ఞానసిద్ధిగలుగదు.

14. ప్ర:—వర్తమానకాలమున శ్రవణమననాదులు చేయువారు పూర్వీకఋషులవలె యేల యున్నతస్థితి పొందజాలకున్నారు?

ఉ:—పూర్వీకఋషులవలె, యోగులవలె, జ్ఞానులవలె, భక్తులవలె యిప్పుడు జేయువారు లేకపోయినందుచేతనే అట్టిస్థితి గలుగక పోవడమైనది. నిప్పుయొక్క శక్తియంతయు కట్టెలపై నాధారపడియుండును,

పూర్వముగాని, యిపుడుగాని, కట్టెలుండినచో అగ్ని వృద్ధియగును. లేకున్న తగ్గిపోవును. అలాగుననే పూర్వీకులు శ్రవణ, మనన, నిదిధ్యాసనములను పూర్తిగ చేయువారై యుండిరి. ఇప్పుడుండువారు శ్రవణ మొక్కదానిచేతనే తాము తృప్తులై తిమని తలంచుచున్నారు. మనన నిదిధ్యాసనములలో కొంతకలిగెను. అందువలన పూర్వీకమహానీయుల వలె యిప్పుడు జనులు లేకపోవుచున్నారు. కావుననే వేదాంత వాక్యము గురువువద్ద వినుటయను శ్రవణమునకు నూఱురెట్లు ఫలమనియు, దానిని మననము చేయుటచే ఫలము లక్షలగుణమధికమనియు, దానిని నిదిధ్యాసనమందుంచుటచే గలిగెడు ఫలమనంతమనియు చెప్పుటకు కారణమైనది. అట్లే మంత్రముకూడ వాచికమైన ఒక్కఫలమనియు, ఉపాంశువైన నూఱురెట్లధికఫలమనియు, మానసికమైన వెయ్యిరెట్లధికఫలమనియు చెప్పుటకు కారణమైనది.

క్రియాయుక్తదశేభ్యశ్చ తపోయుక్తో విశిష్యతే ।
తపోయుక్త శతేభ్యశ్చ జపయుక్తో విశిష్యతే ॥
జపయుక్తసహస్రేభ్యశ్శివజ్ఞానీ విశిష్యతే ।
శివజ్ఞానిషు లక్షేషు ధ్యానయుక్తో విశిష్యతే ॥
జ్ఞానయుక్తేషు కోటిభ్యః సమాధిస్థో విశిష్యతే।
ఉత్తరోత్తర వైశిష్ట్యాత్పూజాయాముత్తరోత్తరమ్ ॥

( రుద్రసంహిత. )

కర్మకాండ విధిప్రకారము చేయువానికన్న దానిని తపస్సుతో కూడచేయువాడు పదిరెట్లధికఫలముగలవాడు. అట్టి తపస్సు జపముతో చేయువాడు నూఱురెట్లధికుడు. అట్టి జపయుక్తతపస్సు నాచరించువానికన్న ఈశ్వరజ్ఞానము గలవాడు వెయ్యిరెట్లధికుడు. అట్టి ఈశ్వరజ్ఞానముతో జపమాచరించువానికన్న బ్రహ్మజ్ఞానయుక్తుడు లక్షరెట్లధికుడు. అట్టిధ్యానయుక్తునికంటె సమాధిస్థుడు (శివజీవైక్యము గలవాడు) కోటిగుణమధికుడు. ఒకదానికన్న మఱియొకటి శ్రేష్ఠమగుటచేతను, భక్తియందును వారొకరికంటె యొకరు అధికులగుదురు.

కర్మయజ్ఞ సహస్రేభ్యస్తపోయజ్ఞో విశిష్యతే।
తపోయజ్ఞ సహస్రేభ్యో జపయజ్ఞో విశిష్యతే ॥

ధ్యానయజ్ఞాత్పరం నాస్తి ధ్యానం జ్ఞానస్య సాధనమ్ ॥

కర్మపరమగు సహస్రయజ్ఞములకన్న తపస్సను యజ్ఞము శ్రేష్ఠమైనది. తపోయజ్ఞసహస్రమునకన్న ప్రణవాది జపయజ్ఞము ఉత్కృష్టమైనది. ధ్యానమను యజ్ఞమునకన్న శ్రేష్ఠమైనది మఱియొకటిలేదు. ఈ ధ్యానము జ్ఞానమునకు కారణమగును.

యావచ్చ పాతకం దేహే తావత్సిద్ధిర్న జాయతే ।
గతే చ పాతకే తస్య సర్వం చ సఫలం భవేత్ ॥

ఎన్ని ధ్యానానుష్ఠానములు చేయువాడైనను, భక్తికార్యములాచరించువాడైనను, ఎంతవఱకు దేహములో పాతకము నశించలేదో, అంతవఱకు దైవజ్ఞానమగు సిద్ధి యేమియు గలుగదు. ధ్యానాదులచే పాతకములు నశించునపుడు సమస్తసాధనలు ఫలము గలుగజేయును. ఇది చాల ముఖ్యమైన రహస్యము. ఇందువల్లనే కొందఱికి అనుష్ఠానములో త్వరలో ఫలము కానుపించుటకును, కొందఱికి యెక్కువ కాలముచేసినను ఫలము కనుపడకపోవుటకును కారణము. ఈ సత్యమును తెలిసికొనిన, మనలోగల జన్మాంతరపాపములు నశింపనందుననే సాధనలో ఫలము కనుబడకుండుటలేదని తెలిసికొని, పాపము నశించువఱకు భక్తిశ్రద్ధలుగల్గి అనుష్ఠానముచేయుటకు దృఢమైన సంకల్పము గలుగును. ఎట్లన, మంచిజలముండు ప్రదేశములో కొద్ది లోతులోనే మంచిజలము గలుగును. జలములేని ప్రదేశమున్ను, రాళ్లుగల ప్రదేశమున్ను అయిన, చాలలోతుగ శ్రమపడి త్రవ్వవలెను. ఆలాగున జన్మాంతరసుకృతమెక్కువగలవారికి సాధనలో శీఘ్రముగ ఫలితము గలుగును. కొంచము సుకృతము గలవారున్ను పాతకముండువారున్ను కొంత యెక్కువకాలము సాధనచేయవలసియుండును. కాని, యెప్పుడు మనస్సు యీశ్వరోన్ముఖమై తిరిగెనో, అది ఉత్తరాయణప్రారంభకాలమువంటిదగును. దానికి దేవతలకాలమని పేరు. దక్షిణాయనము అసురులకాలము. వర్షాదులచే నది జనులకు చాల దుర్గమముగను నుండును. అతివర్షము, పిడుగులు, ఉఱుములు, మేఘావరణము మొదలగువానివలన ఆకాలము భయంకరముగనే యుండును. ఉత్తరాయణము వచ్చిన ఆకాశము స్వచ్ఛముగను, పైజెప్పిన విపత్తు

లేవియు లేకయుండుననని నిశ్చయించుకొనినట్లు, మనస్సెప్పుడు నివృత్తి మార్గమున దైవోన్ముఖమై, ఊర్ధ్వగమనము గల్గియుండునో, అట్టిస్థితి ఉత్తరాయణపుణ్యకాలమనియు, జ్ఞానఫలమునకు మంచికాలమనియు, పాపము చాలవఱకు నశించెననియు, ఇక భయములేదనియు తెలిసికొనవచ్చును. మఱియు, పథ్యములేని మందు యేలాగున సరియైన ఫలము కలుగజేయదో, ఆలాగున సరియైన యనుష్ఠానము లేనివారికి, సాధనచతుష్టయసంపత్తి సమర్థత లేనివారికి అజ్ఞానరోగమున్ను పూర్తిగ నశించి సౌఖ్యము కలుగదు.

సమాధినా నయేత్కాలం వృథా చిన్తాం వివర్జయేత్ ।
ధ్యానేన విలయం యాన్తి పాపాని బహుజన్మనామ్ ॥

కావున కాలము కొంచెమైనను వ్యర్థముచేయక, వ్యర్థమైన చింతనలను హృదయములోనికి రానీయక, సమాధినిష్ఠలో కాలము గడుపవలెను. ధ్యానమువలన అనేకజన్మలలో చేసిన పాపములుకూడ, అగ్నిచే కొండంతపరిమాణముగల కట్టెలున్ను భస్మమై పోవునట్లు జ్ఞానమువలన దహించిపోవును.

ప్రారభ్యతే న ఖలు విఘ్నభయేన నీచైః
ప్రారభ్య విఘ్ననిహతా విరమన్తి మధ్యాః ।
విఘ్నైర్ముహుర్ముహురపి ప్రతిహన్యమానాః
ప్రారబ్ధముత్తమగుణా న పరిత్యజన్తి ॥

హీనగుణముగలవారు విఘ్నభయముచే సత్కర్మలను ప్రారంభించకయే యుందురు. ప్రారంభించినను విఘ్నములు కలిగినవెంటనే మధ్యములు విరమించిపైతురు. ఉత్తమగుణములుగలవారెన్నివిఘ్నములు వచ్చినను, ప్రారంభించిన దైవకార్యమును ఫలము గలుగువఱకు విడిచిపెట్టకయే యాచరింతురు.

15. ప్ర:—ఈబ్రహ్మవిద్యయందు స్త్రీపురుషాదిభేదమేమైనగలదా?

ఉ:—భేదముగలదని కొందఱు చెప్పుదురు. కాని యావాదము దుర్బలము. భేదములేదుగాని యోగ్యతమాత్రము కలిగియుండవలెను. వ్యాధిగలవారందఱును ఔషధసేవ చేయవచ్చును. కాని పథ్యములో జాగ్రత లేనిచో పురుషులకైనను, స్త్రీలకైనను, బ్రాహ్మణుల

కైనను, బ్రాహ్మణేతరులకైనను, సంన్యాసులకైనను, గృహస్థులకైనను రోగము బాగుపడజాలదని అందఱును మఱువగూడదు.

16. ప్ర:—అరిషడ్వర్గమనగా నేమి? అది జీవులనెట్లు దుఃఖపెట్టును?

ఉ:— అరిషడ్వర్గమనగా ఆఱుగురు శత్రువులని భావము. శత్రువు లేలాగున ధనము మొదలగువాని నపహరింతురో, అంతేగాక జనులను బాధింతురో, ఆలాగున బ్రహ్మనిష్ఠుల జ్ఞానవిజ్ఞానముల నది నశింప జేయును. అంతేగాక వారలకు బాధలనుగూడ కలుగజేయును. కాన యట్టిదానిని దగ్గఱకు రానీయగూడదు. (1) కామము, (2) క్రోధము, (3) లోభము, (4) మోహము, (5) మదము, (6) మాత్సర్యము, — ఇవి అరిషడ్వర్గమనఁబడును.

17. ప్ర:—షడ్భావవికారములెవ్వి?

ఉ:—ప్రాకృతవస్తువులకే వికారముగల్గును. ఆత్మ నిర్వికార వస్తువు. వికారములు దేహాదులకే గలుగును. దేహియగు ఆత్మకు గలుగజాలవు.

(1) ఉండుట, (2) పుట్టుట, (3) పెరుగుట, (4) పరిణామము నొందుట, (5) క్షయించుట, (6) నాశ మొందుట — ఇవి షడ్భావ వికారములనఁబడును.

18. ప్ర:— షడూర్మ్ములనగా నేవి?

ఉ:—ఊర్మియనగా కెఱటము. సముద్రము యేలాగున కల్లోలము గల్గియుండునో, ఆలాగున అజ్ఞానమయమగు దేహమునకు ఆఱు విధములగు ఊర్మ్ములుగలవు.

(1) ఆకలి, (2) దప్పి, (3) శోకము, (4) మోహము, (5) వార్ధక్యము, (6) మరణము — ఇయ్యవి షడూర్మ్ములనఁబడును.

19. ప్ర:—ఇవన్నియు తెలిసికొనిన గలిగెడు ప్రయోజనమేమి?

ఉ:—దృక్కగు ఆత్మ ఈ యూర్మ్యాదులను చూచునదగుటచే దృశ్యములగు యివన్నియు ఆత్మధర్మములు కావనియు, ఇవి దేహేంద్రియాదుల గుణములనియు బోధము కలుగును. అందువలన అరిషడ్వర్గమునకు లోబడకూడదనియు, వికారములు దేహమునకేగాని దేహియగు ఆత్మకు గావనియు తెలియుచున్నది. దానిచే శుద్ధ చిన్మయమగు

తనస్వరూపమైన ఆత్మలో నిరంతరము నిలుకడ గలిగియుండవచ్చును.

20. ప్ర: — దృక్, దర్శన, దృశ్యములను త్రిపుటియని చెప్పు చుందురుగదా, త్రిపుటియనగ నేమి?

ఉ: — మూడింటిగొక్క కూడికను త్రిపుటియందురు. అట్టి త్రిపుటి యుండువఱకున్ను ద్రష్టృదర్శనదృశ్యములనెడు బంధనము గలదు. కావున త్రిపుటి రహితముకావలెను.

21. ప్ర: — ఆ త్రిపుటి యెన్నివిధములు?

ఉ: — త్రిపుటి యొకటియైనను అనేకవిధములుగ జెప్పెదరు. నిజము విచారించిన అది యొకటిమాత్రమే. తక్కినవన్నియు శబ్దాలంకారములనియే గ్రహించుకొనవలెను. అనగా ఒకదానియొక్క పర్యాయనామములనియే తెలియదగినది. అది జలమనియు, ఉదకమనియు, తోయమనియు నీటికి పేర్లు గలిగియున్నట్లుండును. కొన్నిటి నిచట పేర్కొనెదను. ఈ వాక్యములను గ్రహించియుండిన, యిక యెవరైనను వాటిని చెప్పినపు డివియన్నియు ఒకేవస్తువునుగూర్చి చెప్పినవని తెలిసికొనవచ్చును. లేనిచో విద్య తక్కువగలవారికి 'ఇది మనము తెలిసికొనలేదే'యను భ్రమకలుగును. (1) ద్రష్ట, (2) దర్శనము, (3) దృశ్యము. ఆలాగున (1) ధ్యాత, (2) ధ్యానము, (3) ధ్యేయము. అట్లే (1) జ్ఞాత, (2) జ్ఞానము, (3) జ్ఞేయము. వీటి యర్థము — చూచువాడు, చూపు, చూడబడిన వస్తువు. ఆలాగున ధ్యానముచేయువాడు, ధ్యానవృత్తి, ధ్యానింపదగినవస్తువు (ధ్యేయము). అదేరీతిగ జ్ఞాత (తెలివిగలిగిన ఆత్మ), తెలిసికొనెడి జ్ఞానము, తెలిసికొనదగిన జ్ఞేయము. ఈ మూడును వేఱువేఱుగనుండునప్పుడు జీవుడున్ను, జగత్తున్ను, ఈశ్వరుడున్ను (బ్రహ్మమున్ను) ఈ మూడున్ను వేఱువేఱుగానేయుండును. అపుడు అద్వయమగు ఒక బ్రహ్మముతప్ప రెండవది లేదను శ్రుతివాక్యమునకు భంగముగలుగును. అదేస్థితిలో జీవుడు, ప్రకృతి, ఈశ్వరుడు అను మూడున్ను యుండియేతీరవలెను. చిత్, అచిత్, ఈశ్వరుడు అను మూటి స్థితిగలదానికి విశిష్టాద్వైతమనియు, ద్వైతమనియు పేర్లుగలిగియున్నవి. దానిని అద్వైతము అంగీకరించదు. కావున యివి మూడున్ను ఒక్కటేకావలెను. అప్పుడే శివజీవైక్యము

సిద్ధించును. అదే సాయుజ్యముక్తియనంబడును. అట్టి యేకావస్థగలుగు వఱకు బ్రహ్మాత్మైక్యము అంగీకారము కాజాలదు.

22. ప్ర:— శివజీవైక్యమనినను, బ్రహ్మాత్మైక్యమనినను యొకే అర్థము గలుగుచున్నది. అపుడు జీవుడీశ్వరునియందుగాని, బ్రహ్మమందుగాని ఐక్యమునొందుటయే మోక్షమైనచో, ఈశ్వరునియందుండి లేక బ్రహ్మమందుండి యొకకాలమున జీవులు యేర్పడినట్లు సిద్ధించుచున్నది. అపుడు ఏకమైన బ్రహ్మమందు యేకాలమందును జీవత్వము గలుగలేదని చెప్పెడు శ్రుతికి విరోధము గల్గును. మఱియు, ఏది దేనియందైక్యమునొందునో, దానికెప్పుడైనను దానినుండి విడుదల గలుగుట నిశ్చయము. అనగా సంయోగమునకు వియోగమే పర్యవసానమని శాస్త్రసమ్మతము. కావున, ఐక్యమనునది శాశ్వతమైన ముక్తియని యేలాగున సిద్ధించును? ఇచట రెండుదోషములాపాదించును. ఒకటి నిర్వికారబ్రహ్మమునకు వికారముగల్గుట, రెండవది యోగమునకు వియోగము సిద్ధించుట. కావుననట్టి దోషములు గలుగకుండునట్లు ఐక్యముయొక్క నిజార్థమును దెలిపి ధన్యునిగా జేయవేడుచున్నాను.

ఉ:—ఐక్యమనునది గ్రాహ్యార్థముగ చెప్పునదేగాని పారమార్థిక వచనముగాదు. అనగా నది యర్థవాదమే గాని, విధివాక్యముగాదని తాత్పర్యము. నిజముగా పరమాత్మస్వరూపమునుండి జీవులు ఒకప్పుడున్ను యుద్భవించియుండలేదు. అవిద్యయొక్క దోషముచే ఆలాగున తోచుచున్నది. ఈ విషయమై పంచప్రభమలు ఉపనిషత్తులలో నిరూపింపబడినవి. వానిని విచారణచేసిన, ఈతత్వము బోధపడగలదు. ఈ పంచప్రభమలిదివఱలో వ్రాయబడియున్నవి.

23. ప్ర:— త్రిపుటినిగుఱించి చెప్పువిషయములలో మధ్య శివజీవైక్యవిషయము వచ్చినది. కావున దానిని స్పష్టముగా తెలుప ప్రార్థించుచున్నాను.

ఉ:— దృశ్యమను వ్యవహారముండువఱకుమాత్రమే దృక్కను వ్యవహారముండును. చూడబడువస్తువెపుడు లేకపోవునో, అపుడు చూచెడు వృత్తియగు దర్శనమున్ను యుండదు. దీనివల్ల దృశ్యమున్ను, దర్శనమున్ను లీనమైపోవుచున్నవి. దృక్స్వరూపమగు ఆత్మమాత్రము

శేషించియుండును. కావున నట్టి యవస్థ త్రిపుటీరహితమని చెప్పబడును. ఎవరైన యిద్దఱు చేయు వాదవివాదాలకుగాని, కార్యాకార్యములకు గాని, వారికి విలక్షణుడై సాక్షిగానుండి చూచుచుండువానినే సాక్షిగ వేయుదురు. ఎపుడు రెండుపార్టీలు లేవో, అపుడు సాక్షిత్వమను వృత్తి అతనియందుండదు. కావున దృశ్యముండువఱకే ద్రష్టయను వ్యవహార ముండును. దృశ్యము విలీనమగునపుడు ద్రష్టయను వ్యవహారముండదు. ద్రష్టనశించిన, శూన్యత్వమే మిగులును. అపుడు శూన్యమును చూచెడువాడు లేకపోవును. అది సంభవింపదు.

24. ప్ర — త్రిపుటియని చెప్పునపుడు దృక్కు, దర్శనము, దృశ్య మను మూడు గలవుగదా. అపుడు త్రిపుటీరహితమను విషయ ములో ద్రష్టమాత్రమెటుల మిగిలియుండును? కావున ద్రష్టయున్ను రహితము కావలసియేయుండును.

ఉ:— ద్రష్ట నశించిన శూన్యమగును. దానిరహస్య మీలా గున నుంటున్నది. — భార్యాబిడ్డలతోగూడియుండి గృహస్థాశ్రమములో నుండునపుడు మనుజుని 'గృహస్థు'డని చెప్పే మామూలుగలదు. కాని కొంతకాలమునకు అతని భార్యయున్ను, కుమారులున్ను లయము నొందిరి. అపుడు తాను గృహస్థాశ్రమమును సమాప్తిచేసికొని విరక్తుడై తురీయాశ్రమమును పొందెను. అపుడతడొకడుమాత్రమే యుండును. అత్తఱి యతనిని ఏకాకి యని పిలతురు. కాని, యపుడు భార్యతో గూడినవాడనిగాని, పుత్రులతోగూడినవాడనిగాని, గృహస్థుడనిగాని పేరులేక, ఏకాకియగు యతి యని యెట్లు పేరుగలిగియుండునో, ఆ లాగున దృక్కునుండి గలిగిన దృశ్యమున్ను, దర్శనమున్ను లయ మొంద, కేవలము దృక్కుమాత్రమై యుండునపుడు త్రిపుటి లేదు. అదెట్లన, ఉదయకాలమున నొకడు మైదానప్రదేశములో నిలుచుండిన తనయొక్క నీడ చాల పొడవుగానుండును. అపుడు తానా ఛాయను చూచుచుండును. సూర్యుడు క్రమముగ మధ్యాహ్నమునకు రాగా రాగా ఛాయ తగ్గిపోవుచుండును. మధ్యాహ్నకాలమున సూర్యుడు సరిగ భూమియొక్క మధ్యరేఖకు వచ్చునపుడు తనశరీరముమాత్రము మిగిలియుండును, తననీడ తనలో లయమొందును, నీడ యెపుడు లేక

పోయెనో, అప్పుడు ఆ సినిమాను చూచు వృత్తికూడ లేకపోయెనుగదా. అలాగు ననే త్రిపుటియొక్క రహస్యమున్ను యుండునని తెలియఁబడినది. లేక, ద్రష్టకూడ నశించిపోయినచో ముక్తిరూపమగు నిరతిశయానందసుఖమును అనుభవించువారే లేకపోవుదురు. అట్లయిన బ్రహ్మవిద్యాభ్యాసమున్ను, యోగాభ్యనుష్ఠానమున్ను, భక్తిసాధనలున్ను వ్యర్థములై పోవును. వాటిని ప్రతిపాదించెడు శాస్త్రములున్ను నిరుపయోగములగును. అట్టి ద్వైవధర్మమును బోధించెడు ఆచార్యులున్ను నిరర్థకులగుదురు. అపుడు వేదమునకే నిరుపయోగత్వము సిద్ధించును. వేదముయొక్క అర్థమునకుగల జ్ఞానమనెడుపేరు, విపరీతముగ అజ్ఞానదశలోనికి వచ్చును. అంతేగాక, 'ప్రజ్ఞానం బ్రహ్మ' యను మహావాక్యమునకే హాని వాటిల్లును. అది ప్రకాశములోనుండువానిని కారుచీకటిలోనికి త్రోసినట్లుండును. సుఖముగానుండువానిని దుఃఖములోనికి పడద్రోసినట్లుండును. మఱియు ఈ కానుపించెడు జగత్తున్ను, జీవులున్ను శూన్యమునుండి గలుగజాలవు. నాస్తిత్వమునకు అస్తిత్వమనునది యెపుడున్ను గలుగదు. పూజ్యమునుండి యేకాలమందును ఏక, దశ, శత, సహస్రాది సంఖ్యలేర్పడజాలవు. కావున త్రిపుటియందు ద్రష్టకూడ నశించవలెనను వాక్యముయొక్క అర్థమును విచారణ చేయకపోవుటచేతనే యిట్టి సందేహముగలుగుటకు కారణమగుచున్నది. కాన, శాస్త్రరీతిగ శమదమాది గుణములుగల్గి, ఆత్మబోధగల గురువులవద్ద శ్రవణము చేసిన, యిట్టి సందేహముల కవకాశము గలుగదు.

25. ప్ర:—— ధ్యానమునకున్ను సమాధికిని గల తారతమ్యమేమి?

ఉ:——ధ్యానమందు త్రిపుటి యుండును. అనగా ధ్యానముచేయువాడు, ధ్యానించుట, ధ్యేయమగు ఈశ్వరుడు (బ్రహ్మ) యుండును. ఆ ధ్యానకాలములో ధ్యేయాకారమగు బ్రహ్మవస్తువుతప్ప వేఱేమియు నుండరాదు. అట్టి యవస్థ గలుగునపుడు ధ్యానము రూఢియగును. 'నేను బ్రహ్మమును ధ్యానముచేయుచున్నా'నను వృత్తిగలిగియుండును. ఈ వృత్తిగూడ లేకపోవునపుడే సమాధి సిద్ధించును. అపుడు జలములో కరిగిన లవణముచందమునను, జ్యోతిలో లయించిన కర్పూరపురీతిగాను చిత్తము యేకాకారమై (బ్రహ్మరూపమై) యుండును.

ధ్యాతృధ్యానే పరిత్యజ్య క్రమాద్ధ్యేయైకగోచరమ్ ।
నిర్వాతదీపవచ్చిత్తం సమాధిరభిధీయతే ॥

తా॥ క్రమముగ ధ్యానము చేయుచు రాగారాగా, ధ్యాతయు, ధ్యానమున్ను నశించి, ధ్యేయమగు బ్రహ్మవస్తువుమాత్రమే మిగిలి యుండును. గాలిలేనిప్రదేశములో చలనములేక నిలచెడు దీపమువలె చిత్తవృత్తులన్నియు నిశ్చలములై జ్ఞేయవస్తువుమాత్రము మిగిలియుండెడి స్థితి సమాధి యనంబడును.

సలిలే సైంధవం యద్వత్సామ్యం భవతి యోగతః ।
తథాఽఽత్మమనసోరైక్యం సమాధిరభిధీయతే ॥

ఏలాగున నీటియందు ఉప్పు కరిగి జలసామ్యత్వము నొందు చున్నదో, ఆలాగున మనస్సు లయించి, ఆత్మలో నేకత్వమొందుటయే సమాధియనబడును.

సత్త్వావబోధ ఏవాసౌ వాసనాతృణపావకః ।
ప్రోక్తస్సమాధిశబ్దేన స తు తూష్ణీమవస్థితిః ॥

బ్రహ్మాత్మైక్యబోధమాత్రముగలిగి, సత్త్వావబోధముమాత్రము గలిగియుండుటయే సమాధియనబడును. ఇది దృశ్యవాసనారూపమను శుష్కతృణమున కగ్నివంటిది. అనగా సమాధిస్థితిగలవానికి వాసనా క్షయ మనోనాశములు గలిగియుండును. ఇదే సమాధిశబ్దముయొక్క అర్థమగును. అట్లుగాక యేమియు తెలియని స్థితి సమాధి కానేరదు. ఏలన తెలియలేదనువాక్యము అజ్ఞానబోధకము. తెలియునని చెప్పు వచనమే జ్ఞానబోధమగును.

అక్షుబ్ధా నిరహంకారా ద్వంద్వేష్వననుపాతినీ ।
బ్రహ్మన్ సమాధిశబ్దేన మేరోస్స్థిరతరాకృతిః ॥

అహంకారశూన్యమై, సుఖదుఃఖాదిద్వంద్వములచే బాధింప బడనిదై, విషయములచే క్షోభనొందనిదై, మేరుపర్వతమువలె చలన రహితముగనుండు స్థితియే సమాధియనబడును.

నైతజ్జాగ్రన్నైవ స్వప్నం సంకల్పానామభావనాత్ ।
సుషుప్తిభావో నాప్యేతదభావాజ్జడతా స్థితేః ॥

బ్రహ్మాకారముగ మనస్సు పరిణమించుటచేతను, యితరసంకల్ప

ములు లేకపోవుటచేతను సమాధియవస్థ స్వప్నమువంటిది కానేరదు. దృశ్యము, నానాత్వము స్ఫురింపనందుచేత అది జాగ్రదవస్థయు యనఁ దగదు. సుషుప్తియందలి జడత్వము లేనందుచేత నిద్రయని చెప్పుటకును వీలులేదు. జాగ్రత్స్వప్నసుషుప్తుల మూఁడింటికిపైనుండు సాక్షాత్ బోధైకస్వరూపమాత్రమై యుండుటచే నది జ్ఞానమనంబడును.

తస్మాజ్జ్ఞానం తథా యోగమభ్యసేత్సతతం బుధః ।
అభ్యాసాజ్జాయతే సిద్ధిర్యోగాభ్యాసాత్ప్రవర్ధతే ॥
అభ్యాసాత్సతతం కార్యో ధీమతా మోక్షకారణం ।
సంవిత్తిర్లభ్యతేఽభ్యాసాదభ్యాసాన్మోక్షమశ్నుతే ॥

కావున ముముక్షువైనవాఁడు యెల్లప్పుడున్ను వేదాంతజ్ఞాన విచారణయు, మనోనిరోధముకొఱకు ధ్యానాభ్యాసమున్ను చేయుచుండవలెను. యోగజ్ఞానముల రెంటిలోను ప్రవృత్తిగలవాఁడు సరియైన బుద్ధిమంతుఁడు. అభ్యాసమువలన జ్ఞానము సిద్ధించును. అభ్యాసమువలన యోగము వృద్ధినొందును. కావున బుద్ధిమంతులైనవారెల్లప్పుడున్ను మోక్షముకొఱకు అభ్యాసపరులై యుండవలెను. అట్టి యనుష్ఠానము వల్ల సంవిదుత్పత్తి గలుగును. అనగా శుద్ధమైన జ్ఞానముదయమగును. అట్టి సాధనవలన నిరతిశయమోక్షమున్ను సిద్ధించును.

ధారణా ద్వాదశా యామా ధ్యానం ద్వాదశధారణమ్।
ధ్యానద్వాదశకం యావత్సమాధిరభిధీయతే ॥
సమాధిర్నామ యోగాంగమన్తిమం పరికీర్తితమ్।
సమాధినా చ సర్వత్ర ప్రజ్ఞాలోకః ప్రవర్తతే ॥

ప్రాణాయామము పండ్రెండుమారులు సలిపిన యొకధారణ యగును. పండ్రెండుమారులు ధారణనభ్యసించిన ధ్యానమగును. అట్టి ధ్యానములు పండ్రెండు అయినచో సమాధియగును. సమాధి అంతిమమగు యోగాంగము. సమాధిచే అన్నివేళల ప్రకాశించును (వికసించును). అనగా లోకము ప్రజ్ఞామయమగును.

యదర్థమాత్రనిర్భాసం స్తిమితోదధివత్స్థితమ్ ।
స్వరూపశూన్యవద్భానం సమాధిరభిధీయతే ॥

పరమాత్మవస్తుపరిజ్ఞానముమాత్రము గలిగి, కదలని సముద్రము వోలె స్థిరతగల్గి, చిత్తము స్వరూపశూన్యమై యుండుటయే సమాధి యనబడును.

ధ్యేయే మనః సమావేశ్య పశ్యేదపి చ సుస్థిరమ్ ।
నిర్వాణానలవద్యోగీ సమాధిస్థః ప్రగీయతే ॥

ధ్యేయమున మనస్సులయింపజేసి స్థిరముగ ఆ పరమాత్మను గాంచవలయు. ఆ సమాధిస్థుడైన యోగి, చల్లారిన అగ్నివలె శాంతుడై యుండును.

యథా దీపో నివాతస్థః స్పందతే న కదాచన ।
తథా సమాధినిష్ఠోఽపి తస్మాన్న విచలేత్సుధీః ॥

దీపమేలాగున గాలిలేని స్థలమున నుంచబడినదై, యెన్నడును కదలక నిశ్చలముగ నుండునో, అటులే వివేకముగల సమాధినిష్ఠుడు సద్వస్తువునుండి చలింపరాదు.

26. ప్ర:—సమాధినుండి వ్యుత్థానదశలోనికి వచ్చునపుడు జ్ఞానికి మఱల పూర్వసంస్కారవృత్తులుండునా ?

ఉ:—పూర్వవాసనారూపమగు వృత్తులు గలిగియుండిన అది నిజమైన సమాధి కానేరదు. అత్తఱి మనస్సు మొదలగు అంతఃకరణములు నిరోధావస్థనుమాత్రమే పొందియున్నవగును. అది జ్ఞానసమాధి కాదు. శుష్కతృణములను అగ్ని దహింపజేయులాగున, సమాధిజనితజ్ఞానాగ్ని సంస్కారసమూహమును భస్మము చేయును. అట్టి స్థితి గలుగనిది సమాధి కాజాలదు. చిత్తముయొక్క నిరోధముమాత్రమే అట్టివారికి గల్గియుండును. "వాసనా తృణపావకః!" —జన్మాంతరవాసనయు, వృత్తులున్ను మఱల యుండగూడదు. మండుచుండెడు హోమగుండములో హోమించిన సమిధలనుగాని, నవధాన్యములనుగాని, ఘృతమునుగాని, సుగంధ, దుర్గంధద్రవ్యములఁగాని అన్నిటి నేలాగున అగ్ని భస్మమొనర్చునో, అగ్నిలో దహింపబడినతరువాత సుగంధముగాని, దుర్గంధముగాని యెట్లుండదో, మఱియు ఆబీజము లేలాగున బూడిదయైపోవునో, ఆలాగున సమాధిజనితజ్ఞానాగ్నియందు శుభాశుభవాసనలు, వృత్తులు యను బీజములు, సంస్కారములనెడు సమిధలు

అన్నియు నశించిపోవును. స్పర్శవేదిని సోకిన యినుము మఱల యెప్పటికిని సువర్ణముగానే యుండునుగాని యినుము యేలాగున కాజాలదో, అట్లే జీవనోపాధిరహితమై శివస్వరూపమునొందిన జీవుడు మఱల జీవత్వమొందడు. మఱియు భ్రమరత్వము నొందిన కీటకము మఱల క్రిమిత్వమేలాగుననొందదో, ఆలాగున జీవత్వము నశించిన ఆత్మ పరశివత్వమును బొందునేగాని, గుణములతోఁగూడిన జీవత్వము గల్గియుండజాలదు. అట్లే స్ఫటముచే సువర్ణమైన తామ్రమేలాగున రాగి కాజాలదో, ఆలాగున సమాధినిష్ఠచే శుద్ధమైన జీవుడు మరల జీవత్వమునొందక శివత్వమునే పొందును. సత్వాదిగుణములతోఁగూడినట్టి జీవత్వము వానికి నశించును. జ్ఞేయత్వమునొందిన యోగి మఱల యాస్థితినుండి జారి జీవత్వము యెన్నటికి నొందడు. శుద్ధసంవిన్మాత్రమయుడై యేయుండును. అనగా బ్రహ్మాకారవృత్తి గల్గియుండును. 'తదా ద్రష్టుః స్వరూపేఽవస్థానమ్' అని పతంజలి మహర్షి చెప్పిరి. అనగా ఆ సమాధిదశయందు ద్రష్ట స్వరూపస్థితి గల్గియుండును.

27. ప్ర:— ముక్తిదశయందు జీవుడానందమయుడై యుండునని చెప్పుదురుగదా? ఆనందమయత్వము కోశమునకు జెందినదిగదా? అపుడు జీవుని ఆనందమయత్వముకూడ కోశమునకు సంబంధించినదిగదా. కోశమైనచో, అది అన్నమయాదికోశసదృశమేయగును. అట్లయిన, పొట్టుతోఁగూడిన ధాన్యమేలాగున మొలచునో, ఆలాగున అట్టి జీవుడుకూడ మఱల జన్మమునకు రావలసినదిగదా?

ఉ:— ఆత్మ అన్నమయాది పంచకోశముల తుదనుండు ఆనందమయకోశమువంటిది కాదు. ఆత్మ ఆనందమయుడుగానుండునని వచించునపుడు, ఈ పంచకోశములకు సంబంధించిన ప్రియ, మోద, ప్రమోదరూపమగు ఆనందమయకోశముతోఁ గూడినదని యర్థము కాదు. పుణ్యవిశేషముచే బుద్ధి శుద్ధమగునపుడు దాని యందు ప్రతిబింబించిన ప్రత్యగాత్మస్వరూపమునే ఆనందమయకోశ మందురు. దీనికి పరిణామముగలదు. పరిణామముగల పదార్థము లన్నియు ప్రకృతితోఁగూడినవేయగును. కాన నది శుద్ధానందాత్మ స్వరూపముకాదు. జీవన్ముక్తిస్థితియందు చెప్పబడిన ఆనందమయత్వము

ఆత్మయొక్క యథార్థస్వరూపముగనే యుండును. అట్టిదానికి పరిణామము గలదు. అగ్నిలో దహించు వస్తువును జూచి అది అగ్నిమయముగానున్నదనియు, సువర్ణమిశ్రిత తామ్రాదుల పనులనుజూచి సువర్ణమయముగానున్నవనియు, బెల్లముచే చేయబడిన పిండివంటకములు మాధుర్యముగలవై యున్నవనియు చెప్పునట్లే, ఈ యానందమయకోశమునుగూర్చియు గ్రహించవలయును. జ్ఞానాత్మ ఆనందమయమనునది స్వయం శర్కరమయము, స్వయం సువర్ణమయము, స్వయం అగ్నిమయము అని చెప్పునట్లు భేదముగలిగియుండును.

28. ప్ర:— అట్టి జీవన్ముక్తి పొంది మహనీయాత్మత్వము గలిగి యుండినగూడ ప్రారబ్ధమను యొక కర్మమాత్రము జ్ఞానికి మిగిలి యుండునని చెప్పునది నిజమా? అగ్నిలో దహించిన ధాన్యములలో కొన్ని దహించుటయు, కొన్ని దహింపబడకపోవుటయు సంభవించునా? ఆలాగున జ్ఞానాగ్ని సర్వకర్మలను భస్మమొనర్చుచున్నవని తెలుపు శ్రుతివాక్యములకు తామేమి యర్థమును సెలవిచ్చెదరు?

ఉ:— ప్రారబ్ధమనుభవించియే తీరవలెనను యొక అర్థము శాస్త్రమందు గలదు. మఱియు, ఈశరీరము వచ్చినది ప్రారబ్ధకర్మానుభవముకొఱకే. కావున శరీరాంతమువఱకు ప్రారబ్ధముండునని చెప్పు వాక్యములకు దోషము లేదు. కాని, ఈయవస్థ యెక్కువైనదికాదు. ఉన్నతస్థితిలో యాలోచించిన, ఆత్మ యేకాలమందైనను జన్మించుట గాని, యేకర్మనైనను ఆచరించుటగాని లేదను బోధముగల్గును. అయితే యితరులకుమాత్రమట్టిప్రబోధముగల మహనీయుడుకూడ ప్రారబ్ధమనుభవించునట్లు తోచవచ్చును. జ్ఞానికి అంతయు ఈశ్వరమయముగనే యుండును. వారిదృష్టిలో ప్రారబ్ధకర్మ కానుపించదు. ఒకవేళ దృశ్యము భాసించినను, యెండలో పెట్టిన దీపము సూర్యప్రకాశముచే నెట్లు భాసింపదో, ఆలాగున ఆత్మానుభవదివ్యశక్తి యందా ప్రారబ్ధము గోచరము కాజాలదు. కాని; స్ఫటికమణిసాన్నిధ్యమున రక్త, పీత, కృష్ణపుష్పముల కాంతి దానియందు ప్రతిఫలించుటచే స్ఫటికమణియు ఆలాటి రంగులతోకూడియున్నట్లు తోచినను, వాస్తవముగ దానియందారంగులు లేనట్లు బుద్ధిమంతుడెట్లు నిశ్చయించు

కొనునో, అలాగున దృశ్య దేహములన్నింటిని ఆత్మలో లేనట్లు జ్ఞాని తెలిసికొనియుండును. మఱియు అగ్నిలో దగ్ధమైన పాశము మంచి పాశమువలె కనుపించినను, వేయించిన బీజములు పచ్చివిత్తనముల వలె గోచరించినను, వాస్తవముగ ఆ త్రాడుతో బంధించుటకున్ను, ఆ విత్తనములు మొలచుటకున్ను యెట్లు సాధ్యపడదో, అలాగున జ్ఞానాగ్నియందు దహించిన ఆత్మసంసారమునందు బంధింపబడుటగాని, పునర్జన్మమెత్తుటగాని గల్గియుండజాలదు.

29. ప్రః— అయితే ప్రారబ్ధము జ్ఞానికికూడ, దహించిన బీజము వలెను, దగ్ధమైన త్రాటివలెను ప్రతీతియగునని చెప్పినచో, సత్వరజ స్తమోగుణములున్ను యట్లనే ప్రతీతియగుచున్నవేగాని వానివల్ల బంధముగాని, పునర్జన్మముగాని గలుగదనిచెప్పి కొందఱు నికృష్ట కార్యముల నాచరించుచున్నారే! వీరు విషయములలో మునుఁగు చున్నారే! అపుడు వారుకూడ బ్రహ్మజ్ఞానులతో పరిగణింపవలసిన వారా? ఇట్టి ప్రమాదవాక్యములు శాస్త్రములో నుండుటచేతనేగదా, దురాత్ములుకూడ బ్రహ్మజ్ఞానులమని చెప్పుకొనుచు నిషేధకృత్యముల నాచరించుచున్నారు! ఇట్టి సందిగ్ధవాక్యములను శాస్త్రకారులేల వ్రాయవలెను? దీనివల్ల అందఱికిని దుష్కర్మల నాచరించుటకు మార్గము దొఱకుచున్నదిగదా.

ఉః— దీనిలోగల రహస్యతత్వమును తెలిసికొనకపోవుటచేత ప్రమాదములో పడిపోవుటకు హేతువగుచున్నది. జ్ఞానియందు రజ స్తమోగుణములుండజాలవు. సత్వగుణముగాని, విశుద్ధసత్వగుణము గాని మాత్రమేయుండును. ఏలన, సత్కర్మలవలన పుణ్యాధిక్యత గలుగునపుడు తమోగుణసంబంధమైన పాపము నశించును. తర్వాత దైవోపాసనగాని, ఆత్మోపాసనగాని చేయుటచే రజోగుణసంబంధ విక్షేపము లయమొందును. పిమ్మట మహావాక్యప్రబోధమువల్ల సత్వ గుణోపేతమగు యావరణమున్ను నశించును. కావున ప్రాకృతగుణము లతోగూడి జ్ఞాని యుండడు. ప్రారబ్ధకర్మశబ్దమునకు సుఖదుఃఖములు, రోగారోగ్యములు, స్తుతినిందలు, పూజ్యతాపూజ్యతలు, ధన దారి ద్ర్యములు మొదలగునవి జ్ఞానికిగూడ గలుగునను యర్థమేగాని,

మఱియొకయర్థము దానియందేదియులేదు. ఈ పైఁజెప్పిన ద్వంద్వములు జ్ఞానికిన్ని వచ్చుచుండును. కాని అభ్యాసకులకు, జిజ్ఞాసువులకు, మననసిధిధ్యాసనములు చేయువారికిమాత్రము వాసన నశించియుండదు. కావున, వారికి రజస్తమోగుణముల వాసన నిలచియుండవచ్చును. సత్వగుణము జ్ఞానులయందుగూడ యుండును. ఇట్టి సాధనస్థితిలోనుండువారి నారూఢులని తలంచుటచే విపరీతార్థము గలుగుచుండును. వీరందఱును అభ్యాసకులేగాన వైరాగ్యము, గురుసేవ, దైవోపాసన, జీవకారుణ్యము, ధర్మనిష్ఠ గలిగియుండవలెను. అట్లు చేయకపోవుటచేతనే వారికి పతనముగలుగుటకు కారణమగును. వారికింకను దృశ్యము నశింపకయుండును. అందుచే దృశ్యవిషయములలో భ్రాంతిగలుగుటకు కారణమగుచున్నది. కావున యట్టివారు శుద్ధమైన వైరాగ్యము, ఉత్తమమైన విజ్ఞానసంపత్తి గలిగియుండవలెను; వీరు సాధకులు. కావున యెంతోజాగ్రత గలిగియుండవలసియుండును. ఏలన, సాధనచతుష్టయసంపత్తిగలవాడే బ్రహ్మజ్ఞానమున కర్హతగలవాడని వేదాంతశాస్త్రము నిరూపించుచున్నది. కావున రాజసతామసగుణములు బ్రహ్మవేత్తయందుండవు. సాధనచతుష్టయసంపత్తిలోనే ఉత్కృష్టగుణములన్నియు వచ్చిచేరుచున్నవి. (1) నిత్యానిత్యవస్తువివేకము. (2) ఇహాముత్రార్థఫలభోగవిరాగము. (3) శమాదిషట్కసంపత్తి. (4) ముముక్షుత్వము, అనునీ నాల్గునుజేరి సాధనచతుష్టయమనబడును. వాటియర్థమేమన — (1) నిత్యవస్తువుయొక్కయు, అనిత్యవస్తువుయొక్కయు జ్ఞానము మొదటనే గలిగియుండుటచే అనిత్యవస్తువులలో ప్రీతి కలుగదు. (2) ఇహలోకములోగల సమస్తవిషయభోగములందును, పరలోకములోగల స్వర్గాది సౌఖ్యములందును విరక్తిగలిగియుండుట. (3) శమము, దమము, ఉపరతి, తితీక్ష, శ్రద్ధ, సమాధానము, ఈయాఱున్ను శమాదులని చెప్పబడును. (4) ముముక్షుత్వము, అనగా మోక్షేచ్ఛ. ఇట్టి దైవీకములగు దివ్యగుణములు గలవారే మోక్షశాస్త్రమగు వేదాంతమున కర్హులని యున్నందున, నట్టిగుణములు గల్గి, యభ్యసించినపిదప జ్ఞానము లభింపక, నిక యా పుణ్యజీవియందు దుష్టగుణము లెట్లుండును?

30. ప్ర:—ఆత్మ మూడవస్థలకు సాక్షియనునది నిజమైనచో, జాగ్రదవస్థలో యేలాగున దృశ్యమునకున్ను, విషయములకున్ను సాక్షిగానుండి అన్నియు నది యెఱుగుచున్నదో, అట్లే స్వప్నావస్థకున్ను, మనోవృత్తులకున్ను స్వప్నకాలములో యేలాగున సాక్షిగా యుంటున్నదో, అదేరీతిగ సుషుప్త్యవస్థకున్ను, సుషుప్తివిషయమునకున్ను సాక్షిగానుండి జాగ్రదవస్థయందువలె ఆ విషయముల నేల తెలిసికొనుటలేదు ? కావున సుషుప్తియందు ఆత్మ సాక్షియని యెట్లు చెప్పవచ్చును ? సాక్షియను శబ్దమున కర్థమేమి ? ఇరుకక్షులవారు చేయు విషయములను చూచుకొనియుండుటయేగదా. ఒకరిని యొక కార్యమునకు సాక్షిగావేసికొని కోర్టులో విచారణకు తేగా, 'నాకేమియు తెలియలేదని' చెప్పిన యెట్లుండునో, ఆలాగున సుషుప్తినుండి లేచిన వాని నడిగిన, 'నాకేమియు తెలియద'నిమాత్రమే సమాధానము చెప్పును. కావున సుషుప్తికి ఆత్మ యెచట సాక్షిగానుండును ? దీని వలన ఆత్మయు ఈ దేహముతో సమానముగ జడమనియు, దేహము నశించునపుడు ఆత్మయు నశించుననియు స్పష్టముగా తెలియుటలేదా? కావున దేహమున్ను, దేహియున్ను ఒకటేయని చెప్పుటలో యేమి దోషముగలదు? ఇది ప్రత్యక్షముగదా! కాదని యెవరు నిరూపించగలరు?

ఉ:—అది సరికాదు. సుషుప్త్యవస్థలో ఆ సుషుప్తిసుఖమును, మూలాజ్ఞానమును తెలిసికొని యితరులతో చెప్పకపోయినను, సుషుప్తినుండి లేచినవెంటనే సుషుప్తిలోగల యాసుఖమును, అజ్ఞానమును, రెంటిని యనుభవము చేసికొనుటయు, మఱల చెప్పుటయు గావించుచున్నందుచే, సుషుప్తిలోగూడ ఆత్మ సాక్షిగానుంటున్నది. ఒకడు రాత్రియందు సినీమాలోచూచిన విషయములను పగలు యితరులతో చెప్పుచుండిన, ఆ విషయములనాతడు రాత్రిచూడనిచో యెట్లు చెప్పగల్గును? ఏమియు తెలియలేదని యజ్ఞానమును, సుఖముగా నిద్రించితినని సుఖానుభవమును, రెంటిని కలిగియున్నందుచేతనే ఆవిషయమును జాగ్రదవస్థలోనికివచ్చినపుడు చెప్పుటకు సాధ్యమైనది. దీనినే స్మృతి జ్ఞానమందురు. మనస్సుమొదలగు యింద్రియములన్నియు మూలావిద్యలో లీనమైయుండుటచే, సుషుప్తిలో చెప్పుటకు సాధ్యముగాక

పోయెను. అంతేగాని ఆత్మ అపుడుకూడ సాక్షిగానే యుంటున్నది. ఎట్లన, ఒకరి కరములోనుండిన కంకణము చేతినుండిజారి బావిలోపడి పోయెను. అతడు నూతిలోదిగి లోతైనసీటిలో వెదకుచున్నప్పుడా యాభరణము దొఱకెను. కాని నీటిలో యున్నందున పైభాగమున కనిపెట్టి యుండు జనులతో నా విషయమపుడుచెప్పుటకు సాధ్యముగాకపోయెను. తనయాత్మలోమాత్రము కంకణముదొఱికిన యానందముగల్గియుండెను. నీటినుండి బయటకువచ్చినవెంటనే అందఱితోను కంకణము లభించిన యానందమును వెలిబుచ్చెను. అలాగున వాగాది యింద్రియములు లీనమైయుండుటచే సుషుప్త్యవస్థలో చెప్పుటకు వీలులేకపోయినదేగాని అనుభవములేక చెప్పకయుండునదికాదు. కావున ఆత్మ నిత్యము, సాక్షి. మఱియు, ప్రత్యక్షముగ జాగ్రదవస్థలో నేత్రమునకు కనుపించున వన్నియు సత్యమని నమ్ముటకునులేదు. ఏలయనగా, జ్ఞానము రెండు విధములు:— (1) భ్రమ జ్ఞానము (2) భ్రమరహితజ్ఞానము. జాగ్రదవస్థలో యెండమావులందు జలము కానుపించుచున్నది. ఆకాశము నీలముగా గోచరించుచున్నది. ముత్తెపుచిప్పనుజూచిన వెండియను భ్రాంతి గలుగుచున్నది. క్రొత్తగ యరణ్యప్రదేశములో పోవునపుడు దిగ్భ్రమ సంభవించుచున్నది. మందాంధకారమున స్తంభమును జూచిన అది దయ్యమో, దొంగయోయని సందేహము గలుగుచున్నది. మఱియు, త్రాడునుజూచిన సర్పమను బుద్ధి గలుగుచున్నది. పైత్యాధిక్యతచే చూచినవన్నియు పచ్చగ కాన్పించుచున్నది. ఇవన్నియు ప్రత్యక్షములు. యథార్థము విచారించిన వీనిలో సత్యము లేదుగదా. ఈలాటి యుదాహరణములెన్నియో గలవు. కావున భ్రమరహితప్రత్యక్ష జ్ఞానమునకే సత్యత్వము గలుగును. భ్రమసహితమగునది ప్రత్యక్ష జ్ఞానమైనను అది అజ్ఞానమే యగును.

యత్సుషుప్తౌ నిర్విషయ ఆత్మానందోఽనుభూయతే ।
శ్రుతిః ప్రత్యక్ష మైతిహ్య మనుమానం చ జాగ్రతి ॥

సుషుప్త్యవస్థయందు విషయరహితమైన యాత్మానందమనుభవింపబడుచున్నదను విషయమున వేదము, ప్రత్యక్షము, ఐతిహ్యము

(గురుపారంపర్యోపదేశము), అనుమానము యను ప్రమాణచతుష్టయము మేల్కొనియున్నది. — (వివేకచూడామణి.)

31. ప్ర:—ఆత్మానుభవము ధ్యానముచేతను, వేదాంతవిచారణ చేతను భావన చేసికొనవలసియుండును. ప్రపంచములో యేకార్యమైనను బుద్ధిచేతనో, లేక మనస్సుచేతనో నిశ్చయించుకొనవలసియున్నది. అట్లుండగా, బ్రహ్మవస్తువు భావాతీతమని యెట్లు చెప్పవచ్చును? భావాతీతమైనచో భావమునకు లోనుగానందుచే అట్టి బ్రహ్మవస్తువు అమృతమో లేక విషమో, దయ్యమో లేక దైవమో యెట్లు తెలిసికొనఁదగును?

ఉ:—సామాన్యముగా బుద్ధితోను, మనస్సుతోను తెలిసికొనుచుండునని వ్యవహారముండినను, 'తప్తాయఃపిండ'న్యాయముగ ఆ సంగతి విచారించుటలేదు. తప్తాయఃపిండన్యాయమనగా- 'ఇనుము కాలుచున్న'దనుచోట కాలెడుగుణము అగ్నికేగాని యినుమునకు లేదు. అప్పుడు అగ్నియొక్క సంసర్గమువలన యినుము కాలుచున్నదని గ్రహించవలసియుండును. ఆలాగున, ఆత్మచైతన్యము బుద్ధియందు ప్రతిఫలించియుండుటచే బుద్ధితోగాని, మనస్సుతోగాని తెలిసికొనుచుండును. కాని బుద్ధి, మనస్సు మొదలైనవి పంచభూతములయొక్క సూక్ష్మాంశములు. పంచభూతము లేలాగున జడములో, ఆలాగున అంతరింద్రియములును జడములే. కావుననే వీటికి ఆత్మ సాక్షిగా యుంటున్నది. మనస్సుయొక్క వృత్తులను, చిత్తముయొక్క చింతనమును, అహంకారముయొక్క అహంకారిత్వమును, బుద్ధియొక్క నిశ్చయాత్మకత్వమును తెలిసికొనుటకున్ను సాధ్యమగుచున్నది. తెలిసికొనుచుండునని చెప్పునపుడు తెలివి వేఱుగాను, తెలిసికొనంబడు పదార్థము వేఱుగానుండును. అప్పుడే ఘటద్రష్టృన్యాయముగ ద్రష్టయు, దృశ్యమున్ను యేర్పడును. కావున, ఆత్మవల్లనే బుద్ధ్యాదీంద్రియములు తెలిసికొనబడుచుండును. మఱియు, ఆత్మ పరిణామములేనిది; మనస్సు మొదలగు అంతరింద్రియములు పరిణామముతో గూడినవి. తన్ను తాను తెలిసికొనుటయు, యితరములను తెలిసికొనుటయు జడమునకు సాధ్యముకాదు. చైతన్యమునకే సాధ్యమగును. అందుచే ఆత్మ

తన్నును, యితరములగు దృశ్యములను తెలిసికొనుచున్నది. కావుననే ఆత్మ సత్, చిత్, ఆనందమనఁబడినది.

32. ప్ర:—ఆత్మ సత్, చిత్, ఆనందమైనచో మఱల యెందుకు దుఃఖించవలెను? ఆనందమనుభవింపవలెనను యిచ్ఛ యెందుకు గలుగును? వేదాంతులు, యోగులు, సాధువులు, సన్యాసులు, తపస్వినులు, భక్తులు మొదలగువారందఱున్ను ఆనందముకొఱకు బాహ్యవిషయములెన్నియో సమకూర్చుకొనుచున్నారు. వానివల్ల ఆనందమనుభవించుచున్నారు. కనుక, ఆత్మ ఆనందమని యెట్లు చెప్పవచ్చును? ఈ వాక్యము 'మీఅన్నము నాబిడ్డకు పెట్టుము. మీకు ఆకలి లేకుండచేయు మూలిక నిచ్చెద'నని సోదిచెప్పెడు ఆడువారిమాటవలె కానుపించుచున్నది.

ఉ:—ఆత్మ ఆనందస్వరూపమనియే శ్రుతులు చెప్పుచున్నవి. ఆనందస్వరూపమగుటచేతనే ఆనందముగానుండుటకై అపేక్షించుటకు కారణమగుచున్నది. దుఃఖమే ఆత్మకు స్వరూపమైనచో దుఃఖమునే ప్రేమించవలసియుండును. అట్లు కాన్పించుటలేదు. కనుకనే నిశ్శేష శోకశాంతియు, నిరతిశయానందమును, మోక్షమని చెప్పుటకు కారణము. ఆత్మ ఆనందస్వరూపమగుటచేతనేగదా మనుష్యులేగాక, పశుపక్ష్యాది సర్వప్రాణులున్ను దుఃఖమును నిరోధించుటకున్ను, సుఖము నపేక్షించుటకున్ను కారణమగుచున్నది! అయితే సాధువులు, యోగులు బాహ్యసుఖముకొఱకు యత్నించుచున్నారని మీరు తెచ్చిన ఆక్షేపము సరియైనదికాదు. ఏలన ఎందఱో రాజాధిరాజులు, మహారాజులు, శ్రీమంతులు, పండితులు తమకుగల సర్వసౌఖ్యములను త్యజించి వనములలో, నిర్జనప్రదేశములలో, ఏకాంతస్థలములలో నిత్యసుఖమగు బ్రహ్మప్రాప్తినిమిత్తము ధ్యాన, సమాధి, నిష్ఠల నభ్యసించుచున్నారు. యథార్థముగ విచారించిన, ఒక సామాన్యగృహస్థుని ఆహారాదులైనను వారికుండవు. తక్కిన వస్త్రాభరణాదులు సంసారులవలె వారికేమియు లేవుగదా. వారియొక్క ధ్యానానుష్ఠానములకు తగినంతమాత్రమాహారమే వారికుండును. అది లేనిచో వారనుష్ఠానమెట్లు చేయగలరు? మీరు చెప్పులాగున యే సంన్యాసులుగాని,

యోగులుగాని, భక్తులుగాని బాహ్యసుఖమును కోరుచుండిన, దాని కొఱకైదైన యార్జించుచుండిన, వారు విరక్తులు కానేరరు. నిజమైనవైరాగ్యముగలవారెవరున్ను ఆలాగున దృశ్యసౌఖ్యముకొఱకు యత్నింపరు. వైరాగ్యము గలవారికి దేహసంరక్షణకొఱకుమాత్రమే అన్నవస్త్రాదులుండును. అట్లుగాక దృశ్యసౌఖ్యములను ముఖ్యముగా కోరువారుండిన వారు ఆత్మచింతనచేయువారుగాని, తపోయోగాదులు శీలించువారుగాని కారు. ఈయొక్క లక్షణమువలననే వారు ఆత్మశుద్ధికలవారా, లేనివారా, యని తెలిసికొనవచ్చును. దృశ్యసౌఖ్యమును కోరుచుండిన, అతనికింకను ఆత్మసౌఖ్యము గలుగలేదని గ్రహించుకొనవచ్చును. బ్రహ్మనిష్ఠుడుచేయు సమస్తకార్యములున్ను ఆత్మనిష్ఠకనుకూలముగానే యుండును. దానికి ప్రతికూలమగు కార్యములు చేయుచుండిన అతనిహృదయమునకింకను ప్రకృతిభ్రమనుండి విమోచనము గలుగలేదని గ్రహించఁదగినది. ఎవరో యాచకులను, పవిత్రులగు సాధువుల వేషమువేసికొనియుండువారిని జూచి వీరే బ్రహ్మనిష్ఠులు, వీరే సాధుపురుషులు అని తలంచుట, గాఢసుషుప్తిలో నున్నవానిస్థితిని జూచి యిదే నిర్వికల్పసమాధియొక్క స్థితియని తెలిసికొనుట యెటువంటిదో, గాజుముక్కలను జూచి యిదే రత్నముయొక్క స్వరూపమని గ్రహించుట యెటువంటిదో, ఆలాగున, నిర్మలాత్ములైయుండు బ్రహ్మనిష్ఠులనుజూచి, వారిని మలినాశయులై యాచకవృత్తిలో నుండువారితో సమన్వయపఱచుటయు అటువంటిదే యగును.

333. ప్ర:—బ్రహ్మనిష్ఠుడు దేహాదిజగత్తంతయు అనిత్యమని తెలిసికొనినవాడుగదా. అది నిజమైన, యాతడు దేహాదులనేల సంరక్షించవలయు?

ఉ:—సంరక్షణ రెండువిధములు. ఒకటి దేహాదులు సుఖముగానుండి, విషయభోగము లనుభవింపవలెనను బుద్ధిగలిగియుండుట. ఇది ప్రాకృతస్వభావముగలవారిగుణము. రెండవది జన్మరాహిత్యము కలుగజేసికొనుటకు, బ్రహ్మసాక్షాత్కారజ్ఞానము సిద్ధింపజేసికొనుటకు దేహాదులు జ్ఞానముయొక్క పరిపక్వకాలమువఱకు నిలువవలసియుండవలయునని గల స్వభావము. ఫలము పక్వమగువఱకు అరటిచెట్టుయుండవలెననుబుద్ధితో దానిని సంరక్షించినట్లున్ను, ధాన్యము పండువఱకు

పైరును సంరక్షించినట్లును, జ్ఞానప్రాప్తి గలుగువఱకు దేహమును సంరక్షింపవలసియుండును. అదిన్ని ప్రారబ్ధానుగుణముగ నుండిన సరి, లేక పోయిన సరి — యిట్టి బుద్ధితో విరక్తులుందురు. అట్లుకానిచో, బ్రహ్మజ్ఞానము గలుగువఱకు శరీరప్రాప్తి లేకయుండు ప్రారబ్ధమైనచో మధ్యకాలములోనైన యది వీడిపోవచ్చును. అప్పుడు మనస్సులో క్లేశము గలుగును. అట్లుండరాదు. అది మఱల దేహాభిమానమును గలుగజేయును. కావున, నిస్సంగబుద్ధితోమాత్రము దేహసంరక్షణము చేయుచుండవలసినదేగాని, లేనిచో ప్రాకృతులకున్ను, వీరికిన్ని యేలాటి భేదమున్ను గలుగదు. సాధకులు సాధ్యపదవిని పొందక మునుపే వారి దేహము విముక్తిపొందిపోయినను విరోధములేదు. లక్ష్యమునుగూర్చి విడిచిపెట్టబడిన బాణము లక్ష్యములోనికిపోవునే గాని వేఱుదిక్కునకు పోజాలదు. మఱియు ఏయే ప్రతికూలముచే ఈ జన్మలో ఈశ్వరప్రాప్తిగలుగదో, అట్టి ప్రతికూలము లేవియు గలుగని అనుకూలములగు స్థితులలో గూడినదగు జన్మము తప్పకగల్గును. ప్రాకృతజీవులు దేహము సంరక్షించి జ్ఞానము పొందవలెనను బుద్ధితో గాని, జన్మరాహిత్యము చేసికొనవలెనను బుద్ధితోగాని దేహసంరక్షణ చేయుటలేదు. — ఈ దేహాది ప్రపంచము సత్యమను బుద్ధితో సంరక్షించుచున్నారు.

34. ప్ర:— వేదాంతశ్రవణమొకేసారి చేసిన చాలునుగదా! మఱల, మననానిదిధ్యాసనములేల చేయవలెను? ఒకరి జాతిగాని, పేరు గాని యొకేసారి వినిన చాలుగదా. అనగా, కృష్ణుడు లేక రాముడు అని యొకరిపేరుండిన, దానినొకేసారి వినిన చాలును. మఱలమఱల 'నేను కృష్ణుడు', 'నేను రాముడు' అనియేల చింతనచేయవలెను? ఆలాగుననే మహావాక్యముచే 'నీవు జీవుడవు కావు, పరబ్రహ్మ'మని యొకేతూరి వినిన చాలునుగదా; మఱల యేల చర్వితచర్వణము చేయవలెను?

ఉ:— ఈ యుక్తి సరికాదు. సామాన్యముగా పాఠశాలలో చదువుచుండెడు విద్యార్థులుకూడ సంస్కృత శ్లోకాదు లొకేతూరి వినిన, మఱుపుగలుగక యుండజాలదు. అటువంటిదే మఱల యెన్ని యోసార్లు చింతనచేయవలసియుండును. అట్లుండగా వేదాంతవిచారణ

లన్నియు, ప్రత్యేకముగా మహావాక్యమున్నూ రూఢిపడుటకు చిరకాల మువఱకు విచారణచేయవలెననియే శాస్త్రము చెప్పుచున్నది. మీరు చెప్పు విషయమెటువంటిదనగా, రోగిగ్రైనవాడు 'మీ ఆత్మకు వ్యాధి లేదు. దేహమునకే రోగము. మీకు రోగములేదు' అని వైద్యుని వలన ఒకసారి వినిన, రోగశమనము గలుగునా? ఆరోగ్యము గలుగు వఱకు పథ్యముతోగూడి ఔషధసేవ ఆతడేలాగున చేయవలసియుం డునో, ఆలాగున భవరోగము నశించువఱకు శమదమాదులతోగూడి బ్రహ్మజ్ఞానౌషధమును ముముక్షువులు సేవించవలసియుండును. మఱియు, శూద్రగ్రహావిష్టుడైన మంచి సద్బ్రాహ్మణునకు గ్రహావేశము గలుగు నపుడు, 'నీవు శూద్రగ్రహము కాదు. బ్రాహ్మణోత్తముడవే' యని యెన్నిసార్లు బోధించినను, తాను బ్రాహ్మణుడను బోధమెట్లు గలుగ జాలదో, మంత్రశాస్త్రములు చెప్పినట్లు చేసి, గ్రహవిమోచనము గలిగినపిమ్మటమాత్రము తాను సద్బ్రాహ్మణుడను బోధమెట్లు గలుగునో, ఆలాగున, ప్రకృతియను గ్రహముపట్టినవారికి మహావాక్య బోధమొక్కసారి యుపదేశించిన చాలదు. శ్రవణము చేసినను చాలదు. అవిద్యయగు మాయ నశించువఱకును, బ్రహ్మాత్మైకత్వబోధ గలుగదు. అందువలననే పూర్వీకులగు ఋషుల యున్నతావస్థ ప్రస్తుత ముండువారికి గలుగకపోవుటకు కారణము. వారు అజ్ఞానదోషము నిశ్శేషముగ నశించువఱకున్ను వైరాగ్యముతోగూడి బ్రహ్మనిష్ఠచేయు వారు. వర్తమానకాలమున ఆలాగున ఆచరించువారు అరుదైరి. కను కనే వీరిని ప్రకృతిగ్రహము సంపూర్ణముగ విడిచిపెట్టి పోజాలకున్నది. వీరు అజ్ఞానవ్యాధి శమింపకనే యుంటున్నారు. కనుకనే మహావాక్య శ్రవణమున కొకఫలమనియు, మననమునకు నూరెట్లధిక ఫల మనియు, నిదిధ్యాసమునకు వెయ్యిరెట్లధిక ఫలమనియు, సాక్షాత్కార ఫలమనంతమనియు శాస్త్రములుద్ఘోషించుటకు కారణమైనది. "ఆవృత్తి రసకృదుపదేశాత్" అని శ్రీవ్యాసులు బ్రహ్మసూత్రములందు లిఖిం చిరి. అనగా, అసత్తగు అజ్ఞానము క్షయమొందువఱకు మఱలమఱల మహావాక్యశ్రవణ మనననిదిధ్యాసనములను ఆవృత్తిచేయుచుండవలెనని తాత్పర్యము.

ఆరుణియను ఋషిపుంగవుడు తనకొమరుడగు శ్వేతకేతువునకు 9 పర్యాయములు 'తత్త్వమసి' యను మహావాక్యము నుపదేశించినట్లు ఛాందోగ్యోపనిషత్తునందు తెలుపబడినది. అవ్విషయ మిూ క్రింద పొందుపఱుపబడుచున్నది.—

పూర్వము ఆరుణి యనునాతడు తన కుమారుడగు శ్వేతకేతువుతో నిట్లనియె:—నీవు ఉత్తమగురువును ఆశ్రయించి బ్రహ్మచర్యమును అనుష్ఠింపుము. అట్లనుష్ఠింపక మన కులమునందు ఎవ్వరును కేవలము బ్రహ్మబంధువుగా (పేరునకు మాత్రము బ్రాహ్మణుడుగా) ఉండినది లేదు. అపుడు పండ్రెండువత్సరముల వయస్సుగల నా శ్వేతకేతువు ఒకగురువు నాశ్రయించి యిఱువది నాలుగేండ్లవఱకు సకలవేదములను అధ్యయనముచేసి సంపూర్తిచేసెను. తరువాత, మహావివేకవంతుడుగను, వేదాధ్యయనసామర్థ్యము గలవాడుగను, గర్వముగలవాడుగనునై స్వగృహమును జేరెను. సత్యవస్తువగు బ్రహ్మము నెఱింగి ఆత్మనిష్ఠ గలవాడైనచో నట్లు యభిమానగర్వాదుల గల్గియుండడని యెంచి తండ్రియగు ఆరుణి కుమారుని బిలచి, "యేనాశ్రుతం శ్రుతం భవత్యమతం మతమవిజ్ఞాతం విజ్ఞాతమితి" అని యడిగెను. అనగా, దేనిని వినిన సమస్తమున్ను వినినదగుచున్నదో, దేనినెఱింగిన సమస్తము నెఱుంగబడుచున్నదో అద్దానిని ఉపదేశముచేయుడని మిూ గురువు నడిగితివా ? యన అంతనాతడు "కథం ను, భగవః స ఆదేశో భవతీతి" అనగా, ఆ యుపదేశమెట్టిది యని యడిగెను. అపుడారుణి యిట్లు వచించెను:—

"యథా సోమ్యైకేన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతం స్యాద్వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యమ్. యథా సోమ్యైకేన లోహమణినా సర్వం లోహమయం విజ్ఞాతం స్యాద్వాచారంభణం వికారో నామధేయం లోహమిత్యేవ సత్యమ్. యథా సోమ్యైకేన నఖనికృన్తనేన సర్వం కార్ష్ణాయసం విజ్ఞాతం స్యాద్వాచారంభణం వికారో నామధేయం కృష్ణాయసమిత్యేవ సత్యమేవం సోమ్య స ఆదేశో భవతీతి."

అనగా సౌమ్యుడవగు నో శ్వేతకేతూ ! మృత్తిక యొక్క దాని జ్ఞానముచే మృణ్మయములగు ఘటాది సమస్తపదార్థముల జ్ఞానమున్ను యెట్లుకలుగునో, మఱియు వాటి వికారములన్నియు నామమాత్రములే గాని మృత్తిక యొక్కటిమాత్రమే యెట్లు సత్యమగునో; సువర్ణ మొక దాని జ్ఞానముచే సువర్ణమయములగు సమస్త ఆభరణముల జ్ఞానమున్ను యెట్లు కలుగునో, వికారములన్నియు నామమాత్రములేగాని సువర్ణ మొకటియే యెట్లు సత్యమగునో; ఇనుము యొక్క దాని నెఱింగిన ఇనుముతో చేయబడిన పదార్థజాతమంతయు నెట్లెఱుంగబడుచున్నదో, వాటి వికారములన్నియు నామమాత్రములేగాని ఇనుమొకటియే యెట్లు సత్యమైనదగునో, అవ్విధముగ సద్వస్తువునుగూర్చియు నెఱుంగఁదగును. ఇదియే బ్రహ్మోపదేశము. ఇద్దానిని నీ గురువు నీ కుపదేశించియుండలేదా ? యని శ్వేతకేతువును తండ్రియడుగ అట్లుపదేశింప లేదనియు, తామే దాని నుపదేశింపవలయుననియు వేడ నంత ఆరుణి బ్రహ్మనుగూర్చి యిట్లుపదేశించెను.—

'స దేవ సోమ్యేదమగ్ర ఆసీదేకమేవాద్వితీయమ్'

అనగా, సృష్టికి పూర్వము ఏకమును, అద్వితీయమునునగు సద్వస్తు వొకటిమాత్రమే యుండెను. దానినుండియే నామరూపాత్మకమగు యీ జగత్తంతయున్ను కలిగినది. అని యిట్లువచించి క్రమముగ సృష్టిక్రమమంతయు వాని కెఱింగించి మఱియు నిట్లనియె:—

'స య ఏషోఽణిమైతదాత్మ్యమిదం సర్వం తత్సత్యం స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో ఇతి భూయ ఏవ మా భగవాన్విజ్ఞాపయత్వితి తథా సోమ్యేతి హోవాచ.'

తా॥ 'అణుస్వరూపమగు అనగా మిగుల సూక్ష్మమైన నీ పరమాత్మయే సమస్తజగత్తున్ను యగును. అదియే సద్వస్తువు. అదియే ఆత్మ. ఓ శ్వేతకేతూ ! ఆ యాత్మయే నీవు' — అని యుపదేశింప 'దేవా! ప్రతిదినము సుషుప్తియందు జీవులందఱును ఆసద్వస్తువునే జేరుచున్నను, అట్లు జేరితిమని యేల యెఱుంగకున్నారో తెలియజేయు'మని యాతడు తండ్రి నడుగగా, అంత నాతఁడిట్లు వచింపదొడగెను:—

'యథా సోమ్య మధు మధుకృతో నిస్తిష్ఠన్తి నానాత్యయానాం వృక్షాణాం రసాన్సమవహారమేకతాం రసం గమయన్తి. తే యథా తత్ర న వివేకం లభన్తేఽముష్యాహం వృక్షస్య రసోఽస్మ్యముష్యాహం వృక్షస్య రసోఽస్మీత్యేవమేవ ఖలు సోమ్యేమాః సర్వాః ప్రజాః సతి సమ్పద్య న విదుః సతి సమ్పద్యామహ ఇతి. త ఇహ వ్యాఘ్రోవా సింహోవా వృకోవా వరాహోవా కీటోవా పతఙ్గోవా దంశోవా మశకోవా యద్యద్భవన్తి తదా భవన్తి స య ఏషోఽణిమైతదాత్మ్యమిదం సర్వం తత్సత్యం స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో ఇతి భూయ ఏవ మా భగవాన్విజ్ఞాపయత్వితి తథా సోమ్యేతి హోవాచ'.

తా॥ తేనెటీగెలు పలువృక్షములనుండి రసముల గ్రహించి యొకటిగాఁ జేర్చి, ఒక్కరసముగాఁ జేసి తేనెను గలుగఁజేయుచున్నవి. ఆ రసము లొక్కొక్కటియు తానీపుష్పరసమనియు, తానీపుష్పరసమనియు మెఱుంగుటలేదుగదా ! అట్లే సమస్తప్రాణికోట్లున్ను (సుషుప్తి, మరణ, ప్రళయ, మూర్ఛాదులందు) సత్తుతో జేరియున్నను, అట్లుసత్తుతో జేరితిమని యెఱుంగుటలేదు. కాన, వారివారి కర్మానుసారము మఱల యీ లోకమునకు మఱలివచ్చి వ్యాఘ్రము, సింహాది జన్మలంబొందుచున్నారు. కాని సద్రూపమగు ఆత్మయందు స్థితికలవారు అట్టి సత్యాత్మస్వరూపమున బ్రవేశించినవారై మఱల తిరిగి జన్మింపకయుందురు. ఈ సమస్త ప్రపంచమున్ను అతిసూక్ష్మమగు నా సద్వస్తువే యైయున్నది. అదియే సత్యము. అదియే ఆత్మ. ఓ శ్వేతకేతూ ! అదియే నీస్వరూపము !ఇట్లారుణి యుపదేశింప, శ్వేతకేతువు—తండ్రీ ! జీవులు సత్తునుండియే వచ్చినను యేల తామట్లు సద్వస్తువునుండి వచ్చితిమని తెలిసికొనజాలకున్నారను విషయము నాకు వచింప వేడెదననెను. అంత యారుణి మఱియొక దృష్టాంతము ద్వారా తన కుమారునకు తత్త్వమసిమహావాక్యము నిట్లుపదేశించెను:—

'ఇమాః సోమ్య నద్యః పురస్తాత్ప్రాచ్యః స్యన్దన్తే పశ్చాత్ప్రతీచ్యస్తాః సముద్రాత్సముద్రమేవాపి యన్తి స సముద్ర ఏవ భవతి తా యథా తత్ర న విదురియమహమస్మీయమహమస్మీతి. ఏవమేవ ఖలు సోమ్యేమాః సర్వాః ప్రజాః సత ఆగమ్య న విదుః సత ఆగచ్ఛామహ

ఇతి త ఇహ వ్యాఘ్రోవా సింహోవా వరాహోవా కీటోవా పతఙ్గో వా దంశోవా మశకోవా యద్యద్భవన్తి తదా భవన్తి సయ ఏషోఽణిమైతదాత్మ్యమిదం సర్వం తత్సత్యం స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో ఇతి భూయ ఏవ మా భగవాన్విజ్ఞాపయత్వితి తథా సోమ్యేతి హోవాచ.'

తా॥ నదీనదములు సముద్రమునుండియే మేఘరూపమున బయలుదేఱి కొన్ని పూర్వదిక్కునను, మఱికొన్ని పశ్చిమదిక్కునను ప్రవహించి తుదకు సముద్రముననే కలియుచు, సముద్రరూపమునే బొందుచున్నవి. ఆనదులు, 'పూర్వము మేమిానదీరూపముగా నుంటి'మని యెట్లు తెలిసికొనుటలేదో, అట్లే యీ జీవులందఱును సత్తునుండివచ్చి నప్పటికిని, అట్లు సత్తునుండి వచ్చినట్లు తెలిసికొనకయున్నారు. ఆ యజ్ఞానకారణమున వారీప్రపంచమున వ్యాఘ్రాది నీచజన్మలను మఱల మఱల పొందుచున్నారు. కాని, జ్ఞాని సద్రూపమగు బ్రహ్మమునే పొందుచున్నాడు. ఈ సమస్తప్రపంచమున్ను అణుస్వరూపమగు నాబ్రహ్మమే యైయున్నది. అదియే సత్యము. అదియే ఆత్మ. ఓ శ్వేతకేతూ! ఆబ్రహ్మమే నీవు—— అని యిట్లుపదేశింప నంతయాతడు జలమందుద్భవించిన తరంగ, బుద్బుదాదులు మఱల జలరూపమునే బొందునపుడు నశించుచున్నవిగదా; కాని జీవుడు ప్రతిదినము సుషుప్తియందును, మరణ, ప్రళయాదులందును తన కారణరూపమును బొందినను నశించుటలేదేల? దేవా! యిద్దానిని మఱియొకదృష్టాంతముచే బాగుగా తెలియజేయుమని వేడ, అపుడారుణి యిట్లు చెప్పదొడఁగెను:——

అస్య సోమ్య మహతో వృక్షస్య యో మూలేఽభ్యాహన్యా జ్జీవన్స్రవేద్యో మధ్యేఽభ్యాహన్యా జ్జీవన్స్రవేద్యోఽగ్రేఽభ్యాహన్యా జ్జీవన్స్రవేత్స ఏష జీవేనాత్మనానుప్రభూతః పేపీయమానో మోదమానస్తిష్ఠతి. అస్య యదేకాం శాఖాం జీవో జహాత్యథ సా శుష్యతి ద్వితీయాం జహాత్యథ సా శుష్యతి తృతీయాం జహాత్యథ సా శుష్యతి సర్వం జహాతి సర్వః శుష్యతి ఏవమేవ ఖలు సోమ్య విద్ధీతి. హోవాచ జీవాపేతం వావ కిలేదం మ్రియతే న జీవో మ్రియత ఇతి స య ఏషోఽణిమైతదాత్మ్యమిదం సర్వం తత్సత్యం స ఆత్మాతత్త్వమసి శ్వేతకేతో ఇతి భూయ ఏవ మా భగవాన్విజ్ఞాపయత్వితి తథా సోమ్యేతి హోవాచ.'

తా॥ ఒక గొప్ప వృక్షము నొకవైపున కత్తితో గొట్టిన యెడల ఆ వృక్షము చచ్చుటలేదు. బ్రతికియేయుండి రసమును స్రూవము కార్చుచుండును. మధ్య కొట్టినను అట్లేయుండును. తుదను కొట్టినను ఆలాగేయుండును. అది (వృక్ష) జీవునిచే వ్యాప్తమై భూ సంబంధమైన జలమును గ్రహించుచు సంతోషముతో నుండును. ఆ వృక్షముయొక్క ఒక శాఖను (వృక్ష) జీవుడు వదలిపెట్టినచో అది యెండి పోవును. రెండవ, మూడవ శాఖలున్ను అట్లే. అన్నిటిని వదలి పెట్టినయెడల వృక్షమంతయు యెండిపోవును. అట్లనే జీవుడీ దేహ మును విడిచినచో, దేహము నశించునేగాని జీవుడు నశించుటలేదు. ఆతడు అణుస్వరూపుడు, ఈ జగత్తంతయును అట్టి సూక్ష్మరూపమగు సద్వస్తువుచేతనే వ్యాప్తమైయున్నది. అదియే సత్స్వరూపము. అదియే ఆత్మ. ఓ శ్వేతకేతూ! ఆ యాత్మయే నీవు.

ఇట్లారుణి యుపదేశింప, 'అత్యంతసూక్ష్మమున్ను, సద్రూప మున్ను, నామరూప రహితమునగు సద్వస్తువునుండి నామరూపాత్మ కమును, విశాలమునునగు యీ ప్రపంచమెట్లు కలిగెనని శ్వేతకేతువు ప్రశ్నించి, యవ్విషయమును దృష్టాంతపూర్వకముగ మఱల బాగుగ నెఱింగింపమని ప్రార్థింప నంత యారుణి యిట్లు చెప్పఁదొడఁగెను.

'కిఞ్చన భగవ ఇతి. తం హోవాచ యం వై సోమ్యైతమణి మానం న నిభాలయస ఏతస్య వై సోమ్యైషోఽణిమ్న ఏవం మహా న్న్యగ్రోధ స్తిష్ఠతి. శ్రద్ధత్స్వ సోమ్యేతి సయ ఏషోఽణిమైత దాత్మ్యమిదం సర్వం తత్సత్యం స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో ఇతి భూయ ఏవ మా భగవాన్ విజ్ఞాపయత్వితి తథా సోమ్యేతి హోవాచ.'

తా॥ ఆరుణి శ్వేతకేతువును జూచి ఒకమఱ్ఱిపండును తెమ్మ నెను. ఆతడట్లనే తేగా దానిని త్రుంచమనెను. ఆతడట్లనే దానిని త్రుంచెను. దానియందేమి యున్నవని యడుగ, మిగుల సూక్ష్మమైన విత్తనములున్నవనెను. వానిలో నొకవిత్తనమును చీల్చుమన నాతఁ డట్లనే చేసెను. అందేమి యున్నదని యడుగ, ఏమియు లేదనెను. అంత నాతడిట్లుపదేశించెను — 'ఇట్లేమియులేని సూక్ష్మవస్తువునుండి పెద్ద మఱ్ఱిచెట్టు యెట్లుకలిగెనో, అట్లే అతిసూక్ష్మమైన సత్తునుండి యీ

మహాప్రపంచమంతయు కలిగినదని తెలిసికొనుము. ఆ సద్వస్తువు అణు ప్రమాణమైనది. (అతి సూక్ష్మమైనది). ఈ జగత్తంతయు అట్టి సద్రూపమగు ఆత్మయే. అదియే సత్యవస్తువు. అదియే ఆత్మ. అదే నీవై యున్నావు' — ఇట్లు తండ్రియగు ఆరుణి శ్వేతకేతువునకుపదేశింప, యది విని మఱల నాతడిట్లు ప్రశ్నించెను — 'ఇట్టి సత్తామాత్రమైనవస్తువు ప్రపంచమునకు మూలమైయుండగా అది కనబడకుండుటకు కారణమేమి? దానిని దృష్టాంతముతో ఇంకొకసారి చెప్పవేడెద' యన అత్తఱి ఆరుణి యిట్లు చెప్ప నారంభించెను.

'లవణమేతదుదకేఽవధాయాథ మా ప్రాతరుపసీదథా ఇతి స హ తథా చకార తం హోవాచ యద్దోషా లవణముదకేఽవాధా అఙ్గ తదాహరేతి తద్ధావమృశ్య న వివేద. యథా విలీనమేవాఙ్గాస్యాన్తాదాచామేతి కథమితి లవణమితి మధ్యాదాచామేతి కథమితి లవణమిత్యన్తాదాచామేతి కథమితి లవణమిత్యభిప్రాస్యైతదథ మోపసీదథా ఇతి తద్ధ తథా చకార తచ్ఛశ్వత్సంవర్తతే తం హోవాచాత్ర వావ కిల సత్సోమ్య న నిభాలయసేఽత్రైవ కిలేతి, స య ఏషోఽణిమైతదాత్మ్య మిదం సర్వం తత్సత్యం స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో ఇతి భూయ ఏవ మా భగవాన్విజ్ఞాపయత్వితి తథా సౌమ్యేతి హోవాచ'.

తా॥ ఆరుణి తన కుమారునిఁబిలిచి, 'ఒక ఉప్పుగడ్డను ఒక చెంబునీళ్లలో యీరాత్రికి వేసియుంచి మఱునాడుదయము నాయొద్దకు రమ్మ'నెను. ఆతడట్లనే యొనర్చి మఱునాడుదయమున తండ్రికడకు వచ్చెను. ఇప్పుడా యుప్పుగడ్డను తీసికొని రమ్మనగా, ఆతడద్దానికొఱకై నీటిలో వెదకి చూచి, కనబడనందున మరలివచ్చి తండ్రినిజూచి, ఆ ఉప్పుగడ్డ నీటిలో కరఁగిపోయినది, కనఁబడలేదు, అనెను. అపుడు తండ్రి — దానిని కంటితో జూచుటకు సాధ్యముకాదు; వేఱేవిధముగాఁ దెలిసికొనవచ్చునని వచించి, దాని పైనీటిని త్రాగుమనెను. ఆతడట్లనే త్రాగి ఉప్పగానున్నదనెను. మధ్యజలమును త్రాగి చూడుమనగా అదియు ఉప్పగానేయున్నదనియు, అడుగునీటిని త్రాగుమన నదియు ఉప్పగానే యున్నదనియు బదులుచెప్పెను. దానిని దృష్టాంతముగా గైకొని అప్పుడు తండ్రి వానికిట్లుపదేశించెను. — జలమునందాయుప్పు కలసి

పోయియున్నది. అది కంటితోఁ జూచుటకును, చేతిలో తాకుటకును సాధ్యముగాక నాలుకతో రుచిచూచి తెలిసికొనుటకుమాత్రము సాధ్యమై యెట్లు సూక్ష్మరూపమున దాఁగియున్నదో, అట్లనే సత్తున్ను (ఈ దేహమున) దాగియున్నది. అది యింద్రియములచే నెఱుంగుటకు సాధ్యము కానిది. వేఱేవిధముగా యెఱుంగఁదగినది. ఆ సద్వస్తువగు ఆత్మ అతిసూక్ష్మమైనది. ఈ ప్రపంచమందంతట నదియే గలదు. అదియే సత్స్వరూపము. అదియే ఆత్మ. అట్టి సద్వస్తువగు ఆత్మయే నీవైయున్నావు — అని యిట్లుపదేశింప శ్వేతకేతువు వేఱేవిధముగా నాయాత్మ యెట్లెఱుంగబడునో మఱియొకతూరి విశదముగా బోధింపు డన నంత యారుణి యిట్లు చెప్పదొడఁగెను.

'యథా సోమ్యపురుషం గన్ధారేభ్యోఽభినద్ధాక్షమానీయ తం తతోఽతిజనే విసృజేత్స యథా తత్ర ప్రాఙ్వోదఙ్వాఽధరాఙ్వా ప్రత్యఙ్వా ప్రధ్మాయీతాభినద్ధాక్ష ఆనీతోఽభినద్ధాక్షో విసృష్టః. తస్య యథా భినహనం ప్రముచ్య ప్రబ్రూయాదేతాం దిశం గన్ధారా ఏతాం దిశం వ్రజేతి స గ్రామాద్గ్రామం పృచ్ఛన్పణ్డితో మేధావీ గన్ధారానేవో పసమ్పద్యేతైవమేవేహాచార్యవాన్పురుషో వేద తస్య తావదేవ చిరం యావన్న విమోక్ష్యేఽథ సమ్పత్స్య ఇతి. స య ఏషోఽణిమైతదాత్మ్య మిదం సర్వం తత్సత్యం స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో ఇతి భూయ ఏవ మా భగవాన్ విజ్ఞాపయత్వితి తథా సోమ్యేతి హోవాచ'.

తా॥ ఒకానొకని కన్నుల గట్టివైచి గాంధారదేశమునుండి తీసికొనిపోయి జనసంచారములేని యొకప్రదేశమున వదలివైచిన, ఆత డేప్రకారము నలువైపుల దిరిగి 'నాకండ్లు బంధింపబడినవి. నేనిటకు గొనిరాబడియున్నాను. నాకండ్ల నెవరైన విప్పివేయు'డని కేకలిడుచుండునో, మఱియు, ఆసమయమున దైవవశమున ఎవడేని దయగలవాఁడా మార్గమున వచ్చి, వాని బంధనముల విడిపించి, గాంధారదేశ మీదిక్కున నున్నది, ఈ మార్గముగాఁ బొమ్మని వచించిన, ఆ గాంధారదేశస్థుఁడు గ్రామగ్రామములఁ జని, దారి తెలిసికొని యెట్లు తనదేశమును జేరునో, అట్లే జీవుడు సద్వస్తువునుండి వచ్చి వాత, పిత్త, కఫ, రుధిర, మేద, మాంసాస్థి, మజ్జా, శుక్ర, క్రిమి, మలమూత్రాదులచే పూర్ణమై, శీతోష్ణాది

పలువిధ ద్వంద్వములతోగూడి సుఖదుఃఖసహితమైన దేహమును యరణ్యమునుజేరి, మోహమను వస్త్రముచే బంధింపబడిన నేత్రములు గలిగి, స్త్రీ, పుత్ర, మిత్ర, పశు, బాన్ధవాది దృష్టాదృష్ట విషయతృష్ణ లందు తగుల్కొని, పుణ్యపాపములను చోరులచే సంసారారణ్యమున ప్రవేశపెట్టబడగా—నేను వీని పుత్రుడను, వీరు నాబంధువులు, నా ధన ము నష్టమైనది—ఇవ్విధమున ప్రలపించుచునుండ, ఏదేని పుణ్యవశముచే కారుణికుడగు గురువుచే మార్గము చూపబడి సంసారమందు విరక్తి నొందినవాడై తుదకు సద్వస్తువునుబొంది దానితో నైక్యమగుచున్నాడు. అట్లే, యీ లోకమున ఆచార్యుండైన పురుషుడే బ్రహ్మమును (సద్వస్తువును) తెలిసికొనుచున్నాడు. అట్లు దేహబంధనమునుండి విముక్తి నొందినవెంటనే ఆతడు మోక్షప్రాప్తి నొందుచున్నాడు (సత్తుతో నైక్యమగుచున్నాడు). ఆ సద్వస్తువగు ఆత్మ అతిసూక్ష్మమైనది. సకల ప్రపంచమున్ను ఆత్మ (బహ్మ) మయము; అది సత్యస్వరూపము. అది యే ఆత్మయనఁబడును. ఓ శ్వేతకేతూ! ఆయాత్మయే నీవై యున్నావు. ఇట్లుపదేశింప నంత యాతడు 'దేవా! ఆచార్యుఁడెవ్విధమున సద్వస్తు వును జేరుచున్నాడో దృష్టాంతపూర్వకముగ నెఱింగింపవేడెద' ననెను. అపుడు ఆరుణి మఱల యిట్లు చెప్పెను—

'పురుషం సోమ్యోతోపతాపినం జ్ఞాతయః పర్యుపాసతే జానాసి మాం జానాసి మామితి తస్య యావన్న వాఙ్మనసి సమ్పద్యతే మనః ప్రాణే ప్రాణస్తేజసి తేజః పరస్యాం దేవతాయాం తావజ్జానాతి. అథ యదాస్య వాఙ్మనసి సమ్పద్యతే మనః ప్రాణే ప్రాణస్తేజసి తేజః పరస్యాం దేవతాయామథ న జానాతి స య ఏషోఽణిమైతదాత్మ్యమిదం సర్వం తత్సత్యం స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో ఇతి భూయ ఏవ మా భగవాన్విజ్ఞాపయత్వితి తథా సోమ్యేతి హోవాచ.'

తా॥ మరణావస్థయందుండువానివద్దకు, వాని బంధువులందఱును జేరి 'నన్నెఱుంగుదువా! నన్నెఱుంగుదువా' అని యడుగుదురు. కాని యెంతవఱకు వాని వాక్కు మనస్సునందును, మనస్సు ప్రాణమునందును, ప్రాణము తేజస్సునందును, తేజస్సు పరమాత్మయందును లయముగాక యుండునో అంతవఱకును 'నీవు ఫలానివాడవు, నిన్నెఱుంగుదు'నని

చెప్పును. అటుపిదప యేమియు నెఱుఁగజాలడు. [ఆచార్యోపదేశముచే జ్ఞానము బడసి సద్బ్రహ్మరూపమగు పరదేవత (ఆత్మ) యందు ప్రవేశించి జ్ఞాని మఱల తిరిగి జన్మింపకుండును. కాని అజ్ఞాని, తన పూర్వ సంస్కారము ననుసరించి వ్యాఘ్ర, దేవ, మనుష్యాది జన్మలం బొందుచుండును.] ఆ పరమాత్మ అణుస్వరూపుడు. ఈ జగత్తంతయు ఆత్మమయమే యైయున్నది. అదియే సద్వస్తువు. అదియే ఆత్మ యనం బడుచున్నది. ఓ శ్వేతకేతూ! ఆ యాత్మయే నీవై యున్నావు — ఇట్లు పదేశింప, అది విని యాతడు జ్ఞాని, అజ్ఞాని యిరువురును మరణించిన పిదప సత్తును బొందిననుు, అజ్ఞాని మరలివచ్చుటకును, జ్ఞాని మరలి రాకుండుటకును హేతువెద్దియో వచింపుడని కోరెను. అపుడు తండ్రి యగు ఆరుణి యిట్లు చెప్పదొడగెను—

'పురుషం సోమ్యోత హస్తగృహీతమానయన్త్యపహార్షీత్స్తేయమకార్షీత్పరశుమస్మై తపతేతి స యది తస్య కర్తా భవతి తత ఏవానృతమాత్మానం కురుతే సోఽనృతాభిసన్ధోఽనృతేనాత్మానమన్తర్ధాయ పరశుం తప్తం ప్రతిగృహ్ణాతి స దహ్యతేఽథ హన్యతే. అథ యది తస్యాః కర్తా భవతి తత ఏవ సత్యమాత్మానం కురుతే స సత్యాభిసన్ధః సత్యేనాత్మానమన్తర్ధాయ పరశుం తప్తం ప్రతిగృహ్ణాతి స న దహ్యతేఽథ ముచ్యతే. స యథా తత్ర నాదాహ్యేతైతదాత్మ్యమిదం సర్వం తత్సత్యం స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో ఇతి తద్ధాస్య విజజ్ఞావితి విజజ్ఞావితి.'

తా॥ సౌమ్యుడవగు నో శ్వేతకేతూ! ఒకానొకనిని రాజభటులు చేతులఁగట్టివైచి తీసికొనివచ్చిరి. న్యాయాధీశులు 'ఈతడేమి యొనర్చె' నన, 'దొంగిలించినా'డని వారు చెప్పిరి. అపుడు వారు — ఇనుపగొడ్డలిని కాల్చి వీనిచేత నుంచుడు. దొంగిలించియున్నచో యీతడు దానిచే దహింపబడును! అనిరి. ఆతడు నిర్దోషియైనచో, దానిని గ్రహించుటచే తన సత్యమును వెల్లడింపగల్గును. అనగా, సత్యాత్ముడైనచో దానిచే దహింపకయుండును. అపుడాతడు విడువబడును. కాని దోషియైయున్న, తన దోషమును గప్పజూచినచో, ఆ కాలిన యినుపగొడ్డలిని స్పృశింపగనే దహింపబడి మరణించును. ఇవ్విధమున సత్యాభిసంధుడగువాడు

తన సత్యత్వకారణమున యెట్లు దహింపబడకయుండునో, అట్లే దేహ పతనసమయమున, సద్బ్రహ్మరూపమగు సత్యమున నిష్ఠగలవారియొక్కయు, అజ్ఞానుల యొక్కయు స్థితియందు సమానత్వమున్నను, అజ్ఞాని మఱల జన్మపరంపరలఁ బొందును. జ్ఞాని అట్లు పొందకుండును. ఏ ఆత్మయందు స్థితిగల్గిన మోక్షమున్ను, స్థితిగలుగకున్న బంధమున్ను సంభవమగుచున్నవో, ఏది సమస్తజగత్తునకు మూలభూతమో, సర్వజీవులు దేనినాశ్రయించుకొని, దేనియందు ప్రతిష్ఠితులై యున్నారో, ప్రపంచమంతయు యెద్దాని స్వరూపమై యున్నదో, ఏది జననమరణములు లేనిదో, మఱియు అభయమును, శివమును, అద్వితీయము నగునో, అదియే సత్యము. ఓ శ్వేతకేతూ! అదియే నీయాత్మ. కాన నీ వదియే యైయున్నావు.—అని యిట్లు బోధింప నంత శ్వేతకేతువు, 'ఇపుడు నాకు తెలిసిన'దని వచించెను.

ఇవ్విధమున ఆరుణి తనకుమారుడగు శ్వేతకేతువునకు తొమ్మిది పర్యాయములు తత్త్వమసి మహావాక్యమును భిన్నభిన్న దృష్టాంతములతో బోధించి వానిని ప్రబుద్ధునిఁజేసెను.

మఱియు ఉద్దాలకునకు యాజ్ఞవల్క్యమునీంద్రుడు అంతర్యామి స్వరూపమునుగూర్చి 21 పర్యాయములు బోధించియుండెను. ఇంకను ఆత్మావాఽరేద్రష్టవ్య శ్రోతవ్యోమంతవ్యోనిదిధ్యాసితవ్యః" అనిబృహదారణ్యకోపనిషత్తులో మైత్రేయి నుద్దేశించి యాజ్ఞవల్క్య మునీంద్రుఁడుపదేశించెను. అనగా, 'ఆత్మ దర్శింపఁదగినది, శ్రవణము చేయదగినది, మననము చేయదగినది, నిదిధ్యాసనముచేయదగిన'దని యర్థము. ఇట్టి శ్రుతివాక్యమును, వేదవాక్యమును విశ్వసింపకపోవుటచేతనే పూర్వోక్తసిద్ధపురుషులవలె యిప్పుడుండువారు ఉన్నతస్థితి పొందకపోవుటకు కారణమైనది.

మలినో హి యథాదర్శో రూపాలోకస్య న క్షమః ।
తథాఽవిపక్వకరణ ఆత్మజ్ఞానస్య న క్షమః ॥

ఏలాగున మాలిన్యముగల దర్పణము రూపమును ప్రతిబింబింపఁజేయుటకు శక్తిలేకయుండునో, ఆలాగున పరపక్వతలేని అంతఃకర

ణము బ్రహ్మసాక్షాత్కారజ్ఞానము నవగాహనముచేయుటలో శక్తి గల్గియుండజాలదు.

ముక్తిస్తు బ్రహ్మతత్త్వజ్ఞానాదేవాస్య న చాన్యథా ।
స్వప్రబోధం వినా నైవ స్వస్వప్నో హీయతే కథమ్ ॥

జీవన్ముక్తి సాధకునకు బ్రహ్మసాక్షాత్కారజ్ఞానమొక్కదాని వల్లనే గలుగును. వేఱుమార్గములేదు. ఎట్లన, స్వప్నావస్థలోనుండు వానికి జాగ్రదవస్థ గలుగకపోయిన, స్వప్నములో కానుపించిన దృశ్యములన్నియు మిథ్యయని యెట్లు బోధము గల్గును? కనుకనే శ్రుతిమాత 'నాన్యః పన్థా విద్యతేఽయనాయ'— ఈశ్వర సాక్షాత్కారజ్ఞానము తప్ప మోక్షమునకు వేఱుమార్గములేదు, అని చెప్పుటకు కారణము.

శ్రేష్ఠాధికారిణం ప్రాజ్ఞం మేధావినం వివేకినమ్ ।
విద్వాంసం నిస్స్పృహం శాన్తం శమాదిగుణశాలినమ్ ॥

కనుకనే బ్రహ్మనిష్ఠాధికారినిగుఱించి యీలాగున నిరూపించడమైనది. — ప్రజ్ఞావంతుడును, మేధాసంపత్తిగలవాడును, ఆత్మానాత్మవివేకముగలవాడును, బ్రహ్మవిద్యయందు విద్వాంసుడున్ను, నిస్స్పృహుడున్ను, శాంతుడున్ను, శమదమాదిగుణములతో గూడినవాడగు శ్రేష్ఠమైన గుణాధికారము గలవాడున్ను నగువానికే యిట్టి శ్రేష్ఠమగు బ్రహ్మజ్ఞానము బోధపడును.

శుద్ధే చిత్తే చిదానందః స్వయమేవ ప్రకాశతే ।
తద్బ్రహ్మాహమితి జ్ఞాత్వా సర్వబన్ధైః ప్రముచ్యతే ॥

శుద్ధమైన చిత్తమందుమాత్రమే చిదానందమయమగు బ్రహ్మవస్తువు ప్రకాశించును. అట్టి బ్రహ్మవస్తువే ఆత్మగా అనుసంధానము చేయు జ్ఞానికిమాత్రమే సమస్తబంధనములనుండి విమోచనముగల్గును.

అహంకారో మహాగ్రాహో యత్నేన తన్నికృన్తత ।
తస్మిన్స్థితే న ముక్తిస్స్యాత్ శాస్త్రయుక్తిశతైరపి ॥

అనాత్మస్వరూపమగు దేహాద్యహంకారమను గొప్పమొసలిచే పట్టుకొనబడినవాడైన ముముక్షువు సాధనయనెడు ఖడ్గముచే అవిద్యయను యీ మకరిని దునుమవలెను. అట్టి అవిద్యకమగు విషయములో

యెంతకాలముండునో, అంతకాలమువఱకు యెన్నిశాస్త్రములు చదివినను, ఎన్నియుక్తులు నేర్చినను విమోచనము గలుగదు.

ఇంద్రియేషు చ సర్వేషు వాగుపస్థౌ మహాబలౌ ।
అనయోర్జయే యత్నం కుర్యాద్యోగీ విశేషతః ॥

ఇంద్రియములన్నింటిలోను జిహ్వోపస్థలు రెండును మహాబలము గలిగినవి. కావున ధ్యానాద్యనుష్ఠానములు చేయువాడు మొట్టమొదట ఈ రెండింద్రియములయొక్క విషయములను జయించుటలో మిక్కిలి శ్రద్ధగలిగియుండవలెను. ఈ రెంటిని జయించినచో మఱల ప్రకృతి చేరుటకవకాశము లేదు. ఈ రెండుద్వారము లెంతవఱకు మూయబడలేదో, అంతవఱకు జననమరణములకు హేతువగు సంసారద్వారము తెఱచియే యుండును. ఇవి రెండును యెప్పుడు నిరోధింపబడెనో, వానికిక జననమరణములయొక్క కారణమగు ప్రకృతియొక్క ద్వారమున్ను మూయబడినదేయగును.

విషయే దోషదర్శనం తయోర్జయే సుకౌశలమ్ ।
భోగేన న భవేద్వశ్యౌ భవతస్తౌ సమాశ్రితైః ॥

పై రెండుద్వారములను నిరోధించుట కుపాయమీశ్లోకమున తెలుపబడెను. విషయములచే గలిగెడు దోషమును దూరాలోచనచేసి కనుగొనిన, మిక్కిలి సులభముగ నిరోధము సిద్ధించును. ఇదే సులభమైన కుశలత్వము. ఆ విషయము లెంతప్రియనుభవించినను, ఆ రెండింద్రియములును వశములుకావు. వందలకొలది సంవత్సరములనుభవించినను, వాటి తృష్ణ అంతకంతకు వృద్ధినొందునేగాని, శమించదు. ఎట్లన,

ఇంధనేన యథా వహ్నిః వర్ధతే ఉత్తరోత్తరమ్ ।
భోగేన కామరూపాగ్నిః వర్ధతే ఉత్తరోత్తరమ్ ॥

సమిధలచే అగ్నిహోత్రుడంతకంతకు వృద్ధినొందునేగాని యెట్లు శమించడో, ఆలాగున భోగముచే కామాగ్ని యంతకంతకు ప్రజ్వలించునేగాని శమింపదు.

యథాఽయం కమఠోఽఙ్గాని సంకోచయతి సర్వథా ।
విషయేభ్యస్తథా ఖాని సంకోచేద్యోగతత్పరః ॥

ఏలాగున కూర్మము తన కరచరణాదీంద్రియములను లోనికి ముడుచుకొనునో, ఆలాగున విషయములనుండి శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాది పంచేంద్రియములను ధ్యానతత్పరుడు తన హృదయములోనికి ముడుచుకొనవలెను. తాబేలు యేలాగున యింద్రియములను ప్రసరింపచేయుటలోను, ముడుచుకొనుటలోను శక్తిగలిగియుండునో, ఆలాగున యెవఁడు తన చక్షురాది యింద్రియములను సంయమన మొనర్చుటయందు సమర్థత గల్గియుండునో వానికి యింద్రియములు వశవర్తులై యుండును. ఇట్టి శక్తి గలిగెనేని యింద్రియజయము గలిగెనని తెలిసికొనవచ్చును. ఆతఁడే సంయమి యగును.

యదా హ్యజ్ఞానకాలుష్యం జన్తోర్బుద్ధిః క్రమిష్యతి।
తదాఽసౌ యాతి వైరాగ్యం వేదవాక్యాదిషు క్రమాత్॥

ఎప్పుడు అజ్ఞానకలుషితమైన బుద్ధిని సాధకుఁడతిక్రమింపగల్గునో, అప్పుడే వేదములో విధించినట్లు శుద్ధమైన వైరాగ్యము విషయములలో గలుగును. ఎంతవఱకు బుద్ధి శుద్ధముగాలేదో, అంతవఱకు విషయములకు పైనుండు నిర్విషయమగు ఆత్మను జీవుడు పొందజాలడు.

ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే।
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమివాంభసి॥

ఇంద్రియాశ్వాద్విచరతో విషయాననువర్తతే।
యన్మనస్తమతిం హన్యాదప్సు నావం మరుద్యథా॥

ఎంతవఱకు యింద్రియవేగమను వాయువుననుసరించి విషయభోగరూపమగు సంసారసాగరములో మనస్సు యనువర్తించియుండునో, అట్టివానియొక్క మనస్సును, సముద్రములో నావను తుపాను ముంచునట్లు, ఆ యింద్రియములు విషయసాగరములో ముంచివేయును.

చతుర్భిస్సాధనైస్సమ్యక్సంపన్నో యుక్తిదక్షిణః।
మేధావీ పురుషో విద్వానధికార్యత్ర సమ్మతః॥

సాధనచతుష్టయసంపత్తితో గూడినవాడున్ను, ఇంద్రియనిగ్రహము గలవాడున్ను, కార్యదీక్షగలవాడున్ను, మేధాసంపన్నుడును, బ్రహ్మవిద్యయందు విద్వాంసుడున్ను, పురుషప్రయత్నము గలవాడునగువాడే, ఈ బ్రహ్మవిద్యయందధికారియని శాస్త్రసమ్మతమగును.

వి॥ ఇట్టి గుణములుగలవా రేకులమువారైనను, పురుషులైనను, స్త్రీలైనను, గృహస్థులైనను, విరక్తులైనను వారధికారులే.

315. ప్ర:—బ్రహ్మసాక్షాత్కారజ్ఞానము సిద్ధించుటకు ప్రతివారున్ను ఈ వేదాంతశ్రవణమనననిదిధ్యాసనములు చేసియేతీరవలెనా? వేఱుమార్గములచే జీవన్ముక్తిని పొందగూడదా?

ఉ:—సామాన్యముగా బ్రహ్మచింతనావిషయమై, ఈశ్వర సాక్షాత్కారజ్ఞానప్రాప్తివిషయమై అనుభవజ్ఞులగు గురువుల ద్వారా శమదమాది సాధన చతుష్టయసంపత్తిగల ముముక్షువులు వేదాంత వాక్యశ్రవణము చేసినపిదప క్రమముగ మననము, నిదిధ్యాసనము చేయవలెననియే శాస్త్రసమ్మతము. ఏలన, నదిని దాటుటకు నావయే ముఖ్యముగ శాస్త్రములలో నిశ్చయింపబడినది. ఆలాగున, జననమరణ ప్రవాహమగు సంసారమును తరించుటకు వేదాంతజనిత శ్రవణాది త్రయమను జ్ఞానమే శాస్త్రములలో జెప్పబడినది. తక్కిన ఉపాసనా, కర్మయోగాదులు పరంపరామార్గములనియు, శ్రవణాదులు సాక్షా న్మార్గములనియు తెలుపబడెను. కాని, తీవ్రమైన ఈశ్వరభక్తివల్లను, ధ్యానధారణసమాధులను యోగమువల్లనుగూడ మోక్షము పొంద వచ్చును. ఎట్లన, నదిని దాటుటలో పడవయే ముఖ్యమైయున్నప్పటి కిన్ని తెప్పచేతను, ప్రమానుచేతనుగూడ యానదిని దాటవచ్చును. కాని, ప్రసిద్ధముగ నావయే విధింపబడియున్నది. ఆలాటి భేదమిచట గలదు. వామదేవాది పెక్కండ్రు ఋషులు వేదాంతవిచారణజ్ఞానముచేతనే బ్రహ్మత్వమును పొందియున్నారు. ఉపనిషత్తులన్నియు ఈలాగుననే చెప్పుచున్నవి. కాని సనకాదియోగులు ధ్యానయోగముచేతను, నారదాది దేవర్షులు భక్తిచేతను, వసిష్ఠాది బ్రహ్మర్షులు కర్మాను ష్ఠానముచేతను, విశ్వామిత్రాది రాజర్షులు తపస్సుచేతను ముక్తులై యున్నారు. సనకాదులున్ను, శుకాదులున్ను, నారదాదులున్ను, యోగసిద్ధులును, ఈశ్వరసాక్షాత్కారజ్ఞానము పొందినవారునైనను, వీరందఱున్ను వేదాంతవిచారణాపరమగు "ప్రజ్ఞానం బ్రహ్మ" మొదలగు నాలుగు మహావాక్యములను చక్కగ విచారణచేసియున్నారు. అఖండజ్ఞానము గలుగుటలో వీని నందఱును విచారణచేయవలసి యుండును. యోగోపాసనలచే మలవిక్షేపరూప అంతఃకరణదోషము నశించును. అపుడుమాత్రమే అపరిచ్ఛిన్న అద్వైత దైవసాక్షాత్కారమున

కర్తృత గలుగును. వేదాంతశ్రవణాదులచే మోక్షముగల్గునని చెప్పువారికి గూడ నిష్కామకర్మయోగముచే మలనివృత్తియు, దైవోపాసనచే విక్షేపశాంతియు గలుగవలసియుండును. లేనిచో వారున్ను శ్రవణమున కర్హులు కాజాలరు.

ప్రతిబంధో పరిజ్ఞానం నేహ ముక్తిం ప్రయచ్ఛతి ।
విశుద్ధబ్రహ్మవిజ్ఞానం విశుద్ధస్యైవ సిద్ధ్యతి ॥

ఎంతవఱకు హృదయమందు ప్రతిబంధత్రయముండునో, అంతవఱకు యిహామందేవఱున్ను ముక్తిని పొందజాలరు. అత్యంతపరిశుద్ధమైన బ్రహ్మజ్ఞానము నిర్మలాంతఃకరణము గలవారికే లభించును.

శ్రద్ధావినయసంయుక్తః శాన్తిదాన్త్యాదిసంయుతః ।
యావజ్జ్ఞానోదయస్తావద్వేదాన్తార్థం నిరూపయేత్ ॥

ఎంతవఱకు జ్ఞానోదయము కాలేదో, అంతవఱకు శ్రద్ధ, వినయములతో గూడినవాడును, శమదమాదియుక్తుడునై వేదాంతార్థమును మఱలమఱల నిరూఢికొఱకు విచారణచేయవలయును.

36. ప్ర:—సాక్షాత్కారజ్ఞానమునకున్ను, పరంపరాజ్ఞానమునకున్ను యేమి భేదము ?

ఉ:— క్షుద్బాధగలవాని కన్నముపెట్టిన నెట్లుండునో, ఆలాగున మహావాక్యశ్రవణముండును. ఇది సాక్షాత్కారజ్ఞానమనంబడును. అట్లుగాక కర్మముగాని, యోగముగాని, ఉపాసనగాని, భోజనాదులకులేక వచ్చినవారికి కొంతభూమియు, విత్తనములున్ను యిచ్చి, వీటినే కృషిచేసి పండించి సుఖముగా జీవించుడని చెప్పులాగున నుండును. దీనికే పరంపరామార్గమని పేరు కలిగినది.

37. ప్ర:—భూమియు, విత్తనములనిచ్చిన, దానివల్ల పండించి భుజించుటకు చాలకాలము పట్టునుగదా. ఆకలి గలవారికి అన్నముపెట్టిన, అప్పుడే భుజించి సుఖముగ నుండవచ్చునుగదా. ఇంత సులభమార్గముండగ యేల శ్రమచేసి, పండించి తిననలెను? కావున, అందఱున్ను మహావాక్యమును యేల శ్రవణము చేయరాదు ?

ఉ:—సాధారణముగ రాజగృహమునకు వచ్చిన బంధువులకు

మాత్రమే భోజన మొసంగుట గలదు. జీవనోపాయమునకు జరుగనివారు రాజులనాశ్రయించిన, వారు వారికి కొంతభూమి యిచ్చి, విత్తనమునకు సహాయముచేసి, కృషిచేయుటకు తగినసామగ్రుల నొసంగి పంటలు వచ్చువఱకు భోజనాది సదుపాయముల చేయుదురు. ఇంటికి వచ్చిన వారు రాజబంధువులని చెప్పబడుటచే వారికులమున్న సమానస్థితియు గలవారని యర్థమగుచున్నది. కావున, బ్రహ్మవేత్తలైనవారు యేలాగున శమదమాది గుణములతోను, వైరాగ్యోపరతులతోను, నిర్భయ యస్థితి గల్గియుందురో, అట్టి స్థితిగలుగుట కిదివఱలో నిష్కామకర్మ యున్ను, దైవోపాసనయున్ను, ధారణాధ్యానయోగమున్ను అనుష్ఠించినవారుగనుందురో ఆలాగున నట్టి యోగ్యతగలవారు బ్రహ్మవేత్తకు బంధువులవంటివారగుదురు. కావున వీరికిమాత్రము మహావాక్యశ్రవణమున కధికారముగలుగును. వీరు మల, విక్షేపరహితులై యుందురు. ఇప్పుడు బీదవారగువారుగూడ శ్రీమంతులగునప్పుడు రాజబంధువులు కావచ్చును. ఆలాగున, ప్రస్తుతము ఆత్మశుద్ధి పూర్తిగ లేనివారు, హృదయశుద్ధిగల్గి, శమదమాదిగుణములు పొందునప్పుడు మహావాక్యశ్రవణమున కర్హులగుదురు. ఎట్లన, యిపుడు చిన్న తరగతిలో చదువువారు కొంతకాలమునకు పెద్దవారు చదువుచుండెడి స్థానమునకు రాగలరు. మఱియు, చిన్నయుద్యోగములో నుండువారు, యోగ్యతగలవారైన, ఉన్నతోద్యోగస్థానమున కర్హులగుదురు. మఱియును ఉన్నతపర్వతారోహణము చేయువారిలో ముందువెళ్లినవారు పైస్థానమునకు వెళ్లిచేరినను, వెనుక వచ్చువారుకూడ కొంతసేపటికి పర్వతోపరిభాగమును చేరగల్గుదురుగదా. ఆలాగున నిష్కామకర్మ, ఉపాసన, యోగముచేయువారు కొంతకాలమునకు బ్రహ్మసాక్షాత్కార జ్ఞానమునకు యోగ్యులగుదురు. ఈశ్వరోపాసనచేసి ఈశ్వరకృపనొందిన వారికిగూడ మాయ, ఆవరణ నశించుటచే స్వరూపనిష్ఠకర్హులగుదురు.

38. ప్ర:—గురువరా! ఏకార్యమారంభించినను దానికి ఆది, మధ్య, అంతములుండునుగదా. ఆలాగున కర్మ, భక్తి, యోగ, జ్ఞానములయొక్క ఆది, మధ్య, అంతముల దెలుపకోరుచున్నాను. ఏలన, ఈ విషయము తెలిసిన, ముముక్షువు ప్రారంభించెడు సాధనలలో

యెంతవఱకు వచ్చెనను బోధముగలుగును. అది వానికి యెంతో ఆత్మశాంతికి సహాయము గలుగజేయును. ఎట్లన, ఒకదేశమునకు ప్రయాణముచేయువానికి, యింతదూరము వచ్చితిని, ఇక యింత దూరముమాత్రము పోవలసియుండునని తెలియునప్పుడెంత సంతసము గలుగునో, ఇదిన్ని ఆలాగున మనస్సమాధానమునకు కారణమగునని తలంచుచున్నాను.

ఉ:—సూక్ష్మబుద్ధిగల సోదరా! మంచిప్రశ్న చేసితివి. ఇదిజిజ్ఞాసువుల కెంతయో ఉపకరించును. నిర్మలభావముతో వినుము. పుణ్యకర్మలుచేయవలెననుబుద్ధి యుదయమగునపుడు కర్మయోగమారంభమగును. అది ఫలాపేక్షలేక చేసినమాత్రమే శుద్ధజ్ఞానమునకు హేతువుకాగలదను బుద్ధి దృఢముగా గలుగునపుడు మధ్యమస్థితిలోనికివచ్చును. అప్పుడు ఈశ్వరార్పణబుద్ధితో కర్మలంజేయును. వాటిని శుద్ధముగా చేయునపుడు తనయొక్క సొంతపనివలె యాచరించి ఫలమును కోరక యుండునపుడు అట్టిబుద్ధి నైజస్వభావముగామారునప్పుడు అంత్యమగును. ఇదివఱకు అట్లు చేయుటవిధియనిగూడ తలంచును. కానియిప్పుడు తాను నిష్కామకర్మము చేయుచున్నానను బుద్ధికూడగలుగదు. అది సహజమై మారును. తానాచరించుచున్నానను బుద్ధి యెపుడు నశించునో, అప్పుడు అకర్తృత్వము గలిగినందుచే దానివల్ల ముక్తి కలుగును. కలకండ, తాను జనులకు మాధుర్యము గలుగజేయుచున్నానను బుద్ధిగల్గియుండ నప్పటికిన్ని, జనులుమాత్రము 'పటికబెల్లము మనకు తీపి కలుగజేయుచున్న'దని తలంచునట్లు పరిపక్వమైన నిష్కామకర్మయోగి లోకవిషయముగాని, ఈశ్వరవిషయముగాని తానేమియు చేయుటలేదని తలంచినను, జనులుమాత్రము — లోకహితార్థమీపుణ్యాత్ముడు తన జీవితమంతయు వినియోగపఱచుచున్నాడని తలంతురు. "యుక్తః కర్మఫలం త్యక్త్వా శాన్తిమాప్నోతి నైష్ఠికీమ్" అని గీతావాక్యము. యుక్తుడు అనగా సంయమముగలవాడు కర్మఫలమును అపేక్షింపనందుచే నిష్ఠాపర్యవసానమగు పరమశాంతిని పొందుచుండును.

౩౯. ప్ర:—నిష్కామకర్మయోగరహస్యము తెలియడమైనది. ఇక భక్తియోగమునుగూర్చి తెలుపప్రార్థన.

ఉ:—తన్నును, లోకమును, ఈశ్వరుని, యేకరూపముగ కనుగొనుటయే భక్తియోగముయొక్క లక్ష్యమగును. ఇది భక్తి యొక్క పరమావధి. ఇట్టి యవస్థ అంతిమస్థితి యగును. ప్రారంభములో ఈశ్వరభక్తి గలిగియుండిన, దుఃఖములన్నియు నశించును. సర్వేశ్వరకృపవలన మోక్షముకూడ గలుగునను బుద్ధి యుదయమగును. మఱల అట్లు భక్తిగలిగియుండుట జీవుల ధర్మమని బోధమగును. అప్పుడు, హోమగుండమునుండి లేచెడు నిప్పురవ్వలవలె ఈశ్వరాంశులే జీవులని గోచరము కాగల్గును. అప్పుడు ఈశ్వరునివలె శుద్ధసంకల్పము గల్గియుండును. తరువాత ఈశ్వరుడున్ను, జగత్తున్ను, జీవులున్ను ఒకే దైవస్వరూపులేగాని అన్యముకాదను రహస్యము గోచరము కాగల్గును. అగ్నియందువేసిన అన్నివస్తువులున్ను అగ్నిమయమైపోవునట్లు, జగజ్జీవేశ్వరులందఱు ఒకే దైవవస్తువను బోధము గల్గును. అప్పుడు అంత్యమైనది. అపుడు జీవులన్నియు దైవమయముతప్ప అన్యముకాదను జ్ఞానము కలుగుటచే ముక్తిగల్గును. ఇది భక్తియొక్క పరమావధి యనంబడును. అన్నిటియందును చంద్రుని చంద్రికయెట్లు సమముగా ప్రసరించునో, ఆలాగున యాతడన్ని ప్రాణికోట్లను సమముగానే చూచును. చంద్రునకు చంద్రికయెట్లు సహజమో, ఆలాగున శాంతి, కరుణ వానికి సహజములై పోవును.

భక్త్యా మామభిజానాతి యావాన్యశ్చాస్మి తత్త్వతః ।
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనన్తరమ్ ॥

అని గీతాచార్యులుపదేశించిరి. పరిశుద్ధమైన భక్తివల్ల, భగవత్స్వరూపమెట్టిదో సత్యముగ బోధమగును. అట్టి నిజమగు జ్ఞానమునకావరణము గలుగమిచో యా జీవుడు ముక్తుడగును. అచ్చటగూడ జీవత్వము నశించినందుచే బంధము లేకపోవును.

భక్త్యా త్వనన్యయా శక్య అహమేవంవిధోఽర్జున ।
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప ॥

తా॥ అర్జునా! ఇట్టిరూపముగల నన్ను జూచుటకుగాని, నిజముగాఁ దెలిసికొనుటకుగాని, నాయందు బ్రవేశించుటకుగాని నిశ్చల భక్తితప్ప వేఱుసాధనలేదు.

40. ప్ర:—భక్తియోగముయొక్క సారము సంక్షిప్తముగా గ్రహించుకొనడమైనది. ఇక యోగముయొక్క రహస్యమును తెలుప కోరుచున్నాను.

ఉ:—వియోగములేని స్థితి గలిగిన యోగము సిద్ధించును. చంచలమైన మనస్సును ఆత్మలో (ఈశ్వరునిలో) లయమొందించ వలెనను బోధము గల్గునపుడు యోగమారంభమగును. ఇట్టి స్థితి ఆదియనందగును. ధ్యానబలముచే అభ్యాసము పరిపక్వతజెందునపుడు, అగ్నిలోనుంచిన యినుము అగ్నిమయమైయుండునట్లు, ఇంద్రియములు, మనస్సు మొదలగునవన్నియు ఆత్మచే తేజోమయములై యుండు నపుడది మధ్యమస్థితియగును. కాని, యత్తఱి అగ్ని వేఱుగాను, ఇనుము వేఱుగానునుండును. కాన ఏకత్వముగలుగదు. అట్టి ధ్యానము మఱెంత పక్వదశనొందునపుడు, నదులు సముద్రములో జేరి ఏకత్వ మొందునట్లును, బీజమంకురించి వృక్షమగునట్లున్ను, ఒకే స్వయం ప్రకాశమగు దైవచైతన్యముతప్ప రెండవదేమియు లేదను తత్వము బోధమగును. అపుడు అంత్యమైనదని తెలిసికొనవచ్చును. మఱియు అపుడు, అగ్నికేలాగున స్వయముగ ప్రకాశముంటున్నదో, ఆత్మకున్ను జ్ఞానప్రకాశము స్వయముగా నుంటున్నదను బోధ గల్గును. అత్తఱి జీవుడు ఈశ్వరున కన్యముకాదను బోధము గలుగుటచే మోక్షము లభించును. మఱియు నపుడు అగ్నికేలాగున దహనశక్తి నైజముగానే యుంటున్నదో ఆత్మకున్ను ఆలాగున జ్ఞానగుణము స్వభావమను బోధ గల్గును.

తం విద్యాద్దుఃఖసంయోగవియోగం యోగసంజ్ఞితమ్ ।
స నిశ్చయేన యోక్తవ్యో యోగోఽనిర్విణ్ణచేతసా ॥

దుఃఖముయొక్క సంసర్గమేమాత్రములేని స్థితియే యోగమనం బడును. అట్టి యోగమును నిర్మలబుద్ధితోను నిశ్చలమనస్సుతోను జేయవలెను అని శ్రీ కృష్ణవచనము.

41. ప్ర:—యోగరహస్యము సంక్షేపముగ గ్రహించడమైనది. ఇక జ్ఞానముయొక్క రహస్యతత్వము తెలియఁ గోరికగలుగుచున్నది.

ఉ:— జ్ఞానమువల్లనే దుఃఖశాంతియు, ఆనందప్రాప్తియు

గలుగునేగాని మఱియేమార్గము లేదని నిశ్చయించి, శ్రవణమందును, ధ్యానమందును మనస్సు ప్రవేశించెడు కాలమారంభమనఁబడును. మఱల, గురుముఖమున శ్రవణముచేసిన మహావాక్యమును మననము చేయునపుడు మధ్యమస్థితికి వచ్చును. అంతరేంద్రియములన్నియు శుద్ధములై యేకాగ్రతకలిగియుండవలెను. అపుడు వృత్తులన్నియు శరత్కాల మేఘమువలె స్వచ్ఛములైపోవును. బ్రహ్మవస్తువే ఆత్మయను బోధము గలిగినను, దృశ్యము నశించియుండదు. కాని దృశ్యముచే నేలాటి బాధయున్ను గలుగదు. ఇట్టిస్థితి మధ్యమమగును. ఇట్టి మననమే దీర్ఘకాలము యేకాగ్రతతో చేయునపుడది నిదిధ్యాసనముగా మారును. అది పుష్పము ఫలముగా పరిణమించినట్లుండును. తైలము జ్యోతిగ పరిణామమొందినట్లుండును. కర్పూరము వెలుతురుగా మారు నట్లు ధ్యాతయున్ను, ధ్యానమున్ను క్రమముగ లీనముకాగా, జ్ఞేయమగు బ్రహ్మవస్తువొకటిమాత్రముగలదను రహస్యము బోధమగును. అపుడు కర్తృత్వ, జీవత్వములు నశించినందుచే ప్రకృతియు శమించును. అందువల్ల మోక్షముగలుగును. అప్పుడు సూర్యునకు ప్రకాశము సహజమైనట్లు, ఆత్మకు జ్ఞానప్రకాశము స్వభావముగా నుండు నను బోధముగల్గును. ఇది అంతిమస్థితియగును. 'జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్' — 'జ్ఞాని నాయొక్క ఆత్మస్వరూపమే, జ్ఞానియొక్క ఆత్మ స్వరూపమే నే' నని శ్రీకృష్ణవచనము.

> ముక్తిస్తు బ్రహ్మతత్త్వజ్ఞానాదేవాస్య న చాన్యథా ।
> స్వప్రబోధం వినా నైవ స్వస్వప్నో హీయతే కథమ్ ॥

స్వప్నావస్థలో కానుపించెడు దృశ్యములన్నియు జాగ్రత్ స్థితికి వచ్చునపుడెట్లు మిథ్యగ తోచునో, ఆలాగున బ్రహ్మతత్త్వజ్ఞానమను జాగ్రత్ స్థితికి వచ్చునపుడు జీవన్ముక్తస్థితిగలుగును. ఇట్టి జ్ఞానముతప్ప ముక్తికి వేఱుమార్గములేదు.

**42.** ప్ర: —తపస్సువల్లనే పాపము నశించుననియు, అందువల్ల శాంతిగల్గుననియు, దానిచే విషయవిరక్తి సిద్ధించుననియు, అట్టి యుత్కృష్టగుణముగలవారే నిజమైన ముముక్షువులగుదురనియు, అట్టి వారికే యీ ఆత్మబోధముపదేశింపబడుచున్నదనియు శ్రీశంకరులు

ఆత్మబోధములో మొదటనే తెలిపియున్నారు. ఇందులకు ప్రమాణము—

తపోభిః క్షీణపాపానాం శాంతానాం వీతరాగిణామ్ ।
ముముక్షూణామపేక్ష్యోయ మాత్మబోధో విధీయతే ॥

కావున, తపస్సును ముఖ్యముగ నుపదేశించియున్నారు. 'తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ, తపోబ్రహ్మ' యని శ్రుతికూడ విధించుచున్నది. అనగా తపస్సువలననే బ్రహ్మ మెఱుంగఁదగినదనియు, అంతే గాక తపస్సే బ్రహ్మమనియు ఉపదేశించుచున్నది. కావున, తపస్సు ముఖ్యమని శాస్త్రముచేత తెలియబడుచున్నది. కాని తపస్సు చేయుటకందఱును అర్హులుకారని కొందఱు చెప్పుచున్నారు. దీని యొక్క నిజమేలాగున నుండునో తెలుపవలెను.

ఉః—ఇట్లు శాస్త్రములో సామాన్యముగ కర్మకాండపద్ధతిని గుఱించి చెప్పబడియుండినను, అట్టివాక్యము పరమప్రమాణమని యే కాలములోను, యెవరున్ను అంగీకరించియుండలేదు. వర్తమానయుగమున యిది అడిగేవారేలేరు. మఱల యెందుకు దానినిగూర్చి ప్రస్తావించవలెను? ఒకవేళ యేకాలములోనో యెవరైన చెప్పియుండిన, వారు పంచభూతములలో కలిసిపోయి యెన్నియో వందలసంవత్సరములైనవి. ఇపుడావిషయమును మఱల ప్రారంభించుట కలహమునకు కారణమేగాని దానిచే యేలాభమున్నుయుండదు. తపస్సు, భక్తి, జ్ఞానము మొదలగునవి వారివారి జన్మాంతరసుకృతవిశేషముచే గలుగునవి. వాటినెవరున్ను నిలుపుదలచేయ శక్తులుగారు. అవి ఈశ్వరాజ్ఞననుసరించి నడుచుచుండును. అట్టి సంస్కారములేనివారితో తపస్సు యొక్క మహిమను, పవిత్రతనుగుఱించి చెప్పినను వారు చేయనొల్లరు. మహాత్ములందఱును తపస్సుచేసి తద్ద్వారా బ్రహ్మజ్ఞానమును బొందిరి. తపస్సు, బ్రహ్మచర్యముల మహిమ, ప్రాశస్త్యము ప్రశ్నోపనిషత్తునందు తెలుపబడిన ఈ క్రింది యుదంతముచే విస్పష్టముకాగలదు.

మూ॥ సుకేశా చ భారద్వాజః శైబ్యశ్చ సత్యకామః సౌర్యాయణీ చ గార్గ్యః కౌసల్యశ్చాశ్వలాయనో భార్గవో వైదర్భిః కబన్ధీకాత్యాయనస్తేహైతే బ్రహ్మపరాః బ్రహ్మనిష్ఠాః పరంబ్రహ్మాన్వేషమాణా ఏష హవై తత్సర్వం వక్ష్యతీతి తేహ సమిత్పాణయో భగవన్తం పిప్పలాదముపసన్నాః.

తా॥ సుకేశ, సత్యకామ, సౌర్యాయణి, కౌశల్య, భార్గవ, కబన్ధియను పేర్లుగల ఆరుగురు ఋషులు బ్రహ్మమందాసక్తిగల్గి, బ్రహ్మవిద్యోపాసనాపరులై, బ్రహ్మస్వరూపము నన్వేషించుచు పూజ్యుడైన బ్రహ్మజ్ఞానియగు పిప్పలాదుడను ఋషిని సమిత్పాణులై సమీపించిరి.

మూ॥ తాన్ హ స ఋషిరువాచ భూయ ఏవ తపసా బ్రహ్మచర్యేణ శ్రద్ధయా సంవత్సరం సంవత్స్యథ యథాకామం ప్రశ్నాన్ పృచ్ఛథ యది విజ్ఞాస్యామః సర్వం హ వో వక్ష్యామ ఇతి.

తా॥ అట్లు తనయొద్దకు వచ్చిన ఆ ఋషులగూర్చి పిప్పలాదుడు 'మీరు తపస్సు, బ్రహ్మచర్యములతోగూడి, శ్రద్ధగల్గి, ఒకసంవత్సరము ఉండుడు. అటుతరువాత మీ యిష్టప్రకారము ప్రశ్నలనడుగుడు. తెలిసియుండెనేని అవియన్నియు మీకు చెప్పెద'నని పలికెను.

అట్లే నిదాఘు, పైప్పలాద, ఆంగిరసాది మహర్షులున్ను, తపస్సు మున్నగునవి యొనర్చియే బ్రహ్మజ్ఞానమున కర్హతను బడసిరని తెలియుచున్నది.

అట్టి తాపసోత్తములు అనాదికాలమునుండి అన్నికాలముల లోను, అన్నిజాతులలోను, స్త్రీలలోను, పురుషులలోను అప్పుడప్పుడు జన్మించుచునేయుండిరి. లోమశమహర్షి, సూతమహాముని మొదలగు బ్రాహ్మణేతరులెందఱో తాపసోత్తములై యుండిరి. సూతమునీంద్రుఁడు జగద్గురుడని పేరు వహించినవారు. శ్రీ వ్యాసులవారి యనుగ్రహముచేవారు అష్టాదశపురాణములకు కర్తయై ఋషిమండలిలో, నక్షత్రసమూహమున చంద్రునివలె ప్రకాశించుచుండిరి. ఆలాగున స్త్రీలలోగూడ మైత్రేయి, గార్గి మొదలైనవారెందఱో యుండిరి. వాల్మీకిఋషి కిరాతవంశములో నుండినవారని చెప్పుదురు. అట్టి మహానుభావుడే శ్రీమద్రామాయణము, శ్రీయోగవాసిష్ఠము మొదలగు లోకవిఖ్యాతిగల దివ్యగ్రంథములను రచింప శక్తిగలిగి యుండిరి. ఆలాగున, శ్రీకాళహస్తీశ్వరుని సన్నిధిలో కన్నప్పనాయన అను విఖ్యాతిగల పరమభక్తుడు యిక్కాలమునను గలడు. శ్రీరంగక్షేత్రమున పరమభక్తుడును, ఆళ్వారులలో ముఖ్యుడునగు

తిరుప్పాణి ఆళ్వార్విగ్రహమును గనందగును. అలాగున వైశ్యులలో తులాధారుడు, క్షత్రియులలో విశ్వామిత్రుడు, బ్రాహ్మణులలో అగస్త్యుడు మొదలగు పరమఋషులుండిరి. మఱియు కర్మకాండశాస్త్రములలోగూడ కృతయుగమున బ్రాహ్మణులుమాత్రమే తపస్సు చేసెడివారనియు, త్రేతాయుగమున క్షత్రియులున్ను తపస్సంపన్నులైరనియు, ద్వాపరమందు వైశ్యులుకూడ తాపసోత్తములైరనియు, కలియుగమున శూద్రులున్ను తపస్సుచే బ్రహ్మజ్ఞానసంపన్నులు కాగలరనియు చెప్పబడియున్నది. ఇదంతయు ఈశ్వరాజ్ఞానుసారముగ నడుచుచుండును. దీని నెవరున్ను అడ్డపఱుపజాలరు. ఈశ్వరునియొక్క సమత్వమీలాగున వెల్లడియగుచుండును. కాన ఒక్కజాతియందుండు వారుమాత్రము తాము శ్రేష్ఠులమని అహంకరింపదగదు. కనుకనే అన్నిజాతులందును, స్త్రీలందును, పురుషులందును బ్రహ్మజ్ఞానులు, తపోధనులు యేర్పడుటకు కారణము.

పురా కృతయుగే రామ బ్రాహ్మణా వై తపస్వినః ।
అబ్రాహ్మణ స్తతో రాజన్న తపస్వీ కథంచన ॥ 1
త్రేతాయుగేప్యవర్తంతే బ్రాహ్మణాః క్షత్రియాశ్చ యే ।
తతో తప్యం తతే సర్వే శుశ్రూషామపరే జనాః ॥ 2
తతో ద్వాపరసంజ్ఞాతే తపో వైశ్యాన్ సమావిశేత్ ।
యుగేషు త్రిషు రాజేంద్ర ధర్మం చక్రుర్ద్విజాతయః ॥ 3
భవితా శూద్రయోన్యాం హి తపశ్చర్యా కలౌయుగే ॥ 4

అని 'పాద్మము'. దీనియర్థము పైనదెల్పినదే. కావున ద్వాపర కలియుగాదులలో వైశ్యులు, శూద్రులు మొదలైనవారందఱు తాపసులు కాగలరని శాస్త్రమే తెలుపుచున్నది.

43. ప్రః—స్త్రీలు, శూద్రులు మొదలగువారికి బ్రహ్మజ్ఞానము గలుగుటకు తగిన శక్తికలుగునా? వారికి బ్రహ్మజ్ఞానము సిద్ధించునా? తపస్సు చేయదగినంత యోగ్యత బుద్ధికి కలుగునా?

ఉః—ఇట్టి యంధవిశ్వాసము మీకెచ్చటనుండి వచ్చినది? ఇదివఱకు చెప్పిన ధర్మబోధలన్నియు తెలిసికొనకపోవుచున్నారే?

భగవద్భక్తికిగాని, ఈశ్వరజ్ఞానమునకుగాని జాతి కారణముగాదు. సంస్కారమే కారణమగుచున్నది. నాటకశాలయందొకేనటుడు ఒకప్పుడు గొప్పఋషిగాను, మఱియొకపుడు గొప్పశూరుడగు యోధుడుగాను, ఇంకొకప్పుడు వ్యాపారస్థుడుగాను, మఱియొకప్పుడు సేవకుడుగాను, ఇంకొకప్పుడు స్త్రీగాను యేలాగున వచ్చుచుండునో, ఆలాగున సర్వేశ్వరుఁడొక్కొక్కకాలమున ఒక్కొక్క దేశములో ఒక్కొక్క సముదాయము నుద్ధరించుటకొఱకు ఒక్కొక్కదేహమును గ్రహించి వచ్చుచుండును. నాటకశాలలో నుండువారికిమాత్రము, ఒక్క మనుష్యుఁడే యిన్ని వేషములు వేయుచున్నట్లు బోధము కలుగును. ప్రేక్షకులకుమాత్రమాసంగతి తెలియజాలదు. ఆలాగున అంతరంగులైన పరమభక్తులగు జ్ఞాననిష్ఠులకుమాత్రము యివన్నియు సర్వేశ్వరుని లీలలని బోధమగును. ఈశ్వరజ్ఞానమునుండి దూరముగనుండు వారికీ తత్వరహస్యము తెలియజాలదు. ఒక్కొక్క జాతియుద్ధరణ గావలసియుండిన, ఆ జాతిలోనుండువారు చెప్పిన గలిగెడు విశ్వాసము యితరజాతిలోనుండువారు చెప్పిన గలుగదు. మఱియు సర్వేశ్వరుడు అందఱిలోను సమానముగ యుంటున్నట్లు తనయొక్క సమత్వమును బోధించుటకున్ను ఆలాగున జన్మమెత్తును. క్రైస్తవులలో జన్మించి ధర్మమును బోధించువారిపై క్రైస్తవులకు గలిగెడు ప్రీతి ఒకహిందువుపై గాని మహమ్మదీయునిపై గాని కలుగదు. ఆలాగున ఇస్లాంమతములో జన్మించి జ్ఞానబోధలు చేసిన, వారు నమ్మునట్లు హిందువుగాని బౌద్ధుడు గాని చెప్పిన నమ్మరు. అట్లే హిందువులలోను యితరులు చెప్పుదానికన్న స్వమతములోనివారు చెప్పిన యెక్కువ నమ్మికయుండును. ఈలాగున అన్నిమతములలోను చూచుకొనవచ్చును. పురుషులెంత జ్ఞానవంతులై స్త్రీలకు బోధించినను, స్త్రీలలోయొకరు యేర్పడిన, ఆబోధించు వారిపై గల విశ్వాసము పురుషులయందు గలుగదు. ఏలన స్త్రీలీలాగున తలంతురు—'వారు పురుషులు; అన్నిటిలోను వారికి సమర్థతగలదు. మనము స్త్రీలము, అబలులము; మనకంత యోగ్యత యెట్లు కలుగు' నని తోచెడు స్వభావము ప్రకృతియందున్నది. నారీమణులలో యొక్కరు జ్ఞానముగలవారై యేర్పడిన — 'ఈ పుణ్యవతి మనబోటి

నారీమణిగదా, మనమేల యట్లు కాఁగూడ'దని తలంచి ధైర్యమున్ను, ఉత్సాహమున్ను పొందుట కవకాశముగలదు. మఱియు పురుషులెంత గొప్పజ్ఞానవంతులైనను, రేయింబగళ్లు స్త్రీలను దగ్గఱయుంచి అన్నిసాధనలు చేయించుటకున్ను, ఉపదేశించుటకున్ను సాధ్యపడదు. స్త్రీలలో యొకరు జ్ఞాననిష్ఠగలవారైనచో స్త్రీలనందఱిని రాత్రింబగళ్ళు దగ్గఱనుంచి అనుష్ఠానము చేయించుటకున్ను ధర్మమును బోధించుటకున్ను యెంతయో అనుకూలముండును. కావుననే పరమకారుణికుడగు సర్వేశ్వరుడు మానవులందఱిలోను ఆలాగున అవతరించుటకు కారణమగుచున్నది. మఱియు మహనీయులవర్తమానశరీరము స్త్రీగాగాని, శూద్రుడుగాగాని యుండినను అందుగల ఆత్మ జన్మాంతరములో గొప్పఋషిగాగాని, యోగిగాగాని తపస్విగాగాని యుండియుండవచ్చును. లేనిచో యంతదివ్యజ్ఞానప్రభావము వారికి గలుగదు. ఇట్టి సత్యమును తెలియకయే స్థూలమగు బాహ్యదృష్టిగలవారు కేవలము శరీరమునుగూర్చియే చెప్పుచుందురు. శ్రీ భగవద్గీతయొక్క యెఱుపు, నలుపు, పసుపు, తెలుపురంగులతో గూడినబైండు అట్టనుజూచి—ఈ పుస్తకము మంచిది, ఇది మంచిదికాదని చెప్పెడు బుద్ధియెటువంటిదో పైదృష్టియు అటువంటిదే యగును. లేక ఒక మనుష్యుడు ఎఱుపు, తెలుపు, నలుపు, పసుపు మొదలగు రంగులుగల డ్రెస్సును ధరించివచ్చినపుడు ఆ రంగులను జూచి, వీడిట్టివాడు, వాడట్టివాడని చెప్పుట యెటువంటిదో, ఇదిన్ని అటువంటిదే. ఈ విషయమై శ్రీ వివేకానందులొక కథ చెప్పియుండిరి. అదేమన ఒక గృహస్థునియింటిలోగల కుక్క తన యజమానుడు ఏయే రంగులుగల డ్రెస్సుధరించి వచ్చినను, వానిని కనుగొను శక్తి గల్గియుండును. కాని సర్వేశ్వరుఁడనేకరూపములు ధరించివచ్చినను మనుజుడు వాని నెఱుంగకున్నాడు. కాన ఆ నికృష్టజంతువగు శ్వానమునకుగల తెలివియైనను మానవులకు లేకపోవుచున్నదే యని వారు విచారపడి వచించిరి. 'ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి', 'క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత' —ఇట్టి దివ్యవాక్యములఁదెలిసికొని లోకమునకు బోధించువారు లేకపోవుటచేతనే జ్ఞానమునకు పతనము గలుగుటకు కారణమైనది.

నైవ స్త్రీ పుమానేష నైవ చాయం నపుంసకః।
యద్యచ్ఛరీరమాదత్తే తేన తేన స యుజ్యతే॥

ఈ యాత్మవస్తువు పురుషుడుగాని, స్త్రీగాని, నపుంసకుడుగాని కాదు. ఏయే శరీరమును ధరించునో ఆయా ఆకారముతో నది ప్రకాశించుచుండును. చిమ్నీయొక్క రూపమునను సరించి దీపపుప్రకాశ ముండునట్లున్ను, గ్లాసుయొక్క ఆకృతిననుసరించి జలము కనుపించునట్లున్ను, దేహియు దేహమువలె కానుపించును.

44. ప్ర:—గీతలోగల నిష్కామకర్మయోగాది నాల్గింటిని సంక్షిప్తముగ తెలిపితిరి. అయితే గీతయొక్క అర్థము తెలిసికొనుటకున్ను, గీతను సంస్కృతములో పారాయణము చేయుటకున్ను సాధ్యము కానివారు భాషాపద్య (తెనుఁగుపద్య)ములలో రచించియుండు పద్యములనుగాని తాత్పర్యమునుగాని చదివిన చాలునుగదా. అర్థము తెలియని చదువులు వ్యర్థమనిగదా పూర్వీకుల యభిప్రాయము. కావున సంస్కృతము తెలియనివారున్ను, సంస్కృతశబ్దములను చక్కగ నుచ్చరించుటకు రానివారున్ను, తెనుఁగుపద్యములనుగాని, శ్లోకతాత్పర్యములనుగాని చదువుటమంచిదిగదా. మఱియు సంస్కృత శ్లోకములు చదువునప్పుడు యెచ్చటనైనతప్పిన దోషముకలుగునని కూడ కొందఱు వచింతురు. కావున దీనిలో యేది మంచిపద్ధతియని తెలుపగోరుచున్నాను.

ఉ:—చాల ఉపయోగకరమైన ప్రశ్న చేసితివి. లోకమునకు ఇది ముఖ్యముగ అవసరమైనది. సందేహములేదు. తెనుఁగులో చదివి అర్థము తెలిసికొనవచ్చును. కాని దానిచే సంస్కృతములో చదివినదాని యంతపుణ్యము గలుగుటప్రయాసము. మఱియు పద్యములు వ్రాయువారుగాని, తాత్పర్యమును తెలుపువారుగాని, వారివారి హృదయము ననుసరించి అర్థమువ్రాయుదురు. అపుడు గీతయొక్కయు, శ్రీకృష్ణ భగవానులయొక్కయు ఆశయము తెలిసికొనుటకు తరముగాదు. ఏలన, మతత్రయకర్తలుగూడ ఒకరు అద్వైతపరముగాను, మఱియొకరు విశిష్టాద్వైతపరముగాను, ఇంకొకరు ద్వైతపరముగాను అర్థములు వ్రాసిరి. అట్టివారిలోనే యింతభేదముండగా, యిప్పుడు తెనుగుపద్య

ములుగాని, తాత్పర్యములుగాని వ్రాయువారిలో యెంతో మార్పుగలుగ వచ్చును. కొందఱు జ్ఞానపరముగాను, కొందఱు భక్తిపరముగాను, కొందఱు నిష్కామకర్మయోగపరముగాను కొందఱు గృహస్థాశ్రమ పరముగాను, విరక్తాశ్రమపరముగాను అర్థము వ్రాసియున్నారు. ఆకాశ మునుండి వర్షించెడు మేఘజలమంతటను స్వచ్ఛముగానుండినను, భూమి పై బడునపుడు ఆయాస్థలధాతువులననుసరించి రుచిగను, వర్ణముగలది గను, గంధముతోగూడినదిగను యెట్లు మార్పు నొందుచుండునో, అగ్నియొక్క స్వరూపము వెలుతురుగాను, వేడిమిగానుండినను, ధాతువుల (మందుల) సంపర్కముచే నది యెఱుపుగాను, పచ్చగాను, నీలముగాను యెట్లు ప్రకాశించుచుండునో, ఆలాగున అర్థముగాని, పద్యముగాని వ్రాయువారి హృదయపరిపక్వతననుసరించి భావము లోను మార్పుగలుగును. మఱియు గీతలోని మూలశ్లోకములు శ్రీకృష్ణ భగవానుని ము ఖా ర వి ం ద ము నుం డి యుద్భవించినవగుటచే వాని యందు అమృతత్వము గల్గియున్నది. అవే మఱియొకరి ముఖమునుండి యుద్భవించినపుడంత పవిత్రతయు, మాహాత్మ్యమున్ను గల్గియుండునా? 'శ్వచర్మణి యథా క్షీరమపేయం' — గోక్షీరము శ్రేష్ఠమైనను, కుక్క చర్మములోపోసినతరువాత యేలాగున నది పానయోగ్యముకాదో, దేవ తాభిషేక, హోమాది దైవకార్యములకుపయోగపడదో, ఆలాగున భగవన్ముఖమునకున్ను, మానవముఖమునకున్ను భేదముగలిగియుండు నుగదా. ఒకవేళ అర్థము తెలిసికొనుటకు ప్రయాసమని తోచినను, మూలముమాత్రము పారాయణముచేసి, తాత్పర్యము చదువుకొన వచ్చును. గీతావాక్యములు మంత్రములవంటివి. ఏ మంత్రమునైనను మూలము పఠింపక, అర్థముగలుగజేసెడు ప్రాకృతవాక్యముతో జపించి నను, పఠించినను, అంతఫలముగలుగునా? అట్లయిన, అతిప్రయాసలభ్య ములగు వేదమంత్రములనుగూడ ప్రాకృతభాషాపద్యములలో వ్రాసి చదువవచ్చునుగదా. అట్లెన్నటికిని చేయజాలరు. ఒకవేళ అర్థము తెలి యుటలేదని చెప్పినను, దానివల్లగలుగు మాహాత్మ్యమునకు హానిలేదు. ఔషధముయొక్క ప్రయోగము తెలియకపోయినను అది రోగమును హ రిం ప చే య కు న్న దా? తెలియకనే విషమును తినిన బాధ గలు

గదా ? ఆలాగున అమృతమును భుజించిన జరానరలు నశింపక పోవునా ? అట్లే మూలములయొక్క పారాయణచే గలిగెడు పుణ్యము గలుగకపోనేరదు. కాని అర్థముతోగూడి పారాయణచేసేలాగున నేర్చుకొనవలెను. పరిశ్రమచేయనిచో పవిత్రతగలుగదు. రత్నమైనను, సానబెట్టనిచో ప్రకాశింపజాలదు. శుభ్రముగా ఉతుకనిచో మురికివస్త్రము శుద్ధము కానేరదు. ఆలాగుననే యిపుడు పవిత్రులుగ కానుపించువారందఱును పరిశ్రమచేసియే ఆ శోభాయమానమైన ఉన్నతస్థితికి రాగల్గిరి. మఱియు మూలశ్లోకపారాయణమందు తప్పిదము కలిగినను పాపమేమియు కలుగదు. కాని తప్పిదము కలుగనీయక అభ్యసించవలెను. యజ్ఞాది కామ్యక్రియలకుమాత్రమే మంత్రదోషము కలిగిన తప్పిదము కలుగును. అది కర్మకాండము. ఇది భక్తికాండము, లేక జ్ఞానకాండము. దీనికాలాటి దోషము లేవియు లేవు. కావున ఈవిషయమై భయపడనక్కఱలేదు. దీనికి భక్తి శ్రద్ధలు గొప్పవిగాని ఉచ్చారణలుగావు. శ్రద్ధాభక్తులు లేనిచో యెంత శుద్ధముగా యుచ్చరించినను ఫలితము గలుగదు. అది మంచి కూరగాయలతో కళాయిలేనిపాత్రలో వండిన పులుసువంటిదగును. మఱియు శ్లోకములు మొదట నుచ్చరించుటకు కొంతప్రయాసమైనను, కొన్నిసార్లు మఱలమఱల పఠించునప్పుడు ప్రయాసముండదు. ఎట్లన యెండిన ఖర్జూరపుకాయ మొదట నమలునప్పుడు చాల కఠినముగా నుండినను, రెండుమూడుసార్లు నమలిన, మృదువుగాను, తేనెవలె మధురముగాను నుండునుగదా. శ్లోకముయొక్కరీతియు ఆలాగుననే యుండును.

నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే।
స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్ ॥

ఫలాపేక్షలేక ఈశ్వరార్పణముగా జేయబడు యనుష్ఠానము ఆరంభింపబడి ముగింపకున్నను ఫలము లేకపోదు. ఆరంభించినది చెడినను పాపము సంభవింపదు. ఈ యోగము కొంచెమాచరింపబడినను మహత్తరమగు సంసారభయమునుండి రక్షించును. — అని శ్రీకృష్ణభగవానులు శ్రీభగవద్గీత ద్వితీయాధ్యాయమున నుపదే

శించియున్నారు. అపారమైన క్షారోదకముతోఁగూడిన సముద్రమును దాటుటకు సాగరమంతపెద్దపడవ అక్కఱలేదు. చిన్నదగు నావచేతనే దాటిపోవచ్చును. ఆలాగున అపారమైన దుఃఖజలముతోఁగూడిన ఈసంసారము భగవద్ధ్యానమను ఒక్క యోడచేతనే దాటిపోవచ్చును. మఱియు అభ్యాసమువలన లభింపనిది లేదు. మఱ్ఱివిత్తనము చాల సూక్ష్మముగా నుండినను, పెరుగునపుడేలాగున గొప్పవృక్షమగుచున్నదో, అభ్యాసమున్ను ఆలాటిదే. అగ్నియొక్క రవ్వను దూదియందుంచి చిన్నచిన్న పుల్లలుపెట్టి, ఊది వెలిగించిన, పెద్దపెద్ద కట్టెలువేసి గొప్ప అగ్నిగ యెట్లుచేయవచ్చునో, అనుష్ఠానముయొక్క మహిమయు అటువంటిదేయగును. ఇపుడు కానుపించెడు మహామహోపాధ్యాయులున్ను, బి. ఏ., ఐ. సి. ఎస్., పరీక్షలలో నుత్తీర్ణులైన వారున్ను, మొదట ఓ, న, మాలను, ఎ, బి, సి, లను ఒక్కొక్క అక్షరముతో ప్రారంభించినవారుగదా.

అజ్ఞోఽపి తజ్జ్ఞతామేతి శనైః శైలోఽపి చూర్ణ్యతే।
బాణోప్యేతి మహాలక్ష్యం పశ్యాభ్యాసవిజృంభితమ్॥

'ఓ రామా! అభ్యాసముయొక్క ప్రభావమెట్టిదో చూడుము! దీనిచే నజ్ఞానియు క్రమముగ జ్ఞానియగుచున్నాడు. పర్వతమున్ను పిండిచేయబడుచున్నది. జడమగు బాణమున్ను అతిసూక్ష్మమగు లక్ష్యమును పొందుచున్నది'. గీతాది పవిత్రగ్రంథములను సంస్కృతములోనే పారాయణ చేయవలెనని అగస్త్యులు అగస్త్యసంహితయందుపదేశించినది చూడుడు.—

సంస్కృతం రామచరితం పరిత్యజ్య నరాధమః।
పఠన్ భాషాంతరకృతం మృగతృష్ణాజలం పిబేత్॥

సంస్కృతభాషయందుగల శ్లోకములను విడిచిపెట్టి భాషాంతరీకరణంబులను జదివెడు మందమతియగు మనుజుడు జలములేని యెండమావులందు జలముగలదని భ్రమించి గ్రోలఁబోవువానివలె నల్లాడుచున్నాడు.

యస్తు సాంస్కృతికం త్యక్త్వా హ్యన్యత్కర్తుమిహేచ్ఛతి।
సురూపాం స్వస్త్రియం త్యక్త్వా కుష్ఠిమిచ్ఛత్యరూపిణీమ్॥

సంస్కృతసంబంధములైన శ్లోకాదులను విడిచి భాషాంతరీకరణంబగు యితరములఁగోరెడువాడు, సౌందర్యవతియగు తనభార్యను బోనాడి, కురూపిణియు, కుష్ఠుగాత్రియునగు పరస్త్రీని వరించినవాని వలెనుండును.

స రాజ్యసంపదం త్యక్త్వా నరకం గంతుమిచ్ఛతి ।
స యాగీయం పశుం త్యక్త్వా పితరం హంతుమిచ్ఛతి ॥

మఱియు నట్టివాడు రాజ్యసంపదను వదలి నరకమునకు బోవ నిచ్ఛగించువానివలెను, యాగపశువును విడిచి తన తండ్రిని చంప నిశ్చయించువానివలెను నుండును.

యస్తు రామాయణం త్యక్త్వా భాషాంతరమిహేచ్ఛతి ।
స గోక్షీరం విహాయాశు గార్దభీక్షీరమిచ్ఛతి ॥
అమృతస్య సరస్త్యక్త్వా విషం పాతుమిహేచ్ఛతి ।
స దేవత్వం పరిత్యజ్య పిశాచత్వమభీచ్ఛతి ॥

మఱియు నాతడు ఆవుపాలను బోనాడి గాడిదపాలను త్రాగ నపేక్షించువానివలెను, అమృతపుసరస్సును త్యజించి విషమును త్రాగ నుంకించువానివలెను, దేవత్వమును వదలిపెట్టి పిశాచత్వమును గోరువానివలెనునుండును. ఓ ప్రసన్నాత్ముడా! అన్యభాషలో వ్రాసిన సులభముగ తెలిసికొనెడు మార్గముండగా, కఠినభాషయగు ఈ సంస్కృతములోనే పఠింపవలసినదని యింత నిష్కర్షగ చెప్పుటకు కారణముగలదు. లేనిచో ఋషులు ఆలాగున వ్రాయరు. కారణమేమన, వేదమేలాగున అనాదిగ ఈశ్వరసంకల్పముచే యేర్పడినదని చెప్పుచున్నారో, ఈ సంస్కృతభాషయున్ను యెప్పుడు యెవరు నిర్మించినదని లేదు. కనుకనే దీనిని దేవభాషయనుటకు కారణమైనది. మఱియు ప్రపంచములో ఏయే భాషలుగలవో, వాటియన్నింటికిని ఒక్కొక్క జాతియు ఒక్కొక్క దేశమున్ను గలదు. సంస్కృతమో అటువంటిదిగాదు. అది ఒకదేశమునకుగాని, ఒక జాతికిగాని సంబంధించి యుండలేదు. కావున యిది దైవనిర్మితమనుటలో సందేహములేదు. కావుననే ఈ సంస్కృతభాష యతిపవిత్రముగా తలంచడమైనది. అంతేగాక ప్రయాసము లేకయేకార్యమైన సాధించవలెనని తలంచినపుడు, అది సోమరితనమునకు

మార్గమిచ్చుచున్నది. అపుడు ప్రయత్నమున కవకాశము లేకపోవు చున్నది. పైఁజెప్పినలాగున అంతకఠినముగ చెప్పినందువల్లనైనను మంచిపరిశ్రమచేసి యీ భాషనభ్యసించవలెననియే ఋషుల యాశ యముగానున్నట్లు తోఁచుచున్నది. ప్రపంచములోఁగల యేభాషలోఁ నున్న ఏకవచనము, బహువచనము అను రెండువచనములే గలవు. సంస్కృతమున ఏకవచనము, ద్వివచనము, బహువచనమను మూడు వచనములుగలవు. ఇందుచే నిది అప్రాకృతముగు యొక భాషలాగున యుండే తీరవలెను. అయితే అందఱికీ చదువుటకు అనుకూలములేని కాలమొకటి పూర్వముండిన యుండవచ్చును. ఇప్పుడాలాటి ప్రతి బంధములేవియు లేవుగదా! మఱియు నీభాష యందఱును చదువ గలరా యని సందేహింపనక్కఱలేదు. అందఱును చదివి కృతార్థులు కావలెననియే ఈశ్వరసంకల్పము. ఇపుడు దేశీయభాషలనైన అందఱును చదువుచున్నారా? అందఱును చదువకపోయినచో, దేశ భాషను త్యజించవలెననువారుగలరా? మఱియు సువర్ణము, లేక రత్నములు అందఱికిని మామూలుగ వాడుటకు ప్రయాసమని అట్టి యుత్కృష్టముగు హేమ, రత్నాదులను విడిచిపెట్టవలెననిగాని, వాటివలన ఉపయోగము లేదనిగాని చెప్పువారెవ్వరైన యుందురా? కావున పరిశ్రమ చేసికొని అందఱును పవిత్రులగుటకు యత్నించవలెను. అందఱికిని అవకాశము లేదనిచెప్పిన, అది సత్యము. అట్టిదేదియు వర్తమాన కాలమున లేదుగదా. ప్రస్తుతము ధనార్జనలాభమునుద్దేశించి రాజ భాష ముఖ్యమైయుండినను, హిందూదేశపు రాజులు రాజ్యమును పాలించెడుకాలములోఁ ఈసంస్కృతభాష కాధిక్యత గలిగియుండెను. అప్పుడీభాషలోఁ అభ్యాసముగలవారికే గొప్పగొప్ప ఉద్యోగములున్ను, అగ్రహారములున్ను, మాన్యములున్ను, గౌరవమైన హోదాలున్ను రాజులిచ్చుచుండిరి. అధ్యాత్మవిషయకముగు జ్ఞానమంతయు వేదముల లోను, ఉపనిషద్గ్రంథములలోను నుండుటచే, ఈ భాషానైపుణ్యము లేకున్నచోఁ నట్టి యతిపావనమున్ను, పాపరాహిత్యము నొసఁగునదియు నగు జ్ఞానమును మనము పొందజాలము. మఱియు ఈ రాజ్యభారణమే యెల్లప్పుడు నుండుననుట కవకాశమున్ను లేదు. 'లక్ష్మి తోయతరఙ్గ

భఙ్గచపలా' అని యుండుటచే రాజ్యమునకుగాని, రాజ్యసంపదలకు గాని శాశ్వతత్వము లేదనియు, అవి యలలవలె క్షణములో నుత్పన్నమై క్షణకాలమున లయమొందుననియు యెఱుంగవలెను.

45 ప్ర:—శాస్త్రపఠనము బ్రహ్మజ్ఞానమున కేదైన నుపయోగ పడునా ? లేక అనుష్ఠానముమాత్రము చాలునా ?

ఉ:—వేదాంతశాస్త్రమొక్కటి మాత్రము కొంత సహాయ పడును. ఇతర సంస్కృతశాస్త్రములుగాని, మఱియేభాషలుగాని అంత ఉపయోగపడవు. ఎట్లన జ్యోతిశ్శాస్త్రమేలాగున వైద్యమున కుప యోగపడదో, వైద్యశాస్త్రమేలాగున జ్యోతిషమునకు సహాయము కాదో, అట్లే శిల్పశాస్త్రమెట్లు వ్యాకరణమునకు సహాయము గలుగ చేయజాలదో, ఆలాగున ఒకశాస్త్రము మఱియొకశాస్త్రమున కెట్లుప యోగపడదో, బ్రహ్మాత్మైక్యజ్ఞానమున్ను ఆలాగుననే యుంటున్నది. కాని ఒట్టి అనుష్ఠానముమాత్రముండిన చాలదు. అనుష్ఠానములేని వేదాంతశాస్త్రమువలనను ప్రయోజనములేదు. ఎట్లన ఆయుర్వేదము మాత్రము నేర్చుకొనినను ఔషధములేనిచో రోగమెట్లు కుదురును ? ఓషధులుమాత్రము దొఱికినను, వాటియొక్క యోగమేలాగున చేయ వలయునో, దానికి ఆయుర్వేదశాస్త్రనియమమెటువంటిదో, ఆలాగున భవరోగనివారణమునకు వేదాంతశాస్త్రమున్ను, మంచి అనుష్ఠాన మున్ను గలిగియుండవలెను. ఈవిషయమై వేదాంతశాస్త్రములో నొక కథగలదు. అదేమన ఒక గ్రుడ్డివాడు నదిని దాటుటకు దాని తీరమువఱకు యెట్లో శ్రమపడి వచ్చెను. కాని నదియందు పడవలేదు. నదియో అధికజలముగలది కాదు. నాలుగడుగులు లోతుమాత్రమే గల్గి యుండెను. అయితే నిండావేగముతోగూడిన ప్రవాహము గల్గియుండెను. ఆతడు నదినిదాటువిషయమై ఆలోచించుచుండగా, మఱియొక కుంటి వాడున్ను ఆదాఱిలోనే వచ్చెను. కుంటివానికి త్రోవ తెలియును. కాని ప్రవాహవేగములో నదియందు నడువ శక్తిచాలదు. గ్రుడ్డివానికి నడువ శక్తిగలదు. కాని కన్ను కనిపించదు. నదియో విస్తీర్ణమైనది. కావున వీరుభయులున్ను యేమియు చేయజాలక, ఉపాయము తెలి యక విచారగ్రస్థులై యుండుసమయమున, ఆమార్గముననొక యాప్తుడు

వచ్చెను. ఆతడంగసౌష్ఠవము గలవాడు. ఆ యంగహీను లిరువురిని జూచి నదినిదాటు యుపాయమును వారికి తెలిపెను. దానిచే నుభయులున్ను నదిని దాటవచ్చునని బోధించెను. ఆయుపాయమేమన, అంధుడు మంచిబలిష్ఠుడు. కాని నేత్రహీనుడు. పంగువునకు నేత్రములు గలవు. కాని నడువశక్తిలేదు. నేత్రమున్నందున త్రోవ తెలియును. కాని నడువ బలముచాలదు. ఆ యాప్తుడు గ్రుడ్డివాని భుజముపై కుంటివానిని గూర్చుండబెట్టెను. అప్పుడు కుంటివాడు త్రోవ చూపుచుండ, గ్రుడ్డివాడు మోయుచుండ, యిద్దఱును నదిని దాటి పోయిరి. ఆలాగున, సంసారప్రవాహరూపమగు నదిని దాటుటకు కేవలము వేదాంతశాస్త్రము చదువుటచేతను ప్రయోజనములేదు. కాని దానిచే విషయముమాత్రము తెలియును. కేవలము అనుష్ఠానము మాత్రము గలిగియుండిన, విషయము తెలియదు. అందువలన అదిన్ని శ్రేష్ఠమైనదికాదు. కావున అనుష్ఠానమున్నూ, వేదాంత శాస్త్ర విచారణయున్నూ గలిగియుండునపుడే పూర్ణమగును. లేనిచో ఏదో యొక విషయములో అంగహీనులగుదురు.

46. ప్ర:—పై జెప్పిన రెంటిలో యేది మేలైనది? అనగా, శాస్త్రవిచారణలేక అనుష్ఠానముమాత్రము గల్గియుండిన చాలునా? లేక శాస్త్రవిచారణమాత్రముండిన చాలునా?

ఉ:—రెండున్ను గల్గియుండుటయే శ్రేష్ఠము. కాని శాస్త్రము మాత్రము విచారణచేసి అనుష్ఠానము లేక యుండుటకన్న, శాస్త్రవిచారములేకున్నను, అనుష్ఠానముమాత్రము గల్గియున్న చాలును. ఇదే శ్రేష్ఠమైనది. ఏలన అనుష్ఠానముగలవానికి విషయవిరక్తి చాలవఱకు గలిగియుండును. దానివల్ల క్రమముగ యంతఃకరణశుద్ధి గలుగును. అప్పుడు, మబ్బు తొలగునపుడు సూర్యుడుప్రకాశించునట్లు, అంతఃకరణదోషము నశించి జ్ఞానోదయము గల్గును. రెండవవానికి శాస్త్రవిచారణమొకటిమాత్రమేగాని అనుష్ఠానము లేనందుచే ఆత్మశుద్ధి గలుగుటకు మార్గము లేకపోవును. కాన రెండున్ను గలిగియుండుట యుత్తమము.

47. ప్ర:—శాస్త్రము లెంతవఱకు చదువవలయును? శాస్త్రమున కంతమేదైనగలదా? అట్లు చదువుటచే నేమిప్రయోజనము?

ఉ:—శాస్త్రము ప్రయోజనకరమే. కాని, శాస్త్రము చదివినవారిలో ఆచరణలేనందున జనులకు శాస్త్రమందు విశ్వాసము లేకపోయినది. శాస్త్రమంతయు చదువ నెవరికిని సాధ్యమైనపనికాదు. శాస్త్రమనంతము. బహుకాలము చదివినను దాని యంతము కనుపించదు. జీవితమా, స్వల్పము. మధ్యవచ్చు యాటంకములా, అనేకములు. కావున హంసపక్షి క్షీరనీరములను వేఱుపఱచునట్లు శాస్త్రములోగల సారమునుమాత్రము గ్రహించిన చాలునని శ్రీకృష్ణులుత్తరగీతయందిట్లుపదేశించిరి.—

అనంతశాస్త్రం బహువేదితవ్యం స్వల్పశ్చకాలో బహవశ్చ విఘ్నాః।
యత్సారభూతం తదుపాసితవ్యం హంసోయథా క్షీరమివాంబుమిశ్రమ్॥

దీని తాత్పర్యము పైన జెప్పినదే. కావున (1) సాంఖ్యములోని 24 తత్వములు, (2) సాధనచతుష్టయసంపత్తి 4, (3) మహావాక్య విచారణ 4, (4) లక్షణావృత్తి 3, (5) శ్రవణాది త్రయము 3. యింతమాత్రమైనను తప్పక గ్రహించియుండవలెను. దీని కెక్కువ ప్రయాసములేదు. చదువు లేనివారైన నొకరిచే చెప్పించుకొనియైన నేర్చుకొనవచ్చును. దీనివలన వేదాంతస్వరూపము నొక్క అనుభవము కలుగును. ఇక కొంతయనుభవముగలవారైన, యమాద్యష్టాంగములున్ను, సప్తజ్ఞానభూమికలున్ను నేర్చుకొనవచ్చును. నేర్చుకొనవచ్చునని చెప్పుటచే ఆవాక్యములు వల్లించమని అర్థముకాదు. చెప్పుటకు నేర్చుకొనులాగున, అనుష్ఠించుటకున్ను నేర్చుకొనవలెనని తాత్పర్యము.

48. ప్ర:—పంచముద్రలలో యేముద్ర యుండవలసినది?

ఉ:—భద్రమైనముద్ర యుండవలెను.

49. ప్ర:—మంత్రములలో యేమంత్రము కావలసినది?

ఉ:—మననమంత్రము ముఖ్యమైనది.

50. ప్ర:—లక్ష్యములలో యేలక్ష్యము మంచిది?

ఉ:—లక్షింపబడినదే మంచిది.

51. ప్ర:—యోగములలో ఏయోగమవలంబించవలయు ?
ఉ:—వియోగముగలుగని యోగమును శీలించవలెను.

52. ప్ర:—ఆసనములలో ఏ యాసనము గొప్పది ?
ఉ:—బ్రహ్మాసనము గొప్పదనఁదగును.

53. ప్ర:—మననములలో యేమననము కావలసినది ?
ఉ:—నిర్మననము ఉత్కృష్టమైనది.

54. ప్ర:—దృష్టులలో యేదృష్టినవలంబించవలెను ?
ఉ:—బ్రహ్మదృష్టి నవలంబించవలెను.

55. ప్ర:—గ్రంథములలో యేగ్రంథము చదువవలసినది?
ఉ:—హృదయగ్రంథి పఠించవలెను.

56. ప్ర:—గ్రంథియననేమి ?
ఉ:—గ్రంథములలో వెదకినను దొఱకనది.

57. ప్ర:—సిద్ధులలో యేసిద్ధి గలుగవలెను ?
ఉ:—జ్ఞానసిద్ధి గలుగవలెను.

58. ప్ర:—తాము సెలవిచ్చిన యీ గూఢార్థము తెలియుటలేదు.
ఉ:—గాఢమగు నిష్ఠగలిగిన అన్ని గూఢార్థములును తెలియును

59. ప్ర:—ప్రపంచములో భరింపసాధ్యముకాని బాధ యేదిగలదు ?
ఉ:—ఆకలిబాధకు మించిన భరింపరానిబాధ యింకొకటి లేదని తిరువళ్ళువరునాయన 'తిరుక్కుఱళ్'లో నిట్లుపదేశించిరి —

'మానం, కులం, కల్వి, వన్మై, అఱివుడమై, దానం, తవముయర్చి, తాళాణ్మై, తేనిన్, కసివందు, సొల్లియన్ మేల్, కాముఱు, నల్ పత్తుం, పసివందిడ, పఱందుపోమ్.'

తా॥ (1) మానము, (2) కులము, (3) విద్య, (4) గౌరవము, (5) వివేకము, (6) దానము, (7) తపఃప్రభావము, (8) సహనము, (9) వాఙ్మాధుర్యము, (10) కరుణతోఁగూడినవాక్యము—పవిత్రమైన యీ పదిగుణములున్ను ఆకలిబాధకలిగిన, పరుగెత్తిపోవును.

కావున భుక్తికి ఉపాయముచూచినతరువాత ముక్తినుపదేశించవలెనని చెప్పుటకిదియే రహస్యము. ఆకలిబాధచే జఠరాగ్ని ప్రజ్వలించినపుడు, కర్ణమున 'జూ' యనిశబ్దము గలుగునపుడు వేదాంతవాక్యము

చెవిలో జొరబడజాలదు. కావుననే భుక్తి చెప్పినతరువాత ముక్తిని చెప్పుటకు కారణమైనది. అందువల్లనే భుక్తి, ముక్తియను ప్రయోగ మేర్పడినది. క్షుద్బాధకుమించిన యేరోగ బాధయున్ను లోకములోలేదు. ఎట్టిదారుణమైన రోగబాధకూడ ఔషధమిచ్చిన శమించును. కాని, ఆకలిబాధకన్నములేనిచో యెవరున్ను సహింపజాలరు. కావుననే అన్న దానమునకు సరియైన దానములేదని చెప్పుటకు కారణమైనది. ప్రాణ మును సృష్టించిన బ్రహ్మయొకడు; ప్రాణమును సంరక్షించినవాడు రెండవబ్రహ్మయగును. కనుకనే శాస్త్రములో 'అన్నదః ప్రాణదః ప్రోక్తః' అని చెప్పబడినది. వీరుభయులు బ్రహ్మలే.

60. ప్ర:—జయించుటకు ప్రయాసమైన శత్రువెవడు ?

ఉ:—మన్మథుని జయించుటయంత ప్రయాసమైన పని మఱి యొకటి మూడులోకములందును లేదు. అంత కష్టతరమైన పని యిం కొకటి లేదనియే చెప్పవచ్చును. ఏలన,—అనేక మహాశయులుండిరి. లోకమంతయు జయించినవారుండిరి. వారుకూడ విషయమును జయింపజాలకయున్నారు. దేవతల ప్రభువగు ఇంద్రుడుకూడ విషయ మును జయింపజాలకపోయెను. దేవతల గురువగు బృహస్పతిసహి తము దానిని జయింపజాలకపోయెను. ఆలాగున అసురుల గురువగు శుక్రాచార్యుడుకూడ మృతసంజీవినీవిద్యను గ్రహించినవారైనను యింద్రి యముల జయింపజాలకుండెను. మనుజులలోకూడ గొప్పగొప్ప ఋషులు సహితము దానిని జయింపజాలకపోయిరి. ఆలాగున యెందఱో యోగులు, తపస్వులున్ను దానిని జయించుటకెంతో శ్రమపడి యున్నారు. కారణమేమన, జగత్తుయొక్క సృష్టిశక్తి దానియందు నిలుకడగల్గియుండును. కావున జగత్సృష్టికర్తయగు బ్రహ్మదేవుడు అట్లు కఠినముగను, దృఢముగను దానిని సృష్టించియున్నాడు. అట్టి బలము దానియందులేనిచో బ్రహ్మదేవుని సృష్టియంతయు ధ్వంసమై పోవును. కావుననే దానికంతబలము సృష్టికర్త కలుగజేయుటకు కారణమైనది. మఱియు దేనికి ప్రభావముగలదో అది ప్రయాసము వలననే లభించును. ఎవరికిని జయింపనసాధ్యముకానిదానిని జయించి నందుచేతనే మనోజయముగలవారికి, యింద్రియనిగ్రహముగలవారికి,

ప్రకృతిజయముగలవారికి యింతప్రభావము గలుగుటకు కారణమైనది. కనుకనే రాజాధిరాజులు, మహారాజులు, సార్వభౌములు సహితము యింద్రియములను జయింపజాలక అట్టి సంయమియొక్క పాదకమలములపై, పద్మముపై భ్రమరము వ్రాలునట్లు పడుటకు కారణమగుచున్నది. మఱియు పండితులు, పండితోత్తములు, మహాపండితులు, పండితప్రకాండులుసహా యింద్రియముల జయింపజాలక, యింద్రియములు విషయములచే జయింపబడ తపించినందువలననే, వేసవికాలమున యెడారిలో సంచరించు పశువులు జలాశయముదగ్గఱకు పరుగెత్తికొనిపోవునట్లు, తాపత్రయాగ్నిచే సంసారమను యెడారిలో తపించెడివారందఱున్ను, బ్రహ్మజ్ఞానమను పవిత్రగంగోదకముయొక్క ప్రవాహముగల మహనీయుల సాన్నిధ్యమునకు వచ్చిచేరుటకు కారణమగుచున్నది.

61. ప్ర:—విషయము విషప్రాయముగా అతినీచమైనది, దుఃఖహేతువైనది, అసహ్యమైనది. అట్టి దీనియందు వివేకులకెట్లు భ్రమకలుగును? వారికిందెట్లు ప్రవేశము సిద్ధించును?

ఉ:—మాయయొక్క భ్రాంతి ఆలాగున నుండును. అది దుఃఖమును సుఖముగ తోచేలాగున చేయును. నేత్రము గలవానిని మహాంధునిగ నొనర్చును. గొప్ప వివేకవంతుని కేవలము వివేకశూన్యునిగ చేయును. పండితుని పామరునిగ నొనర్చును. విజ్ఞానవంతుని అజ్ఞానపరవశునిగ చేయును. యోగిని భోగిగానో, రోగిగానో మార్చివేయును. తపస్విని, తమస్సులోనికి త్రోయును. ఋషులనుసహా కర్షింపజేయును. పుణ్యవంతుని పరమపాపాత్మునిగ త్రిప్పివేయును. వ్రతనిష్ఠుని పతితునిగ నొనర్చును. పరమపురుషులనుసహా పశువులుగ మార్చివేయును. ఓహో! దానియొక్క బాధలచే యెందఱో పుణ్యాత్ములు పతితులై ఘోరఘోరని యేడ్చుచున్నారు. దానికంతశక్తి గలుగ చేసియే సృష్టికర్త యింద్రజాలమగు యీజగత్తును నిర్మించియున్నాడు. ఈ దానియొక్క మహాపాపము చేత యెందఱో పుణ్యజీవులుకూడ మహాత్ములగు గురువుల పాదసన్నిధానమునుండి దూరులగుచున్నారు. బ్రహ్మ

దేవుడు రెండువిధములగు భ్రమలచే జీవులను సృష్టించియున్నాడు. ఆదోషములు లేనివాడు నరుడుకాడు, నారాయణుడేయగును.

వేధా ద్వేధా భ్రమం చక్రే కాంతాసు కనకేషు చ ।
తాసు తేష్వప్యసక్తో హి నరో నారాయణో భవేత్ ॥

దీనియర్థము పైనజెప్పినదే.

న తప స్తప ఇత్యాహుర్బ్రహ్మచర్యం తపోత్తమమ్ ।
ఊర్ధ్వరేతా భవేద్యస్తు స దేవో న తు మానుషః ॥

ఈ ప్రపంచములోగల తపస్సు తపస్సుకాదు. బ్రహ్మచర్యమే ఉత్తమమైన తపస్సనంబడును. ఊర్ధ్వరేతస్సుగలవాడు దేవుడేకాని మనుజుడుకాడు.

ధర్మ్యం యశస్యమాయుష్యం లోకద్వయరసాయనమ్ ।
అనుమోదామహే బ్రహ్మచర్యమేకాంతనిర్మలమ్ ॥

అతిపవిత్రమగు బ్రహ్మచర్యము ధర్మములన్నిటికిని ఆధారమైనది. యశస్సులన్నిటికిన్ని మూలమైనది. దీర్ఘాయుస్సు గలుగజేయుటయందు ముఖ్యమైనది. ఇహలోకమందును, పరలోకమందును దివ్యరసాయనమువంటిది. అతినిర్మలమైనది, ముఖ్యమైనది, అని ఋషులు గ్రహించియున్నారు.

కిం కిల స్మారమనసాం పశూనాం చ విశేషతః ।
కృష్యన్తే పశవో రజ్జ్వా మనసా మూఢచేతసః ॥

విషయమనస్సుగల మనుజులకున్ను, పశువులకున్ను యేమివిశేషముగలదు ? త్రాడుచే పశువులను కట్టి లాగుకొనిపోవుచున్నారు. మూఢచేతస్సుగలవాడు మనస్సను పాశముచే కట్టబడి యీడ్వబడుచున్నాడు !

62. ప్ర:—మాయాభ్రాంతి నశింపక, విషయములందు దోషదృష్టిగలుగక, నిర్విషయస్థితి లభింపక, మనుజుడు మాయకు పరమగు పరమాత్మస్థితి నెట్లు పొందగలడు ?

ఉ:—ప్రయాసమైయున్నది. మాయ ఈశ్వరుని కధీనము. ఈశ్వరాజ్ఞకు మాయ లోబడియుండును. కావున ఈశ్వరభక్తిచే ఈశ్వరుని ప్రసన్నమొనర్చిన, మాయ మఱల యేమియు చేయజాలదు. కాన ఈశ్వరభక్తి మొదట కావలెను.

'మాయాం తు ప్రకృతిం విద్ధి మాయినం తు మహేశ్వరమ్' అని శ్రుతి చెప్పుచున్నది. ఈ మాయయగు ప్రకృతిని ఈశ్వరుడు నడుపువాడగుటచే 'మాయిన' మని మహేశ్వరునకు పేరు వచ్చినది. కనుకనే గీతలోను త్రిగుణములతో కూడిన మాయను జయించుట దుస్తరమనియు, అయినను భగవద్భక్తిగలవారి కది ప్రయాసము కాదనియు చెప్పు రహస్యము.

దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా ।
మామేవ యే ప్రపద్యన్తే మాయామేతాం తరన్తి తే ॥

దీనియర్థము పైన దెల్పినదే. మఱియు, మాయామోహము యావరింపని స్థలములో ముఖ్యముగా ముముక్షువులుండవలెను. ఆ నియమము ముముక్షువులను తప్పక రక్షించును. ఆ మోహము కాలకూట విషము క్రక్కుచుండు త్రాచుపామువంటిది. అది తాకినవానిని తప్పక కఱచును. కాని దాని విషకోరలను తీసివైచిన, యిక యేమియు చేయ జాలదు. ఆలాగున విషయదోషము రహితమగువఱకు నిష్ఠచేసిన తరువాత, ఇంద్రియాతీతమగు దైవజ్ఞానము గలిగినతరువాత ఆదోష ముండదు. ఇట్టిస్థితి గలిగినతరువాతమాత్రమే ప్రపంచములో ధర్మ బోధలకుగాని, జ్ఞానోపదేశములకుగాని ప్రవేశించవలెను. అమృతము విషమును శమింపజేయునట్లు, హృదయములోగల విషయములన్నియు ఆత్మజ్ఞానామృతము గలిగిన, నశించును. అమృతమొక్కదానివలననే విషము శాంతించునట్లు, దైవజ్ఞానామృతపానమును జీవన్ముక్తిగలిగిన మాత్రమే నిర్విషయస్థితి సిద్ధించును.

తావన్మహత్త్వం పాండిత్యం కులీనత్వం వివేకతా ।
యావజ్జ్వలతి నాఙ్గేషు హతః పఞ్చేషు పావకః ॥

ఎంతవఱకు శరీరమందు మన్మథాగ్నిచే తపనము కలుగలేదో, అంతవఱకే తనయొక్క మహిమ, పాండిత్యము, శ్రేష్ఠత్వము, వివేకతయు నిలుచును. విషయము ననుభవించిన, దానికి తృప్తి కలుగదు. అది అంతకంతకు పెరుగుచునేయుండునని ఈ క్రిందిశ్లోకమువలన తెలియుచున్నది.

సర్పిషా కాష్ఠభారేణ వర్ధతేఽగ్నిశిఖా యథా।
ఉపభోగేన కామేన హ్యాశా చోపరివర్తతే॥

ఘృతముచేతను, కట్టెలచేతను అగ్నిజ్వాల యెంతకంతకు వృద్ధియగునట్లు, భోగముచేత కామమున్ను ఉపర్యుపరి వృద్ధినొందుచునే యుండును.

అనిష్కల్మషచిత్తస్య సర్వతీర్థేషు మజ్జనమ్।
నరస్యాఙ్గారకస్యేవ యథా క్షీరాభిసేచనమ్॥

నిష్కళంకమైన హృదయము లేనివారు సమస్తతీర్థములలో స్నానమాచరించినను, బొగ్గు పవిత్రమగు క్షీరముచే అభిషేకము చేయబడినను, ఏలాగున దాని నలుపుపోయి తెలుపుకాజాలదో, ఆలాగున వారిదోషము నశించి నిర్దోషత్వము కలుగదు. "త్యజేచ్ఛ విషయాసఙ్గం శ్రేయోఽర్థీ మతిమాన్నరః" శ్రేయస్సును కోరువాడును, బుద్ధిమంతుడునగు మనుజుడు విషయములతోగల సంబంధమును విషమువలె త్యజింపఁదగినది. ఎవరికి బ్రహ్మవస్తువు గోచరముకాదో ఆవిషయము ఈ క్రింద నిరూపింపబడుచున్నది.

"అభక్తానామబుద్ధీనామయుక్తానామగోచరమ్"।

దైవభక్తి లేనివాడు, శుద్ధమైనబుద్ధి లేనివాడు, ఇంద్రియనిగ్రహము లేనివాడు యెవడో, అట్టివానికి బ్రహ్మవస్తువు గోచరము కాదు. ఇందువల్ల దైవభక్తిగలవారికి, శుద్ధమైనబుద్ధిగలవారికి, ఇంద్రియముల సంయమముగలవారికి బ్రహ్మవస్తువు గోచరముకాగలదని స్పష్టమగుచున్నది.

63. ప్ర:—తారకమననేమి ?

ఉ:— జననమరణాభవసాగరమునుండి తరింపజేయునదగుటచే తారకమని చెప్పబడెను. అది యొకటిమాత్రమేకాదు; కొందఱు రామమంత్రమును తారకమనెదరు. అట్లే కొందఱు నారాయణమంత్రమును. మఱికొందఱు శివమంత్రమును తారకమని చెప్పుదురు. ప్రణవము తారకమని ప్రసిద్ధి గల్గియున్నది. శ్రీకాశియందు ప్రాణికోట్ల అంత్యకాలమందు శ్రీపరమశివుడు దక్షిణకర్ణమందు ఉపదేశించునదీ యోంకారమేయగును. దీనికి ప్రణవమనియు పేరుగలదు. మంత్రము

లన్నింటికిని ఈ ప్రణవమే ప్రాణాధారమై[illegible]టచే దీనికి ప్రణవమని పేరు వచ్చినది. మఱియు ప్రాణర[illegible] జ్ఞానమగు ప్రాణము నిచ్చునదగుటచేతను ప్రణవమ[illegible]వచ్చెను. ప్ర[illegible]వములేని మంత్రములన్నియు ప్రాణములేనివే. ఉపనిషత్తులందును, ముఖ్యముగ ప్రణవమే ఉపదేశింపబడియున్నది. ఇది వేదమునకు మూలము. సూక్ష్మమగు వటబీజమునుండి గొప్పదగు వటవృక్షము యేర్పడునట్లు ప్రణవబీజమునుండియే నాల్గువేదములున్ను, వేదాంగములున్ను, వేదాంతమున్ను యేర్పడినవి. శ్రీకాశియందీశ్వరుఁడు ఈ ప్రణవమునే మరణకాలములో ప్రాణికోట్లకుపదేశించును. దీనివల్ల ప్రాణులను తరింపజేయునదగుటచే తారకమను పేరు ప్రసిద్ధికి వచ్చినది.

కాశీపతిః కారుణికః కరాభ్యామాదాయ మూర్ధానమతీవ తాసాం।
ఆగమ్య వేగాద్వ్యగపచ్ఛ తాసామోంకారమోంకారయతి స్మ కర్ణే॥

పరమకారుణికుడగు కాశీపతియైన [illegible]శ్వరుఁడు కాశియందు ప్రాణములు విడుచువారిపై కరుణగలిగి, వారి శిరస్సును తనచేతులతో లేవనెత్తి పట్టుకొని, ఓమ్, ఓమ్ అని వారిచెవులలో తారకమంత్రమైన ప్రణవమును ఉపదేశించును. ఈ ప్రణవమే శివపురాణమున తారకమని చెప్పబడినది.

భవంతోఽపి విదిత్వైవం ప్రణవార్థం మహేశ్వరమ్।
వేదగుహ్యం చ సర్వస్వం తారకబ్రహ్మముక్తిదమ్॥

ఓ ఋషిసత్తములారా! ఈశ్వరునకు సంబంధించినదిన్ని, వేదముయొక్క సారమున్ను, సర్వస్వమును గలుగజేయునదియు, ముక్తి నిచ్చునదియునగు తారకబ్రహ్మమగు ఈ ప్రణవార్థమును తెలిసికొని మోక్షమును పొందుదురుగాక.

తిలేషు వా యథా తైలం దధ్ని వా సర్పిరర్పితమ్।
యథాఽఽపః స్రోతసి వ్యాప్తా యథాఽరణ్యాం హుతాశనః॥
ఏవమేవ మహాత్మానమాత్మన్యాత్మవిలక్షణమ్।
సత్యేన తపసా చైవ నిత్యయుక్తోఽనుపశ్యతి॥

తిలములలో తైలమునవలెను, దధియందు ఘృతమువలెను, భూమియందుగునగల స్రోతస్సులలో జలమువలెను, అరణియందగ్నివలెను ఈ

ప్రణవార్థమగు జ్ఞానము ఆత్మలో వ్యాపించియున్నది. కావున ఆత్మా నాత్మవివేచనమను మథనముచే అనాత్మను తొలగించి, విలక్షణమగు ఆత్మను గైకొనవలసియుండును. ఎట్లన సత్యవ్రతముచేతను, తపస్సు చేతను నిరంతరధ్యానయుక్తుడైనవాడు ఈ ఆత్మను దర్శింపఁదగినది.

ప్రణవః సర్వవేదాదిః ప్రణవశ్శివవాచకః ।
మంత్రాధిరాజరాజస్య మహాబీజమనుః పరః ॥

ఈ ప్రణవము వేదములన్నిటికిని ఆదియైనది. ప్రణవమే సాక్షాత్ పరమేశ్వరునియొక్క వాచకము. మంత్రములన్నింటికిని రాజాధిరాజైనది. అన్నిటికన్న శ్రేష్ఠమైనది. బీజాక్షరములన్నింటికిని మహాబీజమైనదని ఋషులు తెలిసికొనియున్నారు.

వ్యంజనస్య సకారస్య హకారస్య చ వర్జనాత్ ।
ఓమిత్యేవ భవేత్స్థూలో హాచకః పరమాత్మనః ॥

'సోహం' మంత్రముయొక్క సకారమున్ను, హకారమున్ను త్యజించిన, 'ఓమ్' అని యేర్పడుచున్నది. పరమాత్మస్వరూపము యొక్క నిజమైన వాచకము ఈ ఓంకారమే యగుచున్నది.

"ఓమితీదం సర్వమితి శ్రుతిరాహ సనాతనీ"

సనాతనమగు శ్రుతిమాత 'ఈ సర్వమున్ను ఓం' అని పలికెను. అనగా చరాచరాత్మకమగు ఈ ప్రపంచమంతయు ఓంకారస్వరూప మని యర్థము.

శివో వా ప్రణవో హ్యేషః ప్రణవో వా శివస్స్మృతః ।
వాచ్యవాచకయోర్భేదో నాత్యన్తం విద్యతే యతః ॥

శివమే ప్రణవము. ప్రణవమే శివము. వాచ్యమునకున్ను, వాచకమునకున్ను అనగా శబ్దమునకున్ను, అర్థమునకున్ను యెట్లు భేదములేదో, ఆలాగున ప్రణవమునకున్ను, శివునకున్ను కొంచెమైనను భేదములేదు. అదే బ్రహ్మస్వరూపము.

కార్యకారణయోర్భేదో వస్తుతో న ప్రవర్తతే ।
కేవలం భ్రాంతిబుద్ధ్యైవ తదభావే స నశ్యతి ॥

ఏలాగున సువర్ణమునకును, ఆభరణమునకును భేదము వాస్తవ ముగలేదో, ఆలాగున జీవేశ్వరులకున్ను భేదములేదు. ఆ భేదము కేవ

లము బుద్ధియొక్క భ్రమవల్లనే కలుగుచున్నది. ఆభ్రాంతి నశించునపు డీభేదమున్ను నశించును.

తదా బీజాత్ప్రరోహాశ్చ నానాత్వం హి ప్రకాశయేత్ ।
అంతే చ బీజమేవ స్యాత్తత్ప్రరోహాశ్చ నశ్యతి ॥

ఏలాగున బీజమునుండి అంకురమేర్పడి ఫలపల్లవపుష్పలతాదులతో ననేకవిధములుగ ప్రకాశించుచుండినను, అంత్యమందు ఆ వృక్షము బీజరూపమై మారుచుండునో, వృక్షత్వమేలాగున లేకుండ పోవునో, ఆలాగున ప్రణవాక్షరబీజమగు పరబ్రహ్మమునుండి మాయవల్ల యేర్పడిన నానారూపముగ కాన్పించు జగత్తంతయున్ను అంత్యమున మఱల నిరాకారమగు పరబ్రహ్మముగానే మారుచుండును.

సహస్రాఙ్కురశాఖాత్మ ఫలపల్లవశాలినః ।
అస్య సంసారవృక్షస్య మనోమూలమిదం స్థితమ్ ॥

ఏలాగున నతిసూక్ష్మమగు బీజమునుండి వేలకొలది శాఖోపశాఖలతోను, ఫలపల్లవపుష్పలతాదులతోను గూడిన గొప్పవృక్షము యేర్పడునో, అట్లే సంసారమను వృక్షమునకు మనస్సే మూలము. మనస్సునుండియే యివన్నియు యేర్పడినవి. మనోలయముగల్గిన ఈ మాయాకల్పితమగు జగత్తంతయు లయమునొందును. శ్రీ వసిష్ఠులు 32000 శ్లోకములతో శ్రీ రాములకొఱకుపదేశించిన శ్రీ యోగవాసిష్ఠసార మంతయు నొక్క మనోలయమునుగుఱించియే యని కానుపించుచున్నది.

సర్వే జీవాస్సుఖైర్దుఃఖై ర్మాయాజాలేన వేష్టితాః ।
తేషాం ముక్తికరం మార్గం మాయాజాలనికృన్తనమ్ ॥

సమస్తజీవులున్ను సుఖదుఃఖములచేతను, మాయాజాలముచేతను వేష్టితములై యున్నవి. వలలో చిక్కుకొనిన చేపలకు విమోచనము గలుగవలసియుండిన, వలయొక్క ఛేదనముతప్ప వేఱుగతి యెట్లు లేదో, ఆలాగున సుఖదుఃఖరూపమగు మాయాజాలమునుండి విముక్తి నొందుటతప్ప జీవులకు వేఱుగతిలేదు.

యథైకం చ సువర్ణాది మిశ్రితం రజతాదినా ।
అల్పమూల్యం ప్రజాయేత తథా జీవోఽహంయుతః ॥

యథైవ నిహీ సువర్ణాది తామ్రాద్యైః శోధితం శుభమ్ ।
స్వార్థవిస్మార్యస్వతాం యాతి తథా జీవోఽపి సంస్కృతః॥

ఏలాగున అపరంజిబంగారైనను రజతతామ్రాదులచే మిళిత మైన దానికి స్వల్పమైన వెల గలుగునో, ఆలాగున శుద్ధజ్ఞానస్వరూపు డగు ఆత్మ దేహాద్యహంకారములతో గూడినవాడైనచో, వానియొక్క శ్రేష్ఠత్వము నశించి నికృష్టత్వము నాతడు పొందుచుండును. మలిన బంగారమును స్ఫుటముచేసిన, శుద్ధత గలుగుచుండునట్లును, అపుడు దానికి పూర్వముండిన విలువ గలుగునట్లును భక్తి, ధ్యాన, జ్ఞానా దులచే జీవుడు సంస్కరింపబడిన, జీవత్వము నశించి శివత్వము నొందు చుండును.

సువర్ణాజ్జాయమానస్య సువర్ణత్వం చ శాశ్వతమ్ ।
బ్రహ్మణో జాయమానస్య బ్రహ్మత్వం చ తథా భవేత్ ॥

సువర్ణమునుండి యేర్పడిన బంగారువస్తువులెలాగున సువర్ణమయ ములుగనుండునో, ఆలాగున బ్రహ్మమునుండి యేర్పడిన జీవకోట్లన్నియు బ్రహ్మమయములుగానే యుండును.

సకృదుచ్చరితమాత్ర ఊర్ధ్వమున్నామయతీత్యోంకారః ।

ఒక్కమారు ప్రణవము నుచ్చరించిన, శ్రేష్ఠగతిని (పరమ పదమును) జేర్పించుటంబట్టి 'ఓంకారమనంబడును' — ఇది ఓంకారశబ్ద మున కర్థము.

ప్రాణాన్సర్వాన్ పరమాత్మని ప్రణామయతీతి ప్రణవః ।

సకలప్రాణములను (ప్రపంచమంతటిని) పరమాత్మయందు జేర్పించుటంబట్టి ప్రణవమనంబడును.

"సంతారయతీతి తారణాత్తారః" ।

తారణముచేయుటవలన ఓంకారము తారకమనంబడును.

'దేవాశ్చేతి సంధత్తాం సర్వేభ్యో దుఃఖభయేభ్యః
సంతారయతీతి తారణాత్తారః॥ (అథర్వశిఖోపనిషత్తు) ॥

సకలదేవతలు ప్రణవస్వరూపులే. సమస్తదుఃఖములనుండియు, సకలభయములనుండియు తరింపజేయునదిగానుండుటంబట్టి ఓంకారము తారకమనంబడును.

ఏనమేవ మహామంత్రం జీవానాం హి తనుత్యజామ్ ।
కాశ్యాం సంశ్రావ్య మరణే దత్తే ముక్తిం పరాం శివః ॥

'శ్రీకాశియందు మరణించెడు వారికి కర్ణమందు ఈమహామంత్రమగు ప్రణవమును పరమశివుఁడుపదేశించినచో ఉత్కృష్టమగు ముక్తిని జీవులకు గలుగజేయుచుండును, అని శివపురాణము.

శివమంత్రజపోధ్యానం హోమో యజ్ఞస్తపశ్శ్రుతమ్ ।
దానమధ్యయనం సర్వే భావార్థం నాత్ర సంశయః ॥
భావహీనో నరస్సర్వం కృత్వాఽపి న విముచ్యతే ।
భావయుక్తః పునస్సర్వమకృత్వాఽపి విముచ్యతే ॥

ఈశ్వరస్మరణ, మంత్రజపము, ధ్యానము, హోమము, యజ్ఞము, తపస్సు, వేదాంతశ్రవణము, దానము, అధ్యయనము మొదలుగాగల సమస్తమున్ను భావనార్థముగా యేర్పడినదే. దీనియందు సంశయము లేదు. భావనచేయుటకు శక్తిలేని నరుఁడు పైఁజెప్పినవన్నియు చేసినను ముక్తిని పొందజాలఁడు. భావయుక్తుఁడైనవాఁడు పైజెప్పినవన్నియు చేయకపోయినను మోక్షమునొందగల్గును. అనగా మంత్రములు, స్మరణలు, ప్రార్థనలు, పారాయణలు యివన్నియు దైవభావముగలుగుట కొఱకేర్పడినవి. అట్లు భావముచేయనిచో పైజెప్పిన ధ్యానయజ్ఞాది క్రియలెన్నిచేసినను ఫలము గలుగదు. దైవముగలవాఁడివియేవియు చేయకున్నను వానికి మోక్షముగలుగును.' — అని ఈశ్వరవచనము (శివపురాణము.)

త్వరితం జీవితం యాతి త్వరితం యాతి యౌవనమ్ ।
త్వరితం వ్యాధిరభ్యేతి తస్మాత్పూజ్యః పినాకధృక్ ॥
యావన్నాయాతి మరణం యావన్నాక్రమతే జరా ।
యావన్నేన్ద్రియవైకల్యం తావత్పూజయ శంకరమ్ ॥
యతఃపాపార్ణవాత్త్రాతుం భక్తిర్నౌరివ నిర్మితా ।

1. జీవితమతివేగముగ గడచిపోవుచున్నది. అలాగున బాల్యావస్థయు, యౌవనావస్థయు అతివేగముగ దాటిపోవుచున్నవి. వ్యాధియో అతిశీఘ్రముగ దగ్గఱకు జేరుచున్నది. కావున, అలస్యముచేయక పరమేశ్వరుని త్వరలో ధ్యానించుకొనుఁడు. 2॥ మరణము రాకముందే

వచ్చుటకు ముందుగా టిక్కెట్టు తీసికొని ప్లాట్‌ఫారంపైనుండిన, యే లాగున రైలెక్కిపోవచ్చునో, అట్లుగాక, ఆలస్యముగావచ్చినను, లేక ఒకవేళ ముందుగావచ్చినను, అచ్చటచ్చట కూర్చొని మాట్లాడు చుండి, టిక్కెట్టుతీసికొని ప్లాటుఫారంమీదికి రాకున్నచో, ప్రయాణమేలాగున ఆగిపోవునో, ఆలాగున శరీరమను రైలు వెళ్లిపోవుటకు ముందుగా జ్ఞానమను టిక్కెట్టు తీసికొనినవారికిక భయములేదు.

2. ఎంతవఱకు మరణము సమీపమునకు రాకయున్నదో, ఎంత వఱకు ముసలితనమాక్రమింపకున్నదో, ఎంతవఱకు యింద్రియము లన్నింటికిని వైకల్యము సిద్ధింపలేదో, అంతలోపలనే సర్వేశ్వరుని మనస్సులో ధ్యానించి, వాని కృపను సంపాదించుకొనవలెను.

విII ఏలాగునసముద్రమును దాటుటకు ఓడ యేర్పడియుండునో, ఆలాగున పాపార్ణవమును తరించుటకు భక్తియనెడు నావను సర్వేశ్వరుఁడు నిర్మించియున్నాఁడు.

ప్రణవో వాచకస్తస్య శివస్య పరమాత్మనః ।
శివరుద్రాదిశబ్దానాం ప్రణవో హి పరః స్మృతః ॥

పరమాత్మస్వరూపుడగు ఈశ్వరుని బోధించునది ప్రణవము. ఈప్రణవము 'శివ', 'రుద్రా'ది ఈశ్వరప్రతిపాదకశబ్దములలో చాలా యుత్కృష్టమైనదని బ్రహ్మవేత్తలందురు.

శంభోః ప్రణవవాచ్యస్య భావనాత్తజ్జపాదపి ।
యా సిద్ధిః సా పరా ప్రాప్యా భవత్యేవ న సంశయః ॥

ప్రణవప్రతిపాద్యుఁడగు ఈశ్వరుని భావనారూపమున ధ్యానించుటవలనను, జపించుటవలనను, యేసిద్ధి (ఫలము) ప్రాప్తించునో, అయ్యది చాల యుత్కృష్టమైనది, ప్రాప్యమైనదియును. ఇట సందియములేదు.

తస్మాదేకాక్షరం దేవమాహురాగమపారగాః ।
వాచ్యవాచకయోరైక్యం మన్యమానా మనస్వినః ॥

కనుక, వేదవేదాంతవేత్తలు పరతత్త్వస్వరూపమగు శివుని ఏకాక్షరస్వరూపమగు ప్రణవరూపముగ చెప్పుచుందురు. పరిశుద్ధాంతఃకరణముగల బ్రహ్మనిష్ఠులు వాచ్యవాచకముల కైక్యతను తలంతురు.

అనగా వాచ్యమగు ఈశ్వరుని, వాచకమగు ప్రణవమును ఏకరూపముగ దెలియుదురని భావము.

అస్య మాత్రాః సమాఖ్యాతాః చతస్రో వేదమూర్ధని।
అకారశ్చాప్యుకారశ్చ మకారో నాద ఇత్యపి॥

ఈప్రణవమునకు అకార, ఉకార, మకార, నాదములను నాల్గుమాత్రలు ఉపనిషత్తులలో చెప్పబడియున్నవి.

అకారం బహ్వృచం ప్రాహురుకారో యజురుచ్యతే।
మకారః సామ నాదోఽస్య శ్రుతిరాథర్వణీ స్మృతా॥

ఈ ప్రణవాంతర్గతమగు అకారమును ఋగ్వేదమని చెప్పుదురు. ఉకారము యజుర్వేదముగ చెప్పబడును. మకారము సామవేదము, ఈ ప్రణవనాదము అథర్వణవేదము — అనగా ప్రణవము చతుర్వేదాత్మకమని భావము.

అకారశ్చ మహాబీజం రజః స్రష్టా చతుర్ముఖః।
ఉకారః ప్రకృతిర్యోనిః సత్త్వం పాలయితా హరిః॥

అకారము మహాబీజము. రజోగుణాత్మకము. సృష్టికర్తయగు బ్రహ్మ దీనికధిదేవత. ఉకారము జగత్కారణమగు ప్రకృతిస్వరూపము. సత్త్వగుణాత్మకము. దీనికధిదేవత లోకపాలకుఁడగు విష్ణువు.

మకారః పురుషో బీజం తమః సంహారకో హరః।
నాదః పరః పుమానీశో నిర్గుణో నిష్క్రియః శివః॥

మకారము పురుషుడు (జీవుడు), బీజస్వరూపము. తమోగుణాత్మకము. జగత్సంహారకుడగు యీశ్వరుడు అధిదేవత. నాదము పరమపురుషుడు (పరమాత్మ); నిర్గుణస్వరూపము; క్రియాశూన్యము, శివస్వరూపము.

సర్వం తిసృభిరేవేదం మాత్రాభిర్నిఖిలం త్రిధా।
అభిధాయ శివాత్మానం బోధయత్యర్ధమాత్రయా॥

ఈమూడుమాత్రలచే మూడువిధముల యీసమస్త ప్రపంచము చెప్పబడుచున్నది. ఇయ్యది అర్ధమాత్రచే శివస్వరూపము బోధించును.

యస్మాత్పరం నాపరమస్తి కించిత్
యస్మాన్నాణీయో న జ్యాయోఽస్తి కించిత్।

వృక్ష ఇవ స్తబ్ధో దివి తిష్ఠత్యేకః
తేనేదం పూర్ణం పురుషేణ సర్వమ్ ॥

దేనికన్న యితరమగు కొద్దివస్తువైనను ఉత్కృష్టమైనది ప్రపంచమున గనుపింపదో, ఎద్దానికన్న అణుస్వరూపముగలది (సూక్ష్మమైనది) మఱియొకటిలేదో, దేనికంటె పెద్దవస్తువు ఒకటైనను లోకమున గన్పట్టదో, ఎయ్యది వృక్షమువలె నిశ్చలముగ ఆకాశమున (భూమ్యంతరిక్షములకు నడుమ) ఏకస్వరూపమై నిలచియున్నదో, అట్టి పరతత్త్వమగు ప్రణవస్వరూపుఁడైన పరమశివునిచే యీ ప్రపంచమంతయు నావరింపబడియున్నది. (ఇట్లు శివపురాణము)

వ్రతం దానం తప శ్శౌచం భూశయ్యా నక్తభోజనమ్ ।
బ్రహ్మచర్యం తథా స్నానం భస్మనా సలిలేన వా ॥
శాంతిర్మౌనం క్షమా నిత్యం సంవిభాగో యథావిధి ।
బ్రహ్మక్షత్రవిశాం దేవి యతీనాం బ్రహ్మచారిణాం ॥
తథైవ వానప్రస్థానాం గృహస్థానాం చ సున్దరి ।
శూద్రాణామథ నారీణాం ధర్మ ఏషస్సనాతనః ॥

వ్రతము, దానము, తపస్సు, శౌచము, భూశయనము, నక్తభోజనము (పగలుపవసించి, అస్తమయసమయమున స్నానమాచరించి వ్రతమొనరించి చేసెడు భోజనము), బ్రహ్మచర్యము, స్నానము (అది భస్మస్నానమైనను, జలస్నానమైననుసరి), శాంతి, మౌనము, క్షమ, నిత్యము ఆత్మానాత్మజ్ఞానము గల్గియుండుట, ఇవన్నియు బ్రాహ్మణులకు, క్షత్రియులకు, వైశ్యులకు, శూద్రులకు, యతులకు, బ్రహ్మచారులకు, వానప్రస్థులకు, గృహస్థులకు, స్త్రీలకు సమానముగానే విధింపబడినవి. ఇట్టిధర్మము సనాతనమగును. అనగా పైఁజెప్పినవాటిలో నందఱికిని సమానమైన యధికారముగలదని భావము.

64. ప్ర:—మంత్రములో చెప్పబడిన తారకముయొక్క యథార్థతను తెలిపితిరి. ఇఁకను తారకవిషయమేమైన గలదా?

ఉ:—పతంజలిమహర్షి యోగదర్శనమందు ఆత్మసాక్షాత్కారజ్ఞానమునే తారకమని యుపదేశించియున్నారు. అనగా యోగముచేతను, జ్ఞానముచేతను ప్రకృతికి పరమగు సాక్షిచైతన్యమైన ప్రత్యగాత్మ

స్వరూపమును ప్రకృతిబంధమునుండి విడుదలచేసిన అనగా ప్రకృతి నుండి తరింపజేసిన స్థితినే తారకమని తెలిపియున్నారు. దీనివల్ల మాయా సంసారసాగరము తరింపబడును. కావున దీనిని తారకమని వచించిరి. ఆ సూత్రవాక్య మిదివఱలో వ్రాయబడియున్నది.

65. ప్ర:—ఇక దేనికైన తారకమని పేరుగల్గియున్నదా?

ఉ:— వేదాంతశ్రవణమునకుగూడ తారకమనుపేరు ప్రసిద్ధి గల్గియుంటున్నది. ఏలన, దుఃఖసాగరమును వేదాంతజనితజ్ఞానమొక్కటి మాత్రమే మాయనుండి తరింపజేయును. తక్కిన యోగముగాని, మంత్రముగాని, తపస్సుగాని, భక్తిగాని పరంపరగా జ్ఞానమును గలుగ జేసి సంసారసాగరమును దాటించును. వేదాంత శ్రవణమో, సాక్షా త్కారమును గలుగజేయును. కావున శ్రవణమననిదిధ్యాసనములు ద్వంద్వరూపమగు సంసారసాగరమును తరింపజేయుటలో ప్రధానస్థాన మును బొందియున్నవి.

66. ప్ర:— ఈయోగసాధనకుగాని, జపపురశ్చరణకుగాని, మనన నిదిధ్యాసనములకుగాని ప్రత్యేకస్థలమేదైన యుండవలెనా? ఈశ్వరుఁ డంతటను యొకేవిధముగ వ్యాపించియుండగా ప్రత్యేకమొకస్థలమేల యుండవలెను?

ఉ:—అంతటను భగవంతుడేకరీతిగ నుంటున్నాడనిగాని, సమస్తప్రాణులయందును సమానముగ సర్వేశ్వరుడు ప్రకాశించు చున్నాడనిగాని ఒట్టిమాటలతో చెప్పినచాలదు. అట్లుకాదు. కొంత ఆత్మశుద్ధిగల్గి శాస్త్రములచేతను, గురువులచేతను, తనయొక్క స్వబుద్ధి బలముచేతను, పరోక్షముగ తెలిసికొనిన చాలదు. సాక్షాదపరోక్ష జ్ఞానముగలవారికిమాత్రము దేశ, కాల, స్థల, భేదము లేదుగాని, అట్టి స్థితి గలుగువఱకు దేశ, కాల, స్థలభేదము గలదు. సాధకులకు ముఖ్యముగ స్థలశుద్ధి గలిగియుండవలెను. సామాన్యముగ భగవంతు డంతట యుంటున్నాడనిగాని, అందఱియందుండువాడు భగవంతుడే గాక యిక యెవఁడునుగాని చెప్పు మాములు గలదు. కాని దాని యొక్క భావము వారికి గల్గియున్నదా, లేక వారు చెప్పేలాగున చేయువారా యని పరిశీలించిన వారి వాక్యములోగల సారము

గోచరము కాగల్గును. మనశరీరములో నంతటను ప్రాణవాయువున్ను రక్తప్రసరణమున్ను యొకేవిధముగ నున్నను, శరీరమంతయు పంచభూతమయమైనను, నేత్రములలోగల దర్శనశక్తి, శ్రోత్రమందుండు శబ్దగ్రహణము, అలాగున ఘ్రాణేంద్రియములోగల గంధగ్రహణశక్తి, జిహ్వాయందుగల రసమును గ్రహించెడుశక్తి, అలాగున ఉపస్థేంద్రియమందును, గుదేంద్రియమునందును యుండు స్వభావము వేర్వేరుగనే యుంటున్నవిగదా. కావున అభేదజ్ఞానము గలుగువఱకు స్థలభేదము గలదు. మఱియు అభేదజ్ఞానముగలిగిన ఋషులే సాధకులకు స్థలభేదము నిర్ణయించిరి. ఇంకను వినుము. భూమియంతయు పృథివీతత్వముతో నిండియున్నదైనను, కొన్నిస్థలములలో చవుడు, కొన్నిస్థలములలో గంధకము, కొన్ని స్థలములలో సున్నము, కొన్నిస్థలములలో సారత్వము, కొన్నిప్రదేశములలో నిస్సారత్వము మొదలగు భేదములేలాగున గల్గియున్నదో, అన్నిచోట్లను యొకేవిధముగ పైరుపంటలెట్లుండవో, మఱియు, కొన్నిప్రదేశములలో కొన్నిరకముల పైర్లు ఉపయోగపడుటయు, కొన్నిప్రదేశములలో కొన్నిపైర్లు ఉపకరింపకపోవుటయు యెట్లుండునో, అలాగున ధ్యానయోగాదుల నభ్యసించు కాలమున మొదట అభ్యాసకాలమున స్థలభేదము గలదు. ఇంకను వినుము. మేఘజలమంతట నొకేవిధముగ వర్షించినను, కొన్నిధాతువుల భేదముచే నొకప్రదేశమున శుద్ధజలముగను, ఇంకొకప్రదేశమున అశుద్ధజలముగను, కొన్నిప్రదేశములందు అమృతసమానమగు జలముగను, కొన్ని తావుల విషతుల్యమగు జలముగను, కొన్నిచోట్ల ఆరోగ్యకరమగు జలముగను, మఱికొన్నిచోట్ల అనారోగ్యకరమగు జలముగను, కొన్నిచోట్ల సుగంధయుక్తజలముగను, కొన్నిచోట్ల దుర్గంధయుక్తజలముగను నగుచు భేదమేలాగున గల్గియుండునో, అలాగున, ఈశ్వరుఁడంతటనిండి వెలుగుచున్నను, మనకు దృక్, దృశ్య, దర్శనమను త్రిపుటి యుండువఱకు భేదమున్ను గల్గియుండును. అభ్యాసకులు తప్పక శుద్ధమైన ఏకాంతస్థలమందుండవలెను. ముఖ్యముగ గాలియున్ను, జలమున్ను, నిరుపద్రవప్రదేశమున్ను, ఆహారమునకు కష్టములేని ప్రదేశమున్ను యుండవలెను. ఎక్కువ భోగములు (భోజనసౌఖ్యము

మున్న(గునవి) యుండుస్థలమున్ను పనికిరాదు. అత్యావసరమునకన్న అధిక భోజనాదులు దొరుకు స్థలమున్ను మంచిదికాదు. నిష్కృతగిన ఆహారము దొరుకని ప్రదేశమున్ను మంచిదికాదు. అధికభోగ్యవస్తువులుండు ప్రదేశమున యింద్రియనిగ్రహము గలుగుట దుస్తరము. ఇంద్రియములకు బహిర్ముఖత్వము స్వభావముగ నుండుచుండును. మంచి భోజనవస్తువులను జూచునపుడు, వాటి వాసన తగులునపుడు వాటిని భుజించవలెనని తలంపు గలుగుచుండును. కావున అట్టిభోజనాదులు దొరుకనిస్థలమే యుండవలెను. ఎలుకలు సంచరించెడి స్థలమున మార్జాలమునకు మనోనిగ్రహము గలుగునా? ఆలాగున మృగములు సంచరించెడు ప్రదేశమున సింహమునకు యింద్రియనిగ్రహము సిద్ధించునా? భోజనమొక్కటిమాత్రము కాదు, ఇతరవిషయములుకూడ బాధించని స్థలములందే స్త్రీలుగాని, పురుషులుగాని బ్రహ్మనిష్ఠ, తపస్సు మొదలగువాని నభ్యసించవలెను. కావుననే శాస్త్రములలో స్థలమునుగూర్చి యీలాగున చెప్పుటకు కారణమైనది. — అనుకూల ప్రతికూలస్థలములు —

అథ ప్రయోగం యోగస్య వక్ష్యే శృణు సమాహితః।
శుభే కాలే శుభే దేశే శివక్షేత్రాదికే పునః॥ 1
విజనే జంతురహితే నిఃశబ్దే బాధవర్జితే।
సులిప్తే స్థలే సౌమ్యే గంధధూపాదివాసితే॥ 2
ముక్తపుష్పసమాకీర్ణే వితానాది విచిత్రితే।
కుశపుష్పసమిత్తోయఫలమూలసమన్వితే॥ 3
నాగ్న్యభ్యాశే జలాభ్యాశే శుష్కపర్ణచయేఽపి వా।
న దంశమశకాకీర్ణే సర్పశ్వాపదసంకులే॥ 4
న చ దుష్టమృగాకీర్ణే న భయే దుర్జనావృతే।
శ్మశానే చైత్యవల్మీకే జీర్ణాగారే చతుష్పథే॥ 5
న జీర్ణోద్యానగోష్ఠాదౌ నానిష్టే న చ నిందితే।
న జీర్ణాన్నరసోద్గారే న చ విణ్మూత్రదూషితే॥ 6
నచ్ఛర్ద్యామాతిసారే వా నాతిభుక్తౌ శ్రమాన్వితే।
న చాతి చిన్తాకులితో న చాతిక్షుత్పిపాసితః॥ 7

నాపి స్వగురుకర్మాదౌ ప్రసక్తో యోగమాచరేత్।
యుక్తాహారవిహారశ్చ యుక్తచేష్టశ్చ కర్మసు॥ 8
యుక్తనిద్రాప్రబోధశ్చ సర్వాయాసవివర్జితః॥ 9

1. తా॥ యోగము నెటులాచరింపవలయునో, అద్దాని నెఱిం గింతును. చిత్తసమాధానము గల్గి యాకర్ణింపుము. శుభసమయమున మంగళకరమగు ప్రదేశమున శివాలయము మొదలగు చోట్లయందు నిర్జనమై, హింసాకరములగు జంతువులు లేనిదై, నిశ్శబ్దమై, ఇతర యీతిబాధలులేని ప్రదేశమున యోగము సలుపవలయు.

2. ఆ ప్రదేశము గోమయముచే చక్కగ అలకబడినదియు, సౌమ్యమైనదియు, గంధము ధూపము మొదలగువాని సువాసన గలిగి, పుష్పమాల్యాదులచే శోభితమై, మేల్కట్టు మొదలగువానిచే ప్రకాశించునదై యుండవలయు.

3. మఱియు దర్భలు, పుష్పములు, సమిధలు, నీరు, పండ్లు, దుంపలుగలదై యుండవలెను. ఆ ప్రదేశము అగ్నిభయముగల ప్రదేశసమీపమున నుండరాదు. జలసమీపమున (తడిగల ప్రదేశమున), యెండుటాకులుగలచోటను నుండరాదు.

4. ఈగలు, దోమలు, పాములు, క్రూరమృగములు గలిగి యుండరాదు. దుష్టమృగములుగల్గి భయంకరమై, దుర్జనులచే ఆవరింప బడియుండ తగదు.

5. శ్మశానమున, రచ్చప్రమానువద్దను, పుట్టలుగల ప్రదేశ మునను, శిథిలమైన గృహమునందును, నాలుగుదారులు కలియు చోటను యోగాభ్యాసస్థల ముండరాదు.

6. శిథిలమైన తోటయందుగాని, శిథిలమైన ఆవులదొడ్డిలో గాని, తనచిత్తములకు నచ్చనిచోటను, నింద్యమైనట్టిదియునగు ప్రదేశ మున నుండతగదు. మలమూత్రములచే అసహ్యాకరమగు ప్రదేశమున గాని, జీర్ణములైన ఆకులు మొదలైనవి పడుటవలన కుళ్లినైననీరు యుండుచోటను ఉండదగదు.

7. వమనమువచ్చు పర్యంతముగాని, మిక్కిలి సారము గల పదార్థమునుగాని భోజనము చేయరాదు. అమితభోజనమున్ను

గూడదు. శ్రమను గలుగజేయు ఆహారముగ నుండరాదు. యోగా భ్యాసి మిక్కిలి చింతలుగలిగియుండరాదు. మిక్కిలి ఆకలియు, మిక్కిలి దప్పియు గలిగియుండరాదు.

8. యోగమునకు భంగకరములై శ్రమను గలుగజేయు భారమైన పనులయందు ఆసక్తిగలవాడై యోగమభ్యసింపరాదు. తగిన ఆహారవిహారములు సలుపువాడుగను, కర్మలయెడ తగినవ్యాపా రము గలవాడై యునుండవలయును.

9. తగిన నిద్రాజాగరణములు గలిగి, దేనివలనను ఆయాసము లేక యుండవలయును.

సముద్రతీరే నద్యాం చ గోష్ఠే దేవాలయేపి వా।
శుచౌ దేశే గృహే వాపి కాలే సిద్ధిగతే తిథౌ॥

ఇఁకను ధ్యానమున కనుకూలస్థలములు—సముద్రతీరము, పుణ్య నదీతీరము, గోవులుండుస్థలము, దేవాలయము, శుభ్రమైనప్రదేశము, అనుకూలమగు స్వగృహము, శుభకాలము, సిద్ధినిగలుగజేయు పుణ్య తిథియు ధ్యానము ప్రారంభించుటకున్ను, అనుష్ఠించుటకున్ను తగిన స్థలకాలములు.

67. ప్ర:—ధ్యాన, యోగనిష్ఠాదులకు కూడని ప్రదేశములెవ్వి?

ఉ:—పైఁజెప్పినదానిలో అనుకూలప్రతికూలములు రెండున్ను తెలుపడమైనది. సారవంతమైన భూమియందు సస్యమేలాగున వృద్ధి నొందునో, ఫలమధికముగనిచ్చునో, సారరహితమైన ప్రదేశమున గాని, ఊషరక్షేత్రమునగాని, సస్యము పెరుగుటకును, ఫలమునిచ్చుట కును యెట్లు అనుకూలముండదో, ఆలాగున హీనప్రదేశములు బ్రహ్మ నిష్ఠులకు మంచివికావు. ముఖ్యముగా వాయువున్ను, జలమున్ను దోషముగలిగియుండిన, బ్రహ్మచర్యమునకు నష్టముగలుగును. దీర్ఘ చింతన చేయుటకున్ను, మనస్సు సుస్థిరముగనుండుటకును, బ్రహ్మచర్య మునకు చలనముండకూడదు. అది అన్నిటికిన్ని ప్రాణసమానమైనది.

'మరణం బిందుపాతేన జీవనం బిందుధారణాత్' అని యోగులు తెలిపియున్నారు.

మఱియు దుష్టస్థలమైన, భూతప్రేతపిశాచాదుల యుపద్రవమున్ను యుండును. కాని పరిశుద్ధహృదయముగలవారైనచో, అవి యేమియు చేయజాలవు. ముఖ్యముగా యిదివఱలో యెవరైన తపస్సు చేసిన స్థలముగాని, గొప్పమహాత్ముల సమాధిగాని, దివ్యక్షేత్రములు గాని, హింసారహితమైన యజ్ఞముచేసిన స్థలముగాని, ఋషులు నివసించియుండిన పుణ్యప్రదేశములుగాని, శుద్ధమైన జలప్రవాహము గల స్థలముగాని గలిగియుండవలెను. అచ్చోటులలోనుండి ధ్యానాద్యనుష్ఠానములుచేయువారికి త్వరలోనే ఆత్మశాంతిగలుగును. స్వచ్ఛమైన బోధములెల్లపుడు నిలచియుండును. సంకల్పములేవియు గలుగవు. మనస్సు బహునిర్మలముగానుండును. ఈలాటి సుగుణములన్నియు శ్రేష్ఠమైన ప్రదేశములో గలిగియుండును. కావుననే సాధకులకు విఘ్నముగలుగకుండుటకొఱకు పైజెప్పిన స్థలవిశేషములన్నియు పరమదయామూర్తులగు ఋషులు నిశ్చయించుటకు కారణమైనది. ఇఁకను స్థలభేదమునుగుఱించి చెప్పెద. గోవుమొదలగు జంతువుల శరీరమంతటయు ఒకేరక్తమున్ను, ఒకేప్రాణమున్ను, వ్యాపించియుండినను, పొదుగునుండి క్షీరమున్ను, దాని సమీపప్రదేశమునుండి మూత్రమున్ను యెట్లు వచ్చుచున్నదో, వృక్షముయొక్క ఆమూలాగ్రము సర్వత్ర రసమున్ను ప్రాణవాయువున్ను ఒకేవిధముగనున్నను, కొన్నిప్రదేశములలో ఫలములు, పుష్పములు, లతలు, కొన్నిప్రదేశములలో గోదు, మూలమందు వేరు యెట్లు గలిగియుండునో, ఆలాగున ప్రకృతియనువృక్షమందుగూడ శుభాశుభములు గలిగియేయుండును. ప్రకృతి యెల్లప్పుడున్ను ద్వంద్వములతోనే గూడియుండును. పరమాత్మయందు సుస్థిరస్థితి గలుగనంతవఱకుమాత్రమే యీభేదముండును. ఆయీశ్వరస్థానము అమృతము; శివము; ఆనందము; అద్వైతము.

68. ప్ర:— ఈ ధ్యానాదులకు స్థలభేదము నిరూపించినట్లు ఆహారాదులకుకూడ నియమములు కలవా? ఏది భుజించినను మనస్సుగదా ప్రధానము?

ఉ:—ఈ విషయమై యిదివఱలో వ్రాసియుండు తమోభాస్కరాది గ్రంథములందు విస్తారముగ వివరింపఁబడియున్నది. కావున ఆవిషయమై యిప్పుడు విస్తారముగ చెప్పదలంపులేదు. సస్యముల కనుకూలమైన యెరువు జలము యుండిన, ఏలాగుననవి యెక్కువ ఫలమును గలుగజేయునో, ప్రతికూలమైన యెరువున్ను జలమున్ను యుండిన యెట్లు సరియైన ఫలమును గలుగజేయవో, ఆలాగున బ్రహ్మనిష్ఠకనుకూలమైన శుద్ధసాత్వికాహారముండిన, అది ఆత్మశాంతికి చాల అనుకూలపడును. లేనిచో ప్రతికూలమే కలుగును. ఇంజను మొదలగువానికి బాయిలరులో శ్రేష్ఠమైనబొగ్గు, జలముండిన, గమనమునకు యెంతవేగత గలిగియుండునో, లేనిచో గమనమెట్లు మందమగునో, ఆలాగున బ్రహ్మప్రాప్తికొఱకు యత్నముచేసెడు ముముక్షువునకు శుద్ధమగు సాత్వికాహారము చాల అనుకూలపడును. లేనిచో ప్రతికూలములెన్నియో గలుగవచ్చును. నదిలో ప్రయాణముచేయువారికి ప్రవాహవేగమున్ను, వాయువున్ను అనుకూలముగానుండిన, యెట్లు త్వరలో గమ్యస్థానము చేరవచ్చునో, ప్రతికూల జలప్రవాహమున్ను, గాలియున్ను గలిగిన గమ్యస్థానము చేరుటకెంతయో శ్రమ యెట్లుకలుగునో, ఇదిన్ని అటువంటిదేయని తలంచవలెను. దేహేంద్రియముల నతిక్రమించి సాధకులెవరున్ను యేమియును చేయుజాలరు. అన్నపానములచేతనే శరీరములోగల రసము, రక్తము, మాంసము, మజ్జ, మేదస్సు మొదలైన సప్తధాతువులేర్పడును. వాటియొక్క సూక్ష్మాంశము మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారముగ మారుచుండును. వీటి నన్నింటినతిక్రమించి యెవరేమి చేయగలరు?

అన్నం పుంసాఽశితం త్రేధా జాయతే జఠరాగ్నినా।
మలం స్థవిష్ఠో భాగస్స్యాన్మధ్యమో మాంసతాం వ్రజేత్॥
మనః కనిష్ఠో భాగస్స్యాత్తస్మాదన్నమయం మనః॥

ప్రాణులు భుజించు ఆహారము స్థూలము, మధ్యమము, కనిష్ఠము (సూక్ష్మము) అని మూడుభేదములుగ మారును. స్థూలభాగము మలమూత్రములుగను, సారమగు మధ్యభాగము రక్తాది సప్తధాతువులుగను, సూక్ష్మాంశము మనోబుద్ధ్యాదులుగను మారు

చుండును, అని ఆయుర్వేదమగు సుశ్రుతమున తెలుపబడినది. ఈ యాహారవిషయమై సాత్త్విక, రాజస, తామసభేదములను గీత 17_వ అధ్యాయమున శ్రీకృష్ణభగవానులుపదేశించియున్నారు. అచ్చోట దీనిని చూడఁదగును.

అన్నదోషేణ చిత్తస్య కాలుష్యం సర్వదా భవేత్ ।
కలుషీకృతచిత్తానాం ధర్మస్సమ్యఙ్న భాసతే ॥

అన్నదోషముచేత చిత్తమునకు కాలుష్యము గలుగును. కల్మషమైన జలములో సూర్యప్రతిబింబము కనుబడనట్లు మలిన హృదయమున బోధము లెస్సగ ప్రకాశింపజాలదు. మఱియు శ్రుతి— 'ఆహారశుద్ధౌ సత్త్వశుద్ధిః, సత్త్వశుద్ధౌ ధ్రువాస్మృతిః, స్మృతిలాభే సర్వగ్రన్థీనాం విప్రమోక్షః' — అనగా శుద్ధమైన ఆహారముచేత అంతఃకరణము శుద్ధమగును. అంతఃకరణము శుద్ధమగుటవలన శ్రేష్ఠమైనదియు, దృఢమైనదియునగు ప్రజ్ఞ కలుగును. అట్టి శ్రేష్ఠమగు వివేకలాభముచే హృదయగ్రంథులన్నియు వీడిపోవును. హృదయగ్రంథులు వీడుటవలన జీవులకు ముక్తికలుగును.

69. ప్ర:—ఈ బ్రహ్మవిద్య యుపదేశించుటకు అధికారిత్వ, అనధికారిత్వము లేవైనగలవా?

ఉ:—బ్రహ్మవిద్య యొక్కదానికేమాత్రముగాదు, ప్రపంచములోగల సమస్తకార్యములకును అర్హత, తనర్హతలు గలిగియున్నవి.

యాదృశ్నరం చ సేవేత తాదృశం ఫలమశ్నుతే ।
మహతస్సేవయోచ్చత్వం క్షుద్రస్య క్షుద్రతాం తథా ॥
సింహస్య మందిరే సేవా ముక్తాఫలకరీ మతా ।
శృగాలమందిరే సేవా త్వస్థిలాభకరీ స్మృతా ॥

ఎట్టిస్వభావముగల మనుజుని సేవింతురో, దాని కనుగుణ్యమగు ఫలమే గలుగును. మహాత్ముల సేవవల్ల ఉచ్చస్థానమున్ను, నీచులసేవవల్ల నీచస్థానమున్ను సిద్ధించును. సింహముయొక్క నివాసస్థానసేవవల్ల ముత్యములు దొఱకును. నక్కల నివాసస్థలసేవవల్ల చనిపోయిన జంతువుల అస్థులే లభించును. అనగా కొన్ని శ్రేష్ఠములైన యేనుగుల కుంభస్థలములందు ముత్యములుండును. వాటినే గజముత్య

ములందురు. సింహము గొప్పగొప్ప గజముల మస్తకములను భేదించుటవలన అవి ఆప్రదేశములో రాలియుండును.

అభక్తాయ న దాతవ్యో మూర్ఖాయ విషయైషిణే।
దత్తేఽపి ఫలతో న స్యాత్ షండాయ వనితా యథా॥

భక్తిలేనివానికి, మూర్ఖస్వభావము గలవానికి, విషయలోలునకు పవిత్రమగు బ్రహ్మవిద్యను చెప్పరాదు. చెప్పినను ప్రయోజనముండదు. ఏలాగున నపుంసకునకు కన్యాదానము చేయరో, ఇదిన్ని అటువంటిదే.

శ్రద్ధధానాయ దాతవ్యం భక్తియుక్తాయ ధీమతే।
అనాస్తికాయ శుద్ధాయ ధర్మనిత్యాయ భామిని॥

ఈ వాక్యము నీశ్వరుడు పార్వతీదేవికి యుపదేశించెను. ఈ బ్రహ్మవిద్య మంచి శ్రద్ధగలవానికిని, భక్తితోగూడినవానికిని; స్వచ్ఛమైన బుద్ధిగలవానికిని, ఆస్తికునకును, శుద్ధమైన ఆచారముగలవానికిని, నిత్యము ధర్మమందు ప్రవృత్తి గలవానికిమాత్రమే యుపదేశింపదగును.

యస్య నాస్తి వివేకస్తు కేవలం యో బహుశ్రుతః।
స న జానాతి శాస్త్రార్థాన్ దర్వీ పాకరసానివ॥

ఎవనికి ఆత్మానాత్మ వివేకమున్ను, జ్ఞానాజ్ఞాన పుణ్యాపాపముల వివేచనయు లేకయుండునో, అట్టివాడనేక శాస్త్రములు చదివినవాడైనను, శాస్త్రసారమెఱుంగనివాడగుటవలన, అనేక రసయుక్త పదార్థములలో దిరుగు గరిటె వాటి రుచినెట్లు తెలిసికొనజాలకుండునో, అట్లాతడున్ను అట్టి గరిటతో సమానుడేయగును.

అంతస్తిమిరనాశాయ శాబ్దబోధో నిరర్థకమ్।
న నశ్యతి తమో నామ కృతయా దీపవార్తయా॥

ఏలాగున గృహాంతరాళమున రాత్రికాలములో చీకటి నిబిడముగా నున్నప్పుడు దీపముయొక్క వార్తవల్ల ఆ తమస్సు నశింపకయుండునో, ఆలాగున అంతరంగానుష్ఠానము లేనివానికి శాస్త్రబోధకములగు శబ్దములన్నియును నిరర్థకములగును. ఈ విషయమై యిదివఱలో అనేక గ్రంథములలో వ్రాసియుండుటచే యిప్పుడు దీనిని విస్తరింప

బూనలేదు. ముముక్షువులు శ్రద్ధాభక్తిగలిగి కాలము వ్యర్థపఱుపక తమ యజ్ఞానము నశించువఱకు ధ్యాననిష్ఠాపరులై యుండవలెను.

ఇహైవ నరకవ్యాధేశ్చికిత్సాం న కరోతి యః।
గత్వా నిరౌషధం దేశం వ్యాధిస్థః కిం కరిష్యతి॥

ఇచటనే సంసారవ్యాధికి చికిత్స యెవఁడొనర్పక యుండునో, అట్టివాఁడు సంసారవ్యాధి కౌషధము లభింపని పరలోకములకుఁ బోయి తద్రోగనివారణ మెట్లొనర్పఁగలఁడు?

ఆసుప్తేరామృతేః కాలం నయేద్వేదాన్తచిన్తయా।
దద్యాన్నావసరం కించిత్కామాదీనాం మనాగపి॥

మేల్కొన్నప్పటినుండి నిద్రించువఱకు, మరణకాలము వఱకును నిరంతరము వేదాన్తచింతనమందే కాలము గడుపవలెను. మఱియు కామాది దోషముల కేమాత్రమున్ను అవసరమీయక యుండవలెను.

హసతా క్రియతే కర్మ రుదతా పరిభుజ్యతే।
దుఃఖదాతా న కోఽప్యస్తి సుఖదాతా న కశ్చన॥
స్వకర్మణా భవేద్దుఃఖం సుఖం తేనైవ కర్మణా।
తస్మాచ్చ పూజ్యతే కర్మ సర్వం కర్మణి సంస్థితమ్॥

జనులు, మాయామోహముచే నవ్వుచు దుష్కర్మల నాచరింతురు. ఏడ్చుచు వాటిఫలము లనుభవింతురు. దుఃఖమును కలుగజేయునదిగాని, సుఖమును కలుగజేయునదిగాని, తన కర్మము తప్ప మఱియొకటిలేదు. సుకృతముచే సుఖమున్ను, దుష్కృతముచే దుఃఖమున్ను జీవునకు కలుగుచుండును. తానుచేసెడు సుకృత దుష్కృతముల ఫలమే తనకు లభించుచుండును. అందువలన కర్మమునకే పూజ్యత గలుగుచున్నది. సమస్తము కర్మపైననే యాధారపడియున్నది.

సుజనానాం స్వభావోఽయం ప్రాణాన్తేఽపి సుశోభనః।
ధర్మం త్యజన్తి నైవాత్ర సత్యం సఫలభాజనమ్॥
మహతాం చ స్వభావో హి పరేషాం హితమావహేత్।
సువర్ణం చన్దనం చేక్షురసస్తత్ర నిదర్శనమ్॥

సజ్జనులయొక్క స్వభావము ప్రాణాంతము వఱకున్ను ప్రకాశించుచునే యుండును. వారెప్పుడున్ను ధర్మమును త్యజింపక యుందురు.

సత్యము సఫలతను గలుగజేయును. మహాత్ముల స్వభావము పరప్రాణులకు హితమును గలుగజేయుటయే. సువర్ణమును, శ్రీగంధమును, చెఱకును క్రమముగ వాటియొక్క ప్రకాశ, సుగంధ, రసముల నేలాగున యెంత బాధించినను విడుచుటలేదో, ఆలాగున సుజనులున్ను యెంతబాధగల్గినను తమ శుద్ధమగు స్వభావమును మానుటలేదు. అందులకు పై సువర్ణము, చందనము, చెఱకుగడలే దృష్టాంతములు.

ఉత్తమానాం స్వభావోఽయం పరదుఃఖాఽసహిష్ణుతా ।
స్వయం దుఃఖం చ సంప్రాప్తం మన్యతేఽన్యస్య వార్యతే ॥

ఉత్తములయొక్క స్వభావము పరులదుఃఖమునుచూచి సహింపజాలకుండుటయే; స్వయముగ దుఃఖము ననుభవించినయైనను అట్టివారితరుల దుఃఖమును నివారించుటకు యత్నించుచుందురు.

దేశేఽస్మిన్ భారతే వర్షే ప్రాప్య మానుష్యమధ్రువమ్ ।
న కుర్యాదాత్మనశ్శ్రేయస్తేనాత్మా ఖలు వంచితః ॥

పుణ్యభూమియగు యీ భారతదేశమున అతిసుకృతవిశేషముచే లభింపదగిన మానవజన్మనుబొందియు, అది క్షణభంగురమని తెలిసికొనియు, యెవడు తన ఆత్మ శ్రేయస్సుకొఱకు యత్నింపడో, ఆతడు నిశ్చయముగ తన యాత్మను వంచించినవాడే యగును.

ప్రథమస్త్వజపాయోగో నాదే వాయోర్లయస్తథా ।
సుస్థిరస్సతతం పశ్చాద్వృత్తిశూన్యం చతుర్థకమ్ ॥

ధ్యానయోగమందు నాల్గవస్థలు గలవు. (1) అజపాయోగము. (2) నాదమందు ప్రాణలయము (3) నిశ్చలత్వము (4) ఎల్లప్పుడున్ను వృత్తిశూన్యమైన యవస్థ.

సమాధినా నయేత్కాలం వృథా చిన్తాం వివర్జయేత్ ।
ధ్యానేన విలయం యాన్తి పాపాని బహుజన్మనామ్ ॥

నిరంతరము సమాధ్యభ్యాసములో కాలము గడుపవలెను. వ్యర్థమైన చింతల కనకాశమీయకూడదు. అనేకజన్మలలో చేసిన పాపములుండినను, ధ్యానముచే అవన్నియు నశించును. మోక్షమున్ను గలుగును.

70. ప్ర:—జీవన్ముక్తిపొందినవానికిక చేయవలసిన కృత్యము లేవియు మిగిలియుండవుగదా. ఆ పుణ్యాత్ముడు కృతకృత్యుడుగదా. కృతకృత్యుడని చెప్పుటవలననే, చేయవలసిన కృత్యములన్నింటిని పూర్తిచేసినవాడని యర్థమగుచున్నది. కృతకృత్యతవలననే కృతార్థత కలుగును. అట్టి జీవన్ముక్తునకింకను చేయవలసిన కార్యముండునని చెప్పిన, యికను యాతడు విధికి లోబడియుండినట్లే అర్థమగుచున్నది. కావున ఈ విషయమై తమయాశయమును స్పష్టముగ నెఱుంగగోరుచున్నాను.

ఉ:—జీవన్ముక్తుడు చేయవలసినదేదియు లేదు. కృతకృత్యత్వము గలుగునపుడే సమస్తము చేసినవాడాయగుచున్నాడు. అయినను అనాదిగ పరబ్రహ్మమునుండి నేటివఱకెడతెగక గురుపరంపరామార్గముగ వచ్చుచుండెడు జ్ఞానప్రవాహమున కడ్డుగలుగనీయక ప్రపంచములోనికి అట్టి దివ్యామృతమును ప్రవహింపజేయవలసిన భారమొకటి గలదు. కాని అట్లు చేయవలెననిమాత్రము శ్రుతి శాసింపదు. ఎందుకనగా ముక్తుడైనపుడే జీవుడు సమస్త బంధనములనుండి విమోచనము నొందినాడు. ఐనను తనయొక్క కృతజ్ఞతను తెలుపుటకొఱకున్ను, లోకములోని ప్రాణికోట్లు తరించుటకున్ను అట్టి పవిత్రమగు ధర్మమొకటి నిర్వహించిన బాగుండును. నిర్వహించవలెననిమాత్రము చెప్పరాదు. అట్లైన, అది విధికి లోబడిపోవును. 'నిస్త్రైగుణ్యే పథి విచరతాం కో విధిః కో నిషేధః' — త్రిగుణాతీతమగు బ్రహ్మమార్గమున విహరించెడు జీవన్ముక్తునకిక చేయవలసిన కర్మలు లేవు. ఐనను సూర్యుడు ప్రకాశమును గలుగజేయుట, చంద్రుడు శీతలత్వమును గలుగజేయుట, మేఘము వర్షించుట, వాయువు ప్రాణశక్తిని గల్గించుట యను స్వభావమెట్లు గల్గియుండునో, ఆలాగున మహాత్ములున్ను లోకమునకు దివ్యజ్ఞానమను ప్రకాశమును గలుగజేయుచునే యుందురు. ఇదియే వారిస్వభావము. "మహాతాం చ స్వభావోఽయం కల్పవృక్షసమో మతః" — మహనీయుల స్వభావము కల్పవృక్షము వలెనుండును. కల్పవృక్షమువద్దకు వెళ్లినవారి కోరిక లన్నింటి నది సఫలీకృతమొనర్చునట్లు, మహనీయులున్ను ఆలాగుననే యుందురు,

ఉత్తమానాం స్వభావోఽయం యద్దీనపరిపాలనమ్ ।
లఘుత్వం చ మహత్వం చ నాత్ర కార్యా విచారణా॥

ఉత్తములయొక్క స్వభావము దీనులను పాలించుటయే యగును. ఆవిషయములో వీడు చిన్నవాడు, వీడు గొప్పవాడను భావము వారికి గల్గియుండదు.

సమాధిమథ కర్మాణి మా కరోతు కరోతు వా ।
హృదయే నాస్తి సర్వాస్థా ముక్త ఏవోత్తమాశయః ॥

జీవన్ముక్త స్థితి గలిగినపిమ్మట నిరంతరము సమాధినిష్ఠలో నుండిననుసరి, లేక పరప్రాణుల కుపకారము, చేయుచుండిననుసరి హృదయమందు యేలాటిభావములున్ను, వాసనలున్ను లేనందుచే వారు సర్వదా ముక్తులే యగుదురు. ఇదే యుత్తమాశయము.

అకుర్వన్నపి సంక్షోభాద్వ్యగ్రః సర్వత్ర మూఢధీః ।
కుర్వన్నపి తు కృత్యాని కుశలో హి నిరాకులః ॥

ఆత్మబోధము చక్కగ గలుగక ఆవరణబుద్ధితో గూడియున్న వాడు యెల్లప్పుడున్ను కర్మము చేయకయుండినను, మానసికక్షోభముచే వ్యాకులత్వమునే పొందుచుండును. జ్ఞానమందారితేరిన కుశలుడు యింద్రియములచే లోకహితకృత్యములను సర్వదా చేయుచుండినను ఆవరణ నశించిన ప్రబోధజ్ఞానముగలవాడైనందుచేత వానికేలాటి వ్యాకులత గలుగకయుండును. ఆతడు నిర్మలాకాశమునగల సూర్యునివలె ప్రకాశించుచుండును.

నివృత్తిరపి మూఢస్య ప్రవృత్తిరుపజాయతే ।
ప్రవృత్తిరపి ధీరస్య నివృత్తిఫలభాగినీ ॥

మూఢబుద్ధిగలవాడు యే ప్రవృత్తి చేయకున్నను, అతని మనస్సెల్లపుడున్ను ప్రపంచములో ప్రవర్తించుచునే యుండును. ఆత్మసాక్షాత్కారజ్ఞానముగల ధీరుని యింద్రియములు సత్కర్మలలో ప్రవర్తించుచుండినను అవి నివృత్తిఫలమునే గలుగజేయుచుండును. ఏలన అగ్నిలో దహించిన బీజమువలె వానిసంస్కారములు, వాసనలు, వృత్తులు పూర్వమే నశించిపోయినందుచే వాటికి పునరావృత్తిగలుగదు.

యస్త్వాత్మరతిరేవ స్యాదాత్మతృప్తశ్చ మానవః।
ఆత్మన్యేవ చ సన్తుష్టస్తస్య కార్యం న విద్యతే॥ (భగవద్గీత)

ఎవఁడు నిరంతరము ఆత్మారాముఁడై, ఆత్మతృప్తుఁడై. ఆత్మయందే సంతుష్టి గలిగియుండునో, వానికిక నాచరింపవలసిన కార్యమెద్దియును లేదు. ఐనను లోకహితార్థమట్లాచరించుటయే యుక్తము. ఈవిషయమై సూతసంహితయందిట్లు చెప్పబడినది.

స్థాపయధ్వమిమం మార్గం ప్రయత్నేనాపి హే ద్విజాః।
స్థాపితే వైదికే మార్గే సకలం సుస్థితం భవేత్॥

ఓ ద్విజులారా! ఈవేదమార్గమైన జ్ఞానమును ప్రయత్నముచేనైన లోకమున స్థాపింపవలయు. అట్లు వేదమార్గమైన జ్ఞానము స్థాపింపబడెనేని సమస్తము సుస్థితమైయుండును.

యో హి స్థాపయితుం శక్తో న కుర్యాన్మోహితో నరః।
తస్య హన్తా స పాపీ స్యాదితి వేదాన్తనిశ్చయః॥

ఇట్టివేదమార్గమైన జ్ఞానమును ప్రపంచమున స్థాపింపశక్తిగలిగి యుండియు, యెవఁడు మోహవశమున యట్లొనర్పకుండునో, అట్టివాఁడా వేదమార్గమైన జ్ఞానమును నశింపజేసినవాఁడగును. మఱియు నాతఁడు పాపియునగునని వేదాన్తసమ్మతమైయున్నది.

యస్థాపయితుముద్యుక్తః శ్రద్ధయైవాఽమోఽపి సన్।
సర్వపాపవినిర్ముక్తస్సాక్షాజ్జ్ఞానమవాప్నుయాత్॥

శక్తిమంతుఁడు గాకున్నను యెవఁడీ వేదమార్గమైన జ్ఞానమును శ్రద్ధతో లోకమున స్థాపింప నుద్యుక్తుఁడగునో, అతఁడు సర్వపాపముల నుండి విడివడి సాక్షాత్కారజ్ఞానమును పొందును.

యశ్చ విద్యాభిమానేన వేదమార్గప్రవర్తకమ్।
ఛలజాత్యాదిభిర్జియాత్స మహాపాతకీ భవేత్॥

ఎవఁడు విద్యాభిమానముచేతను, కపట జాత్యాభిమానముల చేతను వేదమార్గమైన జ్ఞానమును ప్రవర్తింపజేయువానిని మోసకృత్యముచే జయింపఁజూచునో, ఆతఁడు మహాపాపియే యగును.

71. ప్ర:—ఆనందములన్నిటిలో బ్రహ్మానందమతిముఖ్యమనియు, అందువల్ల అన్నియానందములలో నది గొప్పదనియు తెలియవచ్చు

చున్నది, పండితులేగాక పామరులుసహా యేదైన ఒక్క విషయానందము చెప్పినపుడు — యేమి! — ఇది బ్రహ్మానందమా? అని యడుగుదురు. కావున దీనికింతమహిమగలుగుటకు కారణమేమి?

ఉ:—అన్ని ఆనందములకన్న గొప్పదగుటచేతనే దీనికిట్టిపేరు గలిగినది. అందువల్ల చక్రవర్తులేగాక, దేవేంద్రుడుకూడ తన యానందమును తుచ్ఛముగా తలంచుటకును, బ్రహ్మానందమును పొందుటకును కారణమగుచున్నది. ఇంద్రుడేమి! చతుర్ముఖబ్రహ్మసహితము తన యానందమును అతినీచమని తలంచి బ్రహ్మానందమును కోరుటకు కారణమగుచున్నది. ఈ చెప్పినవారి యానందమునకు పరిమితి గలదు. అందువల్లనే దానికి యాద్యంతము గలుగుటకు కారణమగుచున్నది. కావుననే గీతలో అ॥ 5—22, 23 వ శ్లోకములచే దృశ్యసుఖమెంత గొప్పదైనను నాశముగలదనియు, అందువల్ల బుద్ధిమంతులు యపేక్షింపందగినది కాదనియు చెప్పుటకు కారణము. ఏలన తెలివిగలవారుచేయు కార్యము శాశ్వతముగ నుండును. అట్లు శాశ్వతముకాని పనిని బుద్ధిమంతులు చేయరు.

శ్లో॥ బాహ్యస్పర్శేష్వసక్తాత్మా విన్దత్యాత్మని యత్సుఖమ్।
స బ్రహ్మయోగయుక్తాత్మా సుఖమక్షయమశ్నుతే॥

ఆత్మకంటె ఇతరములగు బాహ్యవస్తువులయందాసక్తిని విడిచినవాడు ఆత్మయందు నిత్యసుఖమును బొందుచున్నాడు. అతడు బ్రహ్మనుసంధానముతో గూడినవాడగుచు శాశ్వతసుఖమును బొందును.

శ్లో॥ యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే।
ఆద్యన్తవంతః కౌన్తేయ న తేషు రమతే బుధః॥

తా॥ విషయేంద్రియసంయోగమువలన బుట్టిన భోగములు ఆద్యంతములుకలసిగావున యవి దుఃఖకారణములే. అందువలన శుద్ధబుద్ధికలవాడు వాటియందాశ యుంచడు. ఇక ఈవిషయమున ఆనందముయొక్క తారతమ్యముగురించి బృహదారణ్యక, తైత్తిరీయాదిశ్రుతులందు తెలుపబడినది చూడుడు—

మూ॥ 'సైషా౽౽నన్దస్య మీమాంసా భవతి। యువాస్యా త్సాధు యువాధ్యాయకః। ఆశిష్ఠో ద్రఢిష్ఠో బలిష్ఠః। తస్యేయం పృథివీ సర్వా విత్తస్య పూర్ణా స్యాత్। స ఏకో మానుష ఆనన్దః। తేయే శతం మానుషా ఆనన్దాః। స ఏకో మనుష్యగన్ధర్వాణామానన్దః। శ్రోత్రియస్య చాకామహతస్య। తే యేశతం మనుష్యగన్ధర్వాణామానన్దాః। స ఏకో దేవగన్ధర్వాణామానన్దః। శ్రోత్రియస్య చాకామహతస్య। తే యే శతం దేవగన్ధర్వాణామానన్దాః। స ఏకః పితౄణాం చిరలోకానామానన్దః। శ్రోత్రియస్య చాకామహతస్య। తే యే శతం పితౄణాం లోకలోకానామానన్దాః। స ఏక ఆజానజానాం దేవానామానన్దః। శ్రోతియస్య చాకామహతస్య। తే యే శత మాజానజానాం దేవానామానన్దాః। స ఏకః కర్మదేవానాం దేవానామానన్దః। యే కర్మణా దేవానపి యన్తి। శ్రోత్రియస్య చాకామహతస్య। తే యే శతం కర్మదేవానాం దేవానామానన్దాః। స ఏకో దేవానామానన్దః। శ్రోత్రియస్య చాకామహతస్య। తే యే శతం దేవానామానన్దాః। స ఏక ఇన్ద్రస్యానన్దః। శ్రోత్రియస్య చాకామహతస్య। తే యే శత మిన్ద్రస్యానన్దాః। స ఏకో బృహస్పతేరానన్దః। శ్రోత్రియస్య చాకామహతస్య। తే యే శతం బృహస్పతేరానన్దాః। స ఏకః ప్రజాపతేరానన్దః। శ్రోత్రియస్య చాకామహతస్య। తే యే శతం ప్రజాపతేరానన్దాః। స ఏకో బ్రహ్మణ ఆనన్దః। శ్రోత్రియస్య చాకామహతస్య। స యశ్చాయం పురుషే॥'

తా॥ ఇట, ఆనందముయొక్క మీమాంసయొనర్పబడుచున్నది. యౌవనము, సాధుత్వము, వేదాధ్యయనము, పరిజనము, శరీర దార్ఢ్యము, ధైర్యము, బలము, భూమినంతటిని నేలుశక్తి, సంపూర్ణ ధనము, అనునీమొదలగు గుణములు గల యొక మనుష్యుని ఆనందము మనుష్యానందమని చెప్పబడును. ఇట్టి ఆనందమునకు నూఱింతలుగలది మనుష్యగంధర్వానందము. దానికి నూఱింతలు గొప్పది దేవగంధర్వానందము. చాలకాలము పితృలోకమునందుండు పితృదేవతల ఆనందము ఆ యానందముకంటె నూఱురెట్లధికమైనది. ఆజానదేవతల ఆనందము అంతకంటె నూఱింతలధికము. కర్మదేవతల యానందము దానికంటె

నూఱుపాళ్లధికము. దేవతల కధిపతియైన దేవేంద్రుని యానందము దానికంటె నూఱురెట్లధికము. ఆ దేవేంద్రానందముకంటె బృహస్పతి యానందము నూఱురెట్లు మిన్న. నూఱు బృహస్పతి యానందములు ఒక ప్రజాపతి యానందమునకు సమానము. అట్టి ప్రజాపతి యానందము బ్రహ్మానందసాగరములో నొక లవలేశమే యగును.

న సుఖం న సురేన్ద్రస్య న సుఖం చక్రవర్తినాం।
యత్సుఖం వీతరాగస్య మునేరేకాంతవాసినః॥

ఏకాంతవాసియై, విషయ విరక్తుడై, బ్రహ్మచింతన చేయువాడు ఏ బ్రహ్మానంద సుఖమును పొందుచుండునో, అట్టిదానిలో సహస్రాంశమైన దేవేంద్రునకుగాని, చక్రవర్తులకుగాని కలుగజాలదు.

రసం బ్రహ్మ పిబేద్యశ్చ తృప్తో యః పరమాత్మని।
ఇంద్రం చ మన్యతే రంకం నృపాణాం తత్ర కా కథా॥

ఎవడు బ్రహ్మానందామృత భరితుడై పరమాత్మ ధ్యానమందు తృప్తుడై యుండునో, అట్టి మహానుభావుడు దేవేంద్రునిగూడ అతిదీనునిగా తలంచును. అట్లుండగా చక్రవర్తులనుగూర్చి మరల చెప్పవలెనా? అని గురుగీతయందు శ్రీ ఈశ్వరుఁ డుపదేశించెను.

న సుఖం సార్వభౌమస్య విద్యతే న బిడౌజసః।
బ్రహ్మణో న సుఖం యత్స్యాత్ పుంసః కామవివర్జనాత్॥

తా॥ చక్రవర్తికిని, దేవేంద్రునకును, బ్రహ్మదేవునకునుగూడ గలుగని సుఖము సర్వకామనారహితుడగు నిష్కామునకు కలుగును.

72. ప్ర:— మతత్రయములోని అద్వైత మతమెట్టిది?

ఉ:— అద్వైతమతము ఉపనిషన్మతమనియు, వేదాంతమనియు పేర్లు గలిగియున్నది.

—:అద్వైత సిద్ధాంతము:—

సత్యమైన పదార్థంబొక్కటి. అది బ్రహ్మము. మిగిలిన పదార్థము మిథ్యాభూతము. మాయ బ్రహ్మకల్పితము. బ్రహ్మము మాయతోఁగలసి యొక ప్రధానపురుషుఁడగును. అగ్నినుండి నిప్పురవ్వలు బయలుదేరు చందమున బ్రహ్మమునుండి వివిధమైన చేతనాచేతన పదార్థములు పుట్టినవి.

వస్త్రమునందలి దారములు వస్త్రమునకు ముఖ్యకారణమై దానియం దుండునట్లు— బాహ్యమైన ఆ బ్రహ్మము సమస్తమునకు ముఖ్య కారణమై సమస్తమునందున్నది. మానవ హృదయమునందును మాయ నివసించియున్నది. పరమపురుషునియందుండు మాయ సత్త్వ గుణమునే కలిగియుండి 'మాయ, అవిద్య' అనబడుచున్నది. జీవుడు అవిద్యతో గలిసియుండువఱకు సత్త్వపదార్థమునకును, తాను చూచునట్టి యితరమైన సకలపదార్థములకును తాను భిన్నమని భావించును. అవిద్య జ్ఞానముచే నశించును. జ్ఞానమువలన పాపకృత్యములు చేయకుండుట, సత్కర్మల నాచరించుట మొదలుగాగల కృత్యములు లభించును. అవిద్య నశించినచో జీవునకు బ్రహ్మైక్యముకలుగును. ఇదియే మోక్షము. మాయ ననుసరించి యుండువఱకు తనకు దృశ్యమగు పదార్థము సత్య మని తలంచియుండును. ఇట్లు అవిద్యచేత భ్రమించుచుండుటయే సంసారమనంబడును. తత్త్వమసీత్యాది వాక్యజన్య జ్ఞానంబువలన అవిద్య నివర్తించును. ఇదియే మోక్షము. మఱియు నీ యద్వైతమతమునందు ప్రతిబింబవాదము, అవచ్ఛేదవాదము అని రెండువిధములగు వాదములు గలవు. ప్రతిబింబవాదమనగా — పరబ్రహ్మము అంతఃకరణమున (అద్దములో మన ముఖము ప్రతిఫలించునట్లు) ప్రతిఫలించును. ఇట్టి ప్రతిబింబములే జీవులు. అవచ్ఛేదవాదమనగా — ఆకాశము సర్వత్ర ఏకరీతియే యైనను, యింటియందున్న ఆకాశమును మఠాకాశ మనియును, కుండయందు నిండియున్న ఆకాశమును ఘటాకాశమనియును వ్యవహరించునట్లు, తమ యంతఃకరణములో నిమిడియుండు బ్రహ్మము జీవుడనబడును. అనేక జీవవాదమనగా — ఒక్కొక్క శరీరమున కొక్కొక జీవుడుకలడు. ఇప్పటికి కొందఱు ముక్తులైరి, ఇంకను కొందఱు ముక్తులగుదురు. ఈ యద్వైతసిద్ధాంతమును సక్రమముగను, విశేషము గను గ్రంథాంతరముచే తెలియందగును. ఈ అద్వైతస్థాపకులగు శ్రీ శంకరభగవత్పాదులే శైవ, వైష్ణవాది షణ్మతముల నంగీకరించి యున్నారు. కావున వైష్ణవులవలె విష్ణుభక్తియు దీనియందు కలిగి యున్నది. ఆలాగున యోగ, సాంఖ్యములున్ను యంగీకరింపబడినవి. ఇవన్నియు బ్రహ్మసాక్షాత్కార జ్ఞానమునకు సోపానములుగా నిశ్చ

యించుకొనిరి. ఇట్లు అద్వైతమతముయొక్క సంగ్రహము దీనియందు నిరూపించబడినది.

78. ప్ర:— విశిష్టాద్వైతమతముయొక్క సారమేమి? అది యేమి తత్త్వము నుపదేశించును?

ఉ:— ఈ మతముయొక్క సారమీక్రింద తెలుపబడుచున్నది. దానివల్ల యీ మతరహస్యమెఱుంగదగును,

## —:విశిష్టాద్వైతసిద్ధాంతము:—

ఆత్మ, ప్రకృతి, భగవంతుడు అని మూడుపదార్థములు కలవు. ఆత్మయందును, ప్రకృతియందును నివసించియుండెడి పరమాత్మ భగవంతుడు. సృష్టికిపూర్వము అనంతములైన ఆత్మలును, ప్రకృతియును నామముచేగాని, రూపముచేతగాని విభజింప శక్యములుగానివై అగోచరములై యుండినవి. ఆత్మను, ప్రకృతిని గోచరముగా చేయుటయే సృష్టియనంబడును. ఈ సృష్టియంతమున అవి తమ పూర్వస్థితిని బొందును. ఆత్మ, పరమాత్మకంటె భిన్నమైనది. దానికి పుట్టుకలేదు. పుట్టుకలేనందున, చావున్ను లేదు. శరీరము నశించినపుడది నశింపదు. అది అణుప్రాయమైనప్పటికిని అనంతముగా నుండగలదు. ఆత్మ అంతములేని నిర్మలజ్ఞానమును గలిగియున్నను, అనాదిగా మాయచేత గప్పబడియున్నది. కర్మముల తారతమ్యమునుబట్టి అజ్ఞానము వృద్ధియైనను, క్షయమైనను పొందుచుండును. ఈ లోకమునందును, పరలోకమునందును తన పుణ్యపాపకర్మలకుం దగినట్టి సుఖదుఃఖముల ననుభవించినపిమ్మట దానికి భగవద్జ్ఞానముగాని, లేక వైకుంఠప్రాప్తిగాని కలుగును. వైకుంఠమునకు బోయిన ఆత్మ యెన్నటికిని తిరిగిరాదు. అచ్చటనే ఈశ్వరునివంటి శరీరమును కలిగియుండి భగవత్సేవచేయుటచే గలుగు సుఖము ననుభవించుచుండును. ఇట్టి ఈశ్వరునికి పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చలను అయిదురూపములు గలవు. పరమనగా — కాలకృతపరిణామములేని నిత్యవిభూతియందు నిత్యానుకూలచిత్త జ్ఞానులైన అనంత, గరుడ, విష్వక్సేనాదుల కనుభవ

విషయభూతమైయుండెడు రూపము. వ్యూహమనగా — లీలావిభూతి యొక్క సృష్టిస్థితిసంహారములను నిర్వహించుటకును, బుభుక్షువులగు సంసారుల రక్షించుటకును, ముముక్షువులగు ఉపాసకుల ననుగ్రహించుటకున్ను పరిగ్రహించిన సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధరూపములు. విభవమనగా — రామకృష్ణాద్యవతారములు. అంతర్యామియనగా — 'పద్మకోశప్రతీకాశం హృదయం చాప్యధోముఖమ్' అనునట్లు శుభాశ్రయమైన విగ్రహముతోడ బాహ్యవిషయప్రవణులైన చేతనులకు ధ్యానరుచి గలిగినపుడు ధ్యేయమై, బుద్ధ్యాదులకు నియామకుండై, హృదయకమలమునందు వాసముచేయు రూపము. అర్చయనగా — ఆశ్రితుల కభిమతములైన ద్రవ్యములయందు ఆవిర్భవించియుండునట్టి స్థితి. ఇట్టి అర్చారూపమైన ప్రతిమాదిపూజచేత, పురుషార్థమునకు ప్రతిబంధకమైన దురితము నివర్తించును. ఆతర్వాత విభవాదిపూజ చేయుటకు అధికారము కలుగును. ఈ ప్రకారమైన ఉపాసనచేయునట్టి విధము లేమనగా — అభిగమనమని, ఉపాదానమని, ఇజ్యయని, స్వాధ్యాయమని, యోగమని అయిదువిధములు. అభిగమనమనగా, దేవతాస్థానమార్గములలో సమ్మార్జనము మొదలైన కైంకర్యములు సేయుట. ఉపాదానమనగా చందనము, మాల్యము మొదలగు పూజాద్రవ్యములను సంపాదించుకొనుట; ఇజ్యయనగా దేవపూజ. స్వాధ్యాయమనగా అర్థానుసంధానపూర్వకమైన మంత్రజపమును, తత్త్వప్రతిపాదకమైన శాస్త్రమును అభ్యసించుట. యోగమనగా దేవతానుసంధానము. ఈ ప్రకారముగా ఉపాసనాకర్మసహితజ్ఞానముచేత ద్రష్టృదర్శనములు రెండును నశింపగా నా భగవద్భక్తునికి భక్తవత్సలుడైన పురుషోత్తముడు నిరవధికానందరూపమైనట్టియు, పునరావృత్తిలేనట్టియు, స్వపదమైన వైకుంఠము నిచ్చుచున్నాడని సిద్ధాంతము. విశిష్టాద్వైత సంస్కారపంచకము — శంఖచక్రములను తప్తముచేసి భుజములందు ధరించుట తాపము. శ్వేతమృత్తికతోను, శ్రీచూర్ణముతోను ద్వాదశోర్ధ్వపుండ్రములు ధరించుట పుండ్రము. విష్ణుసంబంధముగల రామకృష్ణాది నామములను ధరించుట నామము. అష్టాక్షరమంత్రమును స్మరించుట మంత్రము. భగవదారాధనమనెడి తిరువారాధనమే

యాగము. ఈ రెండును ముఖ్యముగా శ్రీ వైష్ణవులకు గలిగియుండ వలెను. వీరికి శ్రీ విష్ణువు పరమప్రాప్యము.

74. ప్రః—ద్వైతమతము దేనినుపదేశించుచున్నది? దానిసారమేమి?

ఉః— ద్వైతమతసిద్ధాంతము యీ క్రింద తెలిపెడుదానివల్ల తెలియందగును. ఆ మతముయొక్క సారము సంగ్రహముగ దీనియందు గనందగును.

ద్వైతసిద్ధాంతము—శ్రీ హరియే సర్వోత్తముడైన దేవుడు.

**జగము సత్యము.** జీవపరమాత్మలకు భేదముకలదు. ప్రాణిసమూహమంతయు తారతమ్యానుగుణముగా విష్ణువుయొక్క కింకరులు. స్వాత్మసుఖానుభవమే మోక్షము. నిర్మలమైన భగవద్భక్తియే మోక్ష మార్గోపాయము. ప్రత్యక్షాది ప్రమాణత్రయము ప్రమాణము. సమస్త వేదశాస్త్రైకసమధిగమ్యుడైన శ్రీహరియొక్కడే పరతత్వము, అని ముఖ్య సిద్ధాంతము. ద్వైతమతమునందు సమ్మతములైన తత్వంబులు స్వాతంత్ర మని, అస్వాతంత్రమని ఇఱు తెఱంగులు. స్వతంత్రుడెవడనగా, షడ్గుణైశ్వర్య సంపన్నుడయ్యు, అశేషసద్గుణముల కాటపట్టయినట్టి విష్ణుమూర్తి. అస్వతంత్రులు జీవులు. భగవత్సేవ యెట్టిదనగా—అంకమనియు, నామ కరణమనియు, భజనమనియు మూడు తెఱగులుగా నుండును. అంక మనగా — శ్రీమన్నారాయణమూర్తియొక్క ఆయుధములైన సుదర్శ నాదులచే అంకమును ధరించుట. నామకరణమనగా — పుత్రాదులకు భగవంతుని నామముంచుట. భజనమనగా—విష్ణునామధ్యానము మొద లగునవి. ఈ మతమందు జీవునికిని, ఈశ్వరునికిని పరస్పర భేదము గల దనియు, మోక్షానందమున తారతమ్యముగలదనియు, జీవులు పరతంత్రులై ఈశ్వరానుగ్రహమువలన ఈశ్వర సామీప్యస్థితులను జెందుదురనియును పడుచున్నది. కొన్ని యాత్మలకు సదా జననమరణములు గలవు. భగ వత్కృపవలన ఆత్మకు మోక్షము కలుగుచున్నది. ఆయనయొక్క సర్వోత్కృష్టతను గుర్తెఱింగినవానికి భగవత్కృప కలుగును. ఆత్మలలో కొన్ని మంచిస్వభావమున్ను, కొన్ని మిశ్రస్వభావమున్ను గలవిగానుండుట చేత, భగవద్జ్ఞానమును పొందుటకు అన్ని యాత్మలకును సాధ్యము

కాదు. మంచిఆత్మలు జ్ఞానమును పొంది భగవత్కృపను సంపాదించుకొనును. చెడు ఆత్మలు చెడుకార్యములుచేసి నరకమునకు పోవును. మిశ్రస్వభావముగల ఆత్మలు పుట్టుచు, చచ్చుచు నుండును. సామాన్యముగ ఈ మతము విశిష్టాద్వైతమతముయొక్క సంబంధము కలిగియుండును. వీరియందైదు భేదములు నిత్యములని చెప్పుదురు. (1) జీవజీవ భేదము, (2) జీవేశ్వర భేదము, (3) జీవజడభేదము, (4) జడజడభేదము, (5) జీవ, ఈశ్వర, జడ, పరమాత్మ భేదములను ఈ యైదు భేదములున్ను నిత్యములు. శైవమతము విశిష్టాద్వైతమతము ననుసరించి యుండును. పశుపాశపతి యనువానికి చిత్, అచిత్, విశిష్ట, ఈశ్వరుడు అనునవి పేర్లమార్పులే గాని వస్తుమార్పులేదు. వైష్ణవులు విష్ణుపరత్వముగాను, శైవులు శివపరత్వముగాను చెప్పుదురు. త్రిమతములు, శైవమతములు అన్నియు అనాదిగా నుంటున్నవి. ఐనను అద్వైతమునకు శంకరులున్ను, విశిష్టాద్వైతమునకు రామానుజులున్ను, ద్వైతమునకు మధ్వాచార్యులున్ను మతకర్తలైరి. వీరిలో మొదటివారు శంకరాచార్యులవారు. తరువాత యేర్పడినవారు రామానుజాచార్యులవారు. ఈవల యేర్పడినవారు మధ్వాచార్యులవారు.

75. ప్ర:— బ్రహ్మవిచారము చిరకాలము చేయుచుండినను, ప్రతిబంధత్రయముండిన, నిరావరణసూర్యునివలె జ్ఞానము ప్రకాశించుటకు అడ్డు గలుగుచున్నదని వినుచున్నాను. ఆ ప్రతిబంధత్రయమేది?

ఉ:— వర్తమాన ప్రతిబంధమనియు, భూతప్రతిబంధమనియు, భావి ప్రతిబంధమనియు ప్రతిబంధములు మూడుగలవు. అవి తొలగు వఱకు సూర్యునియెదుట మేఘముండిన, సూర్యబింబము యెట్లు చక్కగ ప్రకాశింపకుండునో, అలాగున జ్ఞానమున్ను ప్రకాశింపకుండును.

పునఃపునర్విచారేఽపి త్రివిధప్రతిబంధతః।
న వేత్తి తత్త్వమిత్యేతద్వార్తికే సమ్యగీరితమ్॥

బహుకాలము తత్త్వంపదార్థవిచారమును జేసినను, మూడు విధములుగా నుండెడి ప్రతిబంధమువలన పురుషుడు పరతత్త్వము నెఱుగడు, అనెడి ఈ యర్థము వార్తికకారులగు సురేశ్వరాచార్యుల చేత చక్కగా జెప్పబడినది. ఎట్లన —

భూతప్రతిబంధము:—

అనుసృత్య గురుస్నేహం మహిష్యాం తత్త్వముక్తవాన్।
తతో యథావద్వేదైష ప్రతిబంధస్య సంక్షయాత్॥

ఒకానొక యతి పూర్వము తన గృహస్థాశ్రమమునందు ఒక యెనుమునందు అతి స్నేహము గలిగియుండెను. దాని పాలచేతనే యాతడు జీవించుచుండెను. సంన్యాసస్వీకరణానంతరము వేదాంత శ్రవణమునందు ప్రవర్తించినవాడైనను, ఆ మహిషీ స్నేహముచేత గలిగిన ప్రతిబంధమువలన (ఆ యెనుము స్ఫురించుటచేత) పరతత్త్వము గురునిచే నుపదేశింపబడినను యాతడెఱుఁగనివాడాయెను. కనుక భూతప్రతిబంధమిట్టిదని తెలియవలెను. అపుడు అతనికి తత్త్వోపదేశము చేసెడిగురువు ఆ యెనుమును ఉపాధిగాగల బ్రహ్మమును వానికి చెప్పినవాడాయెను. అనంతరమందా యతి యెనుమునందలి స్నేహము లక్షణముగాగల ప్రతిబంధము క్షయించుటవలన శాస్త్రోక్త ప్రకారముగా గురునిచే నుపదేశింపబడిన తత్త్వము నెఱిగెను.

వర్తమాన ప్రతిబంధము:—

ప్రతిబంధో వర్తమానో విషయాసక్తిలక్షణః।
ప్రజ్ఞామాంద్యం కుతర్కశ్చ విపర్యయ దురాగ్రహః॥

వర్తమాన ప్రతిబంధము:— (1) విషయాసక్తిరూపము గలదగును. మఱియు, (2) బుద్ధిమాంద్యత్వంబును, (3) కుతర్కము చేయుటయు అనగా శుష్కతార్కికత్వముచేత శ్రుత్యర్థము నన్యవిధముగా నూహించుటయు (4) ఆత్మకు కర్తృత్వాది ధర్మయుక్తజ్ఞానలక్షణమందు యుక్తిరహిత నిశ్చయంబును, (5) మొండిపట్టు, ఈ యైదున్ను వర్తమాన ప్రతిబంధమని చెప్పబడును.

శమాద్యైశ్శ్రవణాద్యైశ్చ తత్రతత్రోచితైః క్షయమ్।
నీతేఽస్మిన్ ప్రతిబంధేఽతస్స్వస్య బ్రహ్మత్వమశ్నుతే॥

అయితే శమదమాదులచేతను, శ్రవణమనన నిదిధ్యాసనముల చేతను, ఆయాసాధనములందు యోగ్యములైన సాధనములచేతను ఈప్రతిబంధము నాశమును పొందుచుండగా, అట్టి ప్రతిబంధనాశమువలన ప్రత్యగాత్మయగు తాను బ్రహ్మత్వమును పొందుచున్నాడు.

భావిప్రతిబంధము:—

ఆగామిప్రతిబంధశ్చ వామదేవేన చేరితః।
ఏకేన జన్మనా క్షీణో భరతస్య త్రిజన్మభిః॥

భావిప్రతిబంధము, అనగా జన్మాంతర హేతువగు ప్రారబ్ధ విశేషము వామదేవునియందు చెప్పబడెను. ఆ భావిప్రతిబంధము వామదేవునకు ఒక్కజన్మచేతను, జడభరతునకు మూడుజన్మలచేతను నాశమును బొందెను.

76. ప్ర:— ప్రతిబంధత్రయమును గ్రహించడమైనది. ఇక వైరాగ్య బోధోపరతుల హేతు, స్వరూప, కార్యములను మూటిని విశదముగ తెలుపగోరుచున్నాను.

ఉ:— వైరాగ్య బోధోపరతులు మూడున్ను ముఖ్యముగ ముముక్షువులు గ్రహించుకొనవలసినవై యున్నవి. ఈ మూడును బాల్య, యౌవన, వార్ధక్యావస్థలవలెను, ఆది, మధ్య, అంతములవలెను క్రమముగ నుండును.

వైరాగ్యబోధోపరమాః సహాయాస్తే పరస్పరమ్।
ప్రాయేణ సహ వర్తన్తే వియుజ్యన్తే క్వచిత్క్వచిత్॥

వైరాగ్యబోధోపరతులు మూడును అన్యోన్యసహాయములుగా నుండును. ఈ మూడును సాధారణముగా ఒకనియందుగూడి వర్తించుచుండును. మఱియు ఈ మూటిలో నొకటియైనను, రెండైనను ఒకానొకనియందు లేకపోవుటయు గలదు.

హేతుస్వరూపకార్యాణి భిన్నాన్యేషామసంకరః।
యథావదవగంతవ్య శ్శాస్త్రార్థం ప్రవివిచ్యతా॥

ఈ మూటియొక్క హేతుస్స్వరూప కార్యములకు భేదముండుట వల్ల, ఆ మూటికిని భేదముగలదు. కనుక శాస్త్రార్థమును విమర్శించి, యెఱుంగదలంచినవాడు ఆ మూటియొక్క భేదమును వాస్తవముగా నెఱుగవలెను. వైరాగ్యముయొక్క హేతు, స్వరూప, కార్యములు—

దోషదృష్టిర్జిహాసా చ పునర్భోగేష్వదీనతా।
అసాధారణహేత్వాద్యా వైరాగ్యస్య త్రయోప్యమీ॥

విషయములందు దోషదృష్టియు, భోగములను విడచుటయు, మఱల భోగములుదయింపమియు, ఈ మూడును క్రమముగ వైరాగ్యముయొక్క అసాధారణ, హేతు, స్వరూప కార్యములగును.
బోధయొక్క హేతుస్వరూపకార్యములు —

శ్రవణాది త్రయం తద్వత్తత్త్వమిథ్యావివేచనమ్ ।
పునర్గ్రంథేరనుదయో బోధస్యైతే త్రయో మతాః ॥

వేదాంతశ్రవణమననినిదిధ్యాసనములు, కూటస్థాత్మయొక్కయు అహంకారాదులయొక్కయు వివేచనజ్ఞానమున్ను, మఱల హృదయ గ్రంథియొక్క ఉదయింపమియు, ఈ మూడును బోధ (తత్త్వజ్ఞానము) యొక్క హేతు, స్వరూప, కార్యములనఁబడును. ఉపరతియొక్క హేతు, స్వరూప, కార్యములు—

యమాది ధీనిరోధశ్చ వ్యవహారస్య సంక్షయః ।
స్యుర్హేత్వాద్యా ఉపరతేరిత్యసంకర ఈరితః ॥

యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధ్యానము, ధారణము, సమాధియను నీయెనిమిది అష్టాంగములనబడును. ఈయష్టాంగములు ఉపరతికి హేతువులగును. మఱియు చిత్తనిరోధలక్షణముగల యోగము ఉపరతియొక్క స్వరూపమగును. సర్వవ్యవహారసంక్షయము ఉపరతియొక్క కార్యమగును — అని శ్రీ విద్యారణ్యగురువులు పంచదశియందు దెల్పిరి.

పుంసః ప్రధానసిద్ధ్యర్థమంగస్యాశ్రయణం ధ్రువమ్ ।
కర్తవ్యమంగహీనం చేత్ప్రధానం నైవ సిద్ధ్యతి ॥

ప్రధానవస్తువు సిద్ధింపగోరునెడ దానియంగమును నిశ్చయముగా నాశ్రయింపవలయు. అంగము లోపించెనా ప్రధానము సిద్ధింపనేరదు.

77. ప్ర:—తల్లియు, తండ్రియు, దైవమున్నూ గురుస్వరూపమని శాస్త్రము చెప్పుచున్నది. బ్రహ్మచర్యవిషయమై నాకు చాల సందేహము కలదు. అది సాధారణజనులు నడుపగదగినదికాదు. కాని ముఖ్యముగా తెలిసికొనఁదగినదిగా యుంటున్నది. శాస్త్రములలో బ్రహ్మచర్య అష్టాంగలక్షణములున్ను, దానిచేఁగలిగెడు మహిమయున్ను, అది

లేనిచో సంభవించెడి విపత్తులున్ను అనేక గ్రంథములవల్ల తెలిసికొని యున్నాను. కాని ఆ బ్రహ్మచర్యమెట్లు సంరక్షించుకొనవలయునో ఆ విషయమై సామాన్య గ్రంథములలో ప్రత్యేకముగా నేమియు తెలుపబడియుండలేదు. కావున బ్రహ్మచర్యమును సంరక్షించువిషయమును ననుగ్రహించగోరుచున్నాను. ఇది నా కొక్కనికిమాత్రముకాదు, లోకమునకంతకును యుపయోగకరమైనది.

ఉ:—ఈ బ్రహ్మచర్యవిషయమై పద్మపురాణమున మానసాది తీర్థమహిమను వర్ణించెడిచోట ఈలాగున తెలుపడమైనది—

బ్రహ్మచర్యం ప్రవక్ష్యామి తీర్థం పరమపావనమ్ ।
తద్బ్రహ్మచర్యం పరమం సర్వకామైకసాధనమ్ ॥

తా॥ మిగుల పావనమగు బ్రహ్మచర్యమను తీర్థమును వివరించెదను. ఈ బ్రహ్మచర్యవ్రతము ఒక్కటియే సమస్తకోరికల నిచ్చుటకు సాధనమైన పవిత్రమగు వ్రతమని చెప్పబడెను. ఇది కల్ప వృక్షమువంటిది. అట్టిబ్రహ్మచర్యము మనస్సుయొక్క నిర్మలభావము చేతనే సాధింపనగును. అట్టి మనోనిర్మలత్వము లేనివానియొక్క వ్రతజప తీర్థస్నానాదులనుగుఱించి ఈ క్రిందివిధముగా వివరించడమైనది.

అనిష్కల్మషచిత్తస్య సర్వతీర్థేషు మజ్జనమ్ ।
నరస్యాంగారకస్యేవ సదా క్షీరాభిషేచనమ్ ॥

తా॥ కల్మషముగల మనస్సుతోఁగూడుకొన్నవానికి సమస్త తీర్థములందు స్నానము చేయుట బొగ్గును తెల్లగాజేయుటకై నిరంతరము పాలతో కడిగినట్టువలె నిరర్థకమగును.

ఈ బ్రహ్మచర్యవిషయమై ఇదివఱలో శుష్కవేదాంతతమోభాస్కరాది గ్రంథములందు తెలుసబడియేయున్నది. కావున ఆ ప్రమాణములెవ్వియు ఇచ్చుట నిరూపించుటలేదు. రసము తీయబడిన చెఱకు యెటువంటిదో, నవనీతము తీయబడిన క్షీరమెటువంటిదో, బ్రహ్మచర్యములేని జీవితమటువంటిదనియే ఋషులు చెప్పియున్నారు! దీనికన్న పరమప్రమాణము మఱియొకటి కావలయునా? తైలము నశించిన దీపమేలాగున ఆరిపోవునో. ఆయిల్ క్షయించిన ఇంజనేలాగున ఆగిపోవునో, ఆలాగున బ్రహ్మచర్యము క్షయించినవానిశరీరయంత్ర

మున్ను, విజ్ఞానమున్ను క్షయమునొందును. కావున ఈ బ్రహ్మచర్యమును ప్రాణసమానముగ సంరక్షించుకొనవలయును. ముఖ్యముగా మనశ్శుద్ధి బ్రహ్మచర్య సంరక్షణవిషయమై గలిగియుండవలయును. బ్రహ్మచర్య సంరక్షణవిషయమై కల్పములు, మూలికలు, రసాయనములు గలవని ఋషులు తెలిపియున్నారు. కాని వాటియొక్క ప్రయోగము తెలిసినవారిప్పుడరుదు. ఈ కాలమున అట్టి యోషధి ప్రయోగముతోనుండు యోగులుగాని, తాపసులుగాని కాన్పించుట లేదు. ఇపుడు లోకములోనుండు బ్రహ్మచర్యనిష్ఠ గలవారందఱున్ను మనోనిర్మల భావముగలవారై యుంటున్నారు. ఎన్ని కల్పములు సేవించినను మనశ్శుద్ధిలేనిచో నిగ్రహము కాజాలదు. కావున మనో నిర్మలత్వము కలిగియుండేలాగున చూచుకొనవలయును. మనస్సునకు మించిన కల్పము మఱియొకటిలేదు. కనుక మనోవికల్పము గలుగకుండునట్లు చూచుకొనవలయును.

78. ప్ర:— మనస్సు నిర్మలముగా యుండువారికిఁగూడ స్వప్నరూపముగా బ్రహ్మచర్యము నష్టమైపోవుచున్నదే, దానికి కారణమేమి?

ఉ:— కారణములనేకములుకలవు. వాటి యన్నిటిలోను ౧. నివసించుస్థలములోగల భూమియొక్క ధాతువులున్ను, గాలియున్ను, జలమున్ను శుద్ధముగా నుండవలయును. ఈ మూడింటిలో జలము ముఖ్యమైనది. సామాన్యముగా జనులు ఈమూడుదోషములను గమనింపరు. దానివల్లనే బ్రహ్మచర్యమునకు మిక్కిలి నష్టము కలుగుటకు కారణమగుచున్నది. వృక్షములు వృద్ధియగుటకు భూమియు, జలము, గాలియు ఎటువంటివో, శారీరక మానసికశుద్ధతకున్ను, అభివృద్ధికిన్ని ఇదిన్ని అటువంటిదే. గంధకాదియుక్త ఊషరక్షేత్రమున్ను, ఉప్పు, సున్నము, గంధకము కలిసిన జలమున్ను యైనచో వృక్షములెట్లు వృద్ధినొందజాలవో, జీవునియొక్క స్థితియున్ను అటువంటిదే. ౨. మఱియు రజస్తమోగుణముల గలుగ చేసెడి యాహారాదులున్ను బ్రహ్మచర్యమును నష్ట మొనర్చును. అవి యన్నియు ముముక్షువులు యోచించుకొనవలయును. వాటిలో కారము, పులుపు, నూనె మిక్కిలి దోషకరములు. ఉప్పుమాత్రము కొంచెముగా నుండవచ్చును. కొన్ని యుష్ణప్రదేశములలో కొంచెము పులుపు వాడ

వచ్చును. అది నిమ్మపులుసైన మంచిది. కాని ఈ ఉప్పు, పులుపుకూడ లేనిచో మఱింతమంచిదే. కారము ఏమాత్రమున్ను కూడదు. దేహేంద్రియములు శుద్ధమైనవారికి ఈ ఉప్పు, పులుపు మొదలైనవాటిలో యభిరుచియుండదు. తీపు సత్త్వగుణమని తలంచి యుపయోగపరచువారు చాలమందియుందురు. అదిన్ని మంచిదికాదు. కావలసినచో మధురమును స్వల్పముగా వాడవచ్చునేగాని ఎక్కువగ వాడగూడదు. అదిన్ని వేడి పదార్థమే. అందువల్ల బ్రహ్మచర్యమును అది నష్టముచేయును. ఆత్మశుద్ధిగలుగునప్పుడు తీపియందుకూడ ఇష్టముగలుగదు. ౩. చమురు పదార్థములుకూడ ఎక్కువ వాడఁగూడదు. నెయ్యిమొదలగునవి ఎక్కువ మంచివికావు. అవి వాటి నైజస్థితిలోనుండి వేఱుపడినవగుటచే శరీరములో అమరుట కష్టసాధ్యము. కావున అవియున్ను బ్రహ్మచర్య నష్టమునకు కారణమగును. క్షీరము, చమురుగింజలు మొదలగు పదార్థములంత దోషకరములైనవికావు. ఏలన వాటిలో స్వభావముగానుండెడు ఘృతాదులు వేఱుపడియుండలేదు. కావున దేహములో నిముడును. అందువల్లనే ఋషులజీవితములో నైజవస్తువులనే యుపయోగించినట్లు కనుపించుటకు కారణము. ఋష్యాశ్రమములలో క్షీరము యుపయోగించినట్లే కనుపించునుగాని వారు క్షీరమును వికారమొనర్చి ఘృతముదీసి వాడినట్లు కనిపించదు. బ్రహ్మచర్యమును సంరక్షింప నిష్టముగలవారెవ్వరున్ను ఘృతాది చమురుపదార్థముల నెక్కువ యుపయోగపఱచగూడదు. ౪. బ్రహ్మచర్యవ్రతనిష్ఠగలవారు, రాత్రులలో ఎక్కువ యాహారమును తీసికొనగూడదు. నిద్రలో చక్కగ జీర్ణము కానిచో అది పులుపుగామారి బ్రహ్మచర్యమును నష్టమొనర్చును. ఎక్కువగా రాత్రులలో భుజించువానికి నిద్రాభంగము తప్పక కలుగును. ఇదిన్ని మిక్కిలి జాగరూకతతోఁ జూడదగినది. ౫. రాత్రులలోపండుకొనునపుడు మంచిగాలియుండుస్థలములో యుండవలసినదేగాని చెమటకలిగెడు గాలిలేనిస్థలములో ఏమాత్రము పండుకొనగూడదు. అదిన్ని ఏకాకిగానుండిన చాలమంచిది. పరుండునపుడు ఒక్కలోట మంచినీరు త్రాగుట చాలయుపయోగకరము. దానిచే నే పదార్థము జీర్ణముగాకయుండునో అది శుద్ధముగా జీర్ణమగును. దాహముండినను, లేకపోయినను శీతల

జలము త్రాగే అభ్యాసము చేసికొనవలయును. దళమైన దుప్పట్లుగాని, దట్టమైన కంబళ్లుగాని, పాన్పులుగాని బ్రహ్మచర్యవ్రతము గలవానికి మంచిదికాదు. ఒకవేళ భరింపరాని చలివల్ల కప్పుకొనవలసి యుండి నను శుభ్రమైన వస్త్రములే మంచివి. శుద్ధముగా యుతకని కంబళ్లు, దుప్పట్లు ఏమాత్రముపయోగించకూడదు. దానివలన మాలిన్యము శ్వాసకోశములో ప్రవేశించి బ్రహ్మచర్యమును నష్టమొనర్చును. కను కనే బ్రహ్మచర్యవ్రతము కలవాడు వట్టి భూమిమీద పరుండవలయునని శాస్త్రములు తెలిపెడి రహస్యము. ౬. విషయబుద్ధిగల స్త్రీలుండు స్థల మున బ్రహ్మచర్యవ్రతము సలుపువాడెన్నడున్ను నివాసము చేయ రాదు. ఎంత శుద్ధమనస్సు అయినను విషయసంకల్పముచే కఱగును. కనుకనే దత్తాత్రేయ మునీంద్రుడు అగ్నికుండముగా స్త్రీని, ఘృతకుంభ ముగా పురుషుని వర్ణించుటకు కారణమైనది. ఇది పురుషులకు చెప్పే లాగున విషయబుద్ధిగల పురుషులుండు స్థలమున బ్రహ్మచర్య వ్రతనిష్ఠగల స్త్రీలున్ను నివాసము చేయరాదు. సూర్యుడాకాశ మండలమున నెంతదూరముగా నుండినను అతని ప్రకాశముచే నవనీతమెట్లు కఱగునో, ఆలాగున పురుషునియొక్క వీక్షణముచే స్త్రీలకున్ను, స్త్రీలయొక్క వీక్షణముచే పురుషులకున్ను బ్రహ్మచర్యవ్రతములో మనస్సునందు మార్పుకలుగును. అన్నిటిలోను ఇది ముఖ్యమైనది. దీని యందు జాగ్రత వహింపనిచో ఒకవేళ క్రియారూపముగా పతనము కలుగకపోయినను, మనోరూపముగ వ్రతభంగము కలుగును. ఆలాగున విషయస్వభావముగల స్త్రీలచేతితో భోజనాది ఏ పదార్థములున్ను బ్రహ్మచర్యవ్రతి భుజించరాదు. పదార్థముద్వారా సంకల్పము ప్రవే శించెడు శక్తి గలిగియున్నది. ఎట్లన లోహపు తీగెలద్వారా విద్యుచ్ఛక్తి యెట్లు ప్రవహించునో, ఇదిన్ని అటువంటిదే. ఇది అప్రత్యక్షముగా జరుగుచుండెడు దివ్యశక్తి. కనుకనే కొందఱు మహనీయులు తీర్థము, విభూతి, ప్రసాదము యిచ్చుటవల్ల మహత్తైన ఫలము కలుగుటకు కారణ మగుచున్నది. ౭. ఎక్కువ పరిశ్రమ చేయుటయు, కొంతైన పరిశ్రమ చేయకుండుటయు మంచిదికాదు. వీరుభయులకున్ను బ్రహ్మచర్యము నిలువదు. పరిశ్రమ అధికముగా చేయుటచే ఎక్కువ శ్రమకలిగి చెమట

విశేషముగా కారిపోవుటవల్లను, పరిశ్రమచేయుటచే వెడలునీరు చెమట రూపముగా వదలిపోవక యుండుటచేతను బ్రహ్మచర్యము నష్టమగును. ఆలాగున ఎక్కువ ప్రాణాయామముగాని, ఎక్కువ జపముగాని, ఎక్కువ గ్రంథపఠనముగాని చేయరాదు. దానివల్ల వేడి అధికమై బ్రహ్మచర్య నష్టముకలుగును. ౮. విషయములచే కలిగెడు దోషమును, పతనమును, రోగమును, అగౌరవమును, ధర్మహానిని బాగుగా హృదయములో చింతన చేయుటచేతను పతితుడుగాక బ్రహ్మచర్యమును సంరక్షించుకొనవచ్చును. ఎందఱో గౌరవపదవిలో నుండువారు వ్రతభంగముచే నగౌరవమును పొందుచున్నారు. పూజ్యులు అపూజ్యులగుచున్నారు. ఆరోగ్యముగలవారు రోగులగుచున్నారు. వేయేల! కొందఱు ప్రాణహాని గలవారుగాగూడ నగుచున్నారు. ఇవియన్నియు పదేపదే చిత్తములో చింతనచేసిన, వ్రతభంగము కలుగనీయక చూడవచ్చును. ౯. మఱియు ఒక్కొక్కరు మంచి బ్రహ్మచర్యములో నుండి నపుడెంత గౌరవముతో నుండిరో, పతనముచే ఎంత దీనస్థితిలోనికి జారిపోయిరో అట్టిదానిని మనస్సులో జ్ఞాపకము చేసికొనుటచేతను, వ్రతనిష్ఠకలవారు ఎంత లోకపూజ్యులై యున్నారో దానిని చింతించుటచేతను పతనము కలుగనీయక చూడవచ్చును. ౧౦. ఏ సమయమందైనను విషయబుద్ధి కలుగనీయక చూచుచుండవలయును. ఏ స్థలములో యుండిన విషయవాంఛ కలిగేలాగున మనస్సుకుతోచునో ఆ స్థలమును విడిచియైనను, లేక అచట యుండియైనను ఆత్మయొక్క స్వచ్ఛత్వమును, జ్ఞానమును, ఆనందమును బాగుగా భావన చేసికొనవలయును. అంతేగాక ఇది మనస్సుయొక్క వికారమేయని నిశ్చయించుకొని తన యాత్మ, మనస్సు, దేహము, ఇంద్రియములు మొదలగువాని యన్నిటికి విలక్షణము, సాక్షియని భావన చేయుటచేతను వ్రతభంగము కలుగనీయక చూచుకొనవచ్చును. ౧౧. సహింపరాని విషయదోషము కలుగునపుడుగాని, ఇతర సమయములందుగాని రహస్యావయవమును చేతితో తాకరాదు. ఇది స్త్రీపురుషులుభయులకున్ను సమాన ధర్మము. మఱియు ఏవిధమైన మనోభావములకుగాని, కృత్రిమక్రియలకుగాని లొంగకూడదు. మఱియును వ్రతనిష్ఠనలుపు పురుషులు బాలురను, స్త్రీలు

బాలికలను పరుండనివ్వరాదు. దీనివల్లను కొన్ని దుష్టసంకల్పములు కలుగవచ్చును. పురుషులు బోర్లపడియుండుటగాని, స్త్రీలు వెలికిల పరుండుటగాని మంచిది కాదు. ఎవరున్ను బోర్లపడి పండుకొనకూడదు. శరీరముయొక్క శుద్ధరక్తనాళములు దేహముయొక్క పురోభాగమునందు కలవు. అందువల్ల బోరగిలపరుండిన ఆ నాళములకు రక్తప్రసరణము సరిగా జరుగజాలదు. ధ్యానమందుగాని, శవాసనమందుగాని స్త్రీలున్ను, పురుషులున్ను వెలికిల పరుండవచ్చును. దానికిమాత్రమే అట్లు చేయవచ్చును. ఇతరసమయములో అట్లుండరాదు. కృత్రిమక్రియలచే పురుషులున్ను స్త్రీలున్ను అనేక విధములుగా బ్రహ్మచర్యవ్రతభంగము చేయుదురు. అది వ్రాయదగినదికాదు. వారికివారే గ్రహించుకొనందగినది. కావుననే 8 విధములుగా బ్రహ్మచర్యదోషములు చెప్పుటకు కారణమైనది. మనస్సులో విషయమునుస్మరించుట — విషయవాక్యముల నుచ్చరించుట విషయదోషము కలవారితో సహవాసముచేయుట - అట్టి విషయబుద్ధితో చూచుట - అట్టివారితో ఏకాంతమున మాటాడుట — మనస్సులో విషయమునుగూర్చి సంకల్పించుట — విషయములో ప్రవర్తించెడు మార్గమును నిశ్చయించుట — విషయములో ప్రవేశించుట యనునీ అష్టవిధదోషములుండనీయక చూడవలయును. ఈ యెనిమిదివిధములుగ శుద్ధముగ నుండినమాత్రము సరియైన బ్రహ్మచర్యవ్రతమని చెప్పబడును. ఈధర్మము స్త్రీలకున్ను, పురుషులకున్ను సమానము. ఆవిషయమై ఉత్తరమువ్రాయుట, సంజ్ఞచూపుట, ఈలాటివన్నియు గూడ అష్టవిధములలో నంతర్భూతములు. ౧౨. ఇక బ్రహ్మచర్యము యెంత యత్నించినను నిలువకపోయిన, జితేంద్రియులగు శుకసనకాది యోగులను మనస్సులో భావించవలయును. దీనివల్ల మనస్సు నిర్మలభావమునొందును. ఇకను నిల్పశక్తిలేకపోయిన — శ్రీ నారాయణగురు — శ్రీ రామకృష్ణపరమహంస మొదలగువారిని బాగుగ జ్ఞాపకము చేసికొనవలయును. అపుడు తప్పక జయము కలుగును. ఇది పురుషులకు చెప్పేలాగున స్త్రీలున్ను మైత్రేయి, గార్గి మొదలగు తపస్వినులను, శ్రీరామకృష్ణపరమహంసయొక్క ధర్మపత్నియగు శారదా

మణిదేవిగారిని జ్ఞాపకముచేసికొనిన వారికి మనోనిగ్రహము కలుగును. అది రైలుగాని, కారుగాని వేగముగా పోవుచుండిన వెంటనే స్టీము నిల్పి బ్రేకువేసిన నిలిచిపోవునట్లుండును. లేనిచో వేగముగా తిరుగుచుండు యంత్రాలయములందలి చక్రములగమనము ఎలెక్ట్రిక్ తంతెకు తగిలించియుండు స్ప్రింగును వేఱుపఱచినవెంటనే ఆగిపోవునట్లు, విషయభావనలనుండి మనస్సును మరలించిన, అది తత్క్షణమే నిలచిపోవును. దీనియందుఁగూడ నిగ్రహము కలుగనిచో ఇష్టదైవమునుగుఱించి భక్తితో ప్రార్థనచేయుటయు — పశ్చాత్తాపపడుటయు మంచిది. తీక్ష్ణమైన వ్రతనిష్ఠను అవలంబించుట గావింపవలయును. ఈ విధులచే తప్పక మనోనిగ్రహము కలుగును. అయితే కొందఱిసంస్కారము మంచిది కానిచో — లేక కొందఱిశరీరమున రోగములుండినచో స్వప్నరూపముగా కొంతనష్టము కలుగవచ్చును. దానివల్ల శారీరక, మానసిక దుర్బలతయు, ప్రసన్నరాహిత్యము కలుగునేగాని పాపమేమాత్రమున్ను కలుగదు. ఆత్మశుద్ధికలిగి రాగారాగా ఈదోషమున్ను క్రమముగా తగ్గిపోవును. వీరుమాత్రము ఇంద్రియనిగ్రహపరములగు ఔషధములను తీసికొనవచ్చును. అదిన్ని మందుల ప్రకటించెడు కేటలాగులోగల ఔషధముల తీసికొనకూడదు. వాటియందు కొన్ని విషధాతువులు కలియువచ్చును. అవి శరీరమునకు క్రమముగా గొప్ప హానిని కలుగచేయును. అట్లుగాక మంచి ఓషధులచే చేయబడెడు కల్పములమాత్రమే వాడవలయును. అప్పుడప్పుడు యుపవాసవ్రతమున్ను, కొంచెము ప్రాణాయామమున్ను, కొన్నియోగాసనములున్ను అందఱికి యుండవలయును. అది చాలామంచిది. శరీరమానసేంద్రియములను శుద్ధపఱచును. ౧౩. మనస్సుయొక్క భావము అన్నిటికన్న శ్రేష్ఠమైనది. మనస్సు ఫోటోతీయు కెమెరాలోపలగల అద్దమువంటిది. పురోభాగవస్తువులన్నియు దానిలో ప్రతిబింబించునట్లు బ్రహ్మచర్యనిష్ఠగల మహనీయుల భావనవల్ల మనస్సు అదేవిధముగా మారును. లేక ఇంద్రియాతీతమగు తనయొక్క ఆత్మభావము అఖండము, నిర్విషయము, స్వయంప్రకాశము, జ్ఞానస్వరూపము, అమృతము, అనంతము యను నిట్టిభావన చేయుటవల్లను ఇంద్రియనిగ్రహము కలుగును.

౧౪. మనస్సు మలినమైయుండుటచేతనే మాలిన్య విషయములయందు అభిరుచిగలిగియుండును. మనస్సు నిర్మలముగా నుండిన అట్టి హీన స్వభావము కలుగదు. విషయములపై యపేక్ష కలుగునపుడు వారి యొక్క శరీరము, ముఖము, ఇతర గుహ్యావయవములు మలయుక్తము గాను, దుర్వాసనాయుక్తముగాను, రక్తశ్లేష్మాదులతో గూడినవిగాను, మలమూత్రముల భాండముగాను, క్రిమిసంకులముగాను గలిగి యున్నట్లు భావించిన, దానివలనగూడ నిర్విషయస్థితి కలుగును. కావు ననే గొప్ప మహనీయులగు పురుషులున్ను స్త్రీల శరీరాదులను అట్లు నిందించుటకు కారణమైనది. ఏలన పామరులైనవారు ఈలాగున భావన చేసియైనను బ్రహ్మచర్యమును సంరక్షించుకొనెదరనియే వారి యాశయము. ఇప్పుడుండువారిలో కొందఱు అట్టి మహనీయులు ఈ చిన్న విషయమును ఈలాగున చెప్పిరేయని సంశయింతురు. అది చిన్నవిషయముకాదు. చాలా గొప్పవిషయము. అందువల్లనే అట్లు వారు చెప్పిరి. ఏలన ఎంతో గొప్పవారుసహితము దానిని జయింపజాలక విషయుక్తమగు విషయములందే మగ్నులై యున్నారు. ౧౫. మను ష్యులకు నిరంతరము ఏదైన ఒక్క ప్రయత్నము కలిగియుండవలయును. అది పవిత్రమైనదిగా నుండవలయును. అప్పుడు మనస్సు ఎల్లప్పుడు దానియందే ప్రయత్నించుచుండును. ప్రయత్నహీనుల మనస్సు, భ్రమరములు పుష్పములపై దిరుగుచున్నట్లు దృశ్యములపై సంచరించు చుండును. కనుకనే మనోనిగ్రహశక్తి లేనివాడు సదా నిష్కామయోగ పరుడై ప్రయత్నించవలయుననియు, లేక దైవకార్యములో నియుక్త మైన చిత్తము కలవాడై దైవమునకు సంబంధించిన పనిలో తగిలిన మనస్సుగలవాడై యుండవలయుననియు చెప్పెడి రహస్యము. మనస్సును విషయములనుండి నిరోధింప శక్తిలేనివారు ఉత్తమ గ్రంథములు వ్రాయు టలోగాని, పత్రికా వ్యాసరాజములను నిర్మించుటలోగాని, ధర్మకార్య ముల లోకములో బోధించుటయందుగాని మనస్సును వినియోగ పఱచిన తప్పక విజయము కలుగును. ఇవియన్నియు మనోజయమునకు కారణములు.

౭౦. ప్ర:— తామిదివఱలో వ్రాసిన గ్రంథములలో మనస్సు శుద్ధమైనదా, లేక ఇంకను శుద్ధము కాలేదా అని తెలిసికొనుటకు స్వప్నములో చూడవలయునని తెలిపియుండిరి. దానికి దృష్టాంతముగా తనయొక్క ముఖమేరీతిగా యుండునో, అలాగున అద్దములో ప్రతి బింబించుననియు, కావున జాగ్రదవస్థలోగల సూక్ష్మ సంకల్పములే స్వప్నములో కనుపించుననియు చెప్పియుండిరి. కొందఱు పరిశుద్ధ హృదయము కలవారై యుండినను, చెడుసంకల్పము లేవియు లేనివారై యుండినను స్వప్నములో విషయబుద్ధిగలిగి బ్రహ్మచర్యము నష్టమగుటయు, దానికి సంబంధించినవారితో కలిసియుండునట్లు కనుపించుటయు కలుగుచున్నది. దానికి కారణమేమి? దీనివల్ల వ్రతభంగ పాపము కలుగునా?

ఉ:— దీనికి కారణము లనేకములు కలవు. అవన్నియు పైన నుదహరింపబడియే యున్నవి. కొందఱికి జన్మాంతరవిషయము నశింపకయు, మఱికొందఱికి యాహారాది దోషములచేతను, ఇక కొందఱికి శరీరములోగల సూక్ష్మమగు రోగములచేతను అట్లు కలుగును. కొందఱికి నిద్రలో యేమియు తెలియకనే నష్టమగును. మఱికొందఱికి అది నష్టమగుటకు యేదైన రూపమేర్పడవలసి యుండును. అందువల్లనే అట్లు కలుగును. కాని ఇదిన్ని మంచిదికాదు. ఇకను ఆత్మశుద్ధి కలుగునపుడు అట్టి దోషములున్ను నశించును. దానివల్ల వ్రతభంగపాపమేమియులేదు. శాస్త్రమీలాగున చెప్పుచున్నది.

పతత్యసౌ ధ్రువం భిక్షుర్యస్య భిక్షోర్ద్వయం భవేత్ ।
ధీపూర్వం రేత ఉత్సర్గో ద్రవ్యసంగ్రహమేవ చ ॥

తా॥ బుద్ధిపూర్వకముగా రేతోనష్టము కావుననే యతియైనవానికి బుద్ధిపూర్వకముగా రేతోభంగమున్ను, స్వార్థనిమిత్తము ధన సంగ్రహమున్ను కూడదని విధించుటకు కారణమైనది. ఈ రెంటివల్ల యాతడు పతితుడగును. చేసినమాత్రమే వ్రతభంగమున్ను దోషమున్ను కలుగును. స్వప్నములో భుజించునట్లు తోచినను యెట్లు భోజనప్రాప్తి కలుగదో, స్వప్నములో ఒకరిని వధించినట్లు ప్రతీతియైనను యేలాగున అతనికి మరణశిక్ష యుండదో, స్వప్నములో ఒకనిని నిందించినట్లు కను

పించినను యేలాగున విరోధముకలవాడుకాడో, ఇదిన్ని యీలాగుననే యుండును. కాన ఈ దోషములుకూడ కలుగనీయక చూడవలయును. ఇదిన్ని స్త్రీపురుషులుభయులకున్ను సమానధర్మము.

81. ప్ర:— ఇప్పుడు చెప్పినవన్నియు నైష్ఠికబ్రహ్మచారులనుగుఱించి నది యగును. గృహస్థ బ్రహ్మచారులనుగుఱించి యేమియు చెప్పక విడిచిపెట్టితిరే ?

ఉ:— దీనియందుగూడ గృహస్థబ్రహ్మచర్యము ననుష్ఠించెడివారు గ్రహింపదగినవి యెన్నియోగలవు. అవి వారున్ను గ్రహించుకొన వచ్చును. గృహస్థబ్రహ్మచర్యమునుగూర్చి తమోభాస్కరాది గ్రంథములలో విస్తీర్ణముగా చెప్పబడియున్నది. ముఖ్యముగా గృహస్థదంపతులుభయులున్ను బ్రహ్మచర్యవ్రతమునందు ఏకమనస్సుకలవారై యుండవలయును. వారుభయులున్ను ఒకేగదిలో పండుకొనగూడదు. గృహస్థులకు శాస్త్రములలో ఏ యే దినములు నిశ్చయింపబడియున్నవో ఆ కాలములను వారున్ను చూచుచుండవలయును. తక్కిన యాహారాది నియమములందఱికిన్ని సమానధర్మములు. దీనినిగుఱించి ఒక కథ చెప్పెద. పూర్వము మగధదేశమునందు ధర్మపాలుడను ఒకరాజు రాజ్యపాలనముచేయుచుండెను. అతడు పేరునకు తగినట్లు ధర్మమును పాలించేవాడు. శాస్త్రమందు గొప్పవిశ్వాసముకలవాడు. దైవమందును గొప్ప భక్తికలిగియుండెను. వానికొక పురోహితుడుండెను. అతడు గొప్ప పండితుడు. జ్యోతిశ్శాస్త్రములో అపారప్రజ్ఞ గలవాడు. కాని ఆచరణ శూన్యుడు. రాజుగారికిన్ని జ్యోతిశ్శాస్త్రములో గొప్పనమ్మకముకలదు. పురోహితునిమాటలలో మంచివిశ్వాసము కలిగియుండెను. రాజుగారికి వివాహమైనతరువాత దాంపత్యధర్మములో ప్రవేశించుటకు మంచి లగ్నము ఎప్పుడు కలదని పురోహితునడిగెను. అతడు జ్యోతిషగ్రంథములను, పంచాంగములను, రాజుగారిజాతకమును అన్నిటిని పరిశోధించి ఇక యైదుసంవత్సరములవఱకు మంచి ముహూర్తములేదు; అది దాటిన తరువాత మాఘశుక్ల త్రయోదశీగురువారము రాత్రి మంచి ముహూర్తముగలదని నిర్ణయించెను. రాజుగారు ఆలాగున అయిదు సంవత్సరములు బ్రహ్మచర్యవ్రతభంగము చేయకనే కాలముగడిపి

పురోహితుడు చెప్పినదినమున దంపతుల ధర్మమున ప్రవేశించెను. మరల ఎప్పుడు మంచిదినమువచ్చునని పురోహితుని ప్రశ్నింపగా ఇక నిపుడుమంచి ముహూర్తములులేవు. పదిసంవత్సరములు దాటవల యును. అపుడు వైశాఖశుక్లదశమికి సరియగు బుధవారము రాత్రి మంచి ముహూర్తమువచ్చును. అదిచాల శుభదినము. అప్పుడు జన్మించెడి పుత్రుడు చాలగొప్పవాడగును. చక్రవర్తిసమానుడుగాను కాగలడని చెప్పి వెళ్ళిపోయెను. మొదట చెప్పిన లగ్నమున మహావిశాల బుద్ధియున్ను, అమానుషప్రజ్ఞయున్ను, దైవమందు శాస్త్రమందు సాధు బ్రాహ్మణులయందు విశ్వాసముగలవాడునగు కొడుకు కలిగియుండెను. ఈలాగున పదిసంవత్సరములలో చాలవఱకు గడచినతరువాత ఒకరోజు ఆదివారము మధ్యాహ్నము అమావాస్య వచ్చినపుడు పురోహితుడు రాజగృహమున తర్పణాదులు జరిపి గొప్పదానాదులు తీసికొని ఇంటికివెళ్లి స్నానముచేయునపుడు తనభార్య స్నానాదికార్యములో తనకు సాయమొనర్చుచున్నపుడు విషయ వికారముగలుగ స్నానముచేసెడి ఆ యావరణములోనే భార్యతో విషయమందు ప్రవర్తించెను. రాజ గృహమునకు ముందుగనే పండితునియిల్లు గలదు. రాణిగారు మేడపై నుండి ఈ అవస్థలన్నియు చూచుచుండెను. వెంటనే రాజుగారిని పిలిచి మన్మథుని మహిమాతిశయమును చూపెను. రాజుగారికి గొప్పకోపము కలిగి వెంటనే పురోహితుని పిలువ మనుష్యునంపెను. అపుడు పురోహి తుడు స్నానము చేయుచుండెను. ఇపుడే రాజగృహమునుండి వచ్చితిని. ఇకను భోజనముచేయలేదు. మరల ఎందుకు పిలువవలయునని యోచించి పిలువవచ్చినవాని శకునములను జ్యోతిశ్శాస్త్రప్రకారము చూచినపుడు స్నానకార్యములో జరిగిన సంగతి యుండవచ్చునని గ్రహించినవాడై తనకుగల పదిరెండు సంతానముల గూడ తీసికొని వెళ్ళెను. పురోహితునిపై యెల్లప్పుడున్ను వినయభావముగలరాజు అపుడు చాలక్రోధావేశుడై యుండినట్లు గన్పించెను. రాజుగారు— ఓయీ! పిచ్చి బ్రాహ్మణుడా! నాకు బ్రహ్మచర్యధర్మము చెప్పుచూ అమావాస్య ఆదిత్యవారము, పగటిసమయము, సూర్యుడు ప్రకాశించుచున్నాడు, స్థలమశుద్ధము, అట్టి దుస్సమయములో స్నానస్థలములో ఏమిచేసినావు?

పురోహితుడు:— మహాప్రభో! నాయొక్క సంగతులన్నియు తమకిదివఱలోనే తెలిపియుంటిని. నేను శాస్త్రముచదివి చెప్పువాడనే గాని అనుష్ఠించువాడను గానని తమచిత్తమునకు తెలిసియేయున్నది. తామో యాచరించెడివారు. ఆచరించనిదానియొక్క ఫలమును శాస్త్ర ప్రకారము చూడవచ్చును మహాప్రభో! అని చెప్పి పెద్దకొడుకగు భాస్కరశర్మను పిలిచి చూడుడని రాజుగారితో చెప్పెను. అతని శిరస్సు గొప్ప ఘటమువంటిదిగాను, శరీరమంతయు చాల సన్నగిల్లి చూచువారికి గొప్ప భూతమువలె గన్పడెను. రెండవకుమారుడగు జరత్కారశర్మను పిలిచెను. అతనికడుపు గొప్ప నగారవలె యుండెను. శిరస్సుమాత్రము ఒక నిమ్మకాయ ప్రమాణమేర్పడి మహాభూతమువలె యుండెను. మూడవదియగు పుత్రికను పిలిచెను. ఆ బిడ్డపేరు వేదమతీ బాయి. దాని రెండుపాదములున్ను లావయి గొప్ప స్తంభమువలె నుండెను. శరీరమంతయు ఎముకలున్ను చర్మమున్ను తప్ప వేఱు ఏమాత్రముండలేదు. దానిఁజూచిన ఒక బ్రహ్మరాక్షసివలె నుండెను. ఈలాగున ఇతరబిడ్డలనందఱిని చూపెను. ఒకడు గ్రుడ్డివాడు, ఒకడు చెవిటివాడు, ఒకడు గూనివాడు, మఱియొకడు కుంటివాడు, యొకడు మూగవాడు. ఈలాగున బిడ్డలందఱు నానావిధ వికారస్వరూపులై, కురూపులై, నలుపువర్ణము కలవారై, ఎఱ్ఱని వెండ్రుకలు కలవారై, గొప్ప భూతసమూహమువలె నుండిరి. పురోహితుడు అయ్యా మహా ప్రభో! చూచితిరా! తమ పురోహితుడు శాస్త్రప్రకారము నడువని కారణముచే ఈలాటి దయ్యము లుద్భవించెను. రాజమండపములో రాజుగారి కుమారుని పటముండెను. దానినిజూపి, చిత్తగించితిరా! తాము శాస్త్రప్రకారము వర్తించిన కారణముచే బాల భాస్కరునివలె ప్రకాశించెడు ముఖారవిందముఁగల పుత్రసంతానము కలిగెను. రాజ కుమారుడు ఎచటనున్నాడని రాజడుగకనే పురోహితుడిట్లు సమాధానము చెప్పెను. — మీ కుమారునకు 9 సంవత్సరముల ప్రాయము దాటెను. పది యింకను కాలేదు. భారతదేశములో ముఖ్యులగు ఇద్దఱు రాజులకు యుద్ధము జరుగుచున్నది. వారుభయులున్ను మీ కుమారుడు చెప్పు లాగున సంధిచేసికొనెదమని తెలిపినందుచే అచ్చోటికి వెళ్లియున్నాడు.

కనుక జనులారా! చూచితిరా బ్రహ్మచర్యముయొక్క వ్రత మహిమ! అని పురోహితుడు చెప్పి, మహాప్రభో! నాయొక్క దుర్నడతచే ఈలాటి భూతము లుద్భవించిరి. వీరు సంపాదించి జీవింపజాలరు. కావున కరుణించవలయునని సమయోచితములగు మాటలు తెలిపి రాజు గారిని సంతోషపఱచి, ఇదే మంచి తరుణమని పురోహితుడు తలంచి చిత్తము ప్రభో! ఇప్పుడు దయచేసియుండు జీవనాధారము ఈ భూతము లకు చాలదని చెప్పగా రాజుగారు సంతోషించి ఆ భూతముల జూచి దయగలవారై యొకఅగ్రహారమును వానికి దానమిచ్చెను. గృహస్థబ్రహ్మ చర్యముయొక్క ఫలితమున్ను, అది లేనందుచే గలిగెడు దీనత్వమున్ను ఈ కథవల్ల తెలిసికొనవచ్చును.

న తపస్తప ఇత్యాహుర్బ్రహ్మచర్యం తపోత్తమమ్ ।
ఊర్ధ్వరేతా భవేద్యస్తు స దేవో న తు మానుషః ॥

తా॥ "బ్రహ్మచర్యవ్రతమే సర్వోత్కృష్టమైన తపస్సు. బ్రహ్మ చర్యవ్రతపాలనమునకు మించిన తపశ్చర్య యేలోకమునందును లేదు. ఊర్ధ్వరేతస్కుడగు పురుషుడీలోకమున ప్రత్యక్షముగా కనుపడు మానవస్వరూప దేవత" అని శివుడు పార్వతితో నుడివెను.

బ్రహ్మచర్యేణ తపసా దేవా మృత్యుముపాఘ్నత ॥

తా॥ బ్రహ్మచర్య వ్రతరూప తపస్సుచేతనే దేవతలు మృత్యు వును జయింపగలిగిరి.

శుక్రం సౌమ్యం సితం స్నిగ్ధం బలం పుష్టికరం స్మృతమ్ ।
గర్భబీజం వపుస్సారో జీవస్యాశ్రయ ముత్తమమ్ ॥

వీర్యము శ్వేతవర్ణము, చిక్కదనముకలిగి, బలము, పుష్టినొసంగి జీవశక్తిని వృద్ధిచేసెడిదై యున్నది. మఱియు నది శరీరమునకు సార రూపమై గర్భమునకు బీజమునై జీవనమునకు ప్రధానాశ్రయముగ నున్నది. అట్టి దృఢబ్రహ్మచర్యము లేనివారి శుక్లము పలుచగాను, పసుపువర్ణముగాను, దుర్వాసన కలదిగాను యుండును. శుద్ధబ్రహ్మ చర్యము కలవారిది మహాసుగంధముగా నుండును.

యథా పయసి సర్పిస్తు గుడశ్చేక్షౌ రసే యథా ।
ఏవం వా సకలే కాయే శుక్రం తిష్ఠతి దేహినామ్ ॥

తా॥ పాలలో నేయివలెను, చెఱకులో రసమువలెను ప్రాణుల యొక్క శరీరమంతటను వీర్యము వ్యాపించియున్నది.

బ్రహ్మచర్యస్య చ గుణం శృణుధ్వం వసుధాధిప ।
ఆజన్మమరణాద్యస్తు బ్రహ్మచారీ భవేదిహ ॥
న తస్య కించిదప్రాప్యమితి విద్ధి నరాధిప ।
బహ్వ్యః కోట్య స్త్వృషీణాం చ బ్రహ్మలోకే వసన్త్యుతం ॥
సత్యే రతానాం సతతం దాన్తానామూర్ధ్వరేతసాం ।
బ్రహ్మచర్యం వహేద్రాజన్ సర్వపాపాన్యుపాసితమ్ ॥

తా॥ ఓధర్మరాజా! బ్రహ్మచర్యవ్రతముయొక్క గుణములను వినుము. ఈప్రపంచమున జన్మించినదాది మరణపర్యంతము బ్రహ్మచారియై యుండువానికి లభ్యముగాని సుగుణములేయుండవు. బ్రహ్మచర్యవ్రతమహిమచేతనే అనేకమహర్షులు, కోట్లకొలదిగ మనుష్యులు ఆనందస్వరూపుడగు పరమాత్మయొక్క సాన్నిధ్యమునకుచేరి యగణితమైన సుఖమును పొందిరి, పొందుచున్నారు, అని నైష్ఠికబ్రహ్మచారియైన భీష్మపితామహుడు యుధిష్ఠిరునకు చెప్పెను.

సముద్రతరణే యద్వత్ ఉపాయో నౌః ప్రకీర్తితా ।
సంసారతరణే తద్వత్ బ్రహ్మచర్యం ప్రకీర్తితమ్ ॥

తా॥ సముద్రమును దాటుటకు నౌకవలె భవసాగరమును దాటుటకు బ్రహ్మచర్యవ్రత ముత్కృష్టమైన సాధనము.

యే తపశ్చ తపస్యంతి కౌమారాః బ్రహ్మచారిణః ।
విద్యావేదవ్రతా స్నాతా దుర్గాణ్యపి తరన్తి తే ॥

తా॥ ఏబ్రహ్మచారులు బ్రహ్మచర్యవ్రతరూప తపస్సునుచేయుదురో ఎవరు వేదవిద్యావ్రతులై పవిత్రులగుదురో వారతికఠినమైనట్టియు, అత్యద్భుతమైనట్టియు కర్మలు చేయగలిగి ఈ దుస్తరమైన సంసారసాగరమును అనాయాసముగా దాటగలరు.

ప్రాణోభూతం చరిత్రస్య పరబ్రహ్మైకకారణమ్ ।
సమాచరన్ బ్రహ్మచర్యం పూజ్యైరపి పూజ్యతే ॥

తా॥ బ్రహ్మచర్యవ్రతము సచ్చరిత్రకు ప్రాణమువంటిది. పరబ్రహ్మైక్యమునకు కారణభూతము. కాబట్టి దానిని పాలించు మనుష్యుడు

పూజ్యులైనవారిచేగూడ పూజింపబడును. ఒకప్పుడు ధన్వంతరిమహర్షి తనయాశ్రమమునగూర్చుండి శిష్యులకు ఆయుర్వేదము చెప్పుచుండెను. పాఠములు చెప్పుట పూర్తియైన తరువాత, ఓ గురువర్యా! దేనిని సేవించిన సర్వరోగములు నాశనమై మానవులాయురారోగ్యములు గలిగి సుఖించెదరో అట్టిదానిని తెలియచేయుడని శిష్యులు కోరిరి. ఇట్లు ప్రార్థించిన శిష్యుల ప్రార్థనలనువిని ధన్వంతరిమహర్షి అత్యంతప్రసన్నుండై ఓ వత్సలారా! మీరు నిర్మలమనస్కులై వినుడు అని ఇట్లు చెప్పెను —

మృత్యువ్యాధిజరానాశి పీయూషం పరమౌషధం ।
బ్రహ్మచర్యం మహద్యత్నం సత్యమేవ వదామ్యహమ్ ॥

బ్రహ్మచర్యవ్రత మమృతస్వరూపమై మరణమును, రోగమును వృద్ధావస్థను నాశనముచేసెడిదై యున్నది. ఇది నిజము. మఱియు,

శాంతి కాంతిం స్మృతిం జ్ఞాన మారోగ్యం చాపి సంతతిమ్।
య ఇచ్ఛతి మహద్ధర్మం బ్రహ్మచర్యం చరేదిహ ॥

తా॥ ఈప్రపంచమున శాంతి, కాంతి, స్మృతి, జ్ఞానము,స్వాస్థ్యము ఉత్తమసంతానము గోరువారెల్లరు సర్వోత్కృష్టధర్మమైన బ్రహ్మచర్యవ్రతమును తప్పక పాలించవలయును.

బ్రహ్మచర్యం పరం జ్ఞానం బ్రహ్మచర్యం పరంబలం ।
బ్రహ్మచర్యమయో హ్యాత్మా బ్రహ్మచర్యైవ తిష్ఠతి ॥

బ్రహ్మచర్యవ్రతమే సర్వోత్తమమైన జ్ఞానము. బ్రహ్మచర్యమే అపరిమితమైన బలము. ఆత్మ బ్రహ్మచర్యవ్రతమయమైయున్నది. అది బ్రహ్మచర్యవ్రతమహిమచేతనే మనుష్యశరీరములో నివసించుచున్నది. ఇది నిశ్చయము.

"కబంధుడు", "కాత్యాయనుడు" అను ఇద్దఱు ఋషికుమారులుండిరి. వారిద్దఱు బ్రహ్మచారులే. ఒకరోజున వారు పిప్పలాదమహర్షి యొద్దకు జని యా పిప్పలాదుని బ్రహ్మవిద్య నేర్పుడని ఆశ్రయించిరి. అపుడామహర్షి వారిద్దఱితో నిట్లుచెప్పెను—మీరిద్దఱు ఒక సంవత్సరము వఱకు నాయాశ్రమమునందుండి నియమానుసారము శ్రద్ధాపూర్వకముగా బ్రహ్మచర్యవ్రతమును పాలించి యటుపిమ్మట మీకు కావలసినదాని నడుగుడు. నాకు తెలిసినంతవఱకు **యథాశక్తిగా**

నెఱింగించెద — పాఠకుడా! ఈ పై వాక్యములవలన, బ్రహ్మజ్ఞానమున కధికారి బ్రహ్మచారియేననియు, బ్రహ్మచర్యవ్రతము వినా బ్రహ్మ విద్య అలవడజాలదనియు విదితమయ్యెనుగదా! కాబట్టి అమరత్వ మును పొంది అమృతజీవులు కాగోరు ప్రతి స్త్రీపురుషులును విధిగా బ్రహ్మచర్యవ్రతమును పాలించవలయును.

చిత్తాయత్తం నృణాం శుక్రం శుక్రాయత్తం చ జీవితం।
తస్మాచ్ఛుక్రం మనశ్చైవ రక్షణీయం ప్రయత్నతః॥

తా॥ మనుష్యుని వీర్యము చిత్తమునకును, వీర్యమునకు జీవి తమును వశమైయున్నది. కాబట్టి మనస్సును, వీర్యమును ప్రయత్న పూర్వకముగా రక్షించవలయును.

గృహస్థులు వంశోద్ధారకులగు సంతానములను కనవలసి యుండిన, సంతానమునకు హేతుభూతమగు ఏ శుక్లశోణితములు కలవో అవి ఏ యన్నపానాదులచే నేర్పడుచున్నవో, అట్టి యన్నపానాదులు శుద్ధములై యుండవలయును. పదార్థశుద్ధియేగాక పదార్థము వచ్చెడి మార్గముకూడ శుద్ధముగా నుండవలయును. మరల మనోభావము కూడ శుద్ధముగా నుండవలయును. పాపపు సొమ్ముచేగాని, పాపమార్గ ముచేగాని వచ్చెడి యాహారము శుద్ధపదార్థమైనను దానివల్ల యేర్పడు శుక్లశోణితములు పాపసంకులము లగుటచే అట్టిదానివల్ల యేర్పడు సంతానముగూడ పాపస్వభావముకలదే యగును. కావున యాహార మందు బహుజాగ్రతగలిగి యుండవలయును. గృహస్థాశ్రమము శుద్ధ మైనచోమాత్రమే వారికేర్పడు సంతానములు యుత్తములై యుద్భ వింతురు. అట్టి సంతతివల్లనే భారత స్వారాజ్యమున్ను, ఆత్మ స్వారాజ్య మున్ను పొందవలసియుండును. కావుననే ప్రతి మతకర్తలును సంసా రము శుద్ధమయ్యేలాగున ఉపదేశించుటకు కారణమైనది.

పరాన్నేన తు భుజ్కేన మైథునం యోఽధిగచ్ఛతి।
యస్యాన్నం తస్య తే పుత్రా అన్నాచ్ఛుక్రం ప్రవర్తతే॥

పాపాన్నముచే నేర్పడిన శుక్లశోణితములవల్ల గలుగు సంతాన ములుగూడ పాపరూపులై జన్మింతురు. ఏలన అన్నమే పురుషులకు శుక్లముగాను, స్త్రీలకు రక్తముగాను యేర్పడును. దానివల్లనే సంతాన

ముద్భవించును. అదేరీతిగా నిర్విషయముగలిగి బ్రహ్మనిష్ఠ చేయువాడు పతనమునొందక జ్ఞానసిద్ధి పొందవలసి యుండిన శుద్ధమైన యాహారమును భుజించవలయును. ఆహార వస్తువులుమాత్రము శుద్ధముగా నుండిన చాలదు. పాపకార్యములు చేయువారి ఆహారములు, పాపమార్గములుగా వచ్చెడు యాహారము లెప్పుడున్ను భుజింపరాదు. అవి ఇంద్రియ నిగ్రహము గలుగజేయవు. విషయబుద్ధిని కలుగచేయును. మనోనిశ్చలత్వమును చేయజాలదు. ఈ విషయమును సాధువులున్ను, సంన్యాసులున్ను, భిక్షాన్నము, వారభోజనముచేయు విరక్తులున్ను బాగుగా జ్ఞాపకము చేసికొనవలయును. అంతేగాక స్వప్రయత్న రహితులై పరాన్నములో జీవించువారుగూడ దీనియందు శ్రద్ధ యుంచవలయును. సరియైన తపస్సు, అధ్యయనము, పరోపకారము, ధ్యాననిష్ఠాదులు లేనిచో తమయొక్క పూర్వపుణ్యముగూడ నశించునని మఱువకూడదు. ఈ విషయమై తమోభాస్కరాది గ్రంథములలో అనేక శ్రుతి స్మృతి ప్రమాణముల చూపియుండుటచే ఇచట మరల వ్రాయం బూనలేదు.

మాత్రా స్వస్రా దుహిత్రా వా న వివిక్తాసనో భవేత్ ।
బలవానింద్రియగ్రామో విద్వాంసమపి కర్షతి ॥

బ్రహ్మచర్యవ్రతనిష్ఠగలవాడు తనయొక్క తల్లి, సోదరి, కుమార్తెలతో ఏకాంత ప్రదేశమున యుండకూడదు. ఆలాగుననే బ్రహ్మచర్య నిష్ఠగల స్త్రీయు తండ్రి, తోడబుట్టువు, కొడుకులతోను ఒకే ఏకాంత ప్రదేశములో నుండరాదు. ఏలన ఇంద్రియసమూహ మతిబలమైనది. అది జ్ఞానియైనవాని మనస్సునుగూడ చలింపచేయును. కావున ఏ సమయములో ఏ విపత్తు సంభవించునోయని యూహించి శాస్త్రమిాలాగున చెప్పడమైనది. ఋషులు ఇంతభద్రత చెప్పియుండగా సామాన్యులగు స్త్రీలతో పురుషుడున్ను, సామాన్య పురుషులతో స్త్రీలున్ను సంచరించుటయం దపాయము విచారించదగినది.

82. కృతజ్ఞత:—ప్ర:—(శిష్యుడు)—జ్ఞైకస్వరూపా! విజ్ఞాననిలయా! జననమరణ స్వరూపమగు సంసారప్రవాహమున కొట్టుకొనిపోయెడివారిని

దరిజేర్చుటకు జన్మించిన దివ్యమూర్తీ! తమ కృపావృష్టిచే నాయొక్క సంసారదుఃఖమనెడు దావాగ్ని చల్లారినది. పరమశాంతి గల్గెను. ధన్యుడనైతి. సందేహకుటిలములన్నిటిని తమయొక్క విజ్ఞానబోధ యను తీక్ష్ణమైన ఖడ్గముచే ఛేదించి నన్ను విముక్తునిగ జేసితిరి. ఇక తాము స్వయముగా తలంచి నాకు శ్రేయస్సునిమిత్తమేదేని ధర్మ ముపదేశింపవలసియుండిన, అనుగ్రహింప ప్రార్థించుచున్నాను.

ఉః—— పరిశుద్ధాత్ముడవగు ఆత్మసోదరా! ఇక చెప్పవలసిన విశేషములేవియు లేవు. శరీరపతనపర్యంతము బ్రహ్మనిష్ఠుల శుద్ధమైన వర్తనము గలిగియున్న చాలును. ఆయొక్కదివ్యోపదేశమును మఱువకయుండిన, మీరు యెంతదూరముననున్నను సదా గురువుదగ్గఱ యున్నవారే యగుదురు. (1) జనులాచరించెడు సత్కర్మలను నిందింప రాదు. వానిని వృద్ధిపఱచవలెను. వాటిని ఫలాపేక్షలేక, శ్రద్ధా భక్తులతో, ఈశ్వరార్పణబుద్ధితో చేయులాగున బోధించవలెను. అందువలన జీవుడు శుద్ధుడగును. సామాన్యజనులకు వీటివల్లనే ఆత్మ శాంతి గలుగవలసియుండును. (2) ఆలాగుననే ఈశ్వరభక్తియు ఉపేక్షింపవలదని భక్తులకు బోధించవలెను. దానిచేతనే ప్రకృతిబంధ ములు నశించి, చిత్తైకాగ్రత కలుగును. సామాన్యభక్తులకిది చాల ఉపయోగపడును. అట్టిపరమైకాంతభక్తి బాహ్యాడంబరము లేక అంతరంగముగా నుండవలెను. (3) చిత్తైకాగ్రత, అంతఃకరణశుద్ధి, ఇంద్రియనిగ్రహము, మనోనిశ్చలత్వము కలుగనివారుండిన వారికి ధ్యానధారణసమాధిరూప యోగమార్గములను బోధించవలెను. చిత్తై కాగ్రత గలిగినవారికి, విషయవాసన నశించినవారికి యిది అక్కఱ లేదు. వారికి బ్రహ్మైకాత్మైక్యపరమగు ఆత్మబోధము గలిగేలాగున బోధించినచాలును. అంతఃకరణశుద్ధిగల్గి జ్ఞానోదయమయినవెనుక యిట్టి బ్రహ్మజ్ఞానమును మీరు లోకమునకు బోధింపుడు. (4) ఇదివఱకు చెప్పినమూడున్ను సాధనమార్గములేకాని, సాధ్యమగు అమృతపదము కాదు. అది మహావాక్యబోధముచే గలుగవలసియుండును. దానికి మించినదిలేదు. ప్రపంచములో యెన్ని పుణ్యనదులున్నను అవన్నియు సముద్రములోనికి వచ్చిచేరునట్లు అనుష్ఠానమార్గములన్నియు ఈ బ్రహ్మ

జ్ఞానామృతసాగరములో లయమొందును. కావున అది శివము, అమృతము, అద్వైతము, ఆనందము. ఉపనిషద్వాక్యములు:—

అహం బ్రహ్మాస్మి మంత్రోఽయం బుద్ధివ్యాధిం వినాశయేత్
అహం బ్రహ్మాస్మి మంత్రోఽయం చిత్తబంధం వినాశయేత్. 1

అహం బ్రహ్మాస్మి మంత్రోఽయం చిత్తవృత్తిం వినాశయేత్
అహం బ్రహ్మాస్మి మంత్రోఽయం సంకల్పాదీన్వినాశయేత్. 2

అహం బ్రహ్మాస్మి మంత్రోఽయం కోటిదోషం వినాశయేత్
అహం బ్రహ్మాస్మి మంత్రోఽయం కామాదీన్నాశయేత్ క్షణాత్.

స్వరూపస్థితి:—

చిదాత్మాఽహం పరాత్మాఽహం నిర్గుణోఽహం పరాత్పరః
ఆత్మమాత్రేణ యస్తిష్ఠేత్ స జీవన్ముక్త ఉచ్యతే. 1

దేహత్రయాది రిక్తోఽహం శుద్ధచైతన్యమస్మ్యహమ్
బ్రహ్మాహమితి యస్యాన్తః స జీవన్ముక్త ఉచ్యతే. 2

కేవలం తుర్యరూపోఽస్మి తుర్యాతీతోఽస్మి కేవలః
సదా చైతన్యరూపోఽస్మి చిదానందమయోఽస్మ్యహమ్. 3

నిర్వికల్పస్వరూపోఽస్మి నిరీహోఽస్మి నిరామయః
సదా చాసఙ్గరూపోఽస్మి నిర్వికారోఽహమవ్యయః. 4

సదైకరసరూపోఽస్మి సదా చిన్మాత్రవిగ్రహః
అపరిచ్ఛిన్నరూపోఽస్మి హ్యఖండానందరూపవాన్. 5

ఇతి ప్రశ్నోత్తర మాణిక్యమాలా సమాప్తా.

ఓమ్ తత్ సత్.





# నామసంకీర్తనములు.

---

హరే రామ హరే రామ రామ రామ హరే హరే।
హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే॥ 1

ఓం శివాయ నమ ఓం, నమశ్శివాయ।
కాశీపతే వారణాసీపతే గంగాజటాజూట గౌరీపతే॥ 2

నారాయణ నారాయణ జయగోవింద హరే।
నారాయణ నారాయణ జయగోపాల హరే॥ 3

రఘుపతి రాఘవ రాజారాం।
పతితపావన సీతారాం॥ 4

సీతారాం సీతారాం సీతారాం జయసీతారాం।
సీతారాం సీతారాం సీతారాం జయసీతారాం॥ 5

రామచంద్ర మహారాజుకు జై జై।
రాజిత సీతామాయికి జై జై॥ 6

ఓం నమశ్శివాయ నమశ్శివాయ నమశ్శివాయా ఓం నమశ్శివాయా।
ఓం నమశ్శివాయ నమశ్శివాయ నమశ్శివాయా ఓం నమశ్శివాయా॥ 7

గోవింద రాం రాం గోపాల హరి హరి।
గోవింద రాం రాం గోపాల హరి హరి॥ 8

రామలక్ష్మణ జానకీ జయబోలో హనుమానికి।
రామలక్ష్మణ జానకీ జయబోలో హనుమానికి॥ 9

శంభో శంకర గౌరీశా శాంతదయాపర విశ్వేశా।
జై జై సీతారాం జై జై రఘురాం॥ 10

రాధారమణ మదనమోహన బృందావన చంద్ర కృష్ణ।
రాధారమణ మదనమోహన బృందావన చంద్ర కృష్ణ॥ 11

శంకర శివా శంకర శివా శంభో మహాదేవ శంకర శివా।
శంకర శివా శంకర శివా శంభో మహాదేవ శంకర శివా॥ 12

గురుచరణం గురుచరణం సద్గురుచరణం భవహరణం।
గురుచరణం గురుచరణం సద్గురుచరణం భవహరణం॥ 13

గజానన గజానన విఘ్నవినాశక గజానన।
గజానన గజానన విఘ్నవినాశక గజానన॥ 14

శివశివబోలో హరహరబోలో శంకరబోలో బోలోభాయ్।
శ్రీమద్రవికులదీపకరామ శ్రితజనకల్పక సీతారామా॥ 15

హరిబోల్ హరిబోల్ హరిహరిబోల్ కేశవమాధవ గోవిందబోల్॥
జయరామ జయరామ జయజయ రామ॥ 16

వేణుగానలోల లీల గోపబాల।
వేణుగానలోల లీల గోపబాల॥ 17

శంభోపురారే శంకరపురారే శూలధరపాణి వరకంకణ పురారే।
శంభోపురారే శంకరపురారే శూలధరపాణి వరకంకణ పురారే॥ 18





శ్రీ వేదవ్యాస ముద్రాక్షరశాల, చిత్తూరు. 1953.